Regd No. M. 982 సం. చందా. ౨ రూపాయలు.

౫-వ సంపుటము] స్వశర్మ ... ౧౦ సంచికలు.

# స్వ...

మతవిషయక మాసపత్రిక.

శ్రీ కాశీక్షేత్రమునందు

విభవసం. ఆశ్వయుజ బ ౧ మొదలు ౧౧ వఱకు జరిగిన

అఖిలభారతవర్షీయ

# బ్రాహ్మణమహాసభాసంచిక

పత్రికాసంపాదకులు.


౧. శ్రీ. దై. కోటీశ్వరశర్మదీక్షితులు.
౨. కనుపర్తి. మార్కండేయశర్మ.


నవంబరు, డిశెంబరు, జనవరి నెలలసంచికలు

విషయసూచిక.





1929

# స్వధర్మప్రకాశినీపత్రికాసంపాదకులచేత

విద్యారణ్య భాష్యానుసారము, ఆంధ్రటీకాతాత్పర్య ధర్మశాస్త్రనిర్ణయ స్వరచిహ్నములతో సంస్కరించి ప్రకటింపఁబడుచు

## శ్రీ శ్రీ శ్రీ. శృంగేరి జగద్గురువులవారిచేత

ప్రశంసింపబడి ౧౦౦రూపాయీలబహుమానము పొందిన

## మతగ్రంథములు.



---

సాదా 2-8-0] **నిత్యకర్మాష్టకము.** [కలికో 3రు

దీనియందు స్నాన, సంధ్యావందనాది ౮ నిత్యకర్మలు, వానికి సంబంధించిన దాదాపు ౪౦ విషయములు ధర్మశాస్త్రచర్చలు టీకా తాత్పర్య స్వరసహితముగలవు. గాయత్రిరంగులపటముగలదు.

**టీకాత్రికాలసంధ్యావందనము.** 6 అణాలు.

గాయత్రిరంగులపటముగలదు. ఆచమన, ప్రాణాయామవివరము, ఆశౌచము, రోగము, దేశవిప్లవము మున్నగుసమయములందు సంధ్యావందన మెటులచేయవలయునో ఇందు వివరింపఁబడియున్నవి.

ఆబ్దికమంత్రములు:—సస్వరాంధ్రప్రయోగము, టీకాతాత్పర్య ధర్మశాస్త్రవిషయసహితము. అన్నసూక్త, అధిశ్రవణ, పురుషసూక్త, ఔపాసనాదికములుగలది. 1-

తీర్థశ్రాద్ధమహాలయవిధులు:—సస్వరాంధ్రప్రయోగము. 0-

పైరెండుగ్రంథములుకలిపి కలికోబయిండు చేసినది 2-

సూర్యనమస్కార, మహాసౌరమంత్రములు సటీక 0-

విఘ్నేశ్వరపూజా పుణ్యాహవాచనము " 0-

మంత్రపుష్పత్రయము:—టీకాస్వరాదిసమన్వితము 0-

స్నానమంత్రములు:— " 0-

## పాఠకులారా గమనింపుడు?

ఇప్పుడు డిల్లీ శాసనసభలో విచారింపబడుచున్న

శ్రీ హరవిలాస శారదా గారి

# బాలికా వివాహ నిషేధ శాసనమును

గర్భాధానవయోనిర్ణయ విచారసంఘమువారు రిపోర్టు ప్రకటించిన తర్వాత విచారించవలయునని యమ్ కే. ఆచార్యాగారు తీర్మానము పెట్టగా ఆతీర్మానము 53 × 34 ఓట్లతో గెలిచినది కనుక ఇది అంతవఱకు విచారింపబడదు. రాబోవు సెప్టెంబరు నెల సభలో రాగలదు,

ఓ బ్రాహ్మణోత్తములారా!

"విప్రాః పశ్చిమబుద్ధయః" అను న్యాయము ప్రకారము ఇప్పుడు పేక్షించి అవతల శాసనమయినతర్వాత బాధపడుట కంటె ఇప్పుడే మేల్కొని

## ఆయా జిల్లాలయందు

# బ్రాహ్మణసభలు జరుపుడు.

అరవజిల్లాలయందు ప్రతిజిల్లాలోను బ్రాహ్మణులుసభలుచేసి "మతాచారవిషయమయి యెంతమాత్రము ప్రభుత్వమువారి జోక్యమును సహింపము" అని తీర్మానించి వైస్రాయిగారికి పంపిరి. మీరున్నూ అట్లేచేయుడు.

ధర్మద్రోహులగు సంఘసంస్కర్తలకు భయపడకుడు.

1. మ. మా. మాలవ్యాగారు యీబిల్లు విచారణకువచ్చినప్పుడు 12 సం. లోపుగా బాలికలకువివాహము చేయగూడదనిసవరణ తెచ్చెదరట.

2. మహమ్మదీయులు బిల్లునకు వ్యతిరేకులుగా నున్నారు కనుక బిల్లు ప్యాసుకాజాలదు. వారికి యీబిల్లు వర్తింపకూడదు అని సవరణ తెచ్చినయెడల బిల్లు ప్యాసయితీరును. అని ఒకమెంబరు తలంచుచున్నాడు.

3. ఈబిల్లు విచారణలో నున్నప్పుడు కొందఱు లేడిమెంబర్లను నామి

నేటుచేయవలయునని కొందఱు మెంబర్లు కోరిరి గాని ప్రభుత్వమువారు అట్టికోరిక చట్టమునకు విరుద్ధము కనుక అంగీకరింపమనిరి.

4. ఆంధ్రదేశమునందు గల సనాతనధర్మ పరాయణులగు బ్రాహ్మణ వైశ్యజాతులవారు గాఢనిద్రనుండి యెప్పుడు మేల్కొనియెదరోగదా!

5. ఘనతచెందిన విక్టోరియారాణి జార్జి మున్నగువారలు పట్టాభిషేక సమయమునచేసిన వాగ్దానమునకు భిన్నముగ మతాచారవిరుద్ధమయిన ఇట్టివివాహచట్టమునకు ప్రవేశమొసంగినందులకు అసెంబ్లి ప్రసిడెంటు మీద హైకోర్టులో వ్యాజ్యము తెచ్చుట మంచిది అని 31-1-29 తేది హిందూపత్రికలో ఒక బి. ఎల్ గారు సూచించుచున్నాడు. తంజావూరు తిరుచినాపల్లి జిల్లాలవారిందులకు ధనసహాయమొనర్చెదమనుచున్నారు ఆంధ్రులున్నూ ఇందులకు తోడ్పడదరుగాక.

---

శ్రీకాశీలోజరిగిన యఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహాసభకు శ్రీధర్మవ్యవస్థావజ్రదర్పణ గంగలకుర్రు అగ్రహార కాపురస్థులు పుల్లెల ఉమామహేశ్వరశాస్త్రి వ్రాసిపంపిన మహానిబంధమునందలి

# వ్యవస్థాబింబముల సారాంశములు.

## ౧. ఆర్యకన్యోద్వాహకాల వ్యవస్థాసారము.

శ్రీ. హేమాద్రిప్రాయశ్చిత్త కాండమునందలి గర్గగౌతమ మార్కండేయ వచనములచే విధించబడిన యవివాహిత ప్రథమరజస్వలా బ్రాహ్మణకన్యలకు వివాహమే లేనిపరిత్యాగ ప్రాయశ్చిత్తమే కాని మరియొకప్రాయశ్చిత్తముతో నాపద్ధర్మముగగూడ వివాహ మశాస్త్రీయము అనార్యము. నిర్ణయసింధ్వాదిధృతా శ్వలాయనాది విహితప్రాయశ్చిత్తాంతరములు తత్పూర్వక వివాహములును నిరవకాశములగు పరిత్యాగవిధులచే సామాన్యవిశేష న్యాయమున బాధింపబడుటచే క్షత్రియవైశ్య విషయములే కాని బ్రాహ్మణకన్యల విషయమునగావు—అట్టి ప్రాయశ్చిత్తములతోగూడిన వివాహములు క్షత్రియవైశ్యులకాపద్ధర్మములుకాని గౌణములుకూడ కావు—కావున వారైన రజస్వలావివాహములం జేయుట యశాస్త్రీయము—అందునను వైశ్యులకు గాంధర్వము విధింపబడకుండుటచేతను ... లేకుండుటచే

తేను వారి కెంతమాత్ర మాచరణీయము కాదు —ఆపద్ధర్మముగ బ్రాయ
శ్చిత్తముతో జెప్పబడిన యభ్యనుజ్ఞాత వివాహము నిప్పటి ప్రాజాపత్య
వివాము నాచరింపుచున్న క్షత్రియు లాచరించుట యంధ పరంపర కాని
వేరుకాదు. దాతయనుమతితో జేయబడునట్టియు సావిత్రీ తపతీందు
మత్యాదుల వివాహములలో సుప్రసిద్ధముగా నాచరింపబడినట్టియు
స్వయంవరములన్నియు రజస్వలకాక పూర్వమే శాస్త్రీయములయియు
న్నవి—కాని యట్టిదాత్రనుమతికి రజోదర్శనానంతరముష
మూడు సంవత్సరముల వరకు నవధి యీయబడుటచే
నపు డాచరింపబడునది సప్రాయశ్చిత్తమయి క్షత్రియుడగు దాతకాపద్ధ
ర్మము—అపుడుదాతృప్రతిగ్రహీతలకును కన్యకును వేర్వేరు ప్రాయ
శ్చిత్తములు నిరూపింపబడినవి—ఇచ్ఛయాన్యోన్యస్య సంయోగ ఇత్యాది
లక్షితమగు కామనామాత్రపూర్వకమగు గాంధర్వమునకు నాల్గవసంవత్స
రముగా నిరూపింపబడినది—అంతకు బూర్వము వధూవరులకు కామ
మున్నను స్వాతంత్ర్యము లేకుండుటచే గాంధర్వము దాత్రనుమతి లేనిది
అశాస్త్రీయము. నాల్గవవర్షమున దాత్రనుమతితో నిమిత్తము లేక శకుం
తలా దుష్యంతులవలె నాచరింపవచ్చును. ఇది దాత్రుపేక్షాప్రయుక్త
ము—ఈవిషయమునే "త్రీణివర్షాణీ త్యాదిమన్వాది" వచనములుబోధిం
పుచున్నవి—ఇవి క్షత్రియులకు నాపద్ధర్మములు—గుణవద్వరాలా
భాదివ్యాజ మాపద్ధర్మము కాదు —ఎట్టిదాతలును లేని కన్యరాజాను
మతితో రజస్వలకాక పూర్వమే స్వయంవరవిధితో వివాహముం జేసి
కొనవలయు. రాజానుమతికిన్నీ యనంతరమున మూడువత్సరములే య
వధి—నాల్గవవర్షమున రాజానుమతితో నిమిత్తము లేక స్వయముగా
సజాతీయుడగు వరుని వరించి పెండ్లాడవలయును—ఇది దాత్రభావ ప్ర
యుక్తస్వయంవరము-ఈవిధియైనను రజస్వలకాకపూర్వమే బ్రాహ్మణకన్య
కాపద్ధర్మముగ నంగీకరింపబడినది కాని పరిత్యాగవిధిబలంబున ననం
తరమునమాత్రము లేదు. అట్టి యెట్టిదాతలును లేని బ్రాహ్మణకన్యను
స్వయంవరవిధిచే వివాహమాడువాడు మార్కండేయ విహితప్రాయ
శ్చిత్తాంతరము నాచరించితీరవలెను. అటులనే యాసురాదివివాహము
లయందు నాయాప్రాయశ్చిత్తముల నాచరించవలెను ప్రాయశ్చిత్తము
తో గూడిన దాత్రభావస్వయంవరమునకు రజస్వలకాకయున్నే బ్రాహ్మణ

కన్యల కాపద్ధర్మము కాని యనంతరమున నెంతమాత్రమును కాదు బ్రాహ్మణకన్య ఎట్టిదశలోనైనను వివాహము లేక మున్ను రజస్వలయగుచో విడిచివేయదగినదియే కాని వివాహ యోగ్య కాదు. అపుడు వేఱుప్రాయశ్చిత్తము లెవ్వియును లేవు. క్షత్త్రియవైశ్యకన్యలకట్టిపరిత్యాగము మాత్రము లేదు కాని ప్రాయశ్చిత్తముతో నాపద్ధర్మముగా నంగీకరింపబడినది. అట్టియాపత్తులు దేశవిప్లవ రాజవిప్లవాదులును భూతవిప్లవాదులునే గ్రాహ్యములు. కన్యకంగవైకల్యాదులచే నగ్రాహ్యతయు గ్రహింపవలసినది. దాత్రభావముకూడ కన్యకాపదగా గ్రహింపబడును. శూద్రులకుగూడ రజోదర్శనానంతరమున భ్రూణహత్యాదిదోషాపాతకమగుటచే హేయమే. ఇదియు వివాహకాల వ్యవస్థాసారము.

(౨) విధవోద్వాహ మన్నియుగములలోను ద్విజులకు నిషిద్ధమే. అక్షతయోనికావివాహ ప్రాపకవచనములు యుగాన్తరీయ విషయములు. విధవా వివాహప్రాపకాభాసవచనములు సప్తపదీసంస్కారముకన్న బూర్వకమునను వాగ్దానోత్తరమునను బోధించునుగాని పిమ్మట గావు. ధర్మజ్ఞులు మన్వాదులు కాని యితరులుకారు వానినిమార్చుటకు మనకధికారము లేదు. ఈయుగమున గ్రాహ్యాగ్రాహ్యములను వారే యేర్పరచిరి. వారుచెప్పిన ప్రకారమునిషిద్ధములవిడనాడి విహితముల నాచరించుటయే మనకు ధర్మజ్ఞత్వశిష్టత్వాదులు-ఇత్యాదివిషయములు.

---

# స్వధర్మప్రకాశిని

శ్లో. "శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మా త్స్వనుష్ఠితాత్"
,, అనాద్యవిద్యావ్యామోహ తమస్తోమరవిద్యుతి,
స్తుమ స్తచ్ఛాస్కరం ధామ కర్మబ్రహ్మోభయాత్మకమ్.

౫-వ సం ] విభవ సం. కార్తిక, మార్గశిర, పుష్యములు. [ ౮-౯-౧౦ సంచికలు

## స్వవిషయము.

పత్రికాసంపాదకులగు శ్రీ కనుపర్తి. మార్కండేయశర్మగారు అఖిలభారత వర్షీయ బ్రాహ్మణమహాసభార్థమయి కాశీక్షేత్రమునకు వెళ్ళి తిరిగిదేశమునకు వచ్చినతరువాత కుడిచేతికి తిమ్మిరిగాఉండి ఏమియు వ్రాయ శక్తిలేకయున్నారుకనుక ఈసభారిపోర్టును పత్రికను ప్రకటించుటకు ఇంతయాలస్యమయినందులకు చింతిల్లుచున్నాము.

మానేజరు:—స్వధర్మప్రకాశిని.

—

శ్రీమచ్చిదానంద సరస్వతీగురుపరబ్రహ్మణేనమః.

## చాతుర్మాస్య యాగాహ్వానము. బెజవాడ.

విభవసం॥ మాఘ ౧-మొదలు ౭వఱకు ఫిబ్రవరి ౧౦-తేదీమొదలు ౧౬ తేదివఱకు, బెజవాడ సత్యనారాయణపురాగ్రహారంబునందు చిదానందాశ్రమంబను, స్వగృహమునందు స్వధర్మప్రకాశినీ పత్రికా ప్రధానసంపాదకులగు

### శ్రీ. దై. మ. కోటీశ్వర దీక్షితులవారు,

చాతుర్మాస్యయాగము జరుప సంకల్పించినారు గనుక శ్రీమత్పరమహంస, శ్రీచిదానంద సరస్వతీయతీంద్రులవారి శిష్యప్రశిష్యపరంపరలోఁజేరిన, స్వధర్మానుష్ఠానపరులందరు నీకాలమునకు విచ్చేయసంప్ర

ర్థితులు. పుష్య బ ౧౪ శుక్రవారం (8-2-29)ఉదయముననే ఋత్విక్కు లందరు రావలయును.

| | | |
|---|---|---|
| ఫిబ్రవరి ౧౦ మాఘ శు ౧ ఆది అన్వారంభణీయేష్టి | } | వైశ్వదేవ |
| ,, ౧౧ ,, శు ౨ సో వైశ్వదేవేష్టి | } | పర్వము |
| ,, ౧౨ ,, శు 3 మం వరుణప్రఘాసలు | | వరుణప్రఘాస పర్వము |
| ,, ౧3 ,, శు ౪ బుధ అనీకవతేష్టి సాంతపతేష్టి | } | సాకమేధ |
| ,, ౧౪ ,, శు ౫ గురు గృహమేధేష్టి మహాహవిషేష్ట్యాదులు | } | పర్వము |
| ,, ౧౫ ,, శు ౬ శుక్ర శునాసీరీయేష్టి | | శునాసీరపర్వం |
| ,, ౧౬ ,, శు ౭ శని ఐంద్రాగ్నపశుయాగము | } | ఆశీర్వచనము |

ఫిబ్రవరి ౧౪-౧౬ తేదీలు ముఖ్యదినములు.

---

## శ్రీ కాశీక్షేత్రమునందు

విభవసం. ఆశ్వయుజ బ౧-౧౧ (29-10-28—8-11-28) వరకుజరిగిన

## అఖిలభారత వర్షీయబ్రాహ్మణ మహాసమ్మేళనము.

సనాతన ధర్మపరాయణులును, సదాచారప్రచారణ శీలురును అగు శ్రీశ్రీశ్రీ మహారాజాధిరాజ దర్భాంగామహారాజు శ్రీశ్రీశ్రీ కాశీమహారాజు మున్నగు రాజాధిరాజుల ప్రోత్సాహముతో కాశీనివాసులును విద్వద్వరేణ్యులును అగు మహామహోపాధ్యాయ లక్ష్మణశాస్త్రిద్రావిడులు మున్నగు పండితవరేణ్యులును, మదరాసు రాజధానియందుజన్మించి సంస్కృతభాషయందు న్యాయవేదాంతమీమాంసాశాస్త్రములందు అద్వితీయ ప్రతిభను గడించి కలకత్తా విశ్వవిద్యాలయమునందు మీమాంసాశాస్త్రోపన్యాసకులుగా నున్న మహామహోపాధ్యాయ వేదాంతవిశారద అనంతకృష్ణశాస్త్రి మున్నగుపండిత

వర్యులును శ్రీకాశీక్షేత్రమునందు చేయదలచిన "అఖలభారతవర్షీయ బ్రాహ్మణ పండితమహాసభ 29-10-28 మొదలు. 8-11-28 వఱకు ౧౧ది నములు జయప్రదముగజరిగెను. శ్రీకాశీనగరమునందుకూడా సుమా రు ౪౦౦సంవత్సరములనుండి ఇంతటిమహాసభ జరిగియుండ లేదనియు, ఇందఱు పండితు లొక్కచోట చేరుట కిదియే ప్రథమపర్యాయమని యు పలువురు పండితులు తలంచిరి. ప్రకృతకాలమునందు కొందఱి మనస్సును ఆందోళన పఱుచుచున్న

౧ ఋత్వనంతరవివాహము శాస్త్రీయమా? కాదా?

౨. స్పృశ్యా స్పృశ్య విచారము.

3. విధవాపునరుద్వాహము.

మున్నగు ౧౭విషయములనుగూర్చి శాస్త్రసమ్మతమయినవాద ప్రతివాదములు సభయందు జరుగగలవని ప్రప్రథమమునందే సభా నిర్వాహకులు ప్రకటించియుండుటచేత దాదాపు ౨౦౦పైగా విద్వాం సులు సభాకార్యనిర్వాహకులు ప్రకటించిన ప్రశ్నావళికి ఉత్తరములను వ్రాసిపంపి సభాచర్చయందు పాల్గొనుకుతూహలముతో విచ్చేసిరి. ద్వై తాద్వైత విశిష్టాద్వైతాది సకలమతములకుచేరిన అన్నివర్ణముల వారల కుపండితమహాసభానిర్ణయములుఅత్యావశ్యకములనిభావించుటచేతను, సకలమతములకు సంబంధించిన బ్రాహ్మణ పండితోత్తములే సభకుప్రతి నిధులగుటచేతను బ్రహ్మ,క్షత్రియ, వైశ్య, శూద్రవర్ణమునకు చేరినవా రలేప్రేక్షకులగుటచేతను జగద్గురుపీఠము నలంకరించిన వివిధమతాచా ర్యులు సభనలంకరించుటచేతను ధర్మాచార్యులందఱు సభాధ్యక్షులని యు, అందఱేకగ్రీవముగ ధర్మనిర్ణయమును ప్రకటించుట అత్యావశ్య కమనియు భావించి యీచెప్పబోవురీతిగ నిర్ణయించిరి:—

# అ.భా. బ్రాహ్మణమహాసభ. (వైదికవిభాగము.)

బ్రాహ్మణ మహాసభను వైదికభాగమనియు, లౌకికభాగమనియు రెండుగావిభజించిరి. 29-10-28 తేదిమొదలు 6-11-28 తేదీవఱకుగల తొమ్మిదిదినములలో వైదికవిభాగసభజరిగెను. ఈవైదికవిభాగసభయం దీక్రింది నియమముల నవలంబించిరి:—

౧. సభార్థమయి కాశీనగరమునకువిచ్చేసినధర్మాచార్యులగుపీఠాధిపతులందఱు సభాధ్యక్షులనియు; 7,8, తేదులందు లౌకికవిభాగసభయనియు, దానికి శ్రీదర్భాంగామహారాజాగారుఅధ్యక్షులుగానుండవలయు ననియు నిర్ణయించిరి.

౨ వాదప్రతివాదములు మున్నగు సభాకార్యజాతమంతయు సంస్కృతభాషయందే జరిగి తీరవలయును.

3. సభాకార్య నిర్వాహకసమితివారు ప్రకటించిన "వివాహవయో నిర్ణయాది ౧౭ ప్రశ్నలకు సంబంధించిన విషయములనే సభయందు చర్చించవలయును.

౪. శ్రుతి,స్మృతి, నిబంధన గ్రంథములకు అవిరోధముగ మీమాంసాశాస్త్రపద్ధతిననుసరించియే వాదప్రతివాదములు జరుగవలయును. తరువాతధర్మాచార్యులందఱు కలసి సభనలంకరించి యీక్రిందినియమములను కార్యనిర్వహణార్థ మేర్పఱిచిరి:—

౧. ఒక్కొకవిషయమును చర్చించునపుడు ౫రకుతక్కువకాకుండా ౭రకు ఎక్కువకాకుండా మధ్యవర్తులను నిర్ణయించుటయు, ఈమధ్యవర్తులగు పండితులు వాదిప్రతివాదుల వాదము నాలకించి తమకు శాస్త్రీయమనితోచిన నిర్ణయమును లిఖించి ధర్మాచార్యుల సమీపమున సమర్పించవలయు ననియు.

౨. వాదప్రతివాదములనుమఱొకరులిఖించి చివరకు వాదిప్రతివాదులకువినిపించి తాము చెప్పినవిషయమంతయు అందు లిఖించియున్నట్లుల వారు తృప్తిజెందినయెడల వారాకాగితమునందు సంతకములొనర్చి ఆకాగితమును మధ్యవర్తులకు ఇవ్వవలయుననియు,

3. సాధ్యమయినంతవఱకు వాదప్రతివాదము లొనర్చుటకు పండితుల కవకాశమొసంగినను అందఱకవకాశమొసంగుట అశక్యము కావున ఈవిషయమయి చెప్పదలచినవారు తాము చెప్పదలచిన విషయమును లిఖించి మధ్యవర్తులకు ఇప్పించవలయు ననియు,

౪. వాదిప్రతివాదులుగాని తదితరులుగాని శాస్త్రవిరుద్ధముగనో అప్రస్తుత ప్రశంసగానో మాట్లాడుచున్నయెడల వారిని వారించుటకు గాను నియామకునిగా ఒక్క పండితమన్యుని నియమించవలయును. (మధ్యవర్తిత్వము ఆంధ్రదేశమునుండి సభకు వచ్చిన ఆంధ్రపండితులలో

శ్రీశ్రీమల్లాది రామకృష్ణచయనులవారికిన్నీ మహా. తా. రాయుడు శాస్త్రి గారికిన్నీ లభించినదిగాని నియామకపదవిమాత్రము ఒక్కరికిన్నీ లభింప లేదు. కేవలపాండిత్యము, సదాచారపరత్వముమాత్రమేగాక స్థానికము గను, దేశమునందును సుప్రసిద్ధియు అందుల కత్యావశ్యకములగుట చేత శ్రీపంచానన తర్కరత్నాది గౌడవిద్వాంసులు, స్వామిదయానం దులు మున్నగువారలే ఆపదవికి నియమింపబడిరి.)

౫. ఒక్కొకవిషయమునుగూర్చి చర్చించిన తరువాత క్రొత్తవి షయమును విచారించునప్పుడు మధ్యవర్తులను నియామకుని మార్చు చుండిరి.

విచారసభయందు విమర్శింపబడినవిషయములలో స్త్రీవివాహ వయఃకాల నిర్ణయచర్చ, విధవాపునరుద్వాహ సాధుత్వాసాధుత్వచర్చ, ప్రణవ సహితమంత్ర దీక్షాగ్రహణార్హాచర్చ, విభిన్నశాఖీయబ్రాహ్మ ణులలోపరస్పరవివాహచర్చ, అస్పృశ్యవిచారచర్చ మున్నగువానినిగూర్చి చాలశాస్త్రార్థముజరిగెను.

గర్భాదిగగాని జననాదిగగాని అష్టమసంవత్సరమునందు బ్రాహ్మ ణబాలికలకు వివాహ మొనర్చుట శ్రేష్ఠతమమని శాస్త్రములు విధిం చుచున్నవను విషయమును పండితులందరేకగ్రీవముగ సంగీకరించిరి. ఋత్వనంతర వివాహవిషయమునందు మాత్రము పండితులలో మతభే దము. లిట్లు తెలుపబడెను:—

౧. ఆపత్కల్పముగా బ్రాహ్మణస్త్రీలకు ఋత్వనంతర వివాహ మును ప్రాయశ్చిత్తపూర్వకముగా చేయవచ్చును. పితృదోషముచేత అవి వాహితగా ఉండి రజస్వల యయినస్త్రీకి సామాన్యపాపము, సాహస ముచేత పెండ్లిచేసికొనుట కిష్టపడని బాలిక రజస్వల యయినయెడల అధికపాపము "నైనఃకించిదవాప్నోతి నచయం సాధిగచ్ఛతి" అనుమను వచనము ననుసరించి ఈద్వివిధ బాలికలకు సంభవించు నట్టిపాపము ప్రాయశ్చిత్త మొనర్చినయెడల పోవును. తదనంతరము వారు సవ్యవహా ర్యలగుదురు. అట్టిబాలికను పెండ్లాడిన వరుడుకూడా ప్రాయశ్చిత్తానంత రము వ్యవహారమునకు యోగ్యుడగును. ఋత్వనంతర వివాహమును గూర్చి శాస్త్రములందచ్చటచ్చట గనంబడుచున్న నిందావచనములు " నహినిందా న్యాయము చేత అష్టవర్షావివాహ స్తుతిపరములనుగా

సమన్వయించుకొనవలయునుగాని వానికి స్వార్థమునందు ప్రామాణ్యము నుస్వీకరింప కూడదు" అని వంగీయ పండితులవాదము.

౨. మహామహోపాధ్యాయ తాతా సుబ్రాయశాస్త్రిగారున్నూ పైవంగీయపండితుల నిర్ణయము నామోదించుచు అందులకు వారునిర్ణయసింధు ధృతఆశ్వలాయన వచనమునందు గల ప్రాజాపత్య కృచ్ఛ్రత్రయామ్నాయ గోదానరూపమైన అల్పప్రాయశ్చిత్తమును గమకముగా నుదహరించిరి.

౩. న్యాయాచార్య శ్రీరాజేశ్వరశాస్త్రి ప్రభృతులుమాత్రము పితృదోషముచేత అవివాహితగా ఉండి రజస్వలఅయిన బాలికయొక్క పాపము౩ సంవత్సరములలోపల ప్రాయశ్చిత్తపూర్వకముగావివాహ మొనర్చినయెడలనిర్దుష్టమైవ్యవహారయోగ్యురాలగుననియు, తండ్రి పెండ్లిచేయదలచినను పెండ్లియాడనని పట్టుపట్టిన బాలిక అవివాహితగా రజస్వల యయినయెడల ప్రాయశ్చిత్తమొనర్చినను అట్టిబాలికసవ్యవహార్య కాజాలదనియు, పితృదోషమున అవివాహితగా ఉండి రజస్వల అయినప్పటికిన్నీ రజోదర్శనానంతరము ౩వ సం దాటినతర్వాత ప్రాయశ్చిత్త పూర్వకముగా వివాహమొనర్చినను ఆబాలిక శిష్టవ్యవహారయోగ్యురాలు కాజాలదనియుచెప్పిరి.

అందుబుత్వనంతరవివాహవిషయమును గూర్చి మేమొసంగిన అభిప్రాయము నిటదెలుపుచున్నారము:—

౪. వంగీయ పండితులవాదమునకు సమాధానము:—తైత్తిరీయ ఖిలశ్రుతియగు ఇతిహాసమునందును, అత్రి, ఆంగిరస, ఆపస్తంబ, ఆశ్వలాయన, కశ్యప, గర్గ, దేవల, పరాశర, ప్రజాపతి, మరీచి, యమ, మార్కండేయ, లఘుశాతాతప, విష్ణు, శాట్యాయన, హారీత, యమధర్మశాస్త్రములందును, అవివాహితగా పితృగృహమున సమర్తాడిన ద్విజ బాలిక వృషలియనియు, సర్వధర్మబహిష్కృత యగుననియు చెప్పబడియున్నది. అట్టిబాలికకు ప్రాయశ్చిత్తము నొనర్చినతరువాత పరిశుద్ధురాలగుననిచెప్పిన ఆశ్వలాయన వచనమునందు సామాన్యముగ చెప్పబడియున్నదే కాని బ్రాహ్మణాదిపదము ఏదియు చెప్పఁబడి యుండలేదు.

ఆ. అవివాహితగాఉండి రజస్వలయయిన బాలిక సర్వధర్మబహిష్కృతయగును, పరిత్యజింపదగినదియనిచెప్పినశాస్త్రములందును, తైత్తిరీయ

ఖిలక్షత్రియగు ఇతిహాసమునందున్ను, అత్రి,ఆంగిరస ఆపస్తంబ, కశ్యప, గర్గ, దేవల, పరాశర, మరీచి, యమ మార్కండేయ ధర్మశాస్త్రము లందున్ను "అసంభాషో హ్యపాం క్తేయస్స విప్రోవృషలీపతిః; యస్తాము ద్వాహయేత్కన్యాం బ్రాహ్మణోజ్ఞానదుర్బలః, యాకన్యా పితృవేశ్మ స్థా యదిపుష్పవతీభవేత్, అసంస్కృతాపరిత్యాజ్యా నపశ్యేత్తాంకదా చన, వివాహేచనయోగ్యాస్యాత్ శ్లోకద్వయవిగర్హితా. ఏతాంపరిణయ న్విప్రో నయోగ్యో హవ్యకవ్యయోః" మున్నగుతావులందు బ్రాహ్మణ, విప్ర ఇత్యాదిపదములుండుటచేత అట్టి ప్రాయశ్చిత్తపూర్వక ఆపత్కల్ప వివాహాచరణముకూడ బ్రాహ్మణ స్త్రీలకుపనికిరాదనియు, అట్టివివాహము స్వయంవరవివాహార్హలగు క్షత్రియకన్యావివాహపరమనియు గ్రహిం చవలయును.

ఇ. దాత్రాద్యభావదశయందు కన్య స్వయముగా వరించవచ్చు నని చెప్పినచోట "ఏతచ్చప్రాగ్రజోదర్శనాత్" అని అపరార్కాదివ్యా ఖ్యాతలు నిర్ణయించియున్నారు. పిత్రాదులుండియు కన్యాదానమొనర్ప క ఉన్నతావునందు ఋత్వనంతరము 'ఋతుత్రయమో, సంవత్సరత్రయ మో' నిరీక్షించి స్వయంవరమును చేసికొనవచ్చునని చెప్పిన మను, బోధాయన, వసిష్ఠ, విష్ణుస్మృతులందు సామాన్యముగ విధింపబడియు న్నదే కాని బ్రాహ్మణాదిపదము యెంతమాత్రము చెప్పబడియుండలేదు. నిబంధకారులుకూడ ఆపత్కల్పమగు ఈఋత్వనంతరనిరీక్షణమును సర్వ వర్ణసాధారణవిధిగా ఎచ్చటను చెప్పియుండలేదు. మీదుమిక్కిలి "అత బ్రా హ్మణపదోపాదానాత్ బ్రాహ్మణస్యైవాయంరజస్వలావివాహనిషేధః, నక్షత్రియాణాం" అని వీరమిత్రోదయనిబంధకారుడుకూడా నిర్ణయించి యున్నాడు కనుక బ్రాహ్మణులకు రజస్వలావివాహము సర్వథానిషేధింప బడియున్నది. ఆపత్కల్పముగా చెప్పబడినఋత్వనంతరవివాహాభ్యనుజ్ఞ బ్రాహ్మణేతరపరమనియే గ్రహించితీరవలెను.

ఈ. మీమాంసాశాస్త్రమునందుగల "నహినిందా న్యాయము ను నిందావాక్యములుగల ప్రతిచోటను ప్రయోగించుట మీమాం సాశాస్త్రసమ్మతము కాజాలదు. నిందావచనములచేత ప్రతిషేధవిధిని కల్పించవలయును. ప్రమాణాంతరవిహితమయినదానికి బాధకలుగుచు న్నప్పుడే నహినిందాన్యాయమును పరిగ్రహింపవలయును. గోవు, అశ్వ

ములకంటె భిన్నములయినవి పశువులే కాదు. అనువాక్యమునందు తదితరములగు మేక, మహిషము మున్నగునవికూడా పశువులేయని ప్రమాణాంతరమున్నూ లోకప్రసిద్ధియున్నూ ఉండుటచేత ఆవాక్యము గోప్రశంసయందే తాత్పర్యముగలదియగుననిమీమాంసయందు నిర్ణయింపబడినది ప్రకృతమున బ్రాహ్మణబాలికలకు ఋత్వనంతరవివాహముచెప్పటనువిధింపబడియుండకపోవుటయేగాక మీదుమిక్కిలి రజోదర్శనముకంటెపూర్వమే వివాహముచేసితీరవలయునని స్పష్టముగా విధించియున్నందువల్లనున్నూ ఇచ్చట "నహినిందాన్యాయము"నకు ప్రాప్తియే లేదు.

ఉ. వచనాంతరముచేత ప్రాజాపత్యకృచ్ఛ్రప్రత్యామ్నాయరూపగోదానప్రాయశ్చిత్తముచేతనే అవివాహితగా రజోదర్శనమునందిన బాలికకు వివాహయోగ్యత సవ్యవహార్యతయుసిద్ధించుచుండగా 'అసంస్కృతా పరిత్యాజ్యా; వివాహేచ నయోగ్యాస్యాత్; ఇత్యాది మార్కండేయ స్మృతివచనములందు ఇంతకఠినముగా విధించిన వచనములకు మనము వ్యవస్థ చేయవలయునుగావునతద్వచనములు సర్వథావివాహమునొల్లని స్త్రీపరములని శ్రీమహామహోపాధ్యాయ సుబ్బారాయుడుశాస్త్రిగారుమున్నగువారుచెప్పిరి. ఇందులకుసమాధానము:-రజోదర్శనము మొదలుకన్యాదానపర్యంతము గతించినఋతువులకు ఒక్కొక గోదానముతోడను అత్యంతాశక్తవిషయమున ఒక్కగోదానముతోడను ప్రాయశ్చిత్తమును చెప్పినఆశ్వలాయన వచనమునకున్నూ, అవివాహితగా ఋతుమతియైన బ్రాహ్మణబాలిక పరిత్యాజ్యా, హవ్యకవ్య బహిష్కృత యనిప్రతిపాదించినగర్గ, మార్కండేయాదివచనములకున్నూ సాజాత్యము లేదు. లఘుప్రాయశ్చిత్త పూర్వకపరిగ్రహణమునువిధించినఆశ్వలాయన వచనమునందుసామాన్యముగ చెప్పబడినదికనుక ఆప్రాయశ్చిత్తపూర్వకపరిగ్రహణము క్షత్రియాది పరమనియు, పరిత్యాగ, అవ్యవహార్యతరూపమగుకఠోరదండమును విధించిన మార్కండేయాది స్మృతులందు బ్రాహ్మణ, విప్ర ఇత్యాదిపదములు ప్రయోగింపబడియుండుటచేతవివాహనిషేధముబ్రాహ్మణ బాలికావిషయమనియు వ్యవస్థచేయుట స్మృతిసమ్మతముఅగునుకాని స్వదోషముచేత ఋతుమతి యయినకన్యయనియు సర్వథావివాహపరిత్యాగాభిలాషిణియగు కన్యయని వ్యవస్థచేయుటకు వచనోపపత్తియేమియు లేదు కావున గ్రాహ్యము కాజాలదు.

ఊ. బ్రాహ్మణకన్యలకు చెప్పినవిధానమే వైశ్యకన్యలవిషయము నందుకూడా శాస్త్రము శిష్టాచారము విధించుచున్నది అని చెప్పితిని. అంతటితో ఊరకొనక ఇట్లు పత్రికవ్రాసి నేనున్నూ, శ్రీ కొం. సుబ్బరాయశాస్త్రిగారున్నూ, వి. క్రాల. రామచంద్రాచార్యులుగారున్నూ సంతకములొనర్చి ధర్మాచార్యసమక్షమున సమర్పించితిమి.

ఋ. వ్యక్తులు గాని ఆయా దేశములవారుగాని చేయుచున్న ఆచారములు నింద్యములని గర్హించుటకుగాని, స్తుత్యములని గతికల్పించుటకుగాని యీపండితమహాసభను ఎవ్వరుసమకూర్పలేదు. ధర్మాచార్యులుగాని తత్తుల్యులుగాని చేరి శాస్త్రములందు నింద్యములని నిర్ణయించిన విషయములను కృపాబుద్ధితో శాస్త్రీయములని నిర్ణయించుటకుగానిఅనుగ్రహమొసంగుటకుగాని యీసభసమకూర్పబడలేదు. శాస్త్రసమ్మతములనికొందఱును, శాస్త్రవిరుద్ధములని కొందఱున్నూవివాదగ్రస్తధార్మికవిషయములనుగూర్చి వాదించుచున్నారు. కావునశాస్త్రసమ్మతముగచర్చించి ఎయ్యదిశాస్త్రసమ్మతమో అట్టిదానిని నిర్ణయించుటకే యీసభసమకూర్పబడినది. ఏతన్నిర్ణయమునందుధర్మశాస్త్రవచనములకున్నూ, మీమాంసాశాస్త్రసమ్మతయుక్తులకున్నూప్రాముఖ్యముగానితద్విరుద్ధముగ వాదించువారల సంఖ్యాధిక్యమునకుగాని పాండిత్యమునకుగానిప్రాముఖ్యము లేదనియు, పండితులెఱింగియేయున్నారుగదా!

బాలికలయొక్క వివాహవయఃకాలమును గూర్చియే ధర్మశాస్త్రగ్రంథములందును, నిబంధనగ్రంథములందున్నూ విశేషించిచెప్పబడియున్నది గాని పురుషులయొక్క వివాహవయఃకాలపరిమితినిగూర్చినచర్చ విశేషముగ ధర్మశాస్త్రగ్రంథములందు చెప్పఁబడియుండలేదు. దీర్ఘకాలబ్రహ్మచర్యనిషేధము, ౫౦ సం॥లకు మించిన వయస్సుగల పురుషుడు వివాహము చేసికొనగూడదు అని మాత్రము కలిని షేధములందుగలవు. ౧౨సంవత్సరముల బాలికను ౩౦సం. పురుషుడు పెండ్లియాడవచ్చును. అనెడి మనుస్మృతి వచనముగలదు. అందే పిల్లవయస్సుకంటె ౩వంతులవయస్సుగలిగి పురుషుడుండవలయును అనియు సాధారణముగ జెప్పబడియున్నది. కాని యీసంవత్సరములోపల పెండ్లిచేయగూడదు అని పూర్వావధిని నిర్ణయించి యుండలేదు. కొందఱు ౧౬ సం లోపల చేయగూడదు అనియు, కొందఱు ౧౮సం. లోపలచే

యగూడదనియు, మఱికొందఱు ౨౦సం. అనియు పరిపరివిధముల చెప్పిరి. కాని ఏలకో ధర్మనిర్ణయమునందు పురుషుల వివాహపయఃపూర్వకా లావధినిగూర్చిమాత్రము ఏమియు నిర్ణయించియుండలేదు. నరసింహ కృత ప్రయోగ పారిజాత గ్రంథమునందు పురుషులయొక్క వివాహ కాలముయొక్క పూర్వావధిని సైతము నిర్ణయింపబడియున్నది. ఈ గ్రంథనిర్ణీత విషయమును నేను సభయందు సూచించియుంటిని గాని ప్రమాణవచనము లుదహరించియే యిట్టివిషయములను చెప్పవలయును ఊరక స్వాభిప్రాయమును చెప్పకూడదు అని సభానియమములుండుటచే తను అచ్చటగ్రంథములభింపక పోవుటచేతను నేను నాయభిప్రాయమును చెప్పుటకుగాని వ్రాసియిచ్చుటకుగాని అవకాశమప్పుడులభింపలేదు. పాఠకులకుపకరించుననుతలంపుతో ఆవిషయమునిటనిరూపించుచున్నాడను

శ్లో. వివాహ్యా జననాదూర్ధ్వం చతుర్థాబ్దాత్పరం స్త్రియః।
ఆదశమాబ్దపర్యంత మారజోదర్శనాత్పరా।
చతుర్థే జననాత్పూర్వం నవివాహ్యేతి కేచన।
గౌరీవకస్యకా భాతి చూడాదూర్థ్వ మిహస్త్రియః॥

"తస్మాచ్చాలకాలా దూర్థ్వమారజోదర్శనా త్తస్మిన్ బాలిశా నా మపి నగ్నికానాం వా స్త్రీణాం వివాహ ఉక్తః" అని స్త్రీవిషయమును నిర్ణయించిన తర్వాత.

శ్లో॥ చతుర్థాయనకన్యాంతు వివహేత్ షోడశాబ్దకః।
త్రింశద్వర్షో ద్వాదశాబ్దాకరగ్రహణ మిష్యతే॥
ప్రాగ్ద్వాదశాబ్దాత్పుంనస్తు దశాబ్దాదితిచాపరే।
వివాహం నప్రశంసంతి పుత్రాయుర్వృద్ధి మిచ్ఛవః।
వివాహం నైవదుష్యేత కలౌతు నియమా దిహ॥

ద్వాదశాబ్దాత్ప్రాక్ వరస్య వివాహనిషేధాదిదంవచనము క్తమ్.

పై శ్లోకములతాత్పర్యము పరిశీలించినయెడల గౌణకల్పముగనో ఆపత్కల్పముగనో ౧౨సం. తర్వాత పురుషులకు వివాహాభ్యనుజ్ఞ గల దనియు అంతకంటెతక్కువగా అనగా ౧౦సం. తర్వాత చేయవచ్చు నని కొందఱు చెప్పుచున్నారనియు సిద్ధించుచున్నది.

అగ్నిగోదానవ్రతము ౧౬ సంవత్సరములు చేయవలయుననియు

తరువాత ఒకసంవత్సరము గోదానవ్రతమనియు, తరువాత వేదవ్రతముల నొనర్చుకొని పెండ్లిచేసికొనవలయుననియు చెప్పబడి యుండుటచేత ౧౮వ- యేటపురుషుడు పెండ్లాడుటయందు దోషమేమియు లేదు. అయినను ౧౬సంవత్సరములకు లోపల వివాహము చేయవలసివచ్చినయెడల ఉక్తకాలమగు ౧౬.వసంవత్సరమునకుముందే వేదవ్రతముల నపకర్షించి చేయవచ్చునని కొందఱున్నూ, కాలనిరీక్షణము చెప్పఁబడియున్నది కనుక అంతకులోపల కూడదని కొందఱున్నూ చెప్పుచున్నారు. ఇందులకు ప్రమాణవచనములు:—

శ్లో. స్యాత్పంచదశవర్షస్య వివాహ స్తస్య బోధితః
ద్విత్రివర్షాధికన్యూనాం వరస్తాం వివహేత్ స్త్రియమ్॥

అంగిరా అపి: కన్యాం వరసమా న్న్యూనా ముద్వహేద్ద్విత్రివార్షికీం।
ఉక్తంతత్ షోడశాబ్దాత్ప్రాగ్వివాహ మిదముచ్యతే।
అపకృష్యవ్రతాన్ సర్వాన్ కుర్వంత్యస్య విచక్షణాః।
తదిదంనాదృతం పూర్వైరాచార్యైః కాలవీక్షణాత్।
కలా వనియమ త్త్వేన కర్తవ్య మితి చాపరే॥
బాఢం ఇత్యాదివచనైః వరస్యద్వాదశాబ్దాత్ప్రాగేవవివాహో నాదృతః, తదూర్ధ్వం కర్తవ్య ఏవేత్యలమతి ప్రసంగేన॥

పురుషుఁడు జన్మించిన సంవత్సరమునందుగాని కాలమునందుగాని జన్మించిన పిల్లనుపెండ్లాడగూడదనియు ౨, ౩. లేక అంతకంటె ఎక్కువగను వయస్సు తక్కువగలపిల్లను పెండ్లాడవచ్చుననియు, అభ్యనుజ్ఞకొన్నిచోటుల ఇవ్వఁబడియున్నది:—

శ్లో. సమాబ్దా సమకాలాయా నవివాహ్యా కదాచన,
వరస్తు ద్విత్రివర్షాదిన్యూనాం కన్యాం సముద్వహేత్.

కాని యీశ్లోకములన్నియు ముఖ్యకల్పముగా పరిగ్రహింపఁదగినవి కాజాలవు. ఆపత్కల్పముగా పరిగ్రహింపదగినవని భావము.

ధర్మాచార్యులయామోదము.

బ్రాహ్మణమహాసభా విషయమయి మతత్రయ పీఠాధిపతులున్నూ మతత్రయ విద్వాంసులున్నూ తమసానుభూతినిక్రియారూపముగ గనఁబఱిచియున్నారు.

౧. శ్రీశ్రీశ్రీ ద్వారకా జగద్గురు పీఠాధిపతులున్నూ
౨. ,, సంకేశ్వర కరవీరపీఠాధిపతులున్నూ
స్వయముగా సభ నలంకరించి ధర్మనిర్ణయమునందు పాల్గొనియున్నారు
శ్రీశ్రీశ్రీ శృంగేరిజగద్గురు పీఠాధిపతులు
,, కాంచీకామకోటి జగద్గురు పీఠాధిపతులు
,, పుష్పగిరి జగద్గురు పీఠాధిపతులు
తమతమపీఠములనుండి ప్రతినిధులనుగా విద్వాంసులను చర్చయందు పాల్గొనుటకు పంపుచు మంగళానుశాసనముల నొసంగిరి.

3. శ్రీశ్రీశ్రీ యదుగిరి సంపత్కుమార జగద్గురుస్వాములు.
౪. ,, ప్రతివాదిభయంకర అనంతాచార్యస్వాములు.
స్వయముగా సభ నలంకరించిరి. శ్రీవానమామలయిజియ్యర్ జగద్గురు స్వాములవారు విద్వత్ప్రతినిధులను పంపిరి.

౫. శ్రీశ్రీశ్రీ వల్లభాచార్యసంప్రదాయమునకుచేరిన గోవర్ధనలాల అను నాథు ద్వారపీఠాధిపతులున్నూ, తత్సంప్రదాయ శిష్యపరంపరకు చేరిన మరిముగ్గురు పీఠాధిపతులున్నూ స్వయముగా, సభ నలంకరించి ధర్మాచార్యపీఠము నలంకరించి తమతమ సదుపదేశములనొసంగిరి. శ్రీద్వారకా జగద్గురు పీఠాధిపతులయొక్కయు, ప్రతివాదిభయంకరఅనంతాచార్యస్వాములవారి యొక్కయు ధర్మోపన్యాసములు సభయందు కేవలము ఆశువుగా జెప్పబడినవే గాని ముద్రించి పంచి పెట్టబడలేదు లభించిన యుపన్యాసములను భాషాంతరీకరించి యిందు చేర్చియేయున్నాము. దాదాపు ౧౦ వేలవరకు జనసముదాయముగల జనసమ్మర్దమునందు వారిమౌఖికోపన్యాసమును సంగ్రహించుటకు మాకు అవకాశము లేకపోయెను. శ్రీ ప్రతివాది భయంకర అనంతాచార్యస్వాములవారి మౌఖికమగు సంస్కృతోపన్యాసము సరళపదభూయిష్ఠమై ప్రాచీనశాస్త్రసమ్మతశిష్టాచారనిర్ణయములనిర్ణయించుచు ఓజస్వియైయుండెను.

సభకు నానాదిశలనుండి దాదాపు ౨ వేలకుపైగా పండితప్రతినిధులును, ౬ వేలకుపైగా ప్రేక్షకులును విచ్చేసినటుల సభాకార్యనిర్వాహకులు ప్రకటించిరి కాని సభామంటపమును చూడగా ౧౦ వేలకు పైగా జనసముదాయమున్నటులతోచెను.

ప్రతినిధులసంఖ్య.

| | |
|---|---|
| మదరాసురాజధాని ఆంధ్ర, ద్రావిడ, కర్ణాట, కేరళప్రాంతములనుండి | 100 |
| వంగదేశము ఆసాములనుండి | 700 |
| సంయుక్త ప్రాంతమునుండి | 800 |
| బీహారు బరిస్సాప్రాంతములనుండి | 300 |
| బొంబాయి, గుజరాతు ,, | 150 |
| రాజపుటానా ,, | 100 |
| మొత్తము సభకువిచ్చేసిన ప్రతినిధులు | 2150 |

సనాతనధర్మప్రదీపమను గ్రంథరాజమును దాదాపు ౫౦ వేల రూపాయిల వ్యయఃరిచి ముద్రించి అర్హులగు పండితులకు ఉచితముఃగా పంచిపెట్టిన "సంతోజిమహారాజ"ను సాధుపుంగవుడు సభకు విచ్చేసి పండితమండలిని ప్రార్థించి "సనాతనధర్మప్రదీప" గ్రంథము యొక్క ద్వితీయ ముద్రణమునకు పండితవర్యుల సాహాయ్యమపేక్షించెను. కార్యనిర్వాహకసమితికి అధ్యక్షులగు పంచానన తర్కరత్న మహామహోపాధ్యాయులవారు కాశీయందుండు పండితోత్తములలో సదాచార, విద్యావయోధర్మాసక్తులందు అగ్రగణ్యులు, వీరు ఆరోగ్యవిహీనులై లేవలేనిస్థితియందుండియుమేనానవారిపై సభామంటపమునకు విచ్చేసి ముద్రితమగు స్వోపన్యాసమును జదివింపఁబోవుచు ఆయాదేశ పండితప్రతినిధులకని ప్రత్యేకప్రత్యేకముగ నిర్ణయింపబడినస్థలములందు కూర్చుండియున్న పండితసంఘముకడకు ప్రత్యేకప్రత్యేకముగవచ్చి ఉపచారోక్తులనుపలికి తనయశక్తతచేత సత్కారమును చక్కగా నెరవేర్పజాలనందులకు మన్నింపుఁడనికోరుచు మీయందఱను దర్శించుటవలననాకు సంపూర్ణబలము లభించినదని వక్తృపీఠము నధిష్ఠించి సంస్కృతభాష నెఱుంగని యజ్ఞులవలనను, ఎఱింగియు స్వలాభాపేక్షతో దుర్వాదము సలుపుచున్న కొందఱుపండితులవలనను సనాతనధర్మమునకుసంభవించుచున్నహానిని వివరించుచు పండితులందఱిట్టిధర్మద్రోహుల దుర్వాదములను ఖండించవలయునని ఉద్రేకపూరితమయిన యుచ్చారణతో ఓజస్వియగు సంస్కృతభాషతో పలుకుచు వివశులయిరి. అప్పుడు సమీపమునందున్నవారి పుత్రుడున్నూ, శ్రీఅనంతకృష్ణశాస్త్రిగారున్నూవా

రిని పట్టుకొని మెల్లగా వక్తృపీఠమునుండిదింపి సేదదీర్చి యింటికిపంపిరి.

వైదికవిభాగసభ యందు విచారింపఁదగినవని నిర్ణయించిన ప్రశ్నావళికిని యీప్రశ్నపుటలయందున్నూ, మధ్యవర్తులు నిర్ణయించిన తన్నిర్ణములను ౩౭—వ పుట మొదలు ౪౦వ పుటవఱకును, ధర్మాచార్యులందఱేకగ్రీవముగ ప్రశ్నావళికియిచ్చిన నిర్ణయములను ఈరిపోర్టు ౪౦, ౪౧౪౨ వ పుటలయందును ప్రకటించియున్నారము. లౌకికవిభాగసభయందు జరిగిన తీర్మానములు ౬౨, ౬౩,౬౪, పుటలందు గలవు.

సభవారుప్రకటించినప్రశ్నావళికి ఉత్తరములను దాదాపు ౨౦౦ పైగా పండితులు వ్రాసి పంపియుండిరి. అందాంధ్రదేశమునందుండి దాదాపు ౨౫ పైగా పండితులు వ్రాసిపంపియుండిరి. ఆయాపండితులు వ్రాసిపంపిన అభిప్రాయములను సంగ్రహముగ సభవారు ప్రకటించి పంచిపెట్టిరి. అందు ఋత్వనంతర వివాహము అశాస్త్రీయమని వాదించెడి శ్రీ రామకృష్ణచయనులవారు, వేమూరు నరసింహశాస్త్రిగారు మున్నగు మావంటివారి మతమునేగాక ప్రతికూలురగు శ్రీ పల్లయ్య శాస్త్రిప్రభృతుల మతమునుకూడా ప్రకటించియేయున్నారు. సభకురాని కొందఱాంధ్ర పండితులు సంస్కర్తల మెప్పునకాశించి కాశీసభ "పక్షపాత"సభయని అచ్చటచ్చట చెప్పుచున్నారట, పాపము శాంతించుగాక.

శ్రీపుష్పగిరి పీఠాధిపతులు ౨౪ పండితులకు గమనాగమనవ్యయము నొసంగి కాశీసభకు పంపదలంచిరి కాని అందు ౩ పండితులు మాత్రము కాశీకి రాజాలకపోయిరి. తక్కినవారు సభకు విచ్చేసిరి. శ్రీ రామకృష్ణచయనులవారు, విద్యారణ్యపంచానన విద్యావాచస్పతి, రామచంద్రాచార్యులుగారు, కొంపల్లి సుబ్బరాయశాస్త్రిగారు, జా. పట్టాభిరామశాస్త్రిగారు, మున్నగువారును మేమున్నూ తత్ప్రతినిధులుగానే సభకువెడలియుంటిమి. కలకత్తారైలుమార్గము చెడుటచేతను, విచారసభయనగా పండితులకు చక్కగా అభిప్రాయము తెలియకయు పలువురు పండితులు సభకు సకాలమునకు రాజాలకపోయిరి.

☞ ఉపన్యాసములు మున్నగువానిని ఆంధ్రీకరించి యిచ్చిన మామిత్రులు శ్రీ పు. సూర్యనారాయణతీర్థులవారి కనేకవందనములు. గ్రంథవిస్తరభీతిచేత పలువిషయములను వదలవలసివచ్చినది.



[illegible] (సంపాదకుడు)

# సభయందు విచారించిన ప్రశ్నావళి.

౧. స్త్రీణాం పుంసాంవా వివాహకాలః కియదవధి? కుత ఆరభ్య శాస్త్రసమ్మతః?

స్త్రీలకుగాని, పురుషులకుగాని, ఏ సంవత్సరము మొదలుకొని ఎన్నవసంవత్సరమువరకు వివాహము చేయుట శాస్త్రసమ్మతము?

౨. తత్రవర్తమానపరిస్థిత్యనుసారేణ శాస్త్రానుసారేణచ నియమనం కియదవధి యోగ్యం?

శాస్త్రము ననుసరించి ఈకాలమునందు స్త్రీపురుషవివాహ వయోనిర్ణయమును ఎంతవఱకుయుక్తమని నిర్ణయింపవచ్చును?

౩. రజఃప్రవృత్త్యనంతరం వివాహస్యముఖ్యత్వ? ముతగౌణత్వ మహోస్విత్ ఆపత్కల్పత్వం?

ఋత్వనంతరవివాహము ముఖ్యమా? గౌణమా? ఆపద్ధర్మమా?

౪. ఋతుదర్శనేవృషలీత్వ బోధకానాంవచనానాం తాత్పర్యం కిం?

అవివాహితగా రజస్వలయయిన బాలికను "వృషలి" యని చెప్పుచున్న ధర్మశాస్త్రవచనముల తాత్పర్యమేమి?

౫. బ్రాహ్మణాదిజాతిషు అవాంతరశ్రేణీనాం పరస్పరం వివాహసంబంధః శాస్త్రసమ్మతోవా? నవా?

బ్రాహ్మణాదిజాతులందు గల అవాంతరశాఖలలో పరస్పరము వివాహసంబంధము చేసికొనుట శాస్త్రసమ్మతమా? కాదా?

౬. ధర్మజ్ఞాః కేవా? కీదృశంవా ధర్మపరివర్తనం కర్తుమర్హంతి? కిం సంకోచనాఖ్యం? (ఉతప్రవర్తనాఖ్యం ధర్మపరివర్తనం)

ధర్మజ్ఞు లెట్టివారు? వారికెట్టి ధర్మపరివర్తనముచేయుట కధికారముగలదు? ధర్మపరివర్తనమనగా ధర్మసంకోచమా? లేక మఱేమి?

౭. విధవావివాహః దంపత్యోః, వివాహమోక్షశ్చ శాస్త్రదృష్ట్యాయోగ్యః? ఉతవా విరుద్ధః? అహోస్విన్నింద్యః.

విధవావివాహము,వివాహవిచ్ఛేదము,శాస్త్రదృష్టితో చూచిన యోగ్యములా? లేక శాస్త్రవిరుద్ధములా? లేక శాస్త్రనిషిద్ధములా?

౮. అస్పృశ్యానామంత్యజానాంచ స్పర్శవిషయే, సభాప్రవేశవిషయే, కూపోదకగ్రహణవిషయే దేవాలయప్రవేశవిషయేచ అన్యేభ్యః తారతమ్యరక్షణం యోగ్యం నవా? యదియోగ్యం తదా కీదృశం తారతమ్యం రక్షణీయం?

౮. మ్లేచ్ఛులను అంత్యజులనుతాకుట, సభకురానిచ్చుట, మంచినీళ్లబావుల నుపయోగించుకొననిచ్చుట, దేవాలయములలోనికి రానిచ్చుట మున్నగునవి ఇతరజాతులవలె అంగీకరించవచ్చునా? లేక ఇందేమైన తారతమ్యమును గనంబఱచవలయునా?

౯. అస్పృశ్యజాతుల యస్పృశ్యతజాతి ననుసరించివచ్చినదా? లేక వృత్తిననుసరించియా?

౧౦. భాగవతధర్మదీక్షా జాత్యుత్కర్ష ప్రాపికా వా? నవా?

భాగవత ధర్మదీక్షవలన జాత్యుత్కర్ష లభించునా?

౧౧. యవనాదిజాతిః కిం కర్మకృతా? ఉతజన్మసిద్ధా?

మ్లేచ్ఛత్వజాతియనునది కర్మకృతమా? లేక జన్మసిద్ధమా?

౧౨ భాగవతధర్మదీక్షాయాం జాతివిశేషః ప్రతిబంధకో వా? నవా?

భాగవతధర్మదీక్షకు అన్నిజాతులవారు అర్హులేనా?

౧౩. దేవలస్మృతేః శూలపాణ్యాదివ్యవస్థానుసారేణ ప్రామాణ్యం కి మంగీకరణీయ? ముతన?

శూలపాణ్యాదినిబంధన గ్రంథవ్యవస్థ ననుసరించి దేవలస్మృతిని ప్రమాణముగా అంగీకరింపవచ్చునా? కూడదా?

౧౪. కియదవధి మ్లేచ్ఛ సంసర్గేణ ప్రాయశ్చిత్తీయతా?

మ్లేచ్ఛసంసర్గ మెంతకాలము ప్రాయశ్చిత్తముచేత శుద్ధగును?

౧౫. సంవత్సరపర్యంతం మ్లేచ్ఛ సంసర్గిణాంత దధిక కాలంయావత్ మ్లేచ్ఛసంసర్గిణాంచ ప్రాయశ్చిత్తవిషయే వ్యవహార్యతా విషయేచ కిమైకరూప్య? ముతవైరూప్యం?

సంవత్సరములోపల మ్లేచ్ఛసంబంధముగలవానికిన్నీ, అంతకంటె ఎక్కువకాలము మ్లేచ్ఛసంబంధముగలవానికిన్నీ ప్రాయశ్చిత్తమునందుగాని, సవ్యవహార్యత్వమునందుగాని తారతమ్యభేదముగలదా?

౧౬. వ్రాత్యసంస్కారః కియత్పరంపరాపర్యంతం శాస్త్రసిద్ధః?

వ్రాత్యసంస్కారము ఎన్నితరములవరకు శాస్త్రసిద్ధము?

౧౭. జాతిసామాన్య మైహికకర్మకృత మవ్యవస్థితం? ముత జన్మకృతం వ్యవస్థితంచ?

జాతినిర్ణయము కర్మకృతమా? లేకజన్మసిద్ధమా? ఏదిశాస్త్రీయము?

శ్రీ రస్తు.

శ్రీ విశ్వనాథశ్శరణమ్.

# శ్రీ కాశీక్షేత్రమునందు జరుపఁబడిన

## అఖిలభారతవర్షీయ

# బ్రాహ్మణమహాసమ్మేళనము

## నందు

## స్వాగతాధ్యక్షులయిన

శ్రీమన్మహారాజాధిరాజ ద్విజరాజ కాశీరాజ శ్రీ ౧౦౮ మత్
హిజ్, హైనెస్, లెఫ్టినెంట్ కర్నల్ సర్ ప్రభునారాయణ
సింహబహాదుర్ జీ. సీ. ఎస్. ఐ. జీ. సీ. ఐ. ఈ. ఎల్. ఎల్. డీ.
మహోదయులవారి

## స్వాగతసంభాషణము.

శ్లో. యో గఙ్గాం సహసా ముదావహ దయం లీలావపుర్లీలయా
యో వాలం విపదో ररక్ష నియతం మృత్యోః కరాళాస్యతః,
క్షీరోదప్రభవా ప్రభూషితతనుర్దేవాదిదైత్యార్తిహృత్
పాయా దంధకనిగ్రహః ప్రభు రసా వస్మాన్ సదోమాధవః. ౧

శ్లో. అజ్ఞానాంధతమోధ్వంసి జ్ఞానాలోకప్రదాయినే,
శంకరాయ నమస్కుర్మోఽద్వైతమార్గప్రదర్శినే. ౨

ఆర్యులారా! ఈబ్రాహ్మణమహాసమ్మేళనమునందు, పూజనీయులయిన-ఆచార్యులను, ఋషికల్పులగు బ్రాహ్మణపండితులను, మాన్యులయిన సభ్యులను ప్రార్థించుటకు నేనాజ్ఞాపింపఁబడినాఁడను. శ్రీమంతులయిన పండితమహోదయులచేతను, సభ్యమహాశయులచేతను అభ్యర్థనాసమితికి సభాపతిగా బహుమానింపఁబడిన నేను ఇచ్చటికి దయచేసినవారును, నానాదిగంతపావనులును అయిన-ఆచార్యులను బ్రాహ్మణులను అభివాదనపూర్వకమయిన స్వాగతసంభాషణముచేతను ప్రార్థించుచున్నాఁడను. పూజ్యతములును, సనాతనధర్మసంప్రదాయప్రతిష్ఠాప

ఋలును అగు-ఆచార్యవర్యులారా! సమస్తశాస్త్రములతత్త్వము నెఱిం గిన పండితమహోదయులారా! సభ్యమహాశయులారా! మన మిపుడు కూడియున్న యీ క్షేత్రము విశ్వేశ్వరరాజధాని యనియును, మోక్ష నగరి యనియును, వారాణసి యనియును తమ రెఱింగినదియే. ఇది స్మరణాతీతకాలమునుండి నేఁటివఱకును వేదములయందును, ప్రమాణములయిన యితిహాసములయందును, ఉపనిషత్తులయందును, రామాయణ-మహాభారతములయందును మోక్షనగరి యనియును, ప్రసిద్ధజనపదమనియును, సురాజపాలితమనియును, సమస్తపురాణ-ఉపపురాణ-కథా-ఆఖ్యాయికా-కావ్య-అలంకార-నాటక-జ్యోతిషాదిశాస్త్రములయందును, సామాన్యముగా అష్టాదశవిద్యాస్థానములయందును సూచింపఁబడిన మాహాత్మ్యము గలదియై విరాజిల్లుచున్నది.

సనాతనసదాచారలీలాభూమియు, అష్టాదశవిద్యాపీఠస్థలియు, ఆచారహీనులును, నిజవర్ణోచితవ్యవహారములను మఱచినవారును, శోకతాపక్లిష్టులును అగు వారికి సదాచారవ్యవహారశిక్షాదానముచేతను సమస్తఖేదములను హరించునదియు, అగణితభక్తబృందప్రతిష్ఠాపితానేకవిధశిల్పకార్యసుశోభితగాత్రయు, అర్ధచంద్రాకారయగు గంగానదిచేతను అవధౌతపాదయు, పురహరప్రియయు నగు నీమహానగరి కాశి యనియు, వారాణసి యనియు, అవిముక్తమనియు, రుద్రావాసమనియు, మహాశ్మశానమనియు, ఆనందకాననమనియు, బనారస్ అనియు వ్యవహరింపఁబడుచున్నది.

నిర్వాణ(ప్ర)కాశనమువలనఁగాని, కాశరాజునకావాసమగుటవలనఁగాని కాశి యనియు, వరణా-అసీ నదులమధ్యనుండుటవలన వారాణసి యనియు, పార్వతీపరమేశ్వరులచేతను విడువఁబడకుండుటం జేసి అవిముక్తమనియు, సమస్తరుద్రులకును ఆవాసమగుటచేతను రుద్రావాసమనియు, మహాప్రళయమునందుఁగూడ మహాభూతములిచ్చట శివరూపమున నుండుటం జేసి మహాశ్మశానమనియు, ఆనందదాయకమయినందున ఆనందకాననమనియు, యవనారి యనుపేరఁ బ్రసిద్ధుఁడయిన చంద్రవంశపురాజునకు రాజధాని యగుటచేతను బనారస్ అనియు సంజ్ఞాకరణములు వేదపురాణేతిహాసకావ్యాదులయందు తెలియఁబడుచున్నవి.

ఇందు విశ్వవిశ్రుతకీర్తులును, విజ్ఞానశాలులును, ధార్మికచూడామణులును, సుగృహీతనామధేయులును అగు, ధన్వంతరి, దివోదాసుఁడు, ప్రతర్దనుఁడు, అలర్కుఁడు, అజాతశత్రుఁడు మొదలయిన రాజులుండిరి. ఉత్తమక్షత్రియులగు వారిచేతనే ఆయుర్వేద-బ్రహ్మవిద్యాసంప్రదాయము ప్రవర్తింపఁజేయఁబడినది. మఱియు నిందు, త్రికాలదర్శులును, నిఖిలతత్త్వముల నెఱింగినవారును అగు కృష్ణద్వైపాయనాది మహర్షులును, ఎందఱెందఱో ఆచార్యులును, సాధువులును, మునులును ఉండెడివారు. ఇప్పటికిని సదాచారపరాయణులును, పంక్తిపావనులును, వేదాగమరహస్యముల నెఱింగినవారును అగు బ్రాహ్మణులును, పండితులును అనేకు లిందు నివసించుచున్నారు. ఇందిపుడును దేవస్థానములను చూడఁదలఁచినవారియొక్కయు, ప్రాచీనతత్త్వములను పరిశీలించువారియొక్కయు. శిల్పచాతుర్యము నభ్యసింపఁగోరువారియొక్కయు, నిఖిలవేదాగమశాస్త్రములను నేర్చు విద్యార్థులయొక్కయు సముదాయము చూడఁబడుచున్నది.

ఇందుఁ గాపుర ముండువారు మహాసౌభాగ్యభాము లనియు, శివస్వరూపు లనియు పురాణాదులయందు వినుచున్నాము. తీర్థగౌరవము నంగీకరించువారికిని, సదాచారపరంపరారక్షణవ్రతులకును, ధార్మికులకును వెనుకటిరీతిని నిర్విఘ్నముగా అవస్థానసంభావన కనుపడుటలేదు. అందును ఇప్పటియువకులును, అనేకులు సామాజికులును ప్రకృతినిబట్టియు, కాలమునుబట్టియు, విద్యాభ్యాసమునుబట్టియు, ఇతరసమాజప్రవిష్టులై కోటరస్థవహ్నులగు వృక్షములు వనమునువలె, కుపుత్రులు కులమునువలె, నదీవేగములు తీరములనువలె, వర్ణాశ్రమాచారములను, సనాతనమర్యాదలను విధ్వంసము చేయుచున్నారు. అందును కొందఱు మనీషులీధర్మవిప్లవమును ప్రతిక్రియ చేయుటకు వీలుగానిదానినిగా నాలోచించుచున్నారు. కొందఱు విధ్వంసమునకు సాయపడుచున్నారు. కొందఱు యథాశక్తిప్రతీకారమునకు ప్రయత్నించుచున్నారు. వారిలో నెవ రుదాసీనులో, ఎవరు విధ్వంసనసహాయకులో వారు పాశ్చాత్యవిద్యాభ్యాసప్రభావముచేతనుసనాతనధర్మవిరోధులు. ఎవరు సదుపదేశములచేతను సన్మార్గాభిలాషులై ప్రతీకారమునకుఁ బ్రయత్నించుచున్నారో వారు [illegible] ధార్మికుల

చేతను, సామాజికులచేతను, సర్వశక్తులచేతను, దేశములకొఱకును వర్ణాశ్రమపరాయణుల-అభ్యుదయముకొఱకును పనిచేయఁజాలువా గా ప్రోత్సాహింపఁదగియున్నారు. ఈధర్మవిప్లవమును మనకుఁగ్రొ దికాదు. ఇతిహాసపురాణాదులయందు ప్రతియుగమునందును రాగప్రా మైన యీధర్మవిప్లవమును వినుచునేయున్నాము. అచ్చటచ్చట ఆపద నన్నింటినిదాఁటి యీసనాతనధర్మము సర్వోపరి ప్రవర్తించుచున్నది

త్రికాలదర్శియు, భగవానుఁడును అగు కృష్ణద్వైపాయనుఁడు ద్వాపరయుగాంతమున "ఊర్ధ్వబాహు ర్విరౌమ్యేష నచకశ్చిచ్ఛృణో హి, ధర్మా దర్థశ్చ కామశ్చ స కిం ధర్మో న సేవ్యతే?" అనఁగా, ఇదిగో నేను చేయి మీఁది కెత్తి మొఱలిడుచున్నాను. ఒక్కఁడును వినఁడ గదా! ధర్మమువలననే అర్థము, కామముకలుగుచుండును. అట్టిస్థితిలో నట్టిధర్మము నెందులకు సేవింపరు? అని అన్నాఁడుకూడను. కృతయుగ మున హిరణ్యకశిపుమొదలగు రాక్షసులవలన ధర్మమున కుపద్రవము వాటిల్లినది. త్రేతాయుగమున రావణాదులగు రాక్షసులవలన ధర్మ విప్లవము కలిగినది. ద్వాపరయుగమున అధార్మికులయిన రాజులవలన ధర్మవిప్లముగలిగినది. ఈకలియుగమునందును, అధార్మికులైన రాజుల జైనులు, బౌద్ధులు, మ్లేచ్ఛులు మొదలగువారివలన ధర్మమునకు ముప్పు తప్పినదిగాదు. అటువంటివిప్లవమును పోఁగొట్టుటకును, ధర్మస్థితికొఱ కును, సాధుసంరక్షణకొఱకును ఆయాసమయములయందు భగవం తుఁ డవతరించుచుండెను. ఒకప్పుడు తదంశావిష్టులును, ఒకప్పుడు తద నుగృహీతులయిన తమవంటిసమాజమూర్ధన్యులయిన బ్రాహ్మణులునే సమాజస్థితిని కల్పించియున్నారు. ఓహో! పండితులారా! సామాజిక లయందు సర్వవిధధర్మకార్యాద్యనుష్ఠానముకొఱకు తమ కున్నట్టుగా సంబంధ మితరులకు లేదు. కాఁబట్టి, అనాచారదోషమువలనఁ గలిగిన అనారోగ్య-వ్యాధి-అకాలమృత్యు-పరకీయరక్షణీయతాదులగు దోష సముదాయమును చూపుచుండెడి తమరే అటువంటి-అనాచారాదు లను మొదలంట నుచ్ఛేదింపవలసినవా రగుచున్నారు.

ప్రభుశక్తిసంపన్నులును శాస్త్రవాక్యములను పాలించుచుఁ దమకు సాహాయ్యమును సంపాదించుటకు శక్తిగలవా రగుచుందురు. ఆచా ణము, ప్రచారణము, అధ్యయనము, అధ్యాపనము—అనువీనిచేతను

తమకుమాత్రమే సనాతనధర్మమును రక్షించుటకును, దృఢపఱుచుట కును సమర్థులగుచున్నారు. ఇట్లిప్పటికిని ఆప్రకారముగా అనుష్ఠాన ములో నుంచుచున్నారు కూడను. నానావిధకార్యవ్యాపృతులయిన పాలకసంప్రదాయుల-ఆచరణాతిరిక్తమయిన ధర్మసంరక్షణోపాయ మ గపడకున్నది. ఇపుడు విప్లవవాదులు సమర్థులగుటకు సామాజికుల యొక్కయు, పూజ్యులయిన పండితులయొక్కయు ప్రయత్నశైథిల్యమే కారణమనకతప్పదు. నిశ్చయముగా సామాజికులును, తమరునుఅప్పుడే నడుముగట్టుకొనిసర్వవిధముల నివారించుటకుఁ బ్రయత్నించియుండిన పక్షమున నింతటి ధర్మవిప్లవము జరిగియుండకపోవును. ఏప్రకారము గా, జైన-బౌద్ధ-మ్లేచ్ఛాదులవలనఁ గలిగిన దుర్దినములలో సర్వకర్మ ములను మఱచినవారును, సుగృహీతనామధేయులును, ఆచార్యవర్యు లును అగు కుమారిల-ప్రభాకర-శంకర-వాచస్పతి-ఉదయనప్రభృతుల కును, పండితప్రకాండులకును ధర్మరక్షణకొఱకు యత్న మావశ్యక మైనదో అదేప్రకారముగా నిపుడు తమకును ఆవశ్యక మయియున్నది.

ఇప్పటిసామాజికు లాచార్యపాదులవారిదయచేతనే వర్ణాశ్రమా చారములను విలోకించుటకు సమర్థు లగుచున్నారు.

వెనుకను వేయిసంవత్సరములు జైన-బౌద్ధ-మ్లేచ్ఛులు స్వతం త్రధర్మమతములను ప్రచారమునకుఁ దెచ్చినవారై ఆర్యధర్మమును విధ్వంసము చేసియుండిరి. అప్పుడును అతిదుర్గమప్రదేశములయినను లక్ష్యపెట్టక అక్కడక్కడకు వెళ్ళి శంకరాచార్యభగవానులవారీభా రతవర్షమునం దంతటను ఆర్యధర్మమును మరల స్థాపించి, వర్ణాశ్రమా చారములకు బహిర్భూతములయిన యితరధర్మమతములను నిరాకరిం చిరి. ఆయాకథ యంతయుఁ దమ కెఱింగినదియే. అప్పుడును భారతీ యు లగురాజు లనేకులు వర్ణాశ్రమధర్మవిరోధులై యుండిరి. ప్రభు శక్తియు, సంఘశక్తియుఁ బ్రాచీనాచారమును లోపింపఁజేయుటకుఁ బ్రయత్నించినవి. అప్పటికిని సనాతనధర్మము నష్టము కాలేదు. అట్టిది యిప్పు డెట్లు నశించును? ఆలోచింపఁగా రాజశక్తి ప్రత్యక్షముగా ధర్మ మును లోపింపఁజేయుటకై ప్రవర్తింపలేదు. కాని, ఔదాసీన్యమును వహించినట్టుమాత్రము కనుపట్టుచున్నది. కేవలము సామాజికుల ఉత్సాహాభావమే ధర్మస్థితి తగ్గుదలకు హేతువని తలంచెదను.

నిజముగా సామాజికులు పరిణామము తెలియనివిషయముల యం
దంధులచందాన ప్రవర్తింపకున్నపక్షమున నింతటివిప్లవమున్ను తట
స్థింపకుండెడిది. మన ఆచారవ్యవహారములను విడుచుటకు పరుల
ప్రభువులున్ను కాకుందుము. ఇతరులనే మనము దూషింపకుందుము.

ఆశామరుమరీచికలచే నపహృతవిజ్ఞానులై సామాజికులును,
శాస్త్రరహస్యముల నెఱుఁగనిపండితవిశేషులును నిజధర్మాచారబహి
ష్కృతమయిన విద్యాపద్ధతిని సమర్థింపకయును, వైదేశికభాషావిజ్ఞాన
శిక్షణముకొఱకుఁ దమతమపుత్రులను, అనార్యాచారదూషితములైన
అట్టివిద్యాలయములకే పంపకయు నుండినపక్షమున, ప్రపంచమునం
తను క్రమింగఁదగిన యింతటివిప్లవము సంభవింపకుండెడిది. ఇదిమో
హమా? అవిమృశ్యకారిత్వమా? అంధవిశ్వాసమా? గతానుగతిక
న్యాయమా? కాలమహిమయా? ఏదో యొకటి అగుఁగాక. ఉపేక్షిం
పఁబడినరోగములాగున నీయుపద్రవము గొప్ప-అనర్థము నిమిత్తమే
యేర్పడినది. ఎవ రాదర్శప్రాయులో, ఎవరు ధర్మప్రవర్తకులో, ఎవరు
సమాజమర్యాదాపర్వతభూతులో వారే నిష్కారణముగ విచలితులై
నప్పుడు సామాజికు లెట్లు విఘటింపకుండెడను? సాధారణములయిన
భోగసాధనముల-ఉన్నతిని కోరి కాని, భవిష్యద్వంశధరుల స్వాధీన
జీవికకొఱకుఁగాని, తమవృత్తులయం దశ్రద్ధచేతనుగాని, ధనికుల ద్వార
ములయొద్దకుఁ బోవునప్పటి కష్టములను సహింపలేమిచేతనుగాని, ఈ
ప్రవృత్తి పండితులయందుఁ గలిగినదని మనమెఱుంగము. కాని,విచార
దృష్టిచేఁజూచినచో నిదిసమంజసముగాదు. భోగసాధనముల నౌన్నత్య
మును బొందించుప్రయత్నము పామరసాధారణ మేయగుఁగాని తత్త్వ
మెఱిఁగినవారి కం దనురాగ ముండరాదు. ఋషిప్రదర్శితమయిన
స్వీయజీవికను పరిత్యజించి పరకీయులవృత్తి నవలంబించుటను స్వాధీన
నామమున నెట్లు పేర్కొన వీలగును? "స్వధర్మే నిధనం శ్రేయః పర
ధర్మో భయావహః" అని యుపదేశించువారికి బ్రాహ్మణుల కుచితము
లయినవృత్తులయం దశ్రద్ధ యెట్లు కలుగఁగలదు? ధనికులద్వారముల
యొద్దకుఁ బోవునప్పటి కష్టములకథకూడ నంతకంటెను బహుతరజనా
నురోధాదులవలనఁ గలిగెడిక్లేశ ముండనే యున్నది గనుకను విచార
సహము కాదు. [illegible] పాశ్చాత్త్యవిద్యాశిక్షితులై శిఖాయజ్ఞోపవీత

ములను ధరించువిద్వాంసులను కడకంటనైనను చూడనిచ్ఛగింపరో, మఱి వారితో మాటలాడరో, అట్టివారియిండ్లకుఁ బోవుటకంటెను స్వాగతాభివాదనాదిపరాయణులును, ఏమేని ఉద్యోగముఁ బుచ్చుకొన్నవారును, దాతలును అగువారియిండ్లకుఁ బోవుటలో నేమి కష్ట మున్నది? అసంభావన యేమున్నది? ఇప్పట్టున "స్వార్థే కస్మిన్ సమీహా పునరధికతరే త్వా మనార్యం కరోతి" అను ముద్రారాక్షసనాటకములోని మలయకేతువచనము జ్ఞప్తికి వచ్చుచున్నది. అట్టి ప్రయత్నము తనకును, వంశధరులకును సుఖవిఘాతమునకే యగు నందు రేని మాచెప్పువది వినుఁడు. మనుజులలో స్వతంత్రబుద్ధు లనియు, పరాధీనబుద్ధు లనియు రెండు తెగలవా రున్నారు. స్వతంత్రబుద్ధులు దుర్లభులే యనవచ్చును. పరాధీనబుద్ధులో ఎక్కడఁబట్టిన నక్కడనే కలరు. వారును గతానుగతికన్యాయము ననుసరించుచున్నా రని వారిలో విదితవేదితవ్యులును, లోకస్థితి నెఱింగినవారును, పరిణామ మెఱింగినవారును, పరిణతవయస్కులును, విద్యావ్రతస్నాతులును, అగు పండితప్రకాండులుకూడ సామాన్యులవలెనే సమాజమున కుపద్రవమును గలిగించు నాపద్ధతినే యెట్లనుసరించుచున్నారు? ఎల్లరు సామాజికులును, పండితులును వైదేశికాచారవ్యవహారశిక్షామార్గము ననుసరించినపక్షమున ఆలంబము లేక వర్ణాశ్రమాచారశిక్ష యెట్లునిలిచెడిని? ఎవరయితే వైదేశికశిక్షాచారశాలలయందు దోషములనుచెప్పుచున్నారో వారేతమ బిడ్డలను అటువంటి శిక్షాచారశాలలయందు శిక్షణను గఱపుచున్నప్పుడింక సామాజికు లేమిచేయుదురు? తదుపదేశానుష్ఠానమా ? తత్సదృశాచరణమా? అంటే, ఆచరణము కార్యకారియగునట్లు ఉపదేశము కార్యకారికాదని మాత్రము మేమెఱుఁగుదుము. ఈసంగతి కృష్ణభగవానుఁడే "యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః, స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే" అని గీతలలోఁ జెప్పియున్నాఁడు.

కాఁగా, ఇప్పుడు బ్రాహ్మణులునయితము వైశ్యశూద్రులకర్మములను, బ్రాహ్మణేతరులు బ్రాహ్మణులకర్మములను చేయుచుండువారచ్చటచ్చట నగపడుచున్నారు. తమతమవృత్తులయందు సంతుష్టి లేకుండుటయే యిందులకుఁ గారణము. అట్టి అసంతుష్టి కర్థకామముల-అశమస్పృహయే కారణము. అట్టి-అశమస్పృహయును "అర్థకామము

లే పురుషార్థములు" అని యభిప్రాయపడువారి సాహచర్యమువలనను, ఉపదేశమువలనను కలిగినది.

ధర్మవిచారవిధ్వంసినియగు నిట్టియాపదను పరిహరింపఁదలఁచిన వారును, ప్రాచీనాచారశిక్షావ్యవహారసమర్థులును, ధర్మభీరువులును అగు సామాజికులకును, పండితులకును, తమయధికారమునకు లోఁబడిన పుత్రశిష్యాదులయందు, అటువంటి-ఆచారశిక్షావ్యవహారములను ప్రవర్తింపఁజేయుటయే తాదృశాచారాదిరక్షణోపాయ మని లౌకిక దృష్టిచేతను, యుక్తిచేతను అంగీకరించెదము.

తమ ఆచారమునందు పుత్రాదులప్రతిష్ఠాపనద్వారమున విశ్వప్రతీకారము సుకర మయినట్లు వేలకొలఁది యితరప్రయత్నముల ద్వారమున సుకరముకాదు. ఇట్లే తపస్సుచేతనుకూడ సాధింపవచ్చును. తపస్సువలన సాధింపరానిది లేదని పురాణాదులయందు వినఁబడుచున్నది. ఘోర మయిన యిటువంటి ధర్మవిప్లవ మేర్పడినప్పటికిని శ్రీమంతులును, పూజ్యతములయిన-ఆచార్యులును, పండితప్రకాండులును, బ్రాహ్మణులును కలిసి సనాతనధర్మసంరక్షణముకొఱకు గొప్పప్రయత్నమును చేయుచున్నందున-తమప్రయత్నమును భగవంతుఁడు తప్పక సఫలముచేయును అని మే మాసించుచున్నాము. ఆర్తత్రాణముకొఱకును, ధర్మరక్షణముకొఱకును ప్రతిజ్ఞపట్టిన-ఆభగవంతుఁడు తమమనోరథము నేల పూర్తిచేయకుండును?

శ్లో. "మహాగ్రాహేన సంగ్రస్తం కాతరం శరణాగతమ్,
గజేంద్రం మోక్షయామాస సేయం పౌరాణికీ కథా.
యస్య నిఃశ్వసితం వేదా యస్యేచ్ఛాకల్పితం జగత్,
స రక్షిష్యతి ధర్మం నో యేనాచారః ప్రవర్తితః.
సత్యస్సనాతనో యశ్చ ధర్మో దేవర్షిసత్కృతః,
స కథం విప్లవేభ్యశ్చ నాత్మాన ముద్ధరిష్యతి.
యత్పాదపద్మ మదధ త్పద్మనాభో హృదా స్వయమ్,
తేభ్యో జగత్పునానేభ్యో బ్రాహ్మణేభ్యో మనస్సదా"

ఇట్లు శివము.

(స్వాగతోపన్యాసము సమాప్తము)

## శ్రీ ర స్తు.

### అఖిలభారతవర్షీయ బ్రాహ్మణసమ్మేళన ప్రబంధకారిణీసభాపతియగు శ్రీ మహామహోపాధ్యాయ పండిత, శ్రీయుత, పంచానన తర్కరత్న భట్టాచార్య మహోదయులవారి సంభాషణము.



శ్లో. నమస్సర్వ జగద్బింబ చ్ఛాయా మండల మూర్తయే,
అనన్త జ్ఞాన విజ్ఞాన శ్రేయస్సౌభాగ్య పూర్తయే. ౧

ఇదివఱకీబ్రాహ్మణమహాసంమేళన మెనిమిదిపర్యాయములు జరుపఁబడిన దన్నసంగతి, పూజ్యులును, శ్రీభారత ధర్మాచార్యులు నిర్ణయించిన సదాచారమార్గమునందు సంచరించుచున్నవారును అగు సామాజికులకుఁ దెలియఁబడునుగాక! "యదా యదా హి ధర్మస్యగ్లానిర్భవతి భారత!, అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్" అన్న శ్రీకృష్ణభగవానుని ప్రతిజ్ఞావాక్యమునందు మిక్కిలి శ్రద్ధగల మేము ప్రతిసంమేళనమునందును ఎదుటను సమస్తవిద్వద్బ్రాహ్మణసభ్యుల తేజోమండల మధ్యవర్తియైన భగవంతుని శంఖచక్రగదాపద్మధరుని బ్రహ్మణ్యదేవుని చూచుచుంటిమి. ఇపుడు తొమ్మిదవదిగాఁ బ్రకటింపఁబడిన యీసంమేళనము బహిరంగముల క్రొత్తదనముచేతను విరాజిల్లుచున్నట్లే, అఖిలభారతవర్షీయ చతురాశ్రమి, విద్వద్బ్రాహ్మణాది సమాగమ సౌభాగ్యలక్ష్మిచేఁగూడ క్రొత్తదియై మిగుల విరాజిల్లుచున్నది. అట్లేభగవతి యగు వారాణసి యీసంమేళనమునకుఁ గ్రొత్తక్షేత్రమై విరాజిల్లుచున్నది. అదిగో నెదుటను హరిహరమూర్తి మాటిమాటికిని భయపడకుండుఁ డని పలుకుచుఁ దనకృపాకటాక్షప్రసారములచేతను దిక్కులను కమలమాలామయములనుగాఁ జేయుచున్నది. చూడుఁడు చూడుఁడు. ప్రభూ! ప్రసన్నుఁడ వగుము. అధముఁడను, దాసానుదాసుఁడను అయిన నాయీనమస్కారమును గ్రహింపుము. విదేశీయ శిక్షావికారమయమయిన యీసమయమున మాకు వేఱు దిక్కు లేదు. శ్రీభగవంతుని దయయొక్కటిమాత్రమే మాకు శరణము. ఇదివఱకు ధర్మరక్షణమును గోరుచుండెడివారిచేతను

పురుషకారరూపమున నాచరింపఁబడిన దంతయుఁ జాలవఱకు విఫలమై అయిపోవుచున్నది. సమానకర్ములయిన యే యేబంధువులు సాదరము నుపాసింపఁబడిరో వారందఱును చాలవఱకు మృత్యువుచేతను, దా కంటెను అధికమయిన వైమత్యముచేతను, విస్రస్తులగుట చూచిమా భగవంతుని కరుణనుమాత్రమే అపేక్షించుచున్నదైన యీసద్బ్రాహ్మణులగోష్ఠి ధర్మాత్ములయిన భారతీయులసాహాయ్యముచేతను స మూర్చఁబడినది. వారిసేవయే భగవంతునిసేవ. వారియధిష్ఠానమే భ వంతునియధిష్ఠానము. వారికరుణయే భగవత్కరుణ అని మాకు నమ్మి యున్నది. అందుచేతను భగవంతుఁడా! ప్రసన్నుఁడ వగుము, మా వను స్వీకరింపుము. ఈసభయందు సన్నిహితుఁడ వగుము, నిరాధారు మయిన మాయందు ధర్మమును, బ్రాహ్మణ్యమునురక్షించు నీకరుణ చూపుము.

దీనిచేతను ముఖ్యమయిన ప్రయోజనము చెప్పినట్టయిన ఇంకను అవాంతరప్రయోజన మున్నది, దానిని చెప్పుచున్నాను చిరకాలము జీవించియున్న నేను ప్రాచీనమయిన సమాజస్థితిని చూ యున్నాను ఆసమాజస్థితి క్రమక్రమముగా పొందుచున్నదుస్థితినిజూ చియున్నాను అందులకు మూలము విదేశీయమైన యీవిద్యాపద్ధతియే విదేశీయమయిన రాజచక్రము బహుజనపూర్ణయు, స్వర్ణప్రసవిత్రియు నయిన యీభారతభూమియందు నిరంకుశమయిన తన ప్రభుత్వము కోరుచున్నదై మనఋషుల-ఉపదేశములకు విరుద్ధమయిన స్వదేశ కౌశలమును శిక్షామిషంబున ప్రవర్తింపఁజేసినది. తత్ప్రవర్తితబుద్ధు మనవారు సమాజస్థితివిరోధులును, తమవారినే అవమానించువారును అంతర్భేదముచేతను తమలో తామే విశేషముగ వర్ణబాహ్యులై జీర్ణించిపోవుచున్నారు "మనుష్యు లందఱును సమానులే. స్వ సాధన పరులయిన ధూర్తబ్రాహ్మణులు వర్ణభేదమును కల్పించిరి ఆదిమనివాసులు క్రొత్తగా బయటినుండివచ్చిన ఆర్యులప్రభావము చేతను మిక్కిలి పీడింపఁబడిరి. శూద్రులేకదా భారతవర్షమున ప్రాచీనాధికారులు, వారిలో శ్రేష్ఠులు ద్రావిడులై యుండిరి" అ నిదియేకదా విదేశీయమయిన శిక్షాపద్ధతి! దానిచేతను క్రమక్ర ముగా భేదము దృఢపడినది. భేదమేకదా రాజులు చేయఁదగిన మొ

టియుపాయము; అట్లు భేదము కలిగి, పరస్పరము విద్వేషము వృద్ధిని పొందుచున్నప్పుడు, అవసరము ననుసరించి యచ్చటచ్చట ననుకూలాయమానమైన రాజచక్రముతాలూకు సమదృష్టిత్వాది ప్రశంస ప్రవర్తించినది ఇట్లు కొంతకాలము గడచి తరువాతను తచ్ఛిద్రపరిణామము వేఱుచందము నవలంబించినది. దానిచేతను పలువురు రాజచక్రమునకే విద్వేషులయినారు రాజచక్రముమాత్రము సమదృష్టిని స్వపక్షమునకును, విషమదృష్టిని బ్రాహ్మణాదులకును ప్రకటించుచున్నది "భారతీయులతో స్వజాతీయులకు విరోధముకలిగినపుడు విషమము నాచరించుచున్నది. "భారతీయులు రాజకీయవిశిష్టకృత్యములయందు యోగ్యులయినప్పటికిని వారి నుపేక్షించుచున్నది అందుచేతను స్వదేశమునకేమాత్ర మపకారము గలుగునని తోంచినను భారతమునకు మేలుగూర్చుమార్గమును ఆశ్రయించుటలేదు" అనెడి రాజచక్రముతాలూకు విషమబుద్ధి తెలియుటే ప్రద్వేషహేతువై ప్రాదుర్భవించినది. విదేశీయ విద్యాపద్ధతిలో జన్మాంతరవాదముగాని, రాజరూపమునకు భగవద్విభూతిత్వజ్ఞాపనముగాని లేదు. మఱేమన, రాజచక్రోచ్ఛేదపద్ధతి ప్రతిపత్తిమాత్రమే ఉన్నది. తదనుశీలనలబ్ధప్రకర్షులయిన కొందఱికి విదేశీయ శాసనోచ్ఛేదబుద్ధి కలిగినది బమగోలా (బాంబు) అని ప్రసిద్ధమయిన సంహారాయుధము దానికే ఫలమయినది. మఱికొన్ని తత్తదుపాయములును వారికున్నవి. బంధుద్రోహమున కొడిగట్టిన కొందఱు భారతీయులు చేయు పనులచేతను వీరివిషయము నెఱింగిన రాజచక్రము కన్నులెఱ్ఱజేసి భయంకరమయిన దండన పద్ధతి నవలంబించినది:—అందుచేతను సాపరాధులును నిరపరాధులును సమముగానే దండింపఁబడినారు. ఇప్పటికిని తదాఘాతకాతరులయి కొందఱు పంగులవలె నున్నారు. కొందఱు దానికిభయపడి తమసాహసకార్యములను విడిచి నేతృపదాభిభూతులయి సంఘశక్తివృద్ధికని కూటరాజనీతి చర్చాపరాఙ్ముఖులును, స్వాచారరక్షణపరులును, శాస్త్రనిష్ఠులును, అగు బ్రాహ్మణులను నిగ్రహించుచున్నవారై ప్రాచీనులసమాజస్థితిని విధ్వంసముచేయుటకై ప్రవర్తించుచున్నారు. వారే "అహింసా సత్య మస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః, ఏతత్సామాజికం ధర్మం చాతుర్వర్ణ్యేఽబ్రవీన్మనుః" అనెడి [illegible] క్రింద నాలో

చించి, ధార్మికహింసను, అసత్యమును, ఆత్మస్తేయమును, ఆశౌచము కపటసత్యకవచముచేత నాచ్ఛాదన చేయుచున్నవా రయి స్వేచ్ఛా రము ననుష్ఠానములోనికిఁ దెచ్చుచున్నారు ధర్మాచారవంతులను పా డులని నిందించుచున్నారు. దేశోద్ధారమే మాగొప్పకార్య మను భా మును ప్రకటించుచు దేశమును మఱింత అధోగతిపాలుచేయుచున్నా శ్రుతిస్మృత్యుదిత ధర్మభ్రంశన మెన్నటికిని ఉద్ధారోపాయము కాఁజా దుగదా! స్వాతంత్ర్యమే పరమార్థ మని పలుకుచున్నవారై లోపల బయటను సర్వవిధముల పరాధీను లగుచున్నారు. తమకు లొంగినవా పారతంత్ర్యము నిచ్చుచున్నారు. స్వశాస్త్రవిధినివిడిచిపెట్టి, స్వేచ్ఛా రపరులై తమవారలచిరంతనభావము నపహరించుచు, మ్లేచ్ఛభావపా తంత్ర్యమును స్వీకరించుచున్నవారై యెట్టుగా స్వాతంత్ర్యముయొక్క నామమును స్వీకరించుచున్నారోకదా ! అని మే మెంతయు నచ్చె వొందుచున్నాము. భోజ్యదానవినిమయముచేతనుగాని, లలనోపా రదానపరివర్తనచేతనుగాని సజ్జార్పణకౌశలముచేతనుగాని తఱచు వారియర్థములు లెక్కలలోనిపుణులయిన విదేశీయులచేత నపహరిం బడుచున్నవి. విదేశీయవస్తువుల వ్యవహారము లేకుండ వారికొ దినమయినను గడవదు. కనుక నిట్లు పరతంత్రవృత్తులు, స్వాతంత్ర్య రూపమును నయితము తెలియనివారయి స్వాధీనతావాదముచేతను ప్రత్యయనేయబుద్ధులను వ్యామోహింపఁజేయుచున్నారు. కొందరుమా త్రము బాహ్యాచారముచేతను ప్రాచీనభావము నాశ్రయించుచున్నా రయ్యును మనస్సుచేతను వారినే అనుకరించుచున్నారు. వారునుశాస్త్ర మునుగాని చిరంతనాచారమునుగాని బహుమానింపకున్నారు. విదే యులవలెనే బ్రాహ్మణద్వేషమును ప్రచారింపఁజేయుచున్నారు. వారు అట్లే అంగీకరించుచున్నారు. జన్మాంతరీయకర్మఫలముచేతను జాతి యుర్భోగములు కలుగుననుసిద్ధాంతమును నమ్మకున్నారు. ఈప్రకా ముగా పరానుకరణసమర్థమయిన మనస్సుచేతను చింతింపఁబడుచున్న స్వాతంత్ర్యముకూడ పారతంత్ర్యముతాలూకు ఒకప్రకారమే. ద్వా పాలకునిచేతను రక్షింపఁబడుచున్న గృహపతి పరతంత్రుఁడున్నగాఁ ద్వారపాలకరహితుఁడై అపావృత ద్వారములయిన గృహము లయందు నివసించుచు నిగడబద్ధుఁడైన పురుషుఁడు స్వతంత్రుఁడున్నకాఁడు. అ

పద్ధతి ననుసరించుచున్న వర్ణాశ్రమధర్మపరాయణులు చిరకాలము బాహ్యపారతంత్ర్యము ననుభవించుచున్నవా రయ్యును, ఆంతరమయిన స్వాతంత్ర్యామృతముచేతను తృప్తులయి జీవితాంతమును పొందరు సరిగదా, పై పెచ్చుపుష్టినే పొందెదరు.

ఆర్షపద్ధతిని విడుచుటయందాసక్తిగల యిప్పటివారు,ఆలోచింపఁగా బాహ్యపారతంత్ర్యమునుండి విముక్తినిపొందినను, ఆంతరపారతంత్ర్య కాలకూటాస్వాదసమ్మూర్ఛులై జీవితమునుండియే భ్రంశమును పొందెదరు. ఈప్రకారముగా మనముగూడ గతానుగతికన్యాయము ననుసరించువారము కాకుండెదముగాక యని సమానశీలవ్యసనులసన్నిధిని నివేదించుట యొక-అవాంతర ప్రయోజనము. మఱియు నిప్పుడు—

౧. నాయకత్వ మనఁగా శాస్త్రములను నిందించుట.
౨. దేశభక్తియనఁగా బ్రాహ్మణ్యమును బ్రాహ్మణులను ద్వేషించుట.
౩. ఔదార్యమనగా నిర్విచారముగ త్రాగుట, తినుట.
౪. సమదర్శనమనఁగా ప్రతిష్ఠితములయిన దేవాలయములయందు సర్వజాతులను ప్రవేశింపఁజేయుట.
౫. విద్య యనఁగా ఇతరులను వంచించుట.
౬. ధర్మ మనఁగా తమ్మునుఁ దామే దొంగిలించుకొనుట.
౭. కర్మమనఁగా అశాస్త్రీయకార్యములనుచేయుట.
౮. వీరత్వమనఁగా సదాచారమునువదలుట.
౯. త్యాగమనఁగా పరులసొత్తుపైఁ బెత్తనమువహించుట.
౧౦. దయ యనఁగా దుఃఖజీవులగు స్వజనుల నుపేక్షించుట.
౧౧. కృతజ్ఞత యనఁగా పిత్రాదులను విడుచుట.
౧౨. సంస్కార మనఁగా సమాజస్థితికి భంగము కలిగించుట.

ఇత్యాదులయిన శ్రౌతపరిభాషలు ప్రచారములోనున్నవి.

వేదశాస్త్రములయం దెంతటిపండితులైనవారికిని విద్యావంతులన్న పేరు లేకున్నది. విదేశీయవిద్యలనభ్యసించిన లేక అభ్యసించువారుమాత్రమే విద్యావంతులనఁబడుచున్నారు. బాజారులలోఁ గొన్న మ్లేచ్ఛాదుల-అన్నముతో జీవించువారై యింటను బ్రాయ్యి ముట్టించని పురుషపుంగవులుగూడ మహాత్ములని పిలువఁబడుచున్నారు.హిందూ

గల శ్రీ కాశీక్షేత్రమునందుజరిగిన అ. భా. వ. బ్రాహ్మణమహాసభ.

నామలాంఛన మిశ్రవ్యాప్తి కొఱకు మహాస్మదీయులచేతను ప్రవర్తింపఁజేయఁబడినది. అది యిపు డతివ్యాప్తిని పొందుచు నగపడుచున్నది.

మనతో సమానమయిన శీలము, వ్యసనముగల వర్ణములు భాషలమార్పువలనఁ గలిగెడిభ్రాంతిని పొందెడివి కాకుండునుగాక యని యిందులకై ఐకమత్యసాధనమింకొకప్రయోజనము. ఎవరైతే మొదటినుండియు సజాతీయు లయ్యును విజాతీయభావమును పొందినవారో, సమానభావలవారయ్యును ఆంగ్లభాషావ్యవహారముగలవారో, కులమునుబట్టి మిత్రభూతు లయ్యును కార్యవశమున శత్రువులవలె నగుచున్నారో వారు శాంతినిగోరువారిచే నుపేక్షింపఁబడిన రాజనీతిమార్గము గుండా శాసనసభలలోప్రవేశించి నిర్బంధశాసనములతో మతాచారముల మంటఁ గల్పుటకై ప్రయత్నించుచున్నారు. అటువంటివారిని స్వరూపమునుబట్టి లోకము తెలియఁజాలకున్నది. వీరు, ఎవ్వరిపక్షమున రాజనీతిచర్చలయందు ప్రతినిధులుగా రాజకీయసభయందు ప్రవేశమునుపొందుచున్నారో, ప్రాణములకంటెను అధికమయిన వారిధర్మాచారమునే ధ్వంసముచేయఁగోరుచున్నారు ఇది వీరియాలంబనశాఖాచ్ఛేదినియగునీతి. దీనినిగుఱించి భారతదేశమునం దంతటను ఉచ్చైస్స్వరముతో చాటవలసియున్నది. స్వశాస్త్రములయందు విశ్వాసము లేకుండనెన్నటికిని జాత్యభ్యుదయము కలుగదన్న విశ్వాసము దృఢపడుటాగునందులకై ప్రయత్నింపవలసియున్నది.ఇట్టిప్రయత్నమును భారతదేశమునందంతటను ఒక్కసారిగానే చేయవలసియున్నది. దీనికైకమత్యమవసరము. అట్టియైకమత్యము సనాతన ధర్మావలంబు లందఱిసమ్మేళనము లేకుండఁ గాఁజాలదు గావున నీసంమేళనము దానిచేతనుగూడ సప్రయోజనము. సంమిళిత భగవద్ధర్మాచార్య చరణావలోకన పుణ్యసంచయము వేఱువిధమున దుర్లభముగనుక నది మఱియొకప్రయోజనము.

స్వధర్మవిరహితులును, రాజనీతిచర్చామాత్రసారులును, సామాజికతత్త్వము నెఱుంగనివారును, బల్లలుగ్రుద్దుచు గొంతుపగులనట్లు వాపోవఁగలవారు నగు వారి కుప్పిగంతులచేత అపహరింపఁబడినమనస్సులుగలవారికై ప్రాకృతులు వారికధీనులగుచున్నారు వారిలో

గొందఱు మధ్యములు వీతరాగులయ్యును, తదితరుల-ఆలస్యదోషము వలనఁ గలిగినది గాని, మోహామువలనఁ గలిగినదిగాని యగు బహు కర్మోపేక్షనుచూచి అనన్యగతికులగుటంజేసి తదనువర్తులగుచున్నారు. మఱికొందఱు, ఆశ్రయింపఁదగినమార్గము ఏది యని సంశయించుచున్నారు. మనమిపుడు నిద్రపోయినయెడల సంశయించువారుసయితము ముందువారిమార్గమునే ఆశ్రయించెదరు. ఈలాగు క్రమముగా తదనుగమనప్రవాహముప్రసరింపఁగా మనకందఱకును తప్పక పిండోదకలోపము కాకతీఱదు.

శాస్త్రాచారము దుష్కరమును, ఆపాతక్లేశభూయిష్ఠమునుగదా! స్వేచ్ఛాచారము సుకరము, ఆపాతరమణీయమునుగదా!

శాస్త్రవిశ్వాసము,పరలోకభయమువినాగా ధర్మాచరణము, అధర్మపరిత్యాగము కలుగఁజాలవుగదా! శాస్త్రవిశ్వాసమునకు భంగము గలిగినను, పరలోకభయము లేకున్నను మనస్థితు లన్నియు భంగమును పొందును. భగ్నస్థితికు లయిన మానవులు పశుప్రాయు లగుదురు—అనుమొదలయిన- అనర్థపరంపరనుగుఱించి యందఱకునుబోధింపవలసియున్నది. అందులకై కూడ నీమహాసంమేళన మక్కఱకు వచ్చును. కావున ఇన్ని ప్రయోజనముల నూహించికూర్పఁబడిన యీ మహాసంమేళనము, శ్రీశ్రీ విశ్వేశ్వరునికృపచేతను, శ్రీ౧౦౮ ధర్మాచార్యపాదులయు, శ్రీశ్రీ సంన్యాసి విప్రులయు, శ్రీశ్రీ మద్విద్వద్బ్రాహ్మణులయు, శ్రీశ్రీమన్మిథిలేశ, శ్రీశ్రీ కాశీనరేశ, శ్రీమత్తాహరపురేశ్వర, శ్రీమద్గాడపురేశ్వరప్రభృతులగురాజులయు, సమ్మేళనపోషకులయిన వణిగ్వరులయు, తత్తత్సభాప్రతినిధులయు ననుగ్రహాముచేతను సుసంపన్నమగుఁగావుత మని కోరెదము.

స మా ప్త ము.

---

గ౨. శ్రీకాశీక్షేత్రమునందుజరిగిన అ. భా. వ. బ్రాహ్మణమహాసభ.

శ్రీవిశ్వనాథో విజయతేతరామ్.



అఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహాసమ్మేళనాంగభూతవిచారసభలో,

స్వస్తి శ్రీమత్సమస్త సురబృంద పూజిత పాదారవింద శివప్ర బింబవర్య — శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య — పదవాక్యప్ర మాణ పారావారపారీణ — యమనియమాసన ప్రాణాయామ ప్రత్యా హార ధ్యానధారణా సమాధ్యష్టాంగ యోగానుష్ఠాననిష్ఠ — తపశ్చక్ర ర్త్యనాద్యవిచ్ఛిన్న గురుపరంపరాప్రాప్తషడ్దర్శన సంస్థాపనాచార్య — వ్యాఖ్యానసింహాసనాధీశ్వర — సకలనిగమాగమసారహృదయ — సాం ఖ్యత్రయప్రతిపాదక — సకలనాస్తికమతోచ్ఛేద పూర్వక సకల ధర్మ సంస్థాపనైక ధురీణ — వైదిక మార్గప్రవర్తక — సర్వతంత్రస్వతంత్ర — శ్రీమహారాజధానీ ఋష్యశృంగపురవరాధీశ — శ్రీమద్రాజాధిరాజ — గురు మండలాచార్య — శ్రీమచ్ఛంకరాచార్యాన్వయ సంజాతాభిన పంచగంగాతీరవాస కమలానికేతన కరవీరసింహాసనాధీశ్వర శ్రీసచ్చి దానంద విద్యాశంకర భారతీ కరకమలకింజల్కోద్భవ శ్రీమదభిన సచ్చిదానంద విద్యానరసింహ భారతీస్వామి చరణులవారను,

# శ్రీసంకేశ్వర జగద్గురువుల సంభాషణము.



శ్లో. యస్యాహు రాగమవిదః పరిపూర్ణశక్తే
రంశే కియత్యపి నివిష్టమముం ప్రపంచమ్,
తస్మై తమాలరుచిభాసురకంధరాయ
నారాయణీసహచరాయ నమశ్శివాయ.

ప్రస్తుతము, జగదీశ్వరుఁ డయిన శ్రీవిశ్వనాథభగవానుని రాజ ధానియగు శ్రీవారాణాసియందు, రాజులు, మహారాజులు, విద్వద్వరులు, పౌరులు, జానపదులు, శ్రేష్ఠులు, ధనికులు, ధారికులు, మొదలయిన వారిచేతను ఇపుడు భరతఖండమునం దంతటను వివాదవిషములయిన ధార్మికవిషయములను నిర్ణయించుటకై, అఖిలభారతవర్షీయ బ్రాహ్మణ మహాసభ ఉత్సాహపూర్వకముగా జరుపఁబడుచుండుట మా కెంతే

ఆనందమునకుఁ గారణమగుచున్నది. నిజముగా నిది ఆందోళనఁగలిగించు కలికాలముగదా! ఈ కాలమున విదేశీయ పాండిత్యవిమోహితాంతరంగులై చాలమంది భారతవర్షీయులు తమ సనాతన ధర్మకల్పవృక్షమును బురుదలోని కడుగంటఁద్రొక్కుచు, అధోగతిరూపమైనగోతిలోఁ తాము పడిపోవుచున్నామను విషయమునుకూడ తెలిసికొనకున్నారు.

ఇపు డగ్నిహోత్రాదికములగు కర్మము లెక్కడనో కాని యగపడుట లేదుగదా, సంధ్యావందనము సయితము, ఎక్కడనో ఒకమూలను అణఁగిపోయియున్నది. ఇంక శ్రౌతకర్మములకథ దూర మైనదని వేరుగాచెప్ప నేల? శమదమాదుల పేళ్లు సయితము వినరాకున్నవి. జప మెక్కడ? తప మెక్కడ? భారతవర్షమునం దంతటను విదేశీయుల వేషభాషాచారముల ననుసరించుటయే పరమ పురుషార్థముగా మారినది. అందఱును, అన్నివిధముల శాస్త్రసమ్మతమయిన ధర్మమును పరిహరింపఁగోరుచున్నారు; హేతువాదములనాశ్రయించుచున్నారు. వేదశాస్త్రములను నిందించుచున్నారు. శాస్త్రయుక్తిసమ్మత—ఆచారములను గర్హించుచున్నారు. గురువుల నాదరింపకున్నారు. శిఖా యజ్ఞోపవీతధారణమును అసహ్యించుకొనుచున్నారు. వేయేలా? సర్వవిధములను ఆర్యావర్తముతాలూకు గౌరవమును మెడఁబట్టి గెంటివేయుచున్నారు.

ఏసమయమున నాలుగువర్ణములవారును ధర్మమును తమప్రాణములకంటెను గొప్పదానినిగాఁ దలఁచుచున్నవారై, దానిని పరిపాలించుకొఱకే తమతమబలమును ధనమును ప్రాణమునంతను వినియోగించుచు అత్యభివృద్ధిని బొందియుండిరో, అటువంటిసమయము భారతవర్షమున నొకప్పుడుండెను. వారేకదా దుఃసాహతమములయిన తత్త్వరత్నములను ప్రతిపాదించినవారైరి. పరమగంభీరయు, భగవతియు, అకృత్రిమయునగు వాక్కు (వేదము)ను వివరించినారు. పరమపావనములును, శుభోదర్కములును అగు కర్మముల నాచరించినారు. విమానము లెక్కి సంచరించినారు. స్వర్గలోకమందలి మందాకినిని భూలోకమునకుఁ దీసికొనివచ్చినారు. అంతటి గంభీరమయిన సముద్రమును పుడిసిలించినారు. దేవతాసమాజముతో వ్యవహరించినారు. ఆయాయిష్టదేవతలను సాక్షాత్కరింపఁజేసికొన్నారు. మూఁడుకాలములయందును గలవస్తుజాతమును తెలిసికొనినారు. విమలతమమై దిగంతములవ్యాపిం

చిన కీర్తిధనమును సంపాదించినారు. అంతమందు నిఖిలపురుషార్థ
గణ్యమయిన మోక్షమును పొందినారు. కనుకనేకదా కర్మభూమియగు
నీభారతవర్షమునందు జనించిన బ్రాహ్మణులు సంపూర్ణమయిన భూ
మండలమున కాదర్శభావమును, ఉపదేశకపదవిని పొందినారు.

"శ్లో. ఏతద్దేశప్రసూతస్య సకాశాదగ్రజన్మనః,
స్వం స్వం చరిత్రం శిక్షేరన్ పృథివ్యాం సర్వమానవాః."

అనఁగా, నీభారతదేశమందుఁ బుట్టిన బ్రాహ్మణునివలన భూ
మండలి మనుష్యు లందఱును తమతమ నడువడిని నేర్చుకొనవలె
అని మనుభగవానుఁ డన్నాఁడు. ఇంతటి పరాక్రమము మన ప్రాచీ
కెక్కడినుండి వచ్చినదో తమ రందఱును ఆలోచింతురుగాక ! వా
మనయిప్పటివారివలెనే మాతృగర్భసంభూతులే కదా! వారికిని
కున్నట్లే పదునొకండే యింద్రియములుగదా! ఎంతసూక్ష్మముగా నా
చించినను శరీరనిర్మాణమువిషయమున వారియందు మనకంటె
విశేష మేమియు మాకగపడ లేదు. ఇందులకుఁ గారణ మేమయి
డును? ఆయా సంగతులన్నియు సూక్ష్మముగ విమర్శించి చూచినప
న—వారల కట్టిసామర్థ్యము స్వస్వవర్ణాశ్రమ ధర్మానుష్ఠానము
గాని వేఱుగా దన్న సమాధానము మనకు దొరకును. మన సనా
ధర్మ మేయోగ్యతను కలిగింపకుండెడిని ? కనుకనే భగవతి యగు
"ధర్మే సర్వం ప్రతిష్ఠితమ్" అని చెప్పినది.

అటువంటి మన వైదికధర్మము—కాలపరిపాకమువలన, ప్ర
మున, సర్వజనులచేతను బహువిధములఁ దమయభిలాషల ననుస
ఊహింపఁబడిమార్పఁబడుచుశోకింపఁదగిన యెట్టి యవస్థను అనుభ
చున్నదో ఆసంగతి తమరందఱును ఎఱింగినదియే కనుక వేఱుగా
పవలసిన—అక్కఱ లేదు. మిక్కిలి విషమావస్థనుపొందియున్న
వంటిసమయమునఁగూడ నిచ్చటఁ గూడియున్న ధర్మధురంధరుల
మహారాజులును, పండితప్రకాండులును, ధర్మముతాలూకు యాథా
మును తెలిసికొనఁదలంచినవారై యీమహాసంమేళనమును
టయు, ఇందు కలిమలకలుషితమయిన యీభూవలయమును సము
చుకోరికగలిగి కైలాసమునుండి భూలోకమునఁ నవతరించినవా

భూభారము నుద్ధరించినవారును, దయాసముద్రులును, పరమశివస్వరూపులును అగు శ్రీ మచ్ఛంకరభగవత్పాదాచార్యవర్యులయందు మిక్కిలి కృతజ్ఞతను వహించుచు, శ్రీవారిపీఠ దేవతచేతను ప్రయోగింపఁబడునాశీర్వాదముల నభిలషించి మమ్ముల నిచ్చటికి విజయంచేయ విన్నపించుకొనుటయు, ఆశీఃప్రదానమునకు సుయోగము సమకూడుటయు ననియెడి యీగుణసముదాయ మంతయు మాయంతరంగము నెంతయేని సంతసింపఁజేయుచున్నది.

తప్పకుండ నిటువంటిసభలు భూకైలాస మనఁదగిన యీకాశీక్షేత్రమున పలుసారులు కూర్పవలసియున్నవి. ఈ అవిముక్త (కాశీ) క్షేత్రము నిఖిలజగన్నాయకుఁ డయిన చంద్రమౌళిభగవానునకు ప్రణయమందిరముగదా! ఇది భక్తపోషణధృతవ్రతయు,భగవతియు నగు అన్నపూర్ణాంబకు ఆటకూటము. ఇది పాపత్రయ తాపత్రయ నిబర్హణ గృహీతదీక్షయు, భగవతియు నయిన గంగాభవానికి పతికులము. (అత్తవారియిల్లు) ఇది సర్వదేవతలకును నివాసస్థానము. ఇది వివిధములయిన విద్యల కాకరము, ఇది బ్రహ్మనిష్ఠుల కాశ్రయము. పండితరత్నముల కిది నిధి, భూదేవి కిది తిలకము, క్షేత్రమణుల కిది మేరువు. ఇది శ్రోత్రియులకు మాతృకులము. (పుట్టినిల్లు) కర్మయోగమున కిది యాధారము. ఉపాసనాదేవి కిది యంతఃపురము. ఇది జ్ఞాననిష్ఠకు విహారభూమి. కను కనే యిచ్చట మూర్తిమతియై జ్ఞానవాపి ప్రకాశించుచున్న దని మేము తలంచుచున్నాము. కాఁగా ఈక్షేత్ర మిటువంటి ధార్మిక విచారణలకుఁ దగినస్థాన మని మాతలంపు.

ధర్మముమాత్రము తెలియఁదగినదియు, ఆచరించఁ దగినదియు నగునే కాని యెవ్వరిచేతను మార్చఁదగినది యెప్పటికిని గాదు. ఈధర్మ మలౌకికము గనుక ప్రమాణాంతరములచేతను తెలిసికొనుటకు వీలుకాదు. శ్రుతిప్రమాణముచేతను యాగాచరణమువలన స్వర్గముగలుగుననిన్ గ్రహింప సాధ్యమగును గాని వట్టిశుష్కతర్కవాదములు, విమర్శలు మొదలగువానిచేత సాధ్యముగాదు. ధర్మమును తెలిసికొనుటకు శ్రుతిగదా పరమ ప్రమాణము. తదవిరోధిని యగు స్మృతియు, తదవిరోధి యగు శిష్టాచారమున్ను ప్రామాణ్యములే అగు

చున్నవి. అంతియే కాని ఒకానొకవ్యక్తియొక్క యూహామాత్ర
ప్రమాణము కాఁజాలదు. అట్టియూహ ప్రతిపురుషునియందును వే
వేఱుగా నుండుట యెఱిఁగిన దేకదా! స్మృతిప్రణేతలయిన ప్రాచీ
హర్షులు సైతము ధర్మతత్త్వమును దేనినికూడ తమయూహచేతను
స్థాపించియుండలేదు. మరేమనఁగా, దీర్ఘతరమైన తపస్సుచేతను,
వంతుఁడయిన జగదీశ్వరు నారాధించి స్వతస్సిద్ధమయిన శ్రుతివచన
తాత్పర్యమునే తత్తదధికారిభేదమునుబట్టి ఉద్ఘాటించినవారైన
వేయిమాట లేలా? భగవంతుఁడైన పరమేశ్వరుఁడుసయితము గత
మునందలివేదమును అనుస్మరించియే యావేదమర్యాదను ప్రచా
లోనికిఁ దెచ్చుచుఁ బరిపాలించుచుండునని శ్రుతియే చెప్పుచున్న

యుగాంతరీయధర్మములు కలియుగమునవర్జింపఁదగినవిగాచెప్ప
చున్న వన్నంతమాత్రముననే ధర్మమును మార్చుటకు మనకు హ
న్నదని యజ్ఞులగుకొందఱ అభిప్రాయపడుచున్నారు, గాని—అది
వ్యామోహమే. ఇదివఱ కెన్నఁడును ప్రాచీనులగు మహర్షులు
మునుగాని, తద్బోధకమయిన శాస్త్రమునుగాని మార్చియుండ
మరేమన? సమానబలత్వముచేతను వికల్పబోధకములైన శ్రుతి
ములకు యుగభేదముచేతను దేశభేదముచేతను అధికారిభేదము
వ్యవస్థితత్వమును ప్రదర్శించినారు. ఇది యెంతమాత్రమును మ
కాదు. మరేమన? వ్యవస్థాపనము. అదియేనియు, మోక్షతత్త్వ
ప్రత్యక్షముచేసికొన్నవారును, లోకులనుద్ధరించుటకు మాత్రమే
చవ్యవహారము నవలంబించినవారును, భ్రమప్రమాదాదిదోష
లును, శ్రుతిదేవీహృదయవేదులును, అయిన మను యాజ్ఞవల్క్యాది
తులగు మహర్షులచేతనే చేయఁదగినదిగాని అల్పబుద్ధులును, రా
షదూషిత హృదయులును అగు ప్రాకృతులచేత నెంతమాత్ర
గానేకాదు. కాఁబట్టి, ఎప్పుడును, ధర్మమునుగాని, శాస్త్రములను
మార్చుట న్యాయముగాని, శ్రేయస్కరముగాని కాదు. కనుకనే
ద్వైపాయనభగవానుఁడు మహాభారతాంతమున 'ధర్మో నిత్యః
దుఃఖే త్వనిత్యే' అని యుద్ఘోషించియున్నాఁడు. భగవంతుఁడు
"శ్రుతి స్మృతీ మమైవాజ్ఞే తే ఉల్లంఘ్య ప్రవర్తతే, ఆజ్ఞాభంగో కరీ
ద్రోహః" అని యన్నాఁడు. ఒకవేళ ధర్మమును మార్చుట

చెదరేని యప్పుడు "నజాతు కామాన్న భయాన్న లోభాద్ధర్మంత్యజే జ్జీవితస్యాపి హేతోః" అని కాని, "ఆజ్ఞాభంగో మమ ద్రోహః" అని కాని వేదవ్యాసుఁడుగాని, భగవంతుఁడుగాని చెప్పియేయుండక పోవుదురు. పరిస్థితులచేతమార్పుఁ దగునెడల, ధర్మమును కామానుసారముమార్పఁదగదని యేలచెప్పెదరు? కాఁబట్టి "ధర్మము రూపాంతరమును పొందించుటకు శక్యముకాదు" అను విషయమున అణుమాత్రమయినను సంశయింపఁజనదు అటులేని, ఇంతటి యీసభాధివేశనప్రయాస మెందులకని పలువురు శంకింపవచ్చును. ఇది చోద్యముగా నవతరింపదు. ప్రస్తుతము, ఎల్లయెడలను సంస్కారకంమన్యులును, కామకారమాత్రప్రవృత్తులును అగు కొందఱిచేతను ఊహింపఁబడుచున్న శాస్త్రవాక్యముల—అపార్థములను తొలఁగించి లెస్సగా ఆలోచించుటకై యీయారంభ మావశ్యకము. అట్లు కానిపక్షమున ధార్మికుఁడు నయి తము కర్తవ్యాకర్తవ్యముల నెఱుఁగక దేనినేని యవలంబించినవాఁడై పురుషార్థమునుండి తాను దూర మగుటయే కాక, అనిష్టమునుకూడఁ బొందవలసినవాఁ డగును. కాఁబట్టి శ్రుతిస్మృతిసదాచారముల నంగీకరించి పెద్దలుశాస్త్రీయబుద్ధితో ఆచరించునదియు ప్రాచీనపరంపరచేతను ఆచరింపఁబడుచున్నదియునగుధర్మాచరణమే విశుద్ధమైనదని దృఢపఱుచుటయే యీసభయొక్క ముఖ్యోద్దేశమని మే మిపుడు తలంచెదము.

ఈసభచేతను సనాతనధర్మగౌరవము ప్రకటింపఁబడుఁగాక, శ్రుతిస్మృతిశిష్టాచారములప్రామాణ్యము చాటఁబడుఁగాక, ప్రాచీనుల—ఆచారముతాలూకు విశుద్ధతమత్వము స్థాపింపఁబడుఁగాక, భారతీయులమనస్సులయందు దృఢతమమైన—ఆస్తిక్యబుద్ధి ఉంపఁబడుఁగాక, అంతటను వర్ణాశ్రమధర్మానుష్ఠానము ప్రచారములోనికిఁ దేఁబడునుగాక, ఏతత్సభాప్రవర్తకులును, గోబ్రాహ్మణపరిపాలనైక ధురీణులును, అగు శ్రీకాశీమండలాధీశ, శ్రీ దర్భాంగాధీశ ప్రభృతులును అగు మహారాజులు, ఆయా దేశములనుండి దయచేసినపండితోత్తములు,మిగిలిన యిచ్చటిపౌరులు జానపదులును వారు వీరననేలా? భారతీయులైన శిష్యులందఱును పరమాదరపూర్వకముగఁ దమతమధర్మము ననుష్ఠానములోనికిఁ దెచ్చుచున్నవారై భగవంతుఁడగు పరమేశ్వరునియందు నిరతిశయమైన భక్తిగలిగి గృహస్థు లీలోకమున యావజ్జీవము సుఖము

గా ఆనందించుచుఁ బారమేశ్వరపదప్రాప్త్యధికారమును సంపాదించు కొందురుగావుతమని యనవరతము సాదరముగ శ్రీ శారదా చంద్ర మౌళీశ్వర దివ్యచరణారవిందముల సన్నిధిలోఁ బ్రార్థించుచుండెదము.

ఇట్లు—శివము.

---

శ్రీమతే రామానుజాయ నమః.

అఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహాసంమేళనాంగభూతవిచారసభలోఁ:

శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్యులును, ఉభయవేదాంత ప్రవర్తకాచార్యులును, శాంతి, శమ, దమాద్యనంత కల్యాణగుణగణ భూషితులును, శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యులును, శ్రీసంయమిసార్వభౌమ శాసనాధిగత శ్రీయదుగిరి యతిరాజ సంపత్కుమార సర్వవిధ కైంకర్యధురంధరులును శ్రీభగవద్రామానుజ సిద్ధాంతనిర్ధారణ సార్వభౌములును, శ్రీభగవద్రామానుజాచార్య నిరవధిక పరమానుగ్రహసమధిగత శ్రీయదుగిరి యతిరాజమఠ పరిబృఢిమాలంకర్మీణులును, శ్రీమద్యతీంద్రప్రవణసత్సంప్రదాయనిష్ఠాగరిష్ఠులును అగు

**శ్రీయదుగిరి యతిరాజ సంపత్కుమార రామానుజ**

సంయమి సార్వభౌములచేతను నారాయణస్మరణపూర్వకముగా ననుగ్రహింపఁబడిన,

## ప్రాస్తావిక సంభాషణము.

శ్లో. ప్రకృతిపురుష కాలవ్యక్తముక్తా యదిచ్ఛా
మనువిదధతి నిత్యం నిత్యసిద్ధై రనేకైః,
స్వపరిచరణభోగైః శ్రీమతి ప్రీయమాణే
భవతు మమ పరస్మిన్ పూరుషే భక్తిభూమా,
సర్వదా సర్వకార్యేషు నాస్తి తేషా మమంగళమ్,
యేషాం హృదిస్థో భగవాన్మంగళాయతనం హరిః.
తస్మై రామానుజార్యాయ నమః పరమయోగినే,
యః శ్రుతిస్మృతిసూత్రాణాం సుస్థాపనమకరోత్,

→ దేవవాక్కు, బ్రాహ్మణులును. ←

"ఏకాక్షరాం ద్విపదాం షట్పదాంచ
వాచం దేవా ఉపజీవ న్తి విశ్వే,
వాచం గన్ధర్వాః పశవో మనుష్యా
వాచీమా విశ్వా భువనాన్యర్పితాః.
సా నో హవం జుషతా మిన్ద్రపత్నీ"

"అతిక్రాన్తసుఖాః కాలాః ప్రత్యుపస్థితదారుణాః,
శ్వఃశ్వఃపాపీయదివసాః పృథివీ గతయౌవనా" (వ్యాసభగవానులు)

క. మతిఁ బొలుపెసఁగ సంసార
మ్మతిచంచల మెండమావులట్టుల సంప
త్ప్రతతులు క్షణభంగురములు
గతకాలము మేలు వచ్చుకాలముకంటెన్. (శర్మ యతిట్టు)

ఏ కా ల ము న ం దు మనపూర్వులు దేవవాక్కును సేవించు వారై ఉభయలోకములయందును అవిప్లుతవృత్తులై యుండిరో ఆకాలమును మనము మరలఁ జూచెదమా? అక్కటక్కటా! ఆపురుషులును గతించినారు, ఆదేవవాక్కున్ను గతించినది. ఆకాలమున్ను భూగర్భముపాలయిపోయినది. అయితే, మనయందఱకును నిరన్వయమయిన వినాశమేనా? పాపము శాంతించుఁగాక! పాపము శాంతించుఁగాక. అబ్రహ్మణ్య మబ్రహ్మణ్యము! ఆఋషులవంశమునందుఁ బుట్టి, అముక శాఖాధ్యాయులము, ఆముకచరణులము, అముకప్రవరులము — అను నివి మొదలుగాఁ జెప్పుకొనుచున్న మనము బ్రదికియే యున్నారముగాదా!

ప్రకృతిప్రత్యయశుద్ధయగు నేదేవవాణిచేతను ఆశ్రయికములును, ఆభ్యుదయికములును అగు కర్మములయందు మనము సంస్కరింపఁబడుచున్నారమో ఆ దేవవాణియు జీవించుచున్నది. ఏకాలము మన పూర్వపురుషులను, స్మరింపఁజేయుచు, అతీతాగామివర్తమానముల నెడి మూఁడుక్రమములచేతను, ఈజగత్తును ఆవర్తింపఁజేయుచున్నదో ఆకాలమున్ను జీవించియేయున్నది.

ఈరీతిగా నివి సన్మూలములును, సదాయతనములును, సత్ప్రతిష్ఠములును అయినను క్షేత్రజ్ఞులవలెనే పైపైని సంచరించుచున్నప్పటికిని, ఆయర్థమును మనము పొందఁజాలకున్నాము. కులాభిమతమగు

వృత్తిలేదు. కావున మనగతు లన్నియు అహితాపాయ బహుళము లయి యున్నవి. స్వధర్మమునందు సమితు. లేదు. ఆపరాశరాద్యు ప్రవృత్తి యెట్లు కలిగెడిని? ఆలోచింపఁగా—

"అంగా దంగా త్సంభవసి హృదయా దధి జాయసే,
ఆత్మా వై పుత్రనామాసి స జీవ శరదశ్శతమ్"

అనెడియాశీర్వాదముచేతను వర్ధితులమై ఉత్తరోత్తరము జీవించుచున్నాము. ఇంతేకాదు. "పశ్యేమ శరదశ్శతం, జీవేమ శరదశ్శతం, నందామ శరదశ్శతం, మోదామ శరదశ్శతం, భవామ శరదశ్శతం, శృణవామ శరదశ్శతం, ప్రబ్రవామ శరదశ్శతం, అజీతాః స్యామ శరదశ్శతమ్" అని కర్మసాక్షియగు సూర్యభగవానునిగూర్చి యుపస్థానము చేయుచునేయున్నాము. అయినప్పటికిని, దూరదృష్టిగల ఆకూటస్థులు ఋషులు వేఱు, శ్రుతిసుభగయగు నాసరస్వతియు వేఱే. సుకృతాశ్యావమయిన ఆకాలమున్ను వేఱే, ఇప్పటిమార్పు చాల విచిత్రమయినది. ఏమనఁగా, మనదృష్టి వ్యక్తదర్శినియు, ఆవాక్కు అకల్యాణి యై పోయినది, ఈకాలమో ప్రవృద్ధ లి, అందును విశేషముగా విధర్మము గలదియు, వైదేశికమును, వర్ణమునుబట్టిమాత్రము విశదమయినను కార్యమువలనఁ గాలకూటమును, ఛద్మప్రహారియు, అస్మద్భాగ్యవిపర్యయ దుర్దైవదత్తబలమును ప్రస్తుతము ప్రభవిష్ణువును అగు విప్లవము సర్వవిధముల ఆక్రమించుకొనుచుండఁగా, వజ్రాయుధముచేతను కొట్టబడినట్లు హృదయము వేయిశకలములుగా విడిపోవుచున్నది. ఆహృదయము మూర్తము కానికారణమున ముక్కముక్కలుగా నగుచుండుట లేదు. దారుణతమములయిన ఆయా అవిద్ధకర్ణుల (మ్లేచ్ఛుల) ముట్టడులను స్మరించినంతమాత్రముననే మన సర్వాంగములయందును వ్యాపించియున్నరక్తము ఉడుకెత్తుచున్నట్లు గాత్రములయందు సహస్రవేషమైనజ్వరమును గలిగించుచున్నది. ఈపవిత్ర భారతభూమి నెన్నిపర్యాయములు ముట్టడింపలేదు? మనప్రబంధకోశములను ప్రోగుచేసి యెన్నిపర్యాయములు తగులఁబెట్టలేదు? వేయేలా? భారతముయొక్క నేత్రములనే పొడిచివేసినారు, అందువలననే మన మంధప్రాయులమై విడంబనాహతమయిన జీవితమును ధరించుచున్నాము.

గంగాయమునానదుల సంగమమునకు సాక్షియగు నాపట్టి
చెట్టు స్మరింపఁబడుచున్నదా? దానివేళ్లచే వాసితయగుమృత్స్నయొక్క
కణికమైనను మిగిలియున్నదా? సోమనాథస్వామితాలూకు అధిష్ఠాన
వేదిక ఆనవాలుపట్టుటకైనను వీలున్నదా? వేఱేమికావలెను? విశ్వే
శ్వరభగవానుఁడుకూడ భూతల స్పర్శలేకుండ పదియంగుళములుపైన
నే ప్రతిష్ఠితమయిన ఈకాశీనగరమునం దుండియుఁ దనస్థాణుత్వమునే
విడుచుకొన్నాఁడు. ఇది యిట్లుండగా, మఱొకయుపద్రవముచూచుచుం
డఁగానే బ్రాహ్మణక్షత్రియబృందముపైని ప్రవర్తించినది. ఇప్పటి భార
తభూమి వంధ్యయగుటచేతను, తమ తేజస్సులను చాపములుగాను,
శాపములుగాను కవచములనుగాఁ జేసికొనుచుండెడి యాభటులనే
(అనగా తేజోవంతులగుబ్రాహ్మణులను క్షత్రియులనే) ప్రసవింపకున్నది.
కాఁబట్టి, ఈప్రకారముగా భారతము వ్యాకుల మగుచుండఁగా, వీరపు
రుషులు గడ్డిబొమ్మలవంటివారగుచుండఁగా, స్వరవర్ణవిశుద్ధి ముఖముల
(బ్రాహ్మణుల)యం దెట్లు ప్రకాశింపఁగలదు? భుజముల(క్షత్రియుల)
యం దట్టియూర్జిత తేజస్సెట్లు వ్యాపింపఁగలిగెడిని? ఊరుస్తంభ గృహీ
తయగు పాదపరివృత్తి దుఃస్థితి వేఱ యడుగవలసిన దేమున్నది?

ఈభారతభూమి నుద్ధరింపఁగల పరశురామునివంటి మహావీరుఁ
డెవఁడయినను మరల ఉదయించునా? బ్రాహ్మణకులమునకుఁ దటస్థిం
చిన అవమానమును సహింపలేక తన శర్మపదమును పరిత్యజించి వర్మప
దమును, సమిత్కుశాజ్య పరిపూతమయిన చేతితో శస్త్రమును ధరించిన
వాఁడును, ఈకలియుగములోనే పుట్టినవాఁడును అగు మయూరవర్మవం
టివాఁడు మరల నుద్భవించునా?

దధీచిముని వెన్నెముకనుగూర్చి వజ్రము వజ్రమనుట యేమంత
గొప్పమాట? బ్రాహ్మణునిముఖమునందు సంస్కారపూతయగు నే
వాణిగలదో అదియే వేయంచుల వజ్రము. అట్టి వేదవాక్కును గ్రహిం
పనప్పుడును, విపరీతముగా గ్రహించునపుడును అది ముఖమునందు వర్ణో
త్కర్షము నెట్లు కలుగఁజేయును?

ఇప్పటి బ్రాహ్మణకులీనులు దుర్వర్ణో (రజతో) పసంగ్రహము
(అనగా ద్రవ్యార్జనము)నందే ఆదరమును సమకూర్చుచున్నారు. తుట్ట
తుదకు, అవర్ణపరిగ్రహము (జాత్యంతరవివాహము) వలన సంచితము

సిగ్గుపడకున్నారు. అధ్యయనధ్వనిముఖరితముఖములయిన ఆబ్రాహ్మణకులముల మఱల నెక్కడఁ జూచెదము? అనవరతాగ్నిహోత్రధూమలేఖా సంపాతశబలము లయిన—ఆయగ్రహారముల నిఁక నెప్పుడు చూచెదము? ఎక్కడఁ జూచినను రాక్షసవాక్కులే వినఁబడుచున్నవి. మ్లేచ్ఛభాషాదులచేత వికృతములయినరూపములే అగపడుచున్నవి. సనాతనధర్మహృదయమర్మచ్ఛేదకములైన కర్మములే అంతట చెలరేఁగుచున్నవి.

ఈప్రకారముగా, నితాంతచింతా సంతానదంతురిత నిఖిలాంతరంగమగు నీవ్యతీపాతమునం దెట్లో ఆకాళరాత్రిని గడపి, ఉన్మీలితలోకమై (వెలుఁగిచ్చుచు) ఉజ్జిహానమయిన (ఉదయించుచున్న) మిత్ర(సూర్య)మండలమును చూచుటకై తల యెత్తునంతలో నెక్కడినుండో మబ్బులేనిపిడుగు వచ్చిపడి మనభారతవర్షమును వేయితునకలుగా పగులఁగొట్టుటయేకాకుండ మఱియు, నెక్కడినుండియో వచ్చిన పడమటిసుడిగాలిచేతను ప్రజ్వలింపఁజేయఁబడిన—అగ్ని గడ్డికుప్పను కాల్చినట్లు కాల్చివేసినదికూడను. మనకిప్పుడు సంభవింపనున్న అధఃపతనము ఘోరము.

ఆలోచింపఁగా, మొదటను అవిద్ధకర్ణుల (మ్లేచ్ఛుల) యుద్ధములందీ భారతజాతి అట్లుశల్కములుగాఁ గోయఁబడినదయినను బయటికిమాత్రమే వికారమునుపొందినదిగాని హృదయము కలుషితము లేదు. ఇప్పుడు మనకు దాపరించిన యీధర్మశ్రద్ధాభావరూపమయిన స్థితి మనధర్మమును ముక్కలుముక్కలుగాఁ జెక్కుచు, అర్బుదరోగము వలెనే అనుద్భిన్నముఖమై లోలోపలనే బాధించుచు స్వధర్మమునందుగల రుచినే మొదలంట తుడిచివేయుచున్నది.

పొట్టకూటికయి ఇచట దేవులాడు ఈవిదేశీయుల దుర్బోధలచే నిహపరముల కుపయోగించు తమతమధర్మములనేకాకుండ, తుట్టతుదకు వేదభాషలనుగూడ ఎందఱుభారతీయులు విడువలేదు? ఈ విదేశీయులు విద్యాస్థానములగుపుస్తకముల నెన్నింటిని బలవంతముగా పట్టుకొనిపోలేదు ? ఎన్నింటిని ధనమిచ్చి కొనుక్కొనిపోలేదు ? మన దేశధనము విదేశజులపాలు గాలేదు ? కటకటా ! మూర్తిమంతమయిన మనదురదృష్టమో అన్నట్లు వచ్చిపడిన పడమటిసుడిగాలిరక్కసు సోము కాసుక్కొను వేదములనువలెనే మఱి యపూర్వగ్రంథముల నే

ద్వీపమునందుఁ బడవేసెనే. ఏతూర్పుదిక్కు సర్వతేజస్సులను ప్రకటిం చుచున్నదై యితరదిక్కులకుకూడ నామరూపములుకలుగునట్లు వెలుఁగుచుఁ దానున్నంతవఱకును వెలిఁగించుటకుఁ జాలుచున్నదో అదియే కదా తూర్పుదిక్కు. ఏపశ్చిమదిక్కు తూర్పుదిక్కువలన లబ్ధస్వరూపమై, అందుదయించిన తేజస్సులనే కనుపడకుండఁజేయుచుఁ దుదకుఁ బ్రపంచమునే నామరూపములు లేకుండఁ జిమ్మచీకటిలో ముంచివేయుచున్నదో అదియేకదా పశ్చిమదిక్కు. పోఁగా మిగిలినగ్రంథములను, విద్యలను మఱియొకవిధమయిన రాక్షసి మెడనులిమి చంపివేయుచున్నది. ఆ రాక్షసి యొకవయిపునుండి ముద్రణారూపమునను, రెండవవయిపుననుండి భృతకాధ్యాపనచోదనారూపమునను మన దేశములోఁ బ్రవేశించినది. పై రెండురూపములచేతను మ్రింగివేయఁబడుచున్నవైన మన వాఙ్మయము లచేతితమాలామాలముగాఁ బ్రసారితములై కందుకోపఘాతముగఁ గొట్టఁబడుచు విమర్శనములనుపేర నెట్టియెట్టియవహేళనముల నారోపింపఁబడుటలేదు? మొదటిదయిన ముద్రణారాక్షసిచేతను గళగృహీతములై గ్రంథములు నాలుఁగయిదుచేతులనుండి మాఱినంతమాత్రముననే శిథిలములై గంధర్వనగరభర్మసధర్మములగుచు కేవలము అజకనాశముగ నశించుటయే కాకుండ, కర్కటులవలెనే మాతృకనుసయితము నిర్మూలించుచున్నవి. రెండవదానిచే మ్రింగఁబడినవారు శ్వవృత్తి (సేవా) తత్పరులై పరపరిష్కారసంవ్యయితాయువులును, క్షణలబ్ధరుచులునునై యిహపరములు రెండింటికిని చెడి శేవడలై పోవుచున్నారు. ఉత్తరదేశమున బుజపత్రపుపట్టలు మొదలగువానియందును, దక్షిణదేశమున, తాళపత్రాదులయందును వ్రాయఁబడిన ప్రబంధకోశములు పద్మకోశములవలెనే వేలకొలఁదికరములచేతను విరామము లేకుండఁ బరిమార్జింపఁబడుచున్నను వేలకొలఁది సంవత్సరములు స్వపోషకులతోఁగూడనే సూర్యా (పండితా)భిముఖ్యముగా విజృంభింపఁజేయఁబడుచునేయున్నవి. స్వతఃపురుషార్థభూతమును, సర్వతోముఖమును నగు నా విద్యాధ్యయన మెక్కడకుఁబోయినదో? దయాప్రసన్నహృదయులగు గురువులచేతను శిష్యులకునిష్పణ్య (డబ్బుపుచ్చుకోక) క్షణ్యముగఁ గఱపఁబడుచుండెడి యాయధ్యాపన మెక్కడ నడఁగిపోయినదో? అర్ధజంతీ[illegible]మయిన యీభృతకాధ్యాపన (కూలికి చదువుచెప్పుట) ఎక్కడ నేర్చు

కోఁబడినదో? నిరయపరిపోషమైన యీధర్మపరిమోషము, నిశ్రేయసా లోకప్రదోషమైన యీవేషము భారతీయుల కెట్లిష్టమైనదో? ఉత్ఫు లవీచియగు నీనింద్యకార్యరుచి యేమిటి? మనపూర్వులగు మహర్షుల యుపేక్షింపఁబడుచున్నారో గదా? కులక్రమాగతయగు త్రయీ (వేద) విద్య కపిలగోవువలె నిర్దయముగ నెందులకు నిరసింపఁబడుచున్నది? శా శాఖాప్రరోహమైన యీసజాతీయద్రోహ మెక్కడనుండి యవతరించి నది? ఛీఛీ! శ్రమమనెడిగ్రహము దేవవాక్కునుమ్రింగివేసినది. భారత ధర్మములను లయమొందించుటకుఁగంకణముఁగట్టుకొన్న కలిమహారా నకు అశుభమగుఁగాత! కాఁబట్టి, ఈప్రకారముగాఉపర్యుపర్యుద్గచ్ఛమా యును, ఘోరఘోరయు, అశ్రాంతాంతఃక్షోభనిర్ఘాతాస్ఫాలనావశీర్యమా ణయునగు సుదూరనిగూహితరత్నంబగు సముద్రముయొక్క వేల(తీరము) యందువలెనే తిరోహితప్రజ్ఞాచక్షువైన ఈభారతముయొక్క వేలయం దు, నైశ్రేయసధర్మమర్మము కూలపాతముగఁ బడిపోవుచుండఁగా—

"వర్ణక్షోభకరాపవిద్ధహృదయవ్యావర్ధి తేర్ష్యాగ్నినల
జ్వాలోద్వల్గనపూర్వరంగపిశునై ర్దుర్వర్ణధూమోద్గమైః,
లోకస్సంప్రతి లుప్యతే శ్రుతివచఃప్రాప్తావలోకోఽంజసా
దిగ్వ్యాప్త్యైవ సమాస్తృణాతి జగతీం నీరంధ్ర మంధం తమః"

కోశములన్నింటికిని కోశమయినహృదయమును రక్షించుకొను డు. దానియందు సంక్రమించినవైనపదునాలుగు విద్యలును వందలకో లఁది కోశము లగుటకు సమర్థము లగుచుండును. విద్యలయు, సంపద యు కోశములు యథేష్టముగ హరింపఁబడుఁగాక, విక్రయింపఁబడు గాక, అగ్రజన్ములు ప్రజ్ఞానముచేతనే కోశవంతులును, ధనవంతులును అగుచుందురు. ఒక్కహృదయము విద్యాసంపన్నమయి యుండినపక్ష మున కృతులయు, ధనములయుఁ గోశము లెన్నియేని బయలు దేఱఁగల వుగదా! ఇదియేకదా మనకు సమాశ్వాసనస్థానము! కలివలనఁగలిగిన యీగొప్పకాలుష్య ముండినప్పటికిని, యత్రైకాంతతవలన ఈభారత భూమి దుర్గత గాలేదు. అక్కడక్కడ గుల్మాంతరితములయిన జ్యోతి ష్మతులగు మహౌషధులువలెనే దేవవాక్కును ప్రసారములోనికిఁ దె చ్చుచున్నవారును, పంక్తిపావనులును, స్వాలోకమాత్ర సంపాదితని

మయులును, విద్యానిష్ణాతబుద్ధులును, దూరదర్శులును అగు పండితు లుండ నేయున్నారు గాని, వారు తెల్లవాఱుజామున నక్షత్రములవలెనే కడుకొలఁదిగనుండి చదువఁగోరువారు లేక మాట్లాడి స్వచ్ఛములైన యంతరంగముల నభ్యాసించుచున్నారు. అంతమాత్రమున మనము శ్రుతివిరహితులముకాము. నమ్ముఁడు. భగవతియగు ఈగంగానది మన భారతభూమిని పవిత్రముగఁజేయుచున్నంతకాలము—

"ఇహా సంతో నవా సన్తి సతో వా నానువర్తసే,
తథా హి విపరీతా తే బుద్ధి రాచారవర్జితా,,

అనుదానినిమాత్రము మనము వినియున్నాము. కాఁబట్టి, ఇది యే—అనఁగా మనము గురువులను సేవించుచు ప్రియమయినధన మును దెచ్చి వారి కిచ్చి ప్రజాతంతువును విచ్ఛేదముగ చేయకుండుట యే సంతతి యవిచ్ఛిన్నముగ సాఁగుటకుఁ జాలును. ఆధనము వారిచే నుపదిష్టమయినవిద్య అద్దమునందువలెనే ప్రతిబింబితమగును. అది గదా ప్రియత, ఏది శిష్యప్రజ్ఞయొక్క శత గుణోత్తరతయో, అదిగదా ప్రజ—ఎట్లు వారికి మనమో, అట్లే మన కితరులో. అదిగదా తంతు వు—ఏది పూర్వోత్తరమును విడువనియనుబంధమో, అదిగదా అవిచ్ఛే దము—ఏది ఉత్తరోత్తరముగ విద్యయొక్క ఉపసంక్రాంతియో— తెలినసార మేమనఁగా.—

"ఉత్తిష్ఠత మా స్వప్త అగ్నిమిచ్ఛధ్వం భారతాః!,
రాజ్ఞః సోమస్య తృప్తాసస్సూర్యేణ సయుజోషసః."

కాఁబట్టి, సాందృష్టికము (సద్యఃఫలము)నకును, ఉదర్క (ముందు రాఁగలఫల)మునకును ఉదర్క (ముందురాఁగల ఫల)మునకును ఇది ప్రాప్తకాలము. ముందుగా భారతలింగులయెడ నమ్మకము వదలు కోవలెను. అ భారతీయులయెడ నిది అనిగడ విశదమే. కులక్రమా గత మయిన విద్యారహస్యములు విధ్వంసకులబారిఁబడకుండ గోవ నచేయునది. సదాచారపరాయణులగు శిష్యులయందు విద్యాధన వినియోగము చేయవలెను. పోఁగా మిగిలిన విద్యాస్థానములగు గ్రంథములు ప్రోగుచేసి సుదృఢముగ రక్షింపవలెను. బ్రాహ్మణులు శ్రుతిసుభగ (వినుటకు మనోహరమయినది. వేదముచేత పూజ్యమై నది.) యగు గీర్వాణభాష నభ్యసింపవలెను. విదేశీయుల ప్రలోభముల

నుండి హృదయములను మరలింపవలెను. విదేశీయుల సాహాయ్య
త్యాశల నమ్మఁబోకుఁడు స్వతఃపురుషార్థభూతయగువిద్యనధ్యయ
చేయుఁడు. సర్వాక్షపదలకును ఆస్పదమయిన - అసూయను పరిహ
వలెను. జీవాతువగు మైత్రిని వృద్ధిపొందించునది. ఇదంతయు భా
మృద్ధికిఁ జాలియుండును. ఈభారమంతయుఅవిశేషముగనాలుగువర్ణ
లవారి తలమీఁదనే ఉన్నది. వీరు అన్యోన్యము ఐకమత్యముతోఁ
సినవారయి యీభారతభూమి నుద్ధరించినఁగాని ఉద్ధారము కాఁజా

కావున, నాలుగువర్ణములవారును తమతమకర్మములం
తులై పరస్పరము ఐకమత్యముతోఁ గలసియున్నచో, తాము గొ
లాభమును పొందుటయేకాక, ఇతరులను ముందు రాఁబోవువారి
పొందించెదరు కూడను. ఇందులకు వ్యతిరేకులయినచో, కేవ
తామమాత్రమే విపర్యయమునకుపాలై ఒడ్డుకూలినట్లు పడుట
కాక, యితరులనుగూడఁ బడఁద్రోయుదురు. ఈవ్యవసితవిజృంభ
డఁగా, స్వపక్షమువారివలనిభయముచే శిథిలమయి యీమండ
పరస్పరహస్తావలంబము లేక దురుత్తరమయిన గొప్పగోతిలో పడి
చున్నట్టులున్నది. అందుచేతను విశదకాయచ్ఛాయములును, కట్టి
డ్గారులును అగు దీపోద్గమముల చేతనుబోలె కలిబలముల చేతను
జాపితములయి కనుకనే వ్యతివర్తమానములగుచు వర్ణాంతరమ
నిర్నిమిత్తముగానే ముఖభవమయిన వర్ణమును ద్వేషించుచున్న
మొదటినుండియు బాహుజబలావలంబనము విచ్ఛిన్నమే. ఊరుప
భవుల వ్యాపారమున్ను విదేశమందే ప్రవర్తమానమయి ఊర్ధ్వ
త్యాసత్తికొఱకుఁ గాదన్నసంగతి స్పష్టమే. బాహూరుపాదభవ
లగుక్రమములకు విపర్యాసము కలిగినప్పటికిని ముఖభవక్రమ
క్కటి స్వరవర్ణశుద్ధముగ నున్నచో, ఈభారతి నిర్విఘ్నబ యయి సర
ములకొఱకు సమర్థ మగునని నమ్మకముగా నంద జెప్పఁగినదే.
బట్టి, ఇదిగదా విద్యలయొక్క సాహిత్య మనఁగా, అంగభూతము
గాని, అంగిభూతములుగాని యగువిద్యల పారమును జూచినపం
లుండనే యున్నారుగదా! ఒక్కొక్కరిసన్నిధికూడ ఈలోకముల
ఉద్ధారముకొఱకుఁ జాలును. అయినప్పటికిని పరస్పరము ఐకమత్య
నేతయొక ... ము, తేనెయొ

యు మేళనవలెనే, భగవతియగు గంగయొక్కయు,యమునయొక్కయు, సరస్వతియొక్కయు మేళనవలెనే తేజోభివృద్ధికొఱకును, రసముకొఱకును ఉపయోగపడును.

ఇంకను కొంచె మవధాన మిచ్చుటకై ప్రార్థించెదను. బ్రాహ్మణులసమయానుష్ఠానాదులు ఏవిధముచేతనుకూడ ఇతరుల కుద్వేగకారణములు కావనుసంగతి ఆబాలగోపాలము స్పష్టమేకదా! కాలత్రయానుభూతమయిన యీసార్వప్రత్యయమున్ను, ఆయీసమయానుష్ఠాదులున్ను శ్రుతిస్మృత్యనుశాసనముచేతను ఋషులచేతను నియమితము లేగాని రాజశాసననియమ్యములు గావు. ప్రజాసామాన్యోపయుక్తమయినహితధోరణికి అన్యోన్యోపఘాతము కలుగకుండ సంరక్షణమే వీనియందు రాజులకుఁ గలయధికారము.

ప్రస్తుతము, దుర్దైవవశమున అస్తర్జ్వరాయమాణులగుకొందఱు భేదోపాయమును ప్రయోగించుచున్నవారై, ఏదేని ఛలమునుకలిగించి బ్రాహ్మణులచేతను అనుష్ఠీయమానములగుచున్న సనాతనధర్మములు లోకబాధకములని చాటుచున్నవారై దానభేదములను ప్రయోగించుచున్నవారై తుదకు దండోపాయము చేతను స్వార్థమునుసాధింపఁదలఁచి రాజశాసనమూలమున వాటిని నిర్మూలింపఁ బ్రయత్నించుచున్నారు. పరలోకప్రధానమును, అనవద్యమును అగు బ్రాహ్మణధర్మము రాజాజ్ఞచేతను తప్పింపఁజేయఁబడు నెడల కేవలహైన్యమే సనాతనధర్మమునకు తటస్థించెడిని.

అస్పృశ్యతానిరాకరణము, ప్రౌఢావివాహము, జాత్యంతరప్రవిష్టునకు దాయభాగము మొదలగువానినిగూర్చి కొంచె మిచ్చట నిర్దేశింపఁబడుచున్నది. ఇదంతయు సభ్యులయిన మీరే యెఱుంగుదురు. ఇపుడుకూడిన యీ బ్రాహ్మణమహాసభాధివేశనమునకు ప్లాయమాన యగు శాస్త్రపద్ధతియొక్క తత్త్వమును ప్రకటించి తేజస్సంధుక్షణము చేయు టొక్కటేఫలము గాదు. మరేమన? ఛద్మలచేతను ప్రక్షిప్తమయిన పంకము కడిగివేయుటకూడ నవసరమే.

"యదా యదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత!
అభ్యుత్థాన మధర్మస్య తదాఽఽత్మానం సృజామ్యహమ్."

అనికదా భగవంతుఁ డన్నాఁడు. ఇచ్చట తృతీయపాదార్థమునం భగవంతునిహృదయ మన్నసంగతి, తన్నివారణోపాయము ఆయనచేత సృజింపఁబడిన మీారే యెఱుఁగుదురు.

ఆయీప్రణాళికను సూక్ష్మేక్షికచేతను ఆలోచించినవారై స దృష్టికము, ఔదర్కికము అగుకల్యాణమును అన్యోన్యసమవేతులగు మీారు సాధింతురుగాక యని విశ్వాసముగలవారమై గీతాచార్య డయిన—ఆపరమపురుషుని చరణారవిందములయందే సప్రణిపాతము ప్రార్థించుచున్నాము.

"దివ్యాం గిరంచ సరితంచ సమాశ్రితానాం
నిర్ణిక్తపూతమభిమూర్ఛతు తద్ధి తేజః,
ఆభూతకల్ప మనపాయిని భారతేఽస్మి
న్నన్యోన్య వైరజననీ శమ మేత్వసూయా".

చ. అమరుల వాక్కు నేటిని నిరంతరముం భజియించువారి కు
త్తమముఁ బవిత్రమై తగునుదారపుఁదేజ మెసంగుఁగాత; భూ
తములు లయించుదాఁకఁ జెడుదారినిబట్టనికర్మభూమి ద్వే
షమునకుఁ గారణం బయి యొసంగునసూయ శమించుఁగావుతన్.

సమాప్తము.

---

శ్రీవిశ్వేశ్వర శ్శరణమ్.

అఖిల భారతవర్షీయ బ్రాహ్మణ మహాసంమేళనమున విచారసభ

# మధ్యస్థుల నిర్ణయము.

వివాహ్యబాలికా వయోనిర్ణయ రూపమగు మొదటివిషయము

౧. ఎనిమిదిసంవత్సరములకు ముందే ఉత్కృష్టుఁడయిన వరుఁ లభించినయెడల వివాహము శాస్త్రప్రతిషిద్ధము గాదు కాని సమా హితము నాలోచించి ఆయాసమాజమునకు చేరినవారలు తత్సమ ములవిషయమున—ఎనిమిదేండ్లకులోపల పెండ్లిచేయఁగూడదు—

నియమించుకొనిన పక్షమున శాస్త్రవిరోధము లేదు గనుకను అంగీక రింపవచ్చు నని మహాసంమేళన విచారసభలో అందఱును అంగీకరించిన ప్రస్తావమును మేమును అంగీకరించితిమి.

౨. "వివాహో హ్యష్టవర్షాయాః కన్యాయాశ్చ ప్రశస్యతే, సర్వేషామేవ దానానా మేకజన్మానుగంఫలమ్, హాటకగృహగారీణాం సప్తజన్మానుగం ఫలమ్. అష్టవర్షా భవేద్గౌరీ" ఇత్యాదులయిన ప్రమాణముల ననుసరించి యెనిమిదవయేఁట కన్యాదానమునకు విశిష్టఫలము విధింపఁబడినందునను, స్త్రీలకు వివాహము ఉపనయనస్థానీయముగనుకను, ఉపనయనమువిషయమున బ్రాహ్మణుల కెనిమిదవయేఁడే ముఖ్యకాల మని స్మృతులు చెప్పుచున్నవి గనుకను, బ్రాహ్మణకన్యకలకు పదేండ్లకుముందు పెండ్లిచేయఁగూడదన్ననియమము—"అత ఊర్ధ్వం రజస్వలా—" అన్న వచనముచేతను సర్వవర్ణములయందును పదేండ్లు దాఁటినపైని వివాహమునకు ముఖ్యకాలము గాదని నిషేధమున్నది గనుక—మా కిష్టము లేదు. క్షత్రియాదులకు పదేండ్లకుముందుపనయనకాలము లేదుగనుక సమాజహితము నాలోచించి తత్సమాజముచేతను చేయఁబడుచున్న నియమనము విరుద్ధము గాదని మే మభిప్రాయపడుచున్నాము. శూద్రులవిషయమునఁగూడ నిదియే వ్యవస్థ.

3. ఉత్తరావధివిషయమున ఎక్కడను "ద్వాదశే వృషలీ స్మృతా" అను వచనముచేతను పండ్రెండవయేఁటనే వృషలీత్వబోధ గలిగినను, రజోదర్శనమే వృషలీత్వమును గలిగించును గనుకను, పదేండ్లు దాఁటినతరువాతను రజస్వల కాకముందు ముఖ్యకాలము, నతిక్రమించినందులకు విధింపఁబడిన ప్రాయశ్చిత్తము జరిగించి, ఆపత్సమయమున పెండ్లిచేయవచ్చును.

౪. రజస్వల అయినతరువాతనుగూడ పెండ్లికాని బ్రాహ్మణకన్యకలకు ప్రాయశ్చిత్తము జరిగించినను సంఘములోఁ జేర్చుకొనరాదని శ్రీ రాజేశ్వరశాస్త్రిప్రభృతుల మతము. అందు మూఁడేండ్లలోఁగా ప్రాయశ్చిత్తముజరుపఁబడినను, సంఘములోఁ జేర్చుకొనరా దన్నమతము శ్రీమల్లాది రామకృష్ణశాస్త్రిప్రభృతులది. మూఁడేండ్లలోఁగా తండ్రి పెండ్లిచేయఁదలఁచినను ఇష్టపడనిదానికి ప్రాయశ్చిత్తము జరిగినను వ్యవహార్యత లేదు; పితృదోషమున పెండ్లికానిదానికి పాపముమాత్రమే

కాని వృషలీత్వము లేదు; మూఁడేండ్లు దాఁటినతరువాతను గ
పెండ్లికానిదానికి తటస్థించిన వృషలీత్వము ప్రాయశ్చిత్తముచేతను
నుమతము రాజేశ్వరశాస్త్రి ప్రభృతులది. పితృదోషమున పెండ్లి
దానికి సాధారణమైనపాపము; సాహసించి పెండ్లియాడనిదానికి
లీత్వము కలిగినను ప్రాయశ్చిత్తము జరిగిన దానికి వ్యవహార్యత్వ
న్నది; పరిత్యాగము చేయవలయునన్నవిధి సర్వవిధముల వివా
మాడఁదలఁచకొనని కన్యకవిషయము— అని వంగదేశపువారన్నా
మహామహోపాధ్యాయ తాతా సుబ్బారాయశాస్త్రిలదియు, విం
శ్వరీప్రసాదశాస్త్రిలదియు నిదేమతము. ప్రాయశ్చిత్తము విషయ
గురు—లఘువ్యవస్థను సుబ్బారాయశాస్త్రిలంగీకరించినారు.
యులవిషయముననో వారికి స్వయంవర మంగీకరింపఁబడినందున
యశ్చిత్తము జరిగినంతనే రజస్వలయయినందునఁ గలిగిన వృషలీత్వ
పోవునుగనుక వ్యవహార్యత కలదని అందఱును అంగీకరించినారు.

పైని చూపఁబడిన పక్షములను లెస్సగా నాలోచించి మే
క్రిందివిధముననిర్ణయించుచున్నాము—ధర్మశాస్త్రములలో ఋతి
తీవివాహము సర్వవిధముల నిందింపఁబడినది. గొప్ప—ఆపద
చినవుడు ప్రాయశ్చిత్తవిధిపూర్వకముగ అటువంటిదానికిం గూడ
హ మంగీకరింపఁబడుచున్నది—అయినను, దీనినే నిమిత్తముగఁ
కొని ముఖ్యకల్పము నాచరింపఁదగినవారుగూడ నీపక్షము నవలం
రాదు. ఏమా? ఈపక్ష మత్యంతాపద్విషయము గనుకను, ఆపద
యమున అల్పత్వమహత్త్వముల నిర్ణయము నాయాసమాజము
చేయవలెను. సంఘములోఁ జేర్చుకొనువిషయమున ఆయాకులము
యాచారమే ప్రమాణము. ఋత్వనంతరము సర్వవిధముల సాహసి
పెండ్లి వలదని పట్టుపట్టినకన్యను సంఘములో చేర్చుకొననేరాదు

౫. అవాంతరశాఖలయందు వివాహమువిషయమున వివా
మునకు కులపరీక్ష ముఖ్యముగనుకను, స్కాందపురాణాంతర్గతమం
సహ్యాద్రిఖండము మొదలగువానియందు అవాంతరజాతిరక్షణ
ముఖ్య మని ప్రతిపాదింపఁబడియున్నది గనుకను, సహ్యాద్రిఖం
అప్రామాణ్యమనువాదము యుక్తమయినది కాదుగనుకను, నాగ

* వివా: [illegible] అభిప్రాయమును చూడుడు. ప. సం.

డమున, ఎద్దువంటివాఁడయినను నాగరుఁడే గ్రహింపఁదగినవాఁడని వ్యవస్థాపన యున్నదిగనుకను, గత్యంతరాభావము సమాజానుమతమైన సన్నికృష్టసమానాచారశీలావాంతర శ్రేణీపరిగ్రహము కర్తవ్యమయి నప్పటికిని విప్రకృష్టశ్రేణ్యంతర పరిగ్రహము శాస్త్రమునకును, ఆచారమునకును అసంమతమే అని:—

4-11-28 ౮. శ్రీచండీదాస తర్కతీర్థుఁడు

౧. విధూపాఠశాస్త్రి, నవద్వీపవాసి

౨. డి. శ్రీనివాసాచార్యులు, ౫. దేవశిఖామణి రామానుజాచార్యులు,

౩. శ్రీ శశినాథ. ఝా. పూర్వోత్తరమీమాంసాభూషణుఁడు.

నాకు విచారణకొఱకు ఈయఁబడిన మొదటి అయిదుప్రశ్నలలోను మొదటిది నాల్గవదిగాక కడమవి నిర్ణయప్రకార మంగీకరింపఁబడినవి. మొదటిప్రశ్నమున, ఎనిమిదవయేఁడు మొదలుకొని ఋతుసంభావనకు ముందు కన్యావివాహము యుక్తము. నాల్గవప్రశ్నమున వృషలికి ప్రాయశ్చిత్తము జరిగినతర్వాత వ్యవహార్యత ఉండనేయున్నది.

ద. పం. నందకిశోరుడు.

→ పదుమూఁడవప్రశ్నమువిషయమున మధ్యస్థుల అభిప్రాయము. ←

౧. ఆనందాశ్రమముద్రితమైన దేవలస్మృతి సంపూర్ణమా, త్రుటితమా అని సందేహము గలుగుచున్నది. గనుకను, శూలపాణి నిబంధ వ్యవస్థచేతను ప్రామాణ్య మంగీకరింపఁబడుచున్నది.

→ పదునాల్గవ ప్రశ్నము విషయమున మధ్యస్థుల అభిప్రాయము. ←

౨. నలుఁవదియొనిమిఁది పర్యాయములు, అకామమువలన, ఏకపాత్రభోజనాది రూపమయిన గురుతరసంసర్గము తటస్థించినయెడల, ప్రాయశ్చిత్తము జరిగినను వ్యవహార్యతలేదు. ఇష్టపడి పయినిచెప్పఁబడిన విషయమున ఇరువదినాలుగు పర్యాయముల అభ్యాసమునందు, వ్యవహార్యతలేదు. ఏకపంక్తిలోఁ గూర్చుండినవారిలో భోజనాదిరూపమయిన లఘుభోజన సంసర్గమువలన అకామమువలన సంవత్సరమువఱకును, కామమువలన పదునెనిమిది నెలలవఱకును వ్యవహార్యతలేదని భోజనాదివిషయమున వ్యవస్థ. తత్స్త్రీగమనమునందు అకామమువలన రెండుపర్యాయము లభ్యాసముచేతను, కామమువలన ఒక్కసారిచేయఁబడినను అవ్యవహార్యత. బలాత్కారితమయిన మ్లేచ్ఛదాస్యాది స్థలము

నను శూలపాణ్యుద్ధృతములైన దేవలవచనములవ్యవస్థ స్మార్తభట్టా ర్యులచేతను అనుపనీతుఁడై యెనిమిదియేండ్లవయసుదాఁటని పఠ గల బాలునివిషయముగా చేయఁబడినది. అందును నాలుగుసంవ ములుదాఁటిన తర్వాతను మ్లేచ్ఛసంసర్గము కలిగినయెడల పూర్తి యిన అవ్యవహార్యతయే. ఇదియును "తత్త్రీస్త్రీణాంచతథాసంగః" చోట సంగపదముచేతను సంలాపాదిలఘుసంసర్గమే వివక్షింప నది యనియంగీకరింపఁబడినది. తత్త్రీస్త్రీగమనము విషయమున "స న్యాంగతా దుష్టైః స్సంసర్గశ్శోధితైరపి" అన్నకలివర్జ్యప్రకరణము సరించి అంతకుఁ బూర్వముకూడ అవ్యవహార్యతయే. అట్లుకాక " వత్సరేణపతతి" అనుదాని ననుసరించి బలాత్కారితస్థలమున మ ఖాది నిబంధకార సంమత అకామకృతప్రాయశ్చిత్త యోజనచేతను వత్సరము వఱకును, బలాత్కారముగా మ్లేచ్ఛదాస్యము చేయింప నపుడు పండ్రెండుసంవత్సరములు ప్రాయశ్చిత్తము, పూర్ణమయిన హార్యత. రెండుసంవత్సరము లతిక్రమించినయెడల ఇరువదినాలు సంవత్సరములు ప్రాయశ్చిత్తము, "అథపతితా స్సమవసాయ ధర్మా రేయుః" ఇత్యాదిబౌధాయన సూత్రమునకు నందపండితాదులచే చెప్పఁబడిన వ్యవస్థననుసరించి పృథక్సంస్థచేతను స్వధర్మానుష్ఠానాధి రమున్న నాలుగుసంవత్సరములు దాఁటినయెడల "సంవత్సరైశ్శ ర్భిశ్చ తద్భావం సోఽధిగచ్ఛతి, ప్రాసోనవిద్యతే తస్య ప్రాయశ్చి ర్దురాత్మనః" అను దేవలవచనము ననుసరించి ప్రాయశ్చిత్తము లేదు, వ్యవహార్యత లేదు, పృథక్సంస్థచేతనుగూడ స్వధర్మాధి తయు లేదు. భాగవతాది ధర్మానుష్ఠానము మాత్రమంగీకరిం బడుచుఁనేయున్నది. "చతుర్థే నాస్తి నిష్కృతిః" అన్నవచన మీవ్య స్థయందుపోద్బలకము. ఇరువదినాలుగు సంవత్సరములు మ్లేచ్ఛసం ము కలిగినతరువాతను చాంద్రాయణద్వయము ప్రాయశ్చిత్తము చెప్పఁబడినది. "మ్లేచ్ఛైస్సహోషితః" అను ఉపక్రమమువలన కేవ హావాసపరము. స్త్రీలవిషయమున దేవలునిచేతను గర్భము గలిగిన నంతరముకూడ వ్యవహార్యత్వము ఏదిచెప్పఁబడినదో అది బలాత్ కృతలయిన స్త్రీలనే ఉపక్రమించి హేమాద్ర్యుద్ధృత మార్కండే

వచనమునందు గర్భముకలిగినయెడల స్త్రీలను పరిత్యజించుట చెప్పఁబడినందున వైకల్పికము. వికల్పమునందును "బలాత్కారిత దుష్టస్త్రీ సంగ్రహో విధినోదితః" అని కలివర్జ్యప్రకరణమున పఠింపఁబడినందున గర్భముగలిగిన తరువాతనుగూడ స్త్రీలకు దేవలోక్తమయిన వ్యవహార్యత కలిభిన్న విషయమునందే అని సిద్ధాంతము.

→ పదునేనవ ప్రశ్నమువిషయమున మధ్యస్థుల-అభిప్రాయము. ←

౩. వైరూప్యమే.

హరిశంకరాత్మజుఁడు హాధీభాయిశాస్త్రి; మహామహోపాధ్యాయ శ్రీదుర్గాచరణసాంఖ్య వేదాంతతీర్థుఁడు; మహామహోపాధ్యాయ మైథిలమార్కండేయమిశ్ర;శుద్ధాద్వైతభూషణ భట్టరమానాథ దేవర్షి; ధారవాడ నాగేశశాస్త్రి—తర్కవిద్వాన్, విద్యాలంకారుఁడు.

క్రిందను నిర్దిష్టములయిన విషయముల విమర్శమున సాధకబాధకములయిన వచనములును, యుక్తులును, సావధానముగా ఆలోచింపఁబడినవి. అనుకూలప్రతికూల వక్తల—అభిప్రాయముగూడ లెస్సగా నిశ్చయింపఁబడినది. అటుతర్వాతను అందఱి ఐకమత్యముచేతను ఏదిసిద్ధాంతీకరింపఁ బడినదో అది క్రిందను జేర్చి, తర్వాతను స్వసంమతివిషయమున పేర్లు నిర్దిష్టము లైనవి.

స్మృతిరత్న శ్రీకాశీకిశోరదేవశర్మ, బాలశాస్త్రి హరిశాస్త్రి భట్టు. స్మృతిరత్నశ్రీఆశుతోష దేవశర్మ,రడ్డీరంగాచార్యబాలకృష్ణాచార్యులు; శ్రీకమలకృష్ణస్మృతితీర్థుఁడు,మల్లాదిరామకృష్ణశాస్త్రి—మహాగ్నిచిత్తు.

చండాల విషయకమయిన విచారణయందుమాత్రము, వారస్పృశ్యులనియు, దేవాలయాదులయందు ప్రవేశింపఁదగరనియు స్మృతివచనముల చేతను నిశ్చయింపఁబడుచున్నది మఱియు, వారు మ్లేచ్ఛయవనాదులకంటెను నికృష్టులని ప్రమాణము లుండుటచేతనే మే మంగీకరింప లేదు. ఈవిషయమున సంమతము.

౧. బాలశాస్త్రి హరిశాస్త్రి భట్ట ఇందురకర

౨. ఈవిషయమున దర్భాంగయందలి శ్రీమద్రమేశ్వరలతావిద్యాలయమునం దధ్యాపకుఁడయిన శ్రీముక్తినాథ మిశ్రసంమతి.

౩. రడ్డీ రంగాచార్యుఁడు, స్మృతిరత్న శ్రీఆశుతోష దేవశర్మ,

౪. భట్టపల్లినివాసి శ్రీకమలకృష్ణస్మృతితీర్థుఁడు.

చండాలురకు గ్రామమధ్యమున నివాసము, దేవాలయప్రవేశము స్పర్శము శాస్త్రముచేతను నిషేధింపఁబడుచున్నది. ఆలోచింపఁగా చ్చ్ గుణమువలనను, ధర్మమువలనను చండాలురకంటెను నికృష్టు అయినను వ్యాకరణమహాభాష్యమునందు అనిరవసిత శూద్రులయం పరిగణింపఁబడుటవలన ఆగమములయందు చండాలురకంటెను దేవా యప్రాకారములయందు సన్నికృష్టకక్ష్యవఱకును ప్రవేశింపనచ్చు అంగీకరింపఁబడుటవలనను, చండాలురకంటెను వారికి కొంచెము తమ్యమున్నదని నాయభిప్రాయము.

మల్లాది రామకృష్ణశాస్త్రీ, మహాగ్నిచిత్తు,
అమరావతి—గుంటూరుజిల్లా, మద్రా

ఇప్పటియవనులలో ఎవరు చండాలాదులయందుఁ బుట్టినవా ఎవరు శుద్ధయవనులో తెలిసికొన వీలులేదు. ఒకవేళ వారిసంకర తెలిసినపక్షమున పూర్వజాతికిఁ దగిన వ్యవస్థయే అంగీకరింపఁదగు

పండితప్రవరుఁడు, మల్లాది రామకృష్ణశాస్త్రి,
అమరావతి, గుంటూరుజిల్ల

౧. గాయత్రీభ్రష్టులకు చతుర్థపురుషునివఱకే వ్రాత్యస్తోమ చేతను శుద్ధి, అగ్రపురుషులకు లేదు.

౧. విధవావివాహము సర్వవిధముల ధర్మశాస్త్రవిరుద్ధము.

౧. మ్లేచ్ఛచండాలాదులకు నూతియందును, అల్పజలాశయము యందును జల [illegible] హణాదులవిషయమున అధికారము లేదు.

౧. శ్రుతిస్మృతుల ననుసరించు వారెవ్వరును స్వయముగా పరివర్తనము చేయుటకుఁ దగరు.

బాలశాస్త్రి హరిశాస్త్రి భట్టు ఇందురకర,
రడ్డీ. రంగాచార్యుఁడు
ఇందు శ్రీముక్తినాథ మిశ్రునిసమ్మతి.
మల్లాది రామకృష్ణశాస్త్రి, మహాగ్నిచిత్తు, అమరావతీ.
గుంటూరుజిల్లా, మద్రా

౧౦. పదియవప్రశ్నము, భాగవతధర్మదీక్ష జాత్యుత్కర్ష కలిగించునది [illegible]

దీనికి సమాధానము:—భాగవతధర్మదీక్షచేతను జాత్యుత్కర్షము కలుగదు—భావోత్కర్షముకల్గును.

౧౧ వ ప్రశ్న:— యవనాదిజాతి కర్మకృతమా లేక జన్మసిద్ధమా?

దీనికి సమాధానము—యవనాదిజాతి జన్మసిద్ధమే.

౧౨. భాగవతధర్మదీక్షయందు జాతివిశేషము ప్రతిబంధకమా కాదా?

దీనికి సమాధానము—ఒకానొకచో దీక్షయందు జాతిప్రతిబంధకము, ఒకానొకచోఁ గాదు.

మంత్రమహోదధి యిరువదినాల్గవతరంగమున—"త్ర్యర్ణ మేకాక్షరోఽనుష్టుప్ త్రివిధో నరకేసరీ" ఇత్యాదికముచేతను కొన్నిమంత్రములను పరిగణించి "వర్ణత్రయాయ దాతవ్యా ఏతే శూద్రాయ నో బుధైః" ఇత్యాదికముచేతను తత్తద్వర్ణవిశేషమందు అధికారానధికారములు ప్రదర్శించి "ఛిన్నమస్తాచ మాతంగీ త్రిపురా కాళికా శివః, లఘుశ్యామా కాళరాత్రి ర్గోపాలో జానకీపతిః, ఉగ్రతారా భైరవశ్చ దేయా వర్ణచతుష్టయే, మృగీదృశాం విశేషేణ మంత్రా ఏతే సుసిద్ధిదాః, బ్రాహ్మణాః క్షత్రియా వైశ్యా శ్శూద్రా నార్యోఽధికారిణః" అని స్త్రీశూద్రులకుగూడ కొన్నిమంత్రములయందధికారము చూపఁబడినది.

స్త్రీలకును,శూద్రులకును శివ—రామ మంత్రములవిషయమున విశేషము—సూతసంహితయందు "నమోఽన్తేన శివేనైవ స్త్రీణాం పూజా విధీయతే, విరక్తానాంచ శూద్రాణామేవం పూజా ప్రకీర్తితా" అని మాధవీయమయినదాని వ్యాఖ్యానమున—వసిష్ఠుఁడు "బ్రహ్మచారీ గృహస్థశ్చ వానప్రస్థశ్చ భిక్షుకః, సదోం నమశ్శివాయేతి శివమంత్రం సమాశ్రయేత్, పంచాక్షర స్సప్రణవో ద్విజరాజ్ఞో ర్విధీయతే, విట్ఛూద్ర జన్మనాంవాపి స్త్రీణాం నిర్బీజ ఏవహి, సబీజస్స్వరసామ్యో విప్రక్షత్రియయోర్ద్వయోః, నేత రేషామితీశాన స్స్వయమేవాహ శంకరః, దుష్కృతోఽప్యతిహీనోవా పతితోఽథాన్త్యజోఽపివా, జపేత్పంచాక్షరీంవిద్యాం జపేనైవాప్నుయాచ్ఛివమ్" ఇత్యాదులైనవచనములు. రామమంత్రవిషయమునమాత్రము శూద్రకమలాకరమున—అగస్త్యసంహితయందు "శ్రుతిర్బ్రహ్మేహ షడ్వర్ణం స్మృతిర్వర్ణద్వయాత్మకమ్, షడ్వర్ణం బ్రాహ్మణాదీనాం త్రయాణాం యద్ద్వివర్ణకమ్, తదన్యేషాం దేశికేన వక్తవ్యం తారకం పరమ్, శుచివ్రత

తమాశ్శూద్రా ధార్మికా ద్విజసేవకాః, స్త్రియః పతివ్రతాశ్చాన్యే ప్రతి
లోమానులోమజాః, లోకాశ్చండాలపర్యంతం సర్వేప్యత్రాధికారిణః
అత్ర రామేతిమంత్రే" ఇత్యాది గ్రంథపర్యాలోచనచేతను శూద్రా
దులకు ప్రణవరహితములయిన నారాయణాష్టాక్షరాదులగు కొన్నిమంత్ర
త్రములందుమాత్రమే అధికారమున్నది.

౧. విరూపాక్షశాస్త్రి. ౩. దర్శనాలంకార-దేవకీనందనశాస్త్రి.
౨. తాతా సుబ్బారాయశాస్త్రి. ౪. తర్కతీర్థ-శ్రీనీలాంబర ఝూ.

---

అఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహాసంమేళనమునందుకూడిన

# ధర్మాచార్యులయందఱి నిర్ణయములు.

అఖిలభారత వర్షీయబ్రాహ్మణ మహాసంమేళన విచారసభ నిర్వి
ఘ్నముగా జరిగినందులకు మామనస్సు మిక్కిలి యెక్కువగా సంతో
షించినది. ఆయాశాస్త్రములయందుఁ గృతార్థులయిన విద్వాంసు
యిటువంటి యేకత్ర సమాగమము దుర్లభము. ప్రాచీనమర్యాద నా
యించి చేయఁబడుచున్న ధార్మికచర్చయు,అందును విశేషముగా శాస్త్రా
ర్థముచేతను ఈకాలమునదుర్లభమే. సర్వవిధముల భగవంతుఁడైన
మేశ్వరునిదయచేత విచారసభ సానందముగ నిర్వర్తింపఁబడినది అం
లోనుఇందఱుధర్మపీఠగురువుల యేకత్రావస్థానము శ్లాఘనీయముగదా
ఇది మఱింతమహానందమును మాకు గలిగించుచున్నది ఈప్రసంగమ
తయుఁ గ్రొత్తదియే యనిమేము తలంచుచున్నాము. ఇటుపయినిజరి
పఁబడు మహాసమ్మేళన పరిషత్తునుగూడ అందఱును సంతోషపూర్వ
ముగా నిర్వహింతురనియును. యథార్థమయిన ధర్మతత్త్వమును ప్ర
టింతురనియును, అందువలన నందఱికిని నిరవధికమయిన శ్రేయస్సు
కలుఁగుఁగావుత మనియును ఆశీర్వాదముల చేతనభినందించుచు మా
ర్ణయ మీక్రిందను పొందుపఱుచుచున్నాము.

# నిర్ణయములు.

౧. శ్రీ [illegible] గర్భమునుండి యెని
దవ యేఁడు ముఖ్యకాలము. తొమ్మిదవ పదియవసంవత్సరములు మ

ప్రయములు. అటుపయిని రజస్వల యగువఱకును గౌణకాలము. రజస్వలా నంతరమున మాత్రము సర్వవిధముల నింద్యము.

౨. ఎనిమిదవయేఁడు మొదలుకొని రజస్వలయగువఱకును పరిస్థితుల ననుసరించికూడ వివాహనిషేధ నియమనము సర్వవిధముల అయోగ్యము.

४. వృషలీత్వమును బోధించువచనములకు ధర్మకార్యానర్హతయందు తాత్పర్యము.

౫. అవాంతర శ్రేణులయందు పరస్పరమువివాహమునింద్యము.

౬. మన్వాదులు ధర్మజ్ఞులు. వారుసయితము స్వతంత్రించి యేవిధమయిన ధర్మపరివర్తనమున్ను చేయుటకు సమర్థులుగారు.

౭. త్రైవర్ణిక విధవావివాహము, దంపతుల వివాహ బంధవిచ్ఛేదము సర్వవిధముల నిషిద్ధము.

౮. మ్లేచ్ఛచండాదుల కస్పృశ్యతజాతినిబట్టి, తద్భావాపన్నులకుఁ గర్మమును బట్టి.

౯. ధార్మికదృష్టిచేత నిప్పటిమ్లేచ్ఛులకును,చండాలురకునుఅస్పృశ్యతయు, దేవాలయసభాది ప్రవేశానర్హతయు, తద్భాండసంస్పృష్టకూపోదక గ్రహణాయోగ్యతయు సర్వవిధముల శాస్త్రముచేత ననుశాసింపఁబడుచున్నది. అది రక్షించియే తీరవలయును.

౧౦. మంత్రగ్రహణాది రూపమయిన భాగవత ధర్మదీక్ష యీ జన్మమున ఉత్కృష్టజాతిని కలిగించునదికాదు.

౧౧. యవనాది జాతి జన్మసిద్ధమే.

౧౨. ప్రణవరహితములైన కొన్ని నామమంత్రములయందు జాతివిశేషము ప్రతిబంధకముగాదు (ధర్మాచార్యులంద ఱంగీకరించిరి) విశిష్టవిధి విషయములయిన (కొన్ని) మంత్రములనువిడిచి తక్కినచోట్ల ప్రతిబంధకమే. (అని తెంగల సంప్రదాయులగు శ్రీవైష్ణవధర్మాచార్యులు)

౧౩. శూలపాణి యాదరించిన వ్యవస్థ ననుసరించి దేవలస్మృతి ప్రామాణ్యమున బాధకమేమిన్ని లేదు.

౧४. బలాత్కారమున దాసుఁడుగాఁజేయఁబడినవానికి మ్లేచ్ఛాదిసంసర్గము గలిగినపుడు మూఁడేండ్లవఱకును మన్వాదులచేఁ జెప్పఁ

బడిన వ్యవస్థకు విరోధము లేకుండ ప్రాయశ్చిత్తము చేతను శుద్ధి
నిబంధకారావిరుద్ధము. ఇష్టపడి మ్లేచ్ఛస్త్రీగమన మొక్కసారిచే
పాతిత్యమే. ఏకపాత్రభోజనరూపమయిన గురుతర సంసర్గము
మొదల ఇష్టపడిచేసినచో ఇరువదినాలుగు పర్యాయము లభ్యస్త
నను పాతిత్యమే. ఏకపంక్త్యుపవిష్టభోజనాదికము మాత్రము
చేసినచో సంవత్సరముచేతను పతితుఁడగుచున్నాఁడు.

౧౫. పూర్వోక్త స్థలములయందు నిర్దిష్టములయిన ఆయా
ధులఁదాఁటినపైని మాత్రము ప్రాయశ్చిత్తము జరిపినను అవ్యవ
తయే అట్లే విదేశముల (విలాయతి) నుండి తిరిగి వచ్చినవారి
మందున్న అవ్యవహార్యతయే.

౧౬. వ్రాత్యసంస్కారము త్రిపురుషపర్యంతము ప్రశస్తము
౧౭. చాతుర్వర్ణ్యము జన్మసిద్ధమేకాని, తజ్జన్మీయకర్మకృతము

బ్రాహ్మణమహాసభయొక్క వైదికవిభాగమునకు సంబంధించి
శాస్త్రీయప్రశ్న నిర్ణయాదికము. సమాప్తమైనది.

---

# అ. భా. బ్రాహ్మణమహాసభ. లౌకికవిభాగము

1928 సం॥ నవంబరు 7-వ తేదీని శ్రీకాశీక్షేత్రమున జరుపఁబడి
అఖిలభారతవర్షీయ బ్రాహ్మణ మహాసంమేళనాగ్రాసనాధిపతియ

భారతధర్మదివాకర, మహారాజాధిరాజశ్రీ

## దర్భాంగామహారాజులవారి సంభాషణము

శ్లో. తమీశ్వరాణాం పరమం మహేశ్వరం
తం దేవతానాం పరమంచ దైవతమ్,
పతిం పతీనాం పరమం పరస్తా
ద్విదామ దేవం భువనేశ మీడ్యమ్.

ఈభరతఖండమున ధర్మస్వరూపులును, గౌరవస్వరూపులును
ధర్మాచార్యవర్యులారా! పండితప్రకాండులారా! సభ్య మహా
లారా! నేఁడు మహానుభావులయిన తమయందఱి సమావేశము

ఈయఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహాసంమేళన మెట్టి యుజ్జ్వలరూపమునఁ బ్రకాశించుచున్నదో; ఎట్టియపూర్వశోభనునలువయిపులను వికసింపఁజేసి మనయందఱి హృదయములను సానందముగఁ జేయుచున్నదో; ఎటువంటి నిరుపమానమయిన దృశ్యమును మన కన్నులయెదుటను ప్రకటించుచున్నదో; ఆయావిషయముల నన్నింటిని చూచుచున్న మా-అంతరాత్మ యీసమయమున ప్రసన్నమయి, హర్షముతో నిండారి తరంగితమయి ధర్మోత్సాహము సముద్రమువలెనే తనతరంగములతో నీసభామండపమును ధర్మానందములో ముంచుచు దేశమునంతటను ఈ యానందప్రవాహమును వ్యాపింపఁజేయుచు భారతభూమినంతనుధర్మరూపమయిన వర్షముచేతను సర్వసస్యాఢ్యనుగఁజేయుచున్నది. కనుక, ఈయానందమును, ఉత్సాహమును మాటలచేతను ప్రకటనచేయుటకుఁ దగినశక్తి మాయందు లేదు.

౧. శ్రీవిశ్వనాథ భగవానునియాస్థానమున సంమేళనశోభ.

మహానుభావులయిన ధర్మాచార్యులును, దిగ్గజములవంటి పండితులును, వేదమూర్తులయిన బ్రాహ్మణమహాశయులును, సమస్తసజ్జనులును పండితులునుఅగు తమయందఱును దూరదూరప్రదేశములనుండి దయచేయుటవలనను, ఈమహాసభ—ధర్మరూపమయిన—ఆకాశమండలమున తారాగణసహితముగ అనేకులు పూర్ణచంద్రులుదయించి తమ సుధావర్షముచేతను,అమృతరూపములయిన కిరణములచేతను దిగ్దిగంతరములకు ధర్మజీవనమును కలుగఁజేయుచుఁ బరిపూర్ణముగ వ్యాపించియున్నదా? అన్నట్టు విరాజిల్లుచున్నది. ఎవ్వరి నిస్సీమోత్సాహపరిశ్రమల చేత నీమహాసంమేళనమేర్పడి సఫలమైనదో అట్టిధార్మికమహాశయులందఱికును ముందుగా ఆనందపారవశ్యమును పొందినడెందముతో వందనపూర్వకముగ ధన్యవాదముల నందించుచున్నాము.పరమపవిత్రమైనయీ కాశీక్షేత్రమున,అన్నపూర్ణావిశ్వనాథుల పవిత్రాస్థానములో నీమహాసభ కూడుటమఱెంత గౌరవప్రదమును, శుభలక్షణమును. ఆపురాణదంపతుల—ఆశీర్వాద ప్రభావముచేతన ధర్మోత్సాహపూర్ణమైన మన యీ పరిశ్రమ సఫలమయి మన మంచికోరిక పరిపూర్ణమగుననియు మేమూహించుచున్నాము.

## ౨. మా ధన్యవాదము—తమకర్తవ్యము.

సజ్జనమహాశయులాలా! పవిత్రమయిన యిటువంటి ప్ర[illegible] మహానుభావు లయిన తమరందఱును మమ్ముల నీయఖిలభారతవ[illegible] బ్రాహ్మణమహాసంమేళనమున కధ్యక్షులనుగాఁ జేసినందులకై, యందఱికిని సముచితరీతిని ధన్యవాదములు చేయుటకుఁ దగినశబ్ద[illegible] చము మాయొద్దను లేదు. తమరు మమ్ముల నీయధ్యక్షపదమునక[illegible] భిషేకముచేసి మమ్ములను గౌరవించుట తమనిర్హేతుక మయిన [illegible] గ్రహమేకాని మాయోగ్యత కాదు. పరమగౌరవాన్వితమయిన [illegible] దము తాలూకుభారమును వహించుటకుఁ దగినయోగ్యతగాని, [illegible] ర్థ్యముగాని మాయందు లేకపోయినను మే మీపదవిని స్వీక[illegible] టకు—ధార్మికమహానుభావులయిన తమయందఱియొక్క యి[illegible] వంటిధార్మికసేవవిషయమున తమయాజ్ఞను పాలించుట యందఱ[illegible] కర్తవ్య మగుట యొకటియు, రెండవది, ఎప్పుడయితే తమరంద[illegible] మమ్ముల నీసభ కధ్యక్షునిగాఁ జేసినారో అప్పుడు మే మీపదవితా[illegible] బాధ్యతను తగురీతిని నిర్వహింపఁగలుగునట్లు తమ రాశీర్వా[illegible] ద్వారా మాకు బలమును గలిగింతు రని మాకు విశ్వాస ము[illegible] యునే కారణము. ఏమందురా? తమయందఱిసాహాయ్యబలము తో[illegible] మే మీగొప్పకార్యమును, నెఱవేర్చుటలోఁ గృతార్థులము కా[illegible] ము. ఏదేని యొకమహాసేనకు నాయకుఁ డైనవాఁ డెట్టియోగ్య[illegible] చతురుఁడును, యుద్ధకుశలుఁడును అయినప్పటికిని, ఎంతవఱకు స[illegible] సేనలోని వీరులగుభటులును, రథికమహాశయులును అతనిసాహాయ్య[illegible] విషయమున పూర్ణోత్సాహమును చూపి యుద్యతులు కారో [illegible] వఱకును సేనానాయకుఁడు విజయమును పొందఁజాలఁడుగదా! [illegible] ప్రకారముగా ప్రస్తుతమయిన యీధర్మయుద్ధక్షేత్రములో మ[illegible] దిగియున్నాము. ఇందులో మనకుఁ గొన్నిరకముల విపక్షులతో [illegible] ము జేయవలసియున్నది. వారు మన ధార్మిక, సామాజిక, రాజకీ[illegible] వర్ణాశ్రమసంస్కారరూపము లయిన దుర్గములపైని ఘోరమయి[illegible] ఆక్రమణములను చేయుచున్నారు. పలుతెఱఁగులుగా కూటనీతిని బలమునుఆశ్రయించి మనయీదుర్గములపైని శస్త్రాస్త్రములను ప్ర[illegible] గించుచున్నారు. వారి యీశస్త్రాస్త్రములు విఫలము కాగానే

యుక్తమయిన—ఆందోళనము, విషవాయువుద్వారా మనసైన్య మునకు వ్యామోహము గలిగించుటకుఁ బ్రయత్నించుచున్నారు. ఇట్టి యవస్థలో మనసేనలోని యోధులందఱును లెస్సగా జాగరూకులయి పార్శ్వములను, పృష్ఠభాగమును, కేంద్రములను, సీమలను, పదిదిక్కు లను రక్షించుకొనుటలో తెలివిగలిగియుండి, వారు ప్రయోగించు విష వాయువు మనదుర్గములలోఁ బ్రవేశించుట కేవిధముగాను అవకాశము లేకుండఁ గాపాడుకొనుచుండుట మఱింత పరమావశ్యక మయియు న్నది. వాస్తవముగ నాలోచించినచో మన కెవ్వరిని ఆక్రమించవల యున్న దరిచ్ఛ లేదు. కాని విపక్షుల—ఆక్రమణములనుండి మనలను రక్షించుకొనుటయు, వారి నీయాక్రమణములో పరాజితులను జేయు టయు నావశ్యకమయి యున్నది. ఇందులకై మన మందఱమును నడు ముగట్టుకొని సిద్ధముగ నుండవలెను. మనసేనలోని వీరు లందఱును తమతమ—అస్త్రములను తీక్ష్ణముగా జేసి యుంచికొని పవిత్రకవచము లను ధరించి యీయుద్ధక్షేత్రములను అనాదికాలనిర్మితము లయిన మనధార్మిక, సామాజిక, రాజనైతికాది దుర్గములను రక్షించుటకై సప్రయత్నులై నడుములుగట్టికొని యుండినపక్షమున, తప్పక మనము మనపూర్వపురుషుల సముజ్జ్వలకీర్తిని సురక్షితముగాఁ గాపాడుటలోఁ గృతకృత్యులమయి వారియాశీర్వాదములను పొందఁజాలుదుము,

3. బ్రహ్మకుల భూషణులసన్నిధిలో మావిన్నపము

ఇది మనబ్రాహ్మణసహోదరుల మహాసమ్మేళనము. మాకును పవిత్రమయిన—యిటువంటి బ్రాహ్మణకులగౌరవము లభించినందున, విశేషించి బ్రాహ్మణసహోదరులసన్నిధిలోఁ గొంచెము నివేదించు టావశ్యకమయి యున్నది. సోదరసంబంధమున మేము తమసన్నిధిలో నివేదించుదానివిషయమున, తాము విచారపూర్వకముగ ధ్యానము నుంచెదరని మే మాశించుచున్నాము. రాజనైతిక, సామాజిక, ధార్మి కాదివిషయములలో మా కిదివఱలోఁ గలిగినయనుభవమును మహాను భావులయిన తమయందఱి సన్నిధిలోను స్పష్టముగఁ బ్రకటించెదము. అసాధారణమయిన ప్రస్తుతసమయమున మనధర్మాచార్యులకును, విద్వ ద్బ్రాహ్మణసంఘమునకును ఏది కర్తవ్యమో, ప్రస్తుతస్థితియు,మన మేప్ర కారముగా మనధార్మికసామాజిక సత్త్వములరక్షణకయి ఉద్యతులయి

యుండవలయునో, ఏప్రకారముగా విపక్షులప్రహారములను విఫలము జేసి మనప్రాచీనులగౌరవమును దృఢపఱుచుటలో కృతకృత్యుల మగు ఉచితమో ఆయీవిషయములనుగుఱించి తమసన్నిధిలో మావిచా మును స్పష్టముగఁ బ్రకటించెదము. అట్లు చేసినచో, ఏమార్గ మనకు సుగమమో, విజయమును పొందుటకు ఏదిసాధనమో, మ నాక్రమించుటకై గొప్పనేర్పుతో మనశత్రువులు రచించుచున్న చ వ్యూహము సూచీముఖము, మొదలగు సర్వవిధములయిన వ్యూహ లను మనమెట్లుభేదింపఁగలుగుదుమో అది తమకు విశదముకాఁగల

౮. బ్రాహ్మణజాతిపైని పరస్పరవిరుద్ధమయిన ఘోరాక్షేపణ.

ప్రియమహాశయులారా! ఏప్రకారముగాఁ బూర్వకాలము బ్రాహ్మణజాతి సర్వశ్రేష్ఠ మనియు, మాననీయ మనియును తలఁ బడుచుండెడిదో, సర్వవిషయములలోను అగ్రస్థానమును పొందియ డెడిదో, అదేప్రకారముగా ప్రస్తుతము మన యీ బ్రా హ్మ ణ జా స ర్వా ధి క ము ల యి న ఆక్షేపములకు లక్ష్యమగుచున్నది. సర్వా ధిక ప్రహారము లీజాతికే తగులుచున్నవి. సంఘసంస్కారరూపమయి కోలాహలముచేయు ప్రస్తుతసంఘసంస్కర్తలు తమ లేఖా—భాష రూపములయిన తీక్ష్ణబాణవర్షమును విశేషించి బ్రాహ్మణపండితము లిపైననే వర్షించుచు, వారిపైని కఠోరాఘాతములు కలిగించుచు— దేశోన్నతి,సమాజోన్నతి, రాజనైతికోన్నతియునేకాక సర్వవిధములై యున్నతులకును బాధకు లీపండితులే యనియు, వీరే ఉన్నతిమా ములో కంటకస్వరూపు లనియు, వీరే దేశమును ఉన్నతిలోనికిఁ దెచ్చు టకు బదు లధోగతినైపున కీడ్చుచున్నారనియు,కంటకస్వరూపులయి యీబాధకులు మార్గములో నిదివఱలో నాటంకములు చేయకయు నిప్పుడు చేయుచుండుటయు లేకుండ వారియస్తిత్వము లోపించిపోవ నపక్షమున నీసంస్కర్తలు దేశము నమూలాంతముగా ఉన్నతిశిఖరము కీడ్చుకొని పోదు రనియు నిత్యాదివాక్యములు పలుకుచు సర్వావి ధములను బ్రాహ్మణపండితుల నెత్తిని బెట్టుచున్నారు. వారియాలో నలో ప్రాచీనుల—ఆచారముల ననుసరించుచున్నపండితులే ఉన్న శకటముపోవుదారిలో అడ్డుదగులుచు, దానిని బురదలోనికిఁ ద్ర ద్రొక్కుచు నడుపకుండఁ జేయుచున్నారని స్పష్టముగాఁ దెల్పుచున్న

ఒకవైపునుండి నూతనసభ్యతారంగరంజితులయిన మనదేశీయసంస్కర్తృసోదరు లీప్రకారముగా తీవ్రాక్షేపములు జేయుచుండఁగా, అవతల విదేశములో సర్ మైకల్ ఓడ్వయరుప్రభృతులగు తీవ్ర రాజనైతిక నాయకులు రెండవవయిపునుండి—"భారతదేశములో అల్లరి — ఉపద్రవములకు మూలము బ్రాహ్మణులే; వీరే బ్రిటిషురాజ్యమునువిధ్వంసముచేసి తమరాజ్యమును స్థాపింపఁగోరుచున్నారు. ఇంతవఱకును వీరి యదృష్టప్రభావము జనసామాన్యమునందు బయటివారి కగపడనంతదిగానున్నది. కాని, రహస్యమయిన తమ—ఆప్రబల ప్రభావముచేతనే మరల నెప్పటియట్లు తమ పూర్వాధికారములు వారికిఁ బ్రాప్తించుటకై యీయాంగ్లేయరాజ్యమును మూలోచ్ఛేదము చేయుటకుఁ బ్రయత్నించుచున్నారు" అని బ్రాహ్మణులపైననే దోషారోపణములను జేయుచున్నారు. భారతవర్షములో బ్రిటిషురాజ్యమునకు విరుద్ధముగా ఘోరమైన రాజనైతికాందోళనమునకు నాయకులు, శ్రీ లోకమాన్యతిలకు, సురేంద్రనాథబెనర్జీ, సుబ్రహ్మణ్యయ్యరు, పండితమోతీలాలు నెహ్రూ, పం, తేజబహదూరు సప్రూ మొదలగు వారందఱును బ్రాహ్మణులే యని వారెఱుఁగుదురు. కాఁబట్టి వారియాలోచనలో, మనదేశములోని మనసంస్కర్తృసోదరులు బొత్తిగా నెందులకును ఉపయోగింపనిదానినిగాఁ దలంచుచున్న మనయీబ్రాహ్మణజాతి విదేశములోని రాజకీయనాయకులదృష్టిలో మహాభయంకరముగాను, ఘోరమయినవిప్లవమును గలిగించువిషయమున మిక్కిలి గొప్పవేగముతో పనిచేయుచున్నదిగాను వారాలోచించుచున్నారు. ఇటువంటి విచిత్రపరిస్థితిలో రెండుతెగలవారికిని విచిత్రమును, పరస్పర విరుద్ధమును అగురంగులలో నగపడుచున్న యీబ్రాహ్మణజాతి కిపుడేమిచేయవలసియున్నదో అట్టిగంభీరవిషయమునుగుఱించి మన మాలోచింపవలసియున్నది.

### ౫. బ్రాహ్మణులుజేసిన సంస్కృతభాషారక్షణము, వారి స్వార్థత్యాగము.

బ్రాహ్మణజాతిపయిని ఎవ రెటువంటి కఠోరాఘాతములను ప్రయోగించినను ప్రయోగించుదురుగాక. కాని సంపూర్ణదేశహితైషిలును, భారతమాతకు సుపుత్రులును అగు వారిదృష్టిలో బ్రాహ్మణులే అపరిమితమయిన ధన్యవాదములకును, సాధువాదములకును, భాజన మగుచు

న్నారు. ఏమన? నిస్స్వార్థమయిన వారి పరిశ్రమవలనను, ఆత్మసమర్ప ణమునవలనను ఇంతవఱకును సంస్కృతభాష యీదేశములో జీవించి యున్నది. భారతీయజాతు లన్నియుఁ దమ ప్రాచీనమాతృభాషయగు సంస్కృతమునుండి పెడమొగముపెట్టి సాంసారిక సుఖములు ఐశ్వర్య ము మొదలగుప్రలోభనములవలన సంస్కృతభాషను సంపూర్ణముగా పరిత్యజించియుండఁగా నీబ్రాహ్మణులు నేటికినిఒక్కొక్కపూట దొరకి నంభోజనమే భుజించి శీతాతపాదులవలనిదుఃఖములకోర్చి పరిశ్రమచేయుచు మనమాతృభాష నభ్యసించుటలోనే తమ—ఆయువునంతను ముగించి చాల గొప్పస్వార్థత్యాగమున కుదాహరణమును చూపించుచున్నారు. మహాత్మగాంధి, లోకమాన్యతిలకు, దేశబంధుదాసు, అరవిందఘోషు, మోతీలాలు నెహ్రూ, ప్రభృతుల —అపూర్వస్వార్థత్యాగము కంటెను వీరిస్వార్థత్యాగ మేవిషయమునను తగ్గునది గాదు. ఏసంస్కృతభా షను బ్రాహ్మణులుగాక మిగిలినవర్ణము లన్నియు "డెడ్ లాంగ్వేజ్" అనఁగా, మృతభాషనుగా పిలుచుచున్నారో ఆభాషనే మన బ్రాహ్మణ విద్వాంసులును, వారి శిష్యులగు వేలకొలఁది బ్రాహ్మణకుమారులును ఇంతవఱకును జీవింపఁజేయుచున్నారు. స్త్రీఅనుకూలసమయము తటస్థించి నచో ముందును జీవింపఁజేయఁగలరు.

ప్రస్తుతపు—ఆంగ్లేయ విద్యాలయములలోఁ జదివినవిద్యార్థులు సుమారు పది పదునైదుసంవత్సరములుచదివి ఎమ్, ఏ, ఏల్, ఎల్, వకీలు, బారిష్టరు, డాక్టరు, ఇంజనీయర్, పోలీసు ఆఫీసరు, మున్సీఫ్, డిప్టీ జడ్జీ, సెషన్సు జడ్జీ, హైకోర్టు జడ్జీ, ఛీఫ్, జస్టిస్, ఎగ్జెక్యూటివ్ కౌన్సిల్, మొదలగు గొప్పపదవులలో ప్రవేశింప నర్హులగుచున్నసమయ మున, ఒక సంస్కృతవిద్వాంసుఁడు ౨౦-౨౫ సంవత్సరములవఱకును ఘోరపరిశ్రమచేసి సంస్కృతభాషాశాస్త్రముల నధ్యయనముచేసి "గ్రా డ్యుయేట్ల" కంటెనుగూడా హెచ్చుగా సంస్కృతజ్ఞానమును సంపా దించుకొని, సాధారణమయిన ఒకానొకచిన్నపదవిని పొందుటకైనను ఆశపడఁజాలకున్నాడు.

ఏబ్రాహ్మణకుమారులు ఈశాస్త్రాధ్యయనప్రవృత్తిని వదలికొని సాంసారిక లాభములకుపయోగించు వృత్తులలోఁ బ్రవేశించిరో వారు తమపూర్వపురుషుల తపోబలయుక్తమయిన శుద్ధవీర్యములయొక్క ప్రభా

వముువలన, ఇతరజాతులవారికంటె ముందునకు రాఁగలిగినారు. కలకత్తా, పంజాబు, బొంబాయి, మద్రాసు, అలహాబాదు, మొదలగు అన్ని హైకోర్టులలోను అందఱికంటెను మొదటిజడ్జీలు బ్రాహ్మణులే అయియుండిరి. ఇప్పటికిని చాలమంది బ్రాహ్మణులు జడ్జీలుగాను, సివిలియను మొదలయిన ప్రధానపదవుల యందున్నారు. జస్టిస్ పండిత, శంభునాథ, జస్టిస్ పం. రామనారాయణ, జ, సర్ గురుదాస బనర్జీ, జ. సర్ ఆశుతోషముకర్జీ, (జ. సర్ ఆశుతోషచౌధరీ) జ. సర్. సుబ్రహ్మణ్యయ్యరు, చీఫ్ జ. సర్ శేదాద్రిఅయ్యరు. రాజా సర్. టీ. మాధవరావు, సర్ భాండారకరు, రాజా మాధోలాల్, రాజా సూరజకౌల్, రాజా హరికిషన్‌లాల్, రాజానరేంద్రనాథ, పం. మోతీలాలు నెహ్రూ, పం. అయోధ్యానాథ, డాక్టరు తేజబహదూరుసప్రూ, లోకమాన్య తిలకు, రాజా దీనానాథ, జ, గోకర్‌నాథ మిశ్ర, మి. చందావారకర్. డా. సర్. భాలచంద్ర, మి. ఘోకలే మొదలయిన—ఉచ్చపదాధికారులయిన విఖ్యాతభారతీయరత్నములు బ్రాహ్మణకులోత్పన్నులే. వీరిసాటికితరజాతులవారు రాఁజాలకుండుటయేకాక, యూరోపీయులు సయితము వీరికుశాగ్రబుద్ధిముందర తలలువంచుచున్నారు. నిజముగా నీసాంసారికోన్నతితోపాటు నీ మహాశయులయందు బ్రాహ్మణులకు జన్మహక్కయిన తపోబలముకూడ నుండినపక్షమున, ఈయున్నతిలో మరింత తేజస్సు ప్రాప్తించియుండును. ఎవరు ప్రాచీనదేవవాణిని సంస్కృతము జీవింపఁజేసియున్నారో, ఎవరిదయవలన సాధారణజనులకు సంస్కృతశాస్త్రముల జ్ఞానము ప్రాప్తించెనో, అటువంటి పూజనీయ సంస్కృతవిద్వాంసులకును, బ్రాహ్మణకుమారులకును అత్యంత కృతజ్ఞతాపూర్ణమయిన హృదయముతో మేము లక్షలకొలఁదిగ, కోట్లకొలఁదిగ ధన్యవాదములు చేయకుండనుండఁజాలము. నిజముగా, బ్రాహ్మణకుమారులీప్రకారముగా ప్రశంసనీయమయిన స్వార్థత్యాగమును చేయనిపక్షమున సంస్కృతభాషయొక్కయు, ఆభాషలో వ్రాయఁబడిన శాస్త్రముల యొక్కయు, పేరుసయితము మన దేశములో నిలిచియుండకపోవునుగదా!

౬. బ్రాహ్మణులద్వారా మన సనాతనకర్మకాండమునకు రక్షణ.

మన ప్రాచీనయజ్ఞాది ధార్మికకర్మకాండముగూడ నీబ్రాహ్మణ మహాపురుషులదయచేతనే ఇంతవఱకును జీవించియున్నది.

ప్రస్తుతము ధర్మశూన్యమైన శిక్షణను గఱచుచున్న మనవారి ధార్మికకృత్యములయందును, ఆచారములయందును, విశ్వాసముగాని, శ్రద్ధగాని లేనేలేదు. కానిమెవరి కింతవఱకునుఉన్నదో వారిమనఃకామ ధార్మికకర్మకాండయందు దక్షులైన యీబ్రాహ్మణులద్వారానే పూర్తికాఁగలుగుచున్నది. ఆబ్రాహ్మణులు కేవలము ధర్మమునురక్షింపవలె నన్న సదుద్దేశముతోనే తమయెల్లసుఖములను, స్వార్థమునుత్యజించి పరమపరిశ్రమచేసి కర్మకాండానుష్ఠానవిధులను అభ్యసించుటలోనే తమ—ఆయువును వ్యయపఱచుకొన్నారు. వారే నిజముగా సాంసారికములయిన—ఐశ్వర్యములను గలిగించు విద్యలనభ్యసింపఁ బూనుకొన్నచో అందఱికంటెను ధనాఢ్యులును, వైభవశాలురును అయియుందురు. బ్రాహ్మణజాతిలో నీయలౌకికమయిన సంతోషము, స్వార్థత్యాగము నిరంతరము ఉంచునట్లు చేయునుగాక యనియు, దేవవాణియగుమనసంస్కృతము, మనపవిత్రధర్మగ్రంథములు, పరమవిచిత్రమయిన మన కర్మకాండము, వివిధములయిన మన యాజ్ఞికానుష్ఠానవిధులు మొదలగు వానిని, నిరంతరము సాగించునుగాక యనియు పరమాత్మని సన్నిధిలో సదాప్రార్థించుచుందుము. ఎన్నిహిందీవార్తాపత్రికలు ప్రస్తుతకాలమున దేశముహక్కుల విషయమున యుద్ధరంగములో యుద్ధము చేయుచున్నవో వానిలోచాలవఱకుబ్రాహ్మణకుమారులచేతను స్థాపితములును, సంచాలితములును, సంపాదితములై యగపడుచున్నవి. ఇవియేగాక చాలవఱకుఁ బ్రఖ్యాతములైన, ఆంగ్లేయ, గుజరాతీ, మరాఠీ, బెంగాలీ, తమిళ, ఆంధ్రభాషల పత్రికలలోఁగూడ బ్రాహ్మణకుమారుల చేతిలేఖిని తాలూకు చమత్కారము స్పష్టముగాఁ గానవచ్చుచున్నది.

## ౭. ఇట్లుండినను మనకీ శోచనీయావస్థ యేల కలిగినది?

ఇట్టిపరిస్థితు లుండినప్పటికినిగూడ మన బ్రాహ్మణజాతిదశ యింత శోచనీయ మేలయయినది? పరమోత్కృష్టమైన యీజాతి కర్ణకఠోరములయిన యిట్టినింద్యాక్షేపముల కేల గుఱియగుచున్నది? ఈసంగతి విచారింపవలసియే యున్నది. మనము మనస్వరూపమును మఱచుటయు, ఏయేహక్కులు మనవో, ఏయేక్షేత్రములయందు మనకాధిపత్యమున్నదో వానిని మనము విడుచుటయు నే యిందులకుఁగారణము. మనలో పరస్పరము ప్రేమభావము, ఐక్యము. అన్యోన్యక్షేమమును గో

టయు లేనే లేదు. కనుక నే బ్రాహ్మణులందఱును అప్రతిష్ఠపాలగుచున్నారు. జనసామాన్యమునకు వారియందున్నవిశ్వాసము తొలఁగిపోవుచున్నది. అన్నిప్రాంతములయందలి బ్రాహ్మణసోదరులందఱిలోను పూర్ణమయిన ప్రేమ యథార్థమయిన భ్రాతృభావము పరస్పరము మాన ప్రతిష్ఠల వృద్ధి విషయమున విచారము, ఉండి, యథార్థమయిన ఐకమత్యము కలిగి యున్నపక్షమున, ఏయితరజాతులవారును మనవయిపు అవమానపూర్వకముగా కనులెత్తి చూడఁజాలరు. కాఁబట్టి యీమహాసంమేళనమునకు దేశదేశాంతరములనుండి దయచేసిన బ్రాహ్మణమహాశయులు "మనమందఱము నిజమైన ప్రేమభావమునుంచుకొందుము. మనప్రాంతములకుఁ బోయి ప్రతిచోటను బ్రాహ్మణమండలి కుత్తేజనమును, సంఘటమును కలిగించుటలో దృఢప్రయత్నులమగుదుము. ఐకమత్యముతో మనసోదరుల ఉన్నతివిషయమున వీలయినంతలో ప్రయత్నించుచుందుము" అని ప్రతిజ్ఞపట్టియిచ్చుటనుండి లేచినపక్షమున, ఇపుడయినను మనలో మనకైక్యము, సహానుభూతి ఉన్నపిమ్మటను మన హక్కులను లాగికొనుట కెవ్వరికిని సామర్థ్యముగాని సాహసముగాని యుండదు.

### ౮. మన కార్యక్షేత్రముతాలూకు సంకోచము, పూర్వపరాక్రమత్యాగము.

ప్రస్తుతము మనస్థితి యెట్లున్నదో యెఱుఁగుదురా? ప్రతిష్ఠావంతులైన మనవిద్వద్బ్రాహ్మణులు తమకార్యక్షేత్రమును మిక్కిలిసంకుచితముగాఁ జేసివేసికొన్నారు. బ్రాహ్మణుల యథార్థబలముతపోబలమును, ముఖ్యధనముసంతోషమునను విషయమున సందేహము లేదు కాని ఎంతవఱకీ రెండును దేశోపకారమునందును, ధర్మోపకారమునందును, జాత్యుపకారమునందును, ధర్మ—గౌరవములరక్షణయందును వినియోగింపఁబడకుండెడినో అంతవఱకును నిజముగ సఫలము కాజాలవు. వసిష్ఠమహాముని ఎట్టి తపస్వియో, ఎట్టిస్వభావము, సంతోషము శాంతముగలవాఁడో యెవరెఱుఁగరు? కాని యెప్పుడైతే మహాభిమానియు, బలోన్మత్తుఁడును అయిన—ఒకమహారాజు తనసైన్యబలముద్వారా అన్యాయము చేయుటకుపక్రమించి ఆయనధర్మభారముపై నాక్రమణజరుపఁబూనినాఁడో, అప్పుడాతఁడెంతమాత్రము బ్రాహ్మణబలమున కెట్టి యుదాహరణమును చూపించినాఁడో ఆసంగతి తమ కెఱింగినదే. మహాత్ముఁడయిన

ద్రోణాచార్యునకు సహాధ్యాయియగు ద్రుపదమహారాజు, తనపూర్వప్రతిజ్ఞనవమానించితననురాజసభలోనవమానింపఁగానే శాంతమూర్తియు నిత్యసంతోషియునగు ద్రోణాచార్యుఁడు నాఁడు తన్నవమానించినందులకు తగురీతిని ద్రుపదుని మందలించి బ్రాహ్మణావమానమున కెట్లుప్రతీకారముచేసియున్నాఁడో ఆసంగతియును తమ కెఱింగిన దేకదా! కార్తవీర్యార్జునుఁడు మొదలైన హైహయవంశీయరాజులు తమ పశుబలమువలన మదాంధులయి మహాత్ముఁడయిన జమదగ్నిని అత్యాచారపూర్వకముగా వధించిన సమయమున నేప్రకారముగా పరశురాముఁడు తన బ్రహ్మతేజస్సును ప్రకటించి వారినిసమూలముగ నున్మూలించినాఁడో ఆసంగతియు నితిహాసవేత్తలగు తమ కెఱిఁగియేయున్నారు. వేనుఁడనురాజు ధర్మమార్గమునువిడిచి ధార్మికాత్యాచారమునకు దిగినప్పుడు, ఆకాలపు బ్రాహ్మణోత్తములు వాని నేప్రకారముగా సంహరించి పృథుమహారాజునుపుట్టించి ధర్మమునురక్షించియున్నారో అదియును తమ కెఱుకయే. సారాంశమేమనఁగా—బ్రాహ్మణుల కర్తవ్యము కేవలము పూజాపాఠము. పురశ్చరణాదులు నేకావు, మఱేమన? సమయముతటస్థించినపుడు సర్వక్షేత్రములయందును సర్వకార్యములయందును సమయానుకూలముగా తమపరాక్రమమును చూపించుటయునే.

పూర్వము మన బ్రాహ్మణులు సర్వవిద్యలకును, కలాకౌశలమునకును ఆచార్యులయియుండెడివారు. యుద్ధవిద్య, రాజనీతి, వైద్యము, చికిత్స, స్థాపత్య (ఇంజనీరింగ్) విద్య, అస్త్రవిద్య, శస్త్రవిద్య, వ్యాయామవిద్య, కలాకౌశలవిద్య, మొదలగువానియన్నింటికిని గురువులు బ్రాహ్మణులే. అందుచేతనే యెల్లక్షేత్రములయందును, కార్యములందును, అంతటను వారిప్రభావమే గౌరవింపఁబడుచుండెడిది. వారు తమతపోబలమును సురక్షితముగా నుంచుకొని ప్రతివిద్యయందును, సాంసారికములును, రాజనైతికములును అగు వ్యవహారములలో అగ్రేసరులుగానుండెడివారు. వారిగౌరవము నెదుటనందఱునుతలలువంచుచుండెడివారు.

౯. ప్రస్తుతము విషాదగ్రస్తమయిన మనవిచిత్రదశలో, శ్రీకృష్ణభగవానునియుపదేశము ననుసరించుటయే ఆవశ్యకము.

కాని ప్రస్తుతకాలమున మనదశ విచిత్రముగా మాఱిపోవుచున్నది. ఇప్పుడు కనఁబడుచుండెడి బ్రాహ్మణులు కేవలము పూజాపాఠ

ములయందును, శాస్త్రములలోని సూక్ష్మతత్త్వముల విచారమునం దును లవలీనులును, శాస్త్రార్థములయందు ప్రవీణులునుఅయి శాస్త్ర వలోకమునందు మాత్రమే తమసమయమును గడపుచున్నారు. అంతే కాని, ప్రపంచములో నేమిజరుగుచున్నదో, ఏప్రకారముగా ధర్మమున కుహాని జరుగుచున్నదో, రాజనైతికక్షేత్రమునందు మనధర్మమునకే ప్రకారముగా అవమానము జరుగుచున్నదో ఆయావిషయములను గుఱించి వారికెంతమాత్రమును ధ్యానమే లేకున్నది కేవలము రాజ నైతికక్షేత్రమునందు చతురులును, ఉన్నతపదవులయందు లబ్ధప్రతిష్ఠు లును అగు బ్రాహ్మణనాయకులున్నారుగాని, వారియందు ధర్మభావము లేశమయినను లేకపోవుటయేకాక, వారు మనధార్మికభావములను చా లఅవమానించుచు వానిని తుచ్ఛాతితుచ్ఛములుగా నాలోచించుచుం డుటయేకాక వానిని ఘృణాపూర్వకముగా పదదళితములుగఁ జేయుచు ధర్మములనపహసించుటయే తమకుగౌరవముగానాలోచించుచున్నారు. మన యీబ్రాహ్మణ మెంబర్లు శాసనసభలందు చేయు అన్యాయము చేతనే మనధర్మమునకు గొప్పహాని మనయెదుటనే జరుగుచున్నది.

ఇప్పుడు చెప్పిన రెండుతరగతులం బ్రాహ్మణులలోను మొదటి తరగతివారగు విద్వద్బ్రాహ్మణులుచాలవఱకు సంపూర్ణసాంసారికకర్మ క్షేత్రములనుండియు, జాతీయౌన్నత్యవిచారములనుండియు విరమించు చున్నారు. వీనితోతమ కేవిధమయిన సంబంధమున్నలేనే లేదన్నట్లుగా నుండి కేవలము పరలోకము వయివు ధ్యాన ముంచుచు నీలోకము లోని కర్తవ్యము లన్నింటినుండియు విముఖు లగుచున్నారు. వారు, మహా భారతయుద్ధప్రారంభమున ఉభయసేనలనడుమను విషాదగ్రస్తు డయిన—అర్జునున కుపదేశించిన శ్రీకృష్ణపరమాత్ముని యుపదేశము లను మఱచిపోయినారు. ఆసమయమున అర్జునునిస్థితి యెట్లున్నది? తన సంబంధులే తనవిపక్షులలో నిలిచియుండుటచూచి, అతఁడుయుద్ధరంగ మునుండి విముఖుఁడగుటకై సిద్ధపడినాఁడు అతఁడు రణములో సన్న ద్ధుఁడగుటకు బదులు భిక్షాన్నమును భుజించుచు జీవనమును నిర్వహిం చుకొనుచుండుటయే కల్యాణకారకమని యంగీకరించినాఁడు—చాల వఱ కట్టిస్థితియే యిప్పుడు మనవిద్వద్బ్రాహ్మణమహాశయులకుఁ దట స్థించినది. కాని, శ్రీకృష్ణభగవానునివాక్యములననుసరించిచూడఁగా

నీయజ్ఞానరూపమయిన జ్ఞానాభాసము శ్రేష్ఠపురుషు లాచరించినదిగాని స్వర్గము నిచ్చునదిగాని, కీర్తినివృద్ధిచేయునది గాని కానే కాదు. ఉక్త టకుమాత్రమే యిది ప్రజ్ఞావంతులవచనములవంటిది. కాని యథా ములో ఇట్టివిచారము క్లైబ్యము—అనఁగా నపుంసకత్వమును సూచి చునది. దీనివలన విద్వద్బ్రాహ్మణులకు గొప్ప—అపకీర్తి తటస్థించు చున్నది. అది కొన్నివిషయములలో మరణదుఃఖముకంటెను హెచ్చ యినది. జనసామాన్యము వీరిని తుచ్ఛులనుగా ఆలోచించుచున్నది భయగ్రస్తు లనుచున్నది. శక్తిహీనులని తలంచుచున్నది. ప్రపంచము లోనిజాతు లన్నింటిలోను సర్వోచ్ఛజాతియని ప్రసిద్ధికెక్కిన మనబ్రా హ్మణజాతి కిట్టిదశ తటస్థించుటకంటెను హెచ్చు దుఃఖకరమయి సంగతి యింకేమికావలయును?

ఏప్రకారముగా శ్రీకృష్ణభగవానుడు మునుపర్జునుని విషా మును తొలఁగించి యతనికిఁ గర్తవ్యములయిన కర్మధర్మములందు ధునిచేయగా వానినవలంబించుటచేత నేఁటతనికివిజయమెట్లులభించెనో అదేప్రకారముగా సాహసము, ఉత్సాహము కలిగి, యథోచితోపదే శమందును, కర్తవ్యపాలనయందును, ధర్మపరిపాలనవిషయమునందును నడుముకట్టుకొని పనిచేయుట బ్రాహ్మణపండితులకావశ్యకమైయున్నది

౧౦. రాజకీయసభల నిర్వాచనములోఁ బరాక్రమావశ్యకత.

విద్వాంసులును విషమసంతోషములను అగు మన బ్రాహ్మణ హాశయులయెదుట మనరాజశాసనసభల విషయమున మన కర్తవ్య మేమిటి? అన్నవిచారమే వారికి లేకున్నది. ఎవరు మెంబర్లయి మాకేమి? యెవరుకాకుంటే మాకేమి, యని ప్రజ్ఞావంతులవలె పలు చుందురు. ఇట్టియుపేక్షవలన నెట్టిభయంకరమయిన స్థితి తటస్థించు న్నదో వారెఱుఁగకున్నారు. వారియుపేక్షతాలూకు పరిణామము మ ణదుఃఖముకంటెను హెచ్చుదుఃఖముక్రిందికి మాఱుచున్నది. ఏకౌన్సి ల్లలోనంతుష్టులనుమకొనుమన విద్వద్బ్రాహ్మణు లేవిధమయినసంబం మునుఉంచికొనుటవ్యర్థము, అనుచితము అని ఆలోచించుచున్నారో, వా లో నెట్టి మెంబర్లెన్నుకోఁబడుచున్నను కొంచెమేనియు లక్ష్యము చేయ కున్నారో, [illegible]

దీయుచు,విద్వద్బ్రాహ్మణులజీవనధనము,అథవాప్రాణాధికము నగుమన శాస్త్రీయ ధర్మములను నిర్మూలించుచున్నవి. నిజముగా మనవిద్వాంసులును, ధర్మాచార్యులును ధర్మమును రక్షింపవలయునన్న యుద్దేశముతో నడుముకట్టుకొని కౌన్సిల్లమెంబర్ల నెన్నుకొనుటలోఁ బూర్తిగఁగాలాని ఈఘోరాందోళనలోఁ దగినంతగాఁ బరిశ్రమచేసి, మెంబర్ల నెన్నుకొను వారిపైని తమప్రభావమును ప్రసరింపఁజేసి—ఎవరు ధర్మబుద్ధిగలవారో, ఎవరు ప్రతిసమయమునకు మన ధర్మభావముల సురక్షితముగఁ గాపాడఁగలవారో, వారినే యెన్నుకొను నట్లు చేసిన పక్షమున, ఈకౌన్సిల్ల ద్వారా మనధర్మభావములపైని—మనధార్మిక సంస్కారముల మర్యాదను అస్తవ్యస్తముచేయుచు, మనకు మరణతుల్యమయిన కష్టమునుకలిగించుచున్న ఇప్పటిఘోరాఘాతములు—ప్రహారములుఁనువచ్చియుండవు.నిజముగా మనవిద్వద్బ్రాహ్మణులు నడుములుకట్టుకొని పనిచేసిన ఎవరు మనయీరాజనైతికవిషయములలో యౌదాసీన్యముచూచి సోమరిపోతులనుగను. తుచ్ఛులనుగాను మనలను ఆలోచించుచున్నారో వారే మన సేవలో చేతులుగట్టికొని మనసాహాయ్యము నపేక్షించుచుఁ బ్రార్థించుచుందురు. ఆయీసంగతులన్నియు తమ రేచూచెదరు

౧౧. బలవంతుల కందఱునుసహాయులే, బలహీనుల కెవ్వరును గారు.

ఈవిధముగా ఘోరమయిన—ఆందోళనము చేయుటవలన మన రాజభక్తిలో నేవిధమైన—అభ్యంతరమును కలుగఁజాలదు. మనధార్మికాదులయిన స్వత్వములకొఱకు చేయబడుచున్న—ఆందోళనమురాజభక్తికి విరుద్ధముగాదు. మనము కావలసినంత కోలాహలముచేయకుండ మన కేమి ప్రాప్తింపఁగలదు? "సహిసుప్తస్యసింహస్య ప్రవిశంతి ముఖే మృగాః" అన్నది మన మెఱిగినదే గదా! కాఁబట్టి లెండు, ధర్మయుద్ధము చేయుఁడు, కీర్తిని సంపాదింపుఁడు, ఇదే యీసమయమున పరమకర్తవ్యము."భయ విన హోయ నప్రీతి" అనునది సాధారణ నియమమయియున్నది. బలము నెదుటనే అందఱును వంగియుందురు. అంతటను బలమునకే గౌరవముగలదు. నిర్బలునిసంగతి నెవ్వరును అడుగనే అడగరు. ఆందోళనబల మెవ్వరియందు దగపడునో వారియెదుటనే దొరతనము గూడవంగుచు. ఎవరైతే కేవలశాస్త్రస్వభావమునే అవలంబించి మౌనముద్రను ధరించియుందురో వారెంతయోగ్యులును, వ్యుత్పన్ను

లును అయినను దొరతనము వారిభావములపై పున నేవిధమయినదృష్టిని యుంచుటకు సమర్థులుకారు. ఏమందురా ? ఇది ఆందోళ యుగము ఘోరమయిన యీయాందోళన బల మెవ్వరికుండునో వా రాజనైతిక రణరంగమున జయమునుపొందగలుగుదురు. దొరతన అట్టివారియిష్టమునను సరించియే పనిచేయుటకు బాధ్యతగలది యగుచుండును, ఇదిశాంతి యుగముగాదు — కర్మయుగము, కాబట్టి, ఔదాసీన్యమును విడిచిపెట్టి, యీక్షేత్రములో మనప్రభావమును ప్రదర్శించుటయే మనకు ముఖ్యకర్తవ్యము. కనుక నీరాజనైతికధర్మమునుపాలించువిషయమున, అందును విశేషించి యిప్పటిదుస్థితిలో పాల్గొనుట మనధార్మికమయిన కర్తవ్యము. శాసనసభల యెన్నికలప్పుడు ధార్మికభావములుగల సజ్జనుల నందుఁ బ్రవేశింపఁజేయుటయుఁగూడ ఒకవిధమయిన ధార్మికానుష్ఠానమే అని యాలోచించి దీనిని పూర్తిచేయుటలో— ఏదేనియాజ్ఞికాద్యనుష్ఠానములో ఏకాగ్రచిత్తులయి పరిశ్రమచేసినట్లే పరిశ్రమచేయు టావశ్యకమని మనవిచేయుచున్నాము.ఈయనుష్ఠానము సఫలమయినపిదప, శాసనసభలలో మన—అధికారము నెలకొనును, అపుడు ధర్మమునకు విరుద్ధమయినదిగాని, ఆఘాతము గలిగించునదిగాని యగు నేవిధమయిన ప్రస్తావమున్ను రాఁజాలకుండును. కాని,మనధార్మికసదాచారమునకు సంహారకారియగు హరిసింహా,గౌడ, శారదా మొదలగువారి బిల్లులున్ను, మనమీదవచ్చిపడుచుండ తీవ్రముగా వానినెదుర్కొనక అలసులమయి శాంతిని దుర్వినియోగముచేయుచు, అధర్మభాజనుల మగుచున్నాము. నిజముగా మనమే మనబలప్రభావమునుబట్టి ఆదిలో తగిన ప్రయత్నము చేసియుండినను, ముందు చేయఁబూనినను, మనచేతను నిర్ణయింపఁబడిన సజ్జనులే శాసనసభలో ప్రవేశించి యచ్చట యిట్టిధార్మికానర్థములు కలుగకుండఁ జేసియుందురు. “ఇంద్రాయ సప్రణమతే నమతే యోఽబలీయసే” అను నీ భారతమునందలి ధార్మికమహావాక్యముపైని మన కెల్లప్పుడును దృష్టి యుండవలయుననుట యుచితము.మనమింతపఱకును గాఢనిద్రలో లవలీనుల మయియున్నాము. ఇప్పటికయినను మనలను మేలుకొలిపిన భగవంతునకు ధన్యవాదములుచేయవలసియున్నది.ఈయఖిలభారతవర్షీయబ్రాహ్మణమహాసంమేళనము మనమేల్కొనుటకే ఉదాహరణమన

వచ్చును. మనము మేలొక్కనిసందులకు సంపూర్ణలాభమునుపొంది మ
నచేతులనుండి లాగికొనఁబడిన మనప్రాచీనులస్వత్వములయందు మరల
నధికారము లభించుటకై శ్రీవిశ్వనాథభగవానుఁడు తన వీరభద్రా
దులతోను, కాలభైరవాదులతోను గూడుకొని మనకుఁ దగినంతబల
మును దయచేయునుగాక! ఇటులయినయినను మనవిద్వద్బ్రాహ్మణులు
లేచి యుత్సాహపూర్వకముగా ధర్మరూపమైన యీ కురుక్షేత్రములో
దమపరాక్రమమును చూపించి ధర్మవిజయమును పొందెదరుగాక!

## ౧౧. దైవము—పురుషకారము.

సజ్జనులారా? మనశాస్త్రములలో దైవము—పురుషకారము అనునీరెంటి మహిమయు విశేషముగ వర్ణింపఁబడియున్నది. ఈ రెండును రథమునకు రెండుచక్రములవంటివని యంగీకరింపఁబడినవి. రెండుకలసి నపుడే మన యున్నతిరూపమయినరథముసరిగానడుచును. దైవమేమో మనయందపారమయిన కృపాదృష్టిని ప్రసరింపఁజేసియున్నాఁడు. మొట్టమొదట మనలను భూలోకమున "కర్మభూమి" అని ప్రసిద్ధికెక్కిన పవిత్రభారతభూమిలోఁ బుట్టించి పాండిత్యమునుగూడ దయచేసి ఇతరులకు దుర్లభమయిన సమ్మానమును మనకు శాస్త్రమూలమున నిచ్చియున్నాఁడు.

శ్లో. భూతానాం ప్రాణినశ్శ్రేష్ఠాః ప్రాణినాం బుద్ధిజీవినః,
బుద్ధిమత్సు నరాః శ్రేష్ఠా నరేషు బ్రాహ్మణాః స్మృతాః.
బ్రాహ్మణేషుచ విద్వాంసో విద్వత్సు కృతబుద్ధయః,
కృతబుద్ధిషు కర్తారః కర్తృషు బ్రహ్మవేదినః. మను.౧.౯౬.౯౭

"సద్భిరాచరితం యత్స్యాద్ధార్మికైశ్చ ద్విజాతిభిః,
తద్దేశ కుల జాతీనా మవిరుద్ధం ప్రకల్పయేత్." మను. ౮.౪౬.

కాఁబట్టి, దైవము మనయందింతటి దయాదృష్టినిచూపి మన కిట్టియున్నతపదవిని దయచేసినప్పుడు మనము సోమరితనమువదలి మాశక్తిని ప్రయోగించి దైవిక, సామాజిక, ధార్మికాదులగు నెల్లక్షేత్రములందును ఉన్నతికలుగజేయువయిపున కగ్రేసరులమయి దేశమునకుఁ గల్యాణమును కీర్తిని శాశ్వతముగ నుంచుటకుఁ బ్రయత్నించుటయు నావశ్యకమగుచున్నది.

## ౧౨. ధర్మస్థానములను, పవిత్రమతములను రక్షించుటయు, బ్రహ్మబలమును ఆవశ్యకములు.

ఈప్రకారముగా మన ఆలస్యము, ఉపేక్ష, అనెడి మహా కారణముగా మనధర్మస్థానములయు, ధర్మమతములయు సంపత్తి నుండి లాగికొనుటకై ఇప్పుడు ఆందోళన జరుగుచున్నది. సభ్యులయిన సంస్కర్తలసంఘమున కాయధికారము సంక్రమి యెడల, అది వాటిసంపత్తిని, గొప్పగొప్పవిశాలభవనములను స్వా ముచేసికొని వాటిని తమయిచ్ఛానుసారము ననుభవించెదరు. ఈవిష ములలో ఔదాసీన్యము, సంతుష్టియు మహాహానికరములు, ప్రా శములు, అందువలన మనయొక్కయు, మనపూర్వులయొక్కయు సంపత్తి మనముచూచుచుండగానే దోచుకొన్నట్లుగా అధార్మికుల లోనికి బోవుటయు, మనము వారి ముఖములు చూచుచు ఊరకు టయు, వాటిని రక్షించుట కేవిధమయిన ఉపాయమును చేయక టయు సంభవించుచున్నది. కాబట్టి ఇట్టివిషయములలో మనము బ్ర బలమును, బ్రహ్మదండమునుఆశ్రయించి వానినికాపాడవలయును. ఇతరుల కుపదేశించుటకు జన్మసిద్ధమయిన అధికారమున్నది, మ వందలకొలది, వేలకొలది వక్తలు గ్రామములవెంటతిరిగి పనిచేయ యును. ఇపుడూరకున్నందువలన బని జరుగదు. సింహగర్జనము ఘోరనాదమున కవసరము తటస్థించినది. దానివలననే మనపని వేఱగలదు. ప్రస్తుత మీయత్రప్రయోగము తాలూకు ప్రభా యన్నింటికంటెను హెచ్చుగా నుపయోగించును.

## ౧౩. పండితులకు బరస్పరము కార్యవిభాగము.

ఇప్పటి యవసరములకు తగురీతిని అనుసరించి మనపండిత కొన్నివిభాగములుగా విభక్తులయి, ఒక్కొక్కపనిని తమచేతికి దీ న్నట్లయితే అన్నిక్షేత్రములయందును చక్కగా సఫలమగును. బ్రా ణోచితములయిన నిత్యనియమములును, సదాచారమును, ఇష్టదే రాధనాదులను బ్రాహ్మణులందఱికిని సర్వసాధారణముగా నిత్యకర్మ యయియుండవలెను. ఇందులో దేనికిని లోపము కాగూడదు. ఒక కొందఱీకార్యములను పాలించుటలో ఉద్యుతులై యుండవ వీనినే తమప్రధానలక్ష్యములుగా నాలోచింపవలెను. కొందఱు

...తికమయిన ఆందోళనలో లెస్సగా ముందునకువచ్చి పాలుగైకొనవలెను. రాజనైతికవిషయములలో తమంతటఁదాము దక్షులయియుండవలెను. తీక్ష్ణదృష్టితో అన్నివయిపులను ధ్యానపూర్వకముగాఁ జూచుచుండవలెను. మనధార్మికవిషయములయెడఁగాని, సామాజిక విషయములయెడఁగాని అనుచితమైన హస్తక్షేపముచేయునట్టి యేదేని రాజనైతికవ్యవస్థ యెక్కడనైనను తటస్థించినపక్షమున, వెంటనే మనయీరాజనైతిక విభాగస్థులు ఆందోళనమును గలిగించవలెను. అట్లు చేసినచో దొరతనమునందు పూర్తిగా దానిప్రభావము వ్యాపించును.

మఱికొంద ఱొకసంఘముగా నుండవలెను. వారు శాసనసభల యెన్నికల సమయమున యోగ్యులయిన ప్రతినిధులను ఎన్నికకొఱకు నిలువఁబెట్టి హెచ్చువోట్లు మనము నిలువఁబెట్టిన ప్రతినిధులకులభించునట్లు ప్రయత్నించవలయును. అపుడట్టిశాసనసభలందు ఏదేనిశాసనము మనధర్మముకు విరుద్ధమైనది ప్యాసుకాఁజాలదు.

మఱికొంద ఱింకొకసంఘముగాఁ జేరవలెను. వారు నిష్కారణముగ బ్రాహ్మణుల కవమానము జరుగుచున్నపుడు దానిని నిర్మూలించుటకు దగినయుపాయమును చూడవలెను.

ఉపదేశకులద్వారా ధర్మప్రచారము చేయుటలో బాగుగా సన్నద్ధులయియుండవలెను. కాని, ఒకవేళ, ఈబ్రాహ్మణ సంమేళన కూడ నీవిషయములో కొంచెము విశేషముగా ధ్యానము నుంచినచో దీనిసంఖ్యలోను, కార్యక్షేత్రములోను ఉన్నతి కలుగఁగలదు.

మఱియు నన్నింటికంటెను విశేషముగా మహానుభావుల సంఘమొకటి యిట్టిది యుండవలెను. ఆసంఘములో ఆధ్యాత్మికశక్తి, యోగబలము, తపోబలము, మంత్రశక్తి, అనుష్ఠానము మొదలైన ఆధ్యాత్మికవిషయములలో వ్యుత్పన్నులైనవారేయుండవలెను. ఆధ్యాత్మికశక్తిలేక యోగబలము, మంత్రానుష్ఠానము మొదలగువానివల్లనుగూడ మహాత్ములు లోకులకు చాలవఱకు సంస్కరణమును అదృశ్యరూపమునఁ జేయఁగలరు. తపస్వులగు మహాత్ములప్పుడప్పుడు తమతపోబలము, యోగబలము మొదలయిన వానివలన లోకమునకుఁ జేసిన, జేయఁగల ఉపకారమును ప్రాజ్ఞులెఱుఁగుదురు.



ఈప్రకారముగా అవసరముల ననుసరించి మనము వేఱువేఱు

సంఘములను మనలోనుండియే స్థాపించుకొన్న తరువాతను అన్న యిన యెల్లకార్యక్షేత్రములలోను మనకుఁ బ్రవేశము కలుగుట మనము చాలవఱకు ధర్మమునకును, దేశమునకును ఉపకారము టకును, మనగౌరవమును వృద్ధిఁజేయుచుకొనుటకును సదాసమర్థుల దుము. తైత్తిరీయోపనిషత్తు—శిక్షావల్లీ ఏకాదశానువాకములోఁగూడ నీవిష మున నిట్లుచెప్పఁబడినది. "అథ యది తే కర్మవిచికిత్సా వా వృత్త కిత్సావా స్యాత్, యే తత్ర బ్రాహ్మణాః సంమర్శినః, యుక్తా ఆయు అలూక్షా ధర్మకామాస్స్యుః, యథా తే తత్ర వర్తేరన్, తథా వర్తేథాః" అనఁగా, ఒకవేళ నీకు కర్మమువిషయమునఁగాని, వృత్త విషయమునఁగాని సందేహముగలిగినచో. యుక్తులయినను, అయు యినను, నిస్పృహులయినను, ధర్మకాములయినను సరియే విమ శీలురగు బ్రాహ్మణు లేప్రకారముగా నందుబ్రవర్తించెదరో అదే రముగా నీవుగూడ నందుఁ బ్రవర్తింపుము. ధర్మాచార్యులును, విద సులును చేయునేర్పాటులను శిరసావహించుచున్న మాకింకఁ రెండువిషయములను గుఱించి కొంచెము విన్నవింపవలసియున్నది.

౧౪. అస్పృశ్యజాతులకు సాహాయ్యరూపమైన యుపకారము.

ప్రస్తుతకాలమునమనచే హిందువులలో అస్పృశ్యులుగా గ ణింపఁబడుచున్నవారి విషయమున నెట్లువ్యవహరింపఁదగును? అన్న యమున గొప్పఆందోళన జరుగుచున్నది. ఈ విషయమున మాభి రమిది; వారిని వారి కులధర్మమునందుంచి, వారు తమవ్యవస ములో ఉన్నతులై తమజీవికను బాగుగానిర్వహించుకొనుచుండుట దగురీతిని సాహాయ్యము చేయఁబడవలెను. వారికిఁ జేయఁదగిన నిజ యిన ఉపకారమేదియనఁగా, వారు తమతమ పనులలో నిపుణు కావలెను, ధర్మపరాయణులయి యుండవలెను. వారికి భగవద్భజన యమునఁ బ్రీతియుండవలెను. వారు శ్రీతులసీ రామాయణాది భాషాపురాణగ్రంథములు చదువుకొనుటకుఁ దగినంతగా విద్యావ దప్పకుండ నేర్పవలెను. వారితో సహభోజనమువిషయమునను, మం మందిరములోనికిఁ బ్రవేశింపఁజేయుటకును కొందఱుపట్టు పట్టుచున్న గాని అందువలన వారి క్షేమమాత్రమును ఉపకారము కాఁజా లట్లుచేయుటవలన గొప్పకలహము సామాజిక విప్లవము తప్ప మఱేమి

గాదు. వారందఱును తమతమ వృత్తులందున్నతులై తమ ఉపాసనాదులకు దేవమందిరములను నిర్మించుకొనుటకై కోరిన తగిన ధనసహాయమును మనము చేయవలెను. బ్రాహ్మణులు మొదలుకొని చండాలురపర్యంతము ప్రతివారికిని సర్వమందిరములలోను ప్రవేశించుట కధికారమున్నదని తన్ను సనాతనధర్మావలంబునిగాఁ బ్రకటించుకొనుచున్న యొకానొక సుప్రసిద్ధనాయకుఁడీవ్యవస్థను ప్రకటించియున్నాడు. కాని, అతఁడు మందిరములయొక్కకాని, ఉపాసనావిధియొక్కకాని యథార్థమహిమ నెఱుఁగడు కనుకనే అతఁడు ధర్మవిరుద్ధమయిన యీవ్యవస్థను సాధారణజనుల మెప్పును బడయుటకై యే జేసియుండును. కొన్నిమందిరములలో మూర్తిని సమీపించుటకును, స్పృశించుటకును ఇటువంటి సుప్రసిద్ధనాయకులకు సయితము అధికారములేనంతగా కట్టుబాట్లిప్పటికినిఉన్నవి. ఒకవేళ ఇట్టిసుప్రసిద్ధులయిన లీడరుమహాశయుల యుపదేశమువలనఁగాని, పరిశ్రమవలనఁగాని, చండాలురకు మందిరప్రవేశాధికార మీయబడినచో ఉపాసనాతత్త్వమెఱింగినఉన్నతజాతులవారీమందిరములలోనికిఁ బోవుటమానుకొందురు. అప్పుడవి చండాలురకొఱకే "రిజర్వుడు" అయిపోవును. అతఁడుచేసినవ్యవస్థను మనమే కాదు. విశుద్ధసనాతనధర్మావలంబుడును అంగీకరింపఁజాలఁడుసరిగదా, మీఁదుమిక్కిలి యతని ఇట్టి విచారములుచూచినచో మరింత అసహ్యభావమేర్పడును. మన దేవమందిరములు ప్రతివారును ప్రవేశింపఁదగిన నాటకశాలలును, సినీమానులుగావు. ఇవిశుద్ధమైన ఉపాసన కేర్పడినవిగాని తమాషాగృహములుగావని యందఱును తెలిసికొందురుగాక యని కోరుచున్నాము.

పూజ్యులగు విద్వద్బ్రాహ్మణ మహాశయులారా! మనమందఱమును, ఆలస్యమును, ఉపేక్షను, అకర్మణ్యమును, అవహేళనను విడిచిపెట్టి ప్రస్తుతపు ధర్మయుద్ధములో పాలుగొని మనయొక్కయు, దేశముయొక్కయు గౌరవమును వృద్ధిపొందింపఁ బ్రార్థించెదము.

స్వస్తిన ఇన్ద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వవేదాః,
స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు,
ఓం స్వస్తి నో బృహస్పతి ర్దధాతు.

సమాప్తము.

# అ.భా.వ. బ్రాహ్మణమహాసభ (లౌకికవిభాగము.)

ఏకగ్రీవముగ నిర్ణయించిన తీర్మానములు.

---

౧-వ తీర్మానము:— గోరక్షణము సనాతనధర్మానుయాయులందఱకు మాతృపాలనమువలె అత్యావశ్యకమనియు, ఆగోరక్షణార్థము సనాతనధర్మానుయాయులందఱు ఎల్లప్పుడు సంసిద్ధులయి యుండవలయుననియు ఈసభవారు ముఖ్యముగా సూచించుచున్నారు.

౨-వ తీర్మానము:—ఇప్పుడు వైస్‌రాయిగారి భారతశాసనసభయందు "హరవిలాస శారదా" యను సభ్యుడు తెచ్చిన బాలికావివాహనిషేధశాసనము, సనాతనధర్మవినాశకరమును, సనాతనధర్మపరాయణుల హృదయభంజకమును అగుటచేత ఆబిల్లును నిషేధించుటయేగాక శ్రీరాణీగారి వాగ్దానము ననుసరించి వైస్‌రాయిగారీబిల్లును తోసివేయవలయుననియు, ఈబిల్లును నిరోధించుటకు ఈబ్రాహ్మణమహాసభ శక్తికొలది ప్రయత్నించవలయుననియు ఇందులకు ఉపాయమును కనిపెట్టి వ్యాప్తిచేయుటకు ఒకఉపసంఘమునుకూడ స్థాపించవలయును అందీక్రింద పేర్కొనబడిన ౧, శరచ్చంద్రసాంఖ్యతీర్థమహాశయులు. (వంగీయులు) ౨. మహామహోపాధ్యాయ గిరిధరశర్మగారు. (జయపురము) ౩. మహామహోపాధ్యాయ అనంతకృష్ణ శాస్త్రిగారు. (కలకత్తా) ౪. యస్. జీ. సవార్కరుగారు. (అకోలా) ౫. కనుపర్తి మార్కండేయశర్మగారు. (మదరాసు) సభ్యులుగాని నుండవలయును.

౩-వ తీర్మానము:—ఈబ్రాహ్మణమహాసభ వైస్‌రాయిగారిచట్టనిర్మాణసభయందున్నూ, గవర్నరుగారి చట్టనిర్మాణసభయందున్నూ, మునిసిపాలిటీలసభయందున్నూ, భారతీయవర్ణాశ్రమ ధర్మవిరుద్ధములున్నూ, భారతీయసమాజ నియమవిఘాతుకములున్ను అగు తీర్మానములనెవ్వరైన ప్రవేశపెట్టినయెడల అట్టి తీర్మానమువలన భారతీయ జనసముదాయమునందు గొప్పసంక్షోభమున్నూ, సమాజధర్మహానియుకలుగగలదు. కావున అట్టి తీర్మానములకు ప్రవేశ మొసంగరాదని వైస్‌రాయి, గవర్నరు మున్నగు చట్టనిర్మాణసభాధ్యక్షులకు విజ్ఞాపనముచేయుచున్నది. ఈప్రార్థనము నతిక్రమించి అట్టితీర్మానముల కవకాశమొసంగివానిని తీర్మానించినయెడల భారతీయబ్రాహ్మణులు వానినంగీ

కరింపక అందులకు విరోధము సలుపుదురనియు సూచించుచున్నారము.

౪-వ తీర్మానము:—ఈబ్రాహ్మణమహాసభసంమేళనము "ఆయా దేశములకు సంబంధించినట్టియు సకలదేశములకు సంబంధించినట్టియు, సంశయాస్పదములును, క్లిష్టములును అగు ధర్మసందేహముల నిర్ణయించుటకుగాను ఆయాప్రాంతములనుండి పదుగురు పండితులను పేర్కొని అట్టివారిని ధర్మపరిష్త్తుగా నిర్ణయించుట ఆవశ్యకమని తలంచుచున్నది కావున ఆయాప్రదేశములందుగల ధర్మసంస్థలమూలమున అర్హులగు నామములను బ్రాహ్మణమహాసంమేళనసభ వారికి తెలుపవలయును.

౫-వ తీర్మానము:—ఇదివఱకు ప్రకటించిన "సనాతనధర్మప్రదీప" గ్రంథమునుగూర్చి వండితోత్తములు సూచించిన విమర్శనముల నన్నిటిని ఆమూలాంతముచక్కగావిమర్శించి పునర్ముద్రణార్థముగ్రంథమును సిద్ధముచేయుటకుగాను ఒక్కసమితిని యేర్పాటుచేయవలయుననియు, వారు ఒక్కసంవత్సరములోపల ఆపనిని పరిపూర్తిచేయవలయుననియు, ఆఉపసమితియందు శ్రీ మహామహోపాధ్యాయ లక్ష్మణశాస్త్రి ద్రావిడులుమున్నగు ౨౦మంది పండితులును, ఆయాజగద్గురు పీఠములనుండి ఇద్దరేసి పండితులును, ఆయాసనాతనధర్మ సభాసంపాదకులును, సభ్యులుగా నుండవలయుననియు తీర్మానించుచున్నాను.

౬-వ తీర్మానము:—యీ బ్రాహ్మణమహాసభసమ్మేళనము (౫౦ లక్షలరూపాయల మూలధనముతో ప్రాచీనశిష్టాచారానుగుణ్యమగు) సంస్కృత విశ్వవిద్యాలయము నొక్కదానిని స్థాపించుట అత్యావశ్యకమని తలంచుచున్నది. (ఆ విశ్వవిద్యాలయార్థము ధనసంగ్రహణము నిమిత్తము తిరుగుటకు ౧౫ రను నియమించెను.

౭-వ తీర్మానము:—వైస్‌రాయి,గవర్నరు,మునిసిపలు మున్నగు చట్టనిర్మాణసభలకు మెంబర్లుగా ఉండదలంచుకొన్నవారిలో ఎవ్వరు సనాతనధర్మపరాయణులో, శాస్త్రవిశ్వాసముగలవారలో, శాస్త్రధర్మవిరుద్ధములగు తీర్మానములను సభలయందు ప్రవేశపెట్టమని ప్రమాణముచేయుదురో, ఇతరు లట్టి తీర్మానములను తెచ్చిన ఆ తీర్మానములకు అనుమోదించరో అట్టివారికే తమ వోటును ఇవ్వవలయునని దృఢముగా ఈ బ్రాహ్మణమహాసంమేళనము సూచించుచున్నది.

౮-వ తీర్మానము:—వైస్‌రాయి, గవర్నరు సభలకుపోవుమెంబ

ర్లను ఎన్నుకొనునప్పుడు ధర్మాచార్యులకు విశేషాధికారమునున్నూ, సంస్కృతపండితులకున్నూ, సంస్కృతవిద్యాలయాధికారు లోనంగ ఉపాధులకున్నూ వోటిచ్చు అధికారముచు త్వరలో నొసంగవలయు ననియు ముఖ్యముగా సూచించుచున్నది.

౯-వ తీర్మానము:—అఖిలభారత బ్రాహ్మణమహాసంమేళనము యొక్క కార్యనిర్వాహకసభను కాశియందు యేర్పరచ వలయుననియు ఆ సభయందు ఆయాదేశీయులగుసమసంఖ్యాకులగుపండిత ప్రతినిధుల నేర్పరచవలయుననియు యీ సభవారుసూచించుచున్నారు.

సభాపతి:—దర్భాంగమహారాజులవారు

ఉపసభాధిపతులు:—మహామహోపాధ్యాయపంచాననతర్కరత్న మహోదయులు మున్నగు ౧౮ గురు.

౧౦. వ-తీర్మానము:— అఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహా సమ్మేళన నిర్ణీతవిషయములను అంతట ప్రచార మొనర్చుటకుగాను ఆయా ప్రదేశములందుగల బ్రాహ్మణులందఱు తమ తమ ప్రదేశము లందు శాఖాసభల స్థాపించవలయుననియు ఇదివఱకే యిట్టి సభలు స్థాపింపబడియున్న యెడల ఆ సభలను ఈసభకు శాఖాసభలనుగా నంగీ కరింపవలయుననియు సూచించుచున్నారు.

౧౧-వ తీర్మానము:—ఆయాజాతులవారు తా మనాదిగా వచ్చుచున్నజాతికంటె అధికజాతికి చేరినవారలమని చెప్పుకొనుచు వృథాకలహము తెచ్చిపెట్టి సంఘమునందు క్షోభను కలుగజేయుచున్నారు. అట్లు చేయుట శాస్త్రదృష్టితోను, సమాజహితదృష్టితోను చూచినయెడల చాలఅయోగ్యమని ఈ బ్రాహ్మణమహాసభ సూచించుచున్నది.

౧౨-వ తీర్మానము:—శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యుల వారిచేతఉత్తరదిశయందు స్థాపింపబడిన జోశీమఠము జీర్ణమైపోవుటచేత మఱలతన్మఠమునుఉద్ధరింపవలయునని ఈసభ సూచించుచున్నది.

౧౩-వ తీర్మానము:—త్రైలోక్యపావనియగు శ్రీ గంగానదీ ప్రవాహమును యెచ్చటను నిరోధింపకూడదనియు, అట్లే గంగానది యందు మలమూత్రపుకాలువలను వదలకూడదనియు గంగాప్రవాహమును మలమూత్రదూషిత మొనర్చినయెడలభారతీయులకు పీడయు ధర్మహానియు కలుగునని యీసభవారు సూచించుచున్నారు.

# బాల్యవివాహనిషేధశాసనము.

# గర్భాధానవయోనిర్ణయశాసనము.

రిఫార్మరులు తప్పక చదువవలసిన సంగతి. } { పూర్వాచారపరాయణులు తప్పక చూడవలసినసంగతి,

## హేతువాదవిమర్శనము.

("సనాతనిస్టు" అను ఇంగ్లీషు పత్రికననుసరించి వ్రాయబడినది)

14 సంవత్సరముల లోపల బాలికలకు వివాహముగాని గర్భాధానముగాని చేయకూడదనియు, అట్లు చేయువారిని కఠినముగా రాజకీయ నిర్బంధశాసనము లొనర్చి శిక్షింపవలయుననియు మనరిఫార్మరు సోదరులు చేయుచున్నయాందోళనమును చూడుడు, వీరు రాజకీయాందోళన స్వాతంత్ర్యసంపాదన వ్యాజముతో శాసన సభలకు చేరిన తరువాతరాజకీయస్వాతంత్ర్య సంపాదనమును మఱచి మతాచారవిరుద్ధములగు ఇట్టి నిర్బంధచట్టముల పై శాసనముల సభలయందు ప్రవేశపెట్టుచు నీక్రింది హేతువుల తెలుపుచున్నారు. మనరిఫార్మరు సోదరులు తమకు శాస్త్రజ్ఞానము లేని మాటనుస్వయముగానే అంగీకరించుచున్నారు కావున మేమున్నూ శాస్త్రవాదమునువదలి హేతువాదమును లోకజ్ఞానమును మాత్రమాశ్రయించియే వారుచూపించిన హేతుప్రపంచకమును విమర్శించి దానిచేతకూడా ఇట్టి నిర్బంధ శాసనములు అనర్థప్రదములని ఇట నిరూపించుచున్నారము.

పై వాదమునకు రిఫార్మరులు చూపు హేతువు లెవ్వియనగా:—

(1) ఈదేశమందలి బాలికలలో నెక్కువమంది సామాన్యముగ 14 సంవత్సరముల యీడురాకముందు రజస్వలలుకారు.

(2) రజస్వలయైనంత మాత్రముచేతనే బాలిక యొక్కయవయవములు గర్భము దాల్చుటకును బిడ్డనుగనుటకును దగిన యభివృద్ధిని పొంది యున్నవని తలంపరాదు.

(3) అట్టియభివృద్ధి పొందక పూర్వము గర్భములేర్పడుచుండుటవలన బుట్టినబిడ్డలు అనేకులు చనిపోవుట తటస్థించుచున్న.

(4) పై కారణము వలననే తల్లులును, బిడ్డలును గూడబ్రతికియున్నప్పటికిని దుర్బలశరీరములు గలవారగుచున్నారు.

(౫) దేశమందలి జాతియొక్క యారోగ్యమునకును జ్ఞాన మునకును నైకారణముననే భంగము గల్గుచున్నది.

ఈ హేతువుల కాధారమువారివారి వట్టియూహాలేకా కంటె వేఱునిదర్శనము లేమియును వారుచూపియుండలేదు. బై హేతువుల నొక్కటొకటిగ విమర్శింతము.

(1) వహేతువు:-- ప్రతిబాలికయును సామాన్యముగ యేఁడు రాకపూర్వమే రజస్వలయగుచుండుట యందఱు విషయమే "లయన్" అనువారు Mr. Lyon తాను వ్రాసిన "మె జూరిస్-ప్రూడెన్స్" *Medical Juris Prudence అను గ్రం "ఇండియా దేశమందలి బాలికలలో 14 ఏండ్లు రాకముందే లగువారు నూటికి 71 మంది కలర"ని లెక్క వ్రాసియున్నారు. దీ చూడఁగాఁ బైనఁగనుపఱచిన మొదటి హేతువు వట్టియబద్ధ వగుచున్నది గదా! ఇఁక రెండవ హేతువునువిచారింతము.

2-వ-హేతువు:—ఈ విషయమై విఖ్యాతిగల వైద్యశా గ్రంథములనుండి ప్రమాణముల నీదిగువఁజూపుచున్నాము:—

(1) "గ్యాలబిన్' అనువారు వ్రాసిన "మిడ్-వైఫరీ, ( మంత్రసాని శాస్త్రము) (Gallabin's Midwifery) లో 45-వ

"గర్భవతి యగుటకును, బిడ్డనుగనుటకునుయుక్తవయ నందుకుఁ జిహ్నముసామాన్యముగ మొదటిసారిఋతుమతియగు

(2) 'డబ్లియు — యస్ — ప్లేఫేర్' Mr. W. S. Pl M.D., L.L.D., F.R.C.P. అనువారువ్రాసిన 'సయన్స్-అన్డ్ ( ఆఫ్ మిడ్ వైఫరీ'—Science and Practice of Midwifery సిద్ధాంతముతోడను బ్రత్యక్షానుభవముతోడను గూడిన మంత్రసా స్త్రము) అనుగ్రంథమున నిట్లు వ్రాసియున్నారు. వీరు గొప్పగొ లలోఁ గృతార్థులై, యం. డీ. యల్. యల్. డీ. యఫ్. ఆర్.సీ. పీ గొప్పగొప్ప బిరుదములను సంపాదించిన వారైయున్నారు:—

"మొట్ట మొదటిసారి ఋతుమతియగుటయే రజస్వల దానిచేనేర్పడు మార్పులు, స్త్రీకి గర్భవతి యగుటకును, బిడ్డను

* గ్రంథ ని సభింత [illegible] ముసు మాత్రమే ఇట నొసంగి

నను యుక్తమగు ప్రాయము వచ్చెనని సూచించును—(72-వ-పుట)

(3) పై గ్రంథముననే మొదటి సంపుటములో 338-వ పుట:—

"అంతేగాక, ప్రసవించు స్త్రీయొక్క యీడు ముదిరినకొలఁది ప్రసవవేదన కూడ నెక్కువగు చుండునని సామాన్యముగఁ జెప్పుదురు. ఈడుముదిరినకొలఁదిని యవయవములుకూడ ముదురుటచేవానికి సహజముగ నుండవలసిన మృదుత్వము పోయి, యవి గట్టిబాఱును. అందుచే నీడుముదిరిన స్త్రీ ప్రసవించవలసి వచ్చినపుడు సామాన్య ప్రసవవేదననుమించిన వేదన పడవలసి వచ్చుచున్నది" (338-వపుట)

పై గ్రంథముననే రెండవ సంపుటములోని 5-వపుటలో:—

"ఈడుముదిరినయూఁడుది మొదటిసారి ప్రసవించవలసివచ్చినపుడు ముఖ్యముగ మొదటితూరి గల్గుశ్రమముకంటె మిక్కిలి యెక్కువవిసువును గల్గించును................తఱచుగా నిట్టి శ్రమకు హేతు శరీరమందలి బలహీనత యనుటకంటె, గర్భద్వారములు ముదరిగట్టి బాఱి బిగుతెక్కియుండుటయే యని చెప్పవలసివచ్చుచున్నది.

(4) పై గ్రంథముననే మొదటి సంపుటమందలి 5-వ పుట:—

"గర్భకోశ సంబంధములగు కీళ్లుకొన్ని యెముకవలెగట్టి బాఱు కష్టపడుచుండు సమయమునఁదెఱచుకొనవలసిన గర్భద్వారము తెఱచుకొనుట మానును; ఈవిధముగ మిక్కుటమగు చిక్కువాటిల్లును. ఈడుముదిరిన స్త్రీలయొక్క కానుపులందే యిట్టి చిక్కుమిక్కిలి తఱచుగాఁ దటస్థించుచున్నది."———(మొదటిసంపు.—5వపుట)

(6) మఱియును 'హ్యావ్‌లక్-ఎల్లిస్' Havelock Ellis అను పండితుఁడును మఱికొందఱు పండితులునుజేరి యాశాస్త్రమునామూలాగ్రముగఁ బరిశోధించి తుట్టతుదకుఁ దేల్చిన సిద్ధాంతమేమి యనఁగా: "రజస్వలయైన పిమ్మట స్త్రీతాను పురుష సంగమము చేసినచో దానివలన బిడ్డకుఁగాని తల్లికిఁగాని యెట్టి హానియును, గలుగఁ జాలదు." 'ఇంగ్లండ్' దేశమునందుఁగూడ, గ్లాడ్‌స్టన్ Gladstone అనునతని కాలమున "గర్భాధానవయోనిర్ణయశాసన" మేర్పఱచుటకుఁ బ్రయత్నముసాగినది. ఆయుద్యమమును నుద్దేశించి పైఁజెప్పిన హ్యావ్‌లక్...

ఎల్లిస్,' అను పండితుఁడు ఆఱవ సంపుట మందలి 11-వ యధ్యా
ములోని 524, 525-వ పుటలలో నీ దిగువరీతిగ వ్రాసియున్నాఁడు

"ఈవిధములగు శాసనములు వారి వారియిష్టాను సారముగ వా
బుద్ధికిఁదోచిన రీతిగఁ గల్పింపఁ బడిన వనియును, బ్రకృతి విరుద్ధ
యును దెలిసికొన వలసియున్నది. దానికి జీవశాస్త్రసంబంధమ
ధార మేమియునులేదు. లోకజ్ఞానముఁగలవారు వాని నంగీక
ఇతర విషయములకు సంబంధించిన ప్రపంచకజ్ఞానము గలిగి య
కెంత యీడవసరమో యంత యీడును వారీవిషయమై స్త్రీలకు ని
చుచున్నారు. కాని, యుక్తమగు సంభోగార్హప్రాయము స్త్రీలకు
నిర్ణయించినప్రాయముకంటె జాల కాలము ముందుగనే వారి వా
దార్ఢ్యమును బట్టియు, బుద్ధిబలమును బట్టియు నేర్పడు చున్నది.
బైన నిర్ణయించు ప్రాయమునకును, యుక్తమగు నసలుప్రాయము
నేమియుసంబంధములేదు. అట్టియుక్తమగు ప్రాయ మొక శరీర
ధమగు లక్షణముచేఁ దెలియవచ్చుచున్నది. అదియే రజస్వలయ
అదియే ఋతుకాలమునకుఁ బ్రారంభము. అదియే స్త్రీయొక్క
వములు పూర్ణముగాఁబరిపక్వ మగుటను సూచించును. బాలిక ర
మైనతోడనే బాలికాత్వమును విడచి స్త్రీత్వమును పొందుచు
యును, భర్తతోచేరి సుఖించి బిడ్డలను గనుటకు యోగ్యురా
న్నదనియును, ప్రపంచ మందలి యన్ని దేశముల జనులును స్వ
ముగ నంగీకరించుచున్న విషయమే. ఇందలి ముఖ్యమగు స
మేమనఁగా: రజస్వలకానట్టి భార్యతో గలిసిన భర్త నేరస్థుఁడగు
కాని, రజస్వలయైన భార్యతో గలిసిన భర్తనేరస్థుఁడు కాఁజాలఁడు

(2) మఱియును బైగ్రంథముననే 636-వ పుటలో:

"మిల్‌నర్ అనునతఁడు Milner 14 ఏండ్లప్రాయమున
వతియైన యొక బాలికసమాచారమును గ్రంథస్థము చేసియున్నా
లాన్‌సెట్, జూన్ నెల 7 వ తేది, 1902 వ సం॥ము Lancet J
1902. ఆ బాలిక పడినప్రసవవేదనము కొద్దియేనఁట; మిక్కిలి సు
గాఁప్రసవించెనఁట: 'న్యూ-జెర్సీ' నివాసియగు 'ఈ. బీ. మేల్స్'
Males of New Jersey అనునతఁడు మఱియొక పిల్లయొక్క స

రము వ్రాసిపెట్టెనఁట ఆపిల్ల 11 ఏండ్ల ప్రాయముననే గర్భవతి యాయెనఁట; సామాన్యమగు పరిమాణమే గలదియఁట కాని యన్ని యవయవములును బూర్తిగా బరిణమించియున్నవఁట; పదియేండ్ల ప్రాయముననే రజోవతి యాయెనఁట; ప్రసవకాలమున మితిమీరినబాధగాని, మూలుగులుగాని, యేడ్పులుగాని, పెడబొబ్బలుగాని, ఏమియుఁగదట; చక్కని మొగబిడ్డపుట్టెనఁట; ఆబిడ్డను దూనికవేయఁగా 11 పౌనులకు - అనఁగా రమారమి మూఁడున్నరవీశెలకు దక్కువలేక తూగెనఁట, తల్లియును బిడ్డయును సుఖముగా నుండిరఁట; తల్లికి బాగుగనే పాలుస్రవించినవఁట. "కేప్ కాలనీ Cape Colony యనుప్రదేశమునకు "బ్రిటిష్" దేశమునుండి వలసవెళ్లిన జాతిలోనియొక బాలికసమాచారమును 1902 వ సం॥ము జనవరినెల, 18 వ తేదీన బ్రిటిష్ మెడికల్ జర్నల్ British Medical Journal, January '18—1902 అనుపత్రికలో హ్వైట్ సైడ్ రాబర్ట్ సన్" White side Robertson అనునతఁడు వ్రాసిపెట్టెను. ఆబాలిక 13 వ యేటనే గర్భవతియాయెనఁట ఎట్టిశ్రమముగాని యపాయముగాని లేకయే మిక్కిలి సుఖముగాఁ బ్రసవించెనఁట బిడ్డ పూర్ణమగు నన్ని యవయవములతో యలరారుచుండెనఁట. 636-వ పుట.

ఈ పైఁజూపిన గొప్పవిద్వాంసు లందఱియొక్క యభిప్రాయములుఁగూడ హిందువులయొక్క శాస్త్రాచార పద్ధతులను నేకగ్రీవముగ బలపఱుచుచున్నవి. వానిననుసరించి, బాలిక రజస్వలయైనప్పటినుండియు భర్తతోఁజేరి సంసారసుఖ మనుభవించుటకు యోగ్యురాలగుచున్నది. లేనిపోని శాసనములను గొనితెచ్చిపెట్టి యట్టిసుఖమునకు భంగము గలిగింపఁజూచుటపాపహేతువు. బాలికయొక్క గర్భకోశము మొదలగు నవయవములు పూర్తిగఁబరిణమించి వానివాని పనులను జేయ సమర్థములై యున్నవనియును, నందుచే బాలికగర్భవతియై బిడ్డను గనుటకుఁ దగియున్నదనియును స్వభావసిద్ధముగఁ దెలియఁజేయు చిహ్నమే బాలికయొక్క ప్రథమరజోదర్శనము.

౯.హ్యావెన్‌లక్ ఎల్లిస్ Havelock Ellisఅనునతఁడు చెప్పియున్న యీక్రింది విషయమును బైరిపార్టీరులు గమనించుటమంచిది:—

"బాల్య వివాహములే లేని పక్షమున స్త్రీపురుషులు నిజముగ నీతికి గట్టువడి నడచుటయే సున్నయని కొంచెమాలోచించినచోఁ బ్రతి వానికిని దెలియవచ్చును; ప్రకృతి సిద్ధమగు రతి సౌఖ్యము ననుభవింప నీయక, యీడువచ్చిన స్త్రీపురుషులను శాసనమూలముగ నిర్బంధింపఁ జూచుట యిదివఱలోఁ జెప్పినరీతిగనట్టి స్త్రీపురుషులయెడను, దేశము యొక్క జాతి యెడలను నపరాధమును గావించుటయేగాని వేఱుగాదు. అట్టినేరముచేఁ బ్రకృతి సిద్ధమగునభిలాషను నాశనముచేసినవారగుదురు.

ఈ హేతువుచేతనే హిందూమత శాస్త్రకర్తలగు మహర్షులందఱును గూడ బాలికలకు రజస్వలలు కాకపూర్వమే వివాహములను, రజస్వలలైన వెంటనే గర్భాధానమును నిర్ణయించి విధించియున్నారు.

9. సుప్రసిద్ధులగు దేశాభిమానులలోనుసంస్కర్తలలోను నొకరై యిటీవలఁగీర్తిశేషులైన శ్రీలాలా లజపతిరాయిగారు తాముప్రాసిన, అన్‌హ్యాపీఇండియా Late Mr. Lala Lajpat Rai's Unhappy India పుస్తకములో 214 పుటయందిట్లు వ్రాసియున్నారు:—

"స్త్రీతన వివాహమునకు ముందే పురుషసంయోగ మనుభవించు నాచారముగాని, పిమ్మటఁ బెక్కుమంది పురుషులసంయోగ మనుభవించు నాచారముగాని, యితర దేశములందు కంటె, ఇండియా దేశములో మిక్కిలి యరుదు. పాశ్చాత్య దేశములం దతిబాల్యవివాహములు లేక పోవచ్చును; గాని యంత మాత్రముచే నతిబాల్యమున స్త్రీపురుషసంయోగములు లేవని తలంపరాదు. ఇండియాలో బాల్యవివాహమనఁగా బాల్యముననే సంయోగముఁగలుగఁ జేయుటయని యర్థముకాదు. అంతేగాక స్త్రీతనపురుషుని జేరుటకు ముందితరపురుషుల సంయోగమును జేయకుండ వారించుటలోఁగూడఁ బై బాల్యవివాహములుఁదోడ్పడుచున్నవి. పాశ్చాత్య దేశములందట్లుగాక, ధర్మమైనను, నధర్మమైనను వివాహమునకుపూర్వమే సంయోగము చేయుటయుచితమనితలంచువారుకూడఁ గొందఱున్నారు. ఇట్టియాచార మింగ్లండు దేశమందించుమించుగఁ బల్లెటూళ్లయందంతటను సామాన్యమైయున్నదని "హ్యావ్‌లక్ ఎల్లిస్' Havelock Ellis అను గ్రంథ కారుఁడు వ్రాసియున్నాఁడు. ముఖియునతఁడే యింక నేమి[illegible] దేశములందు

స్త్రీలకు వివాహముకాక పూర్వమే పురుష సంభోగసౌఖ్య మనుభవించుట సర్వసామాన్యమైన యాచారముగ నలరారుచున్నదఁట. అట్టి స్త్రీలు కొందఱు తాము మొదట మచ్చుజూచిన పురుషునే పిదప పెండ్లియాడుదురఁట. మఱికొందఱట్లుఁగాక తమకుఁదగినవరుని నిర్ణయించుకొనుటకుగాను మచ్చుజూచుటకై యనేకపురుషులతో సంగమముచేయుదురఁట.........ఆరీతిగనే 'స్ట్రాఫ్ఫర్ షైర్' Strafford-Shire ప్రదేశమందలి కొన్ని భాగములలో స్త్రీవివాహమాడుటకు ముందేయొక బిడ్డను గనియుండుటఁగూడ నాచారమంట. స్వీడను Sweeden దేశములో నెక్కువ వివాహము లీతీరుగనే జరుగునని ఎల్లెన్. కీ. Ellen Key అనునతఁడు వ్రాసెనని పైఁజెప్పిన "ఎల్లిస్' పండితుఁడు వ్రాయుచున్నాఁడు. వివాహమునకుపూర్వమెంతస్వాతంత్ర్య మనుభవింపఁబడుచున్నదో వివాహానంతరము పాటింపవలసిన పాతివ్రత్యనియమమునందు గూడ నంతటిస్వాతంత్ర్యమే యనుభవింపబడుచుండుటచే నీయేర్పాటుచాలా యనుకూలమని తలంపఁబడుచున్నదఁట. డెన్మార్కులో Denmark కూడననేకమంది బిడ్డలు, తల్లిదండ్రులకు వివాహములు జరుగకపూర్వమే పుట్టినవారు గలరు" 214 వ పుట.

10. పైపుస్తకముననే 21 వపుటలో 'హావ్ లక్-ఎల్లిస్' Havelock Ellis పండితుఁడు వ్రాసియుంచిన యొకసమాచారము తూర్పు జర్మనీ దేశమునకు సంబంధించినది యిట్లు వర్ణింపఁబడియున్నది:—

"పురుషసంయోగమందలి యభిరుచియిట్టిదగుటచేత నేపదునాఱేండ్లు దాఁటిన స్త్రీలలో సంయోగసౌఖ్య మనుభవింపని దొక్కతెయు నుండఁజాలదని యనేకులు నమ్మియున్నారు. అందాశ్చర్యమేమియును లేదు.

11. పైపుస్తకముననే 216 వ-పుటలో నిట్లువ్రాసియున్నారు:—

"మనము తప్పక జ్ఞాపకముంచుకొనఁదగిన విషయమేమనఁగా ఇండియాలో బాలికలకు వివాహమైన పిమ్మటఁజాలాకాలమునకుఁ బురుషసంయోగము గల్గుచుండఁగాఁ బాశ్చాత్య దేశములలో వివాహమునకుఁ జాలాకాలము ముందుగనే యట్టి సంయోగము లభ్యపడుచున్నది. ఇండియాలోని బాల్యవివాహముల నాక్షేపించు పెద్దమనుష్యులీ విషయమును 216వ పుట.

12. అమెరికాలో (జూ-వెనైల్-కోర్టులో Juvenile Court అనఁగాఁ బిల్లవాండ్రుచేసిన నేరములనువిచారించెడి ప్రత్యేకన్యాయస్థానములో 25 సంవత్సరములు జడ్జిపనిచేసిన 'జెజ్-లిండ్సే' గారి Judge Ben Lindsey యనుభవవిషయముగూడఁ బైపుస్తకమున 217—వ-పుటలో నీక్రింది రీతినివర్ణింపఁబడియున్నది:—

"లిండ్సే-యను జడ్జీ విచారించిన నేరములలో నెక్కువభాగము హైస్కూలులోఁ జదువుబాలురకును బాలికలకును సంబంధించియున్నది. వీరిలో నించుమించుగనందఱును గొప్పఖ్యాతిగల ధనవంతులకుటుంబములకుఁ జెందినవారైయున్నారు. ఇట్టి బాలికలలోఁ బైజడ్జిచే విచారింపఁబడిన వారనేకులు పురుషసంగమమును గుఱించి తెలిసికొనఁదగిన యీడురాక-పూర్వమే యట్టి సంగమసౌఖ్యానుభవ మభిలషించుచుఁ గామోద్రేక పరవశ లగుచున్నారు. వారివిషయమై యాజడ్జీయిట్లు చెప్పుచున్నాఁడు:— హైస్కూలులోఁ జదువు బాలురును బాలికలును జేరి టీ పార్టీలు (Tea Parties) మొదలగు వానికిఁ బోవుచుందురు:— అచ్చటి నాట్యములలో (Dances) పాల్గొను చుందురు; మోటారుబండ్లలో నెక్కి షికారు పోవుచుందురు. ఇట్టివారిలో నూటికిఁ తొంబది (90) మంది యాలింగన సౌఖ్యమునకును (అనఁగా, కౌఁగలించు కొనుటకును) చుంబన సౌఖ్యమునకును (అనఁగా, ముద్దుపెట్టుకొనుటకును) రుచి మఱిగియున్నారు.........కొందఱు బాలికలు తమ వెంటవచ్చు బాలురిట్లు చేయఁగోరి, తీవ్రముగనిట్టి సౌఖ్య మభిలషించుచు నందులకు వలసిన సరస సల్లాపముల వాతురతతో సాగించుచుందురు. అట్ల యాతురతలో బాలురు సహితము బాలికలకుఁ దీసిపోరు. (అనఁగా నిరువురును సమానముగనే యాతురతఁజెందుచుందురు")

కాని ఆలింగనమును, జుంబనమును మైధునకర్మకు నారంభమందలి యంగములేగాని పర్యవసానాంగములు గావుగదా! "అట్టి యంగములతో నారంభించిన వారిలోఁ గనీసము నూటికి 50 మంది యైనను నితరాంగములతోఁ గూడఁ జేర్చి మైధున సౌఖ్యమును దుదముట్టఁ అనుభవించియుండురే కాని, యంతటితో నిలువరు. ఇట్టిచర్య లనుచితమ

నున్నమాట యన్నిసంఘములవారును గొంతెత్తి యాందోళనము చేయుచున్న విషయమే గదా!" (అన్‌హ్యాపీ - ఇండియా 217-వ పుట)

పై విధములగు మర్యాదలన్నియును మన సంఘమున లేనిలోపమును దీర్పఁ గోరియేఁగదా, యిప్పటి రిఫార్మరులు మన దేశమందలి బాల్య వివాహములను, రజస్వలానంతర గర్భాధానములను నిలిపివేయఁ గోరి శాసనములు గావింపఁ జూచుచున్నారు! వీరి కోరిక ప్రకారము పై శాసనము లేసాగనిండు; పైవిధమగు దురాచారములు మన దేశమునఁ గూడ విజృంభించి దేశమును ధ్వంసముఁ గావింపకున్న నపుడు చూతము. బాల్య వివాహములు లేని యితర దేశములందుఁ బొడముచున్న యిట్టి కుళ్లు నంతెను దెలిసికొనజాలక, కన్నులు మూసికొని "సంఘ సంస్కరణము, సంఘసంస్కరణము" అని పలవరించక దీర్ఘాలోచనము చేయుడు. మీరు చేయునది పరకీయదురాచారానుసరణముగాని సంఘ సంస్కరణ మెంతమాత్రము కాఁజాలదు. దీనివలన పరదేశమునందు ప్రబలుచున్న దురాచారములే మన సంఘమునందుకూడ కలుగఁ గలవని లోకానుభవజ్ఞులగు పూర్వాచారపరాయణులగు విమర్శకులు చెప్పగా వారిని పరిహసించుచు వారి యభిప్రాయములను తమపత్రికలందు ప్రకటింపకయు, శాస్త్రమర్యాదను భారతీయస్త్రీ సంఘమర్యాదను చిన్ననాడే వదలి స్వేచ్ఛాచారపరాయణలయిన స్త్రీల లజ్జావిహీనచేష్టలను స్త్రీస్వాతంత్ర్యమనియు, వ్రాతలను అభిప్రాయములను భారతీయ స్త్రీలందఱియొక్క అభిప్రాయమని సాహసముతో వ్రాయునట్టియు, ప్రకటించునట్టియు కొందఱు పత్రికాధిపతులయొక్క విపరీత ప్రవర్తనమును మేము ఏవగించుచున్నారము.

3-వ. హేతువు:—(అనఁగా, బాలికల యవయవములు పరిపూర్ణాభివృద్ధిని జెందక పూర్వమే గర్భములుగల్గుచుండుటచేఁ బుట్టిన పసిబిడ్డ లనేకమంది చని పోవుచున్నా రను హేతువు.)

సమాధానము:—ఈ హేతువు సరియైనది కాదు. ఇట్టి తప్పుడు హేతువును జెప్పి రిఫార్మరులు జనులను మోసగించుచున్నారు. ఏల యనఁగా; బాల్యవివాహములున్న సంఘములందుఁగాని, దేశములందుఁ గాని, పసిబిడ్డల మరణము లెక్కువగా నున్న వనుటకుఁ దగిన నిదర్శనము

లేనేలేదు. బెంగాల్, ఒరిస్సా, పరగణాలలో 1911 సం॥రవు జనాభా లెక్క లను బరిశీలింపఁగా, బాల్యవివాహములకును, బసిబిడ్డల మరణములకును నేమియును సంబంధము లేదని ఋజువగుచున్నది. కొన్ని జిల్లాలలో జరుగు వివాహములలో 1000 కిని, బాల్యవివాహములు (అనగా 10 యేండ్లు మొదలు 15 ఏండ్లలోపలి యాఁడుపిల్లలకు జరుగు పెండ్లిండ్లు) లెక్కింపఁగా, 180 మొదలుకొని 565 వఱకును గలవు. అట్టిజిల్లాలలోనే శిశుమరణముల సంఖ్య మిక్కిలి తక్కువగా నున్నమాట నిర్వివాదాంశము. బాబూ-చారు చంద్రమిత్ర (Babu Charu Chandra Mitra) యను నతఁడు చూపియున్నాఁడు. బాల్యవివాహములు చేయుదేశములలో స్త్రీ

? ఙ్యస దర్భాంగ సంస్థానమందు జరుగు వివాహములలో 1000 కి 565 బాల్యవివాహములుగా నున్నవి. ఆదేశమందలి శిశుమరణ సంఖ్య నూటికిని 13 మొదలు 16 వఱకును నున్నది. 'డార్జిలింగు నందును పూరీయందును 1000 కిని 17 మొదలు 20 వఱకు మాత్రమే బాల్య వివాహములు జరుగుచున్నవి. కాని యా దేశమందలి శిశుమరణ సంఖ్య నూటికి 21 మొదలు 22 వఱకును, 22 మొదలు 24 వఱకును గలదు. ఇఁక 'బర్మా',యందు బాల్యవివాహములు లేవనియె చెప్పవచ్చును. ఏ యున 1000 కిని, 4 మాత్రమే యట్టివివాహములు జరుగుచున్నవి. ఆదే శమందలి శిశుమరణసంఖ్య, బెంగాల్, బీహార్, ఒరిస్సా లనుమూఁడు దేశములందలి సంఖ్య కంటె నెక్కువగా నున్నది. ఈమూఁడు దేశము లును బాల్యవివాహములలోఁ దక్కిన దేశముల కంటే ముందంగ వేయు చున్నవి 'అప్పర్-బర్మా" దేశమున శిశుమరణసంఖ్య 1000 కిని మగ శిశువులు 215; ఆఁడు శిశువులు 192 'లోయర్ బర్మాలో మగశిశు వులు 244 ఆఁడు శిశువులు 221 చైనాదేశము (China) నందు, శిశు మరణ సంఖ్య 315; రష్యా (Russia) లో 245; హంగే (Hungary)లో 204; ఇండియాలో మగశిశు మరణములు 211 ఆఁడు శిశుమరణములు 199 రెండును జేర్పగా, సఱటున (average) 20 మాత్రమే యగుచున్నది.

('Rationale of Early Marriagem Syste) అనగా "బాల్యవివాహపద్ధతియొక్క సత్యసారము' అను గ్రంథములో శ్రీ యుత

యు- పీ- కృష్ణమాచార్య (Mr. U. P. Krishnama Charya) అను వా రిట్లు వ్రాయుచున్నారు:—

"మదరాసు పట్టణముమాటయే యాలోచింతము. 1926-27 సంవత్సరముల జననమరణాలలెక్కలను, కార్పొరేషను వారు తయారు చేసి ప్రకటించియున్నారు. వానినిబట్టి చూడఁగా నెక్కువ బాల్యవివాహములేచేయు బ్రాహ్మణసంఘమందే, తక్కిన యన్ని సంఘములందుకంటె శిశుమరణసంఖ్య తక్కువగా నున్నదని స్పష్టమగుచున్నది.

వీని నన్నిఁటినిఁబట్టిచూడఁగా, రిఫార్మరులుచేయు పైవాదము నిరాధారమనియు వట్టి దుర్వాదముచే జనులను మోసగించుచున్నారని యును విశదమగుచున్నది. ఇంగ్లండు, ఫ్రాన్సు మొదలగు దేశములందు శిశుమరణసంఖ్య 1000 కిని, 100 మొదలు 152 వఱకు నుండును. అందుచే నాదేశములందుకంటె నిండియాలో నట్టి మరణసంఖ్య యెక్కువ నమాట వాస్తవమే కావచ్చును. కాని యందులకు హేతువులు దారిద్ర్యమును, వ్యాధులును, పాలును, నాహారపదార్థములును, మొదలగునవి కొఱతపడుటయును, నివాసప్రదేశము, లపరిశుభ్రమగు స్థలములుగా నుండుటయును, నారోగ్యశాస్త్రసంబంధమగు పద్ధతులు జను లెఱిఁగియుండకపోవుటయును మొదలగు కారణము లనేకములుండవచ్చును. మనదేశపు దారిద్ర్యవిషయమై యీక్రింది విషయమును బరిశీలించిన దెలియును. 1924 సం॥ రమున, ఇండియా దేశమందలి యాదాయము సకుటున నొక్కొక్క మనుష్యునకు 30 రూపాయిలాలని లెక్క తేలినది. అదియే యింగ్లండు దేశమున మనుష్యున కొకనికి 586 రూపాయిలవంతునను, అమెరికాలో 600 రూపాయిలవంతునను, లెక్క తేలుచున్నది. ఆసంవత్సరమున ఇంగ్లండ్ దేశమున విద్యాభివృద్ధికై వెచ్చింపఁబడిన ద్రవ్యము మనుష్యున కొకటికి రూ. 4-12-6 పై॥వంతున లెక్క తేలుచున్నది; అమెరికాలో రూ. 12-0-0 వంతునఁ దేలుచున్నది. ఇఁక ఇండియాలో నెంత తేలుచున్నదో తెలియునా? ఒక్కొకమనుష్యునకు రూ. 0-1-0 పై. (అక్షరాల ఒక అణా) వంతున తేలుచున్నది. అమెరికాలోఁ జదువు నేర్చినవారు నూటికి 99 మందికిఁ బైగా గలరు; ఇంగ్లండులో 100 కి 99 వంతునగలరు; జపానులో

నూటికి 95 వంతునఁగలరు. ఇఁక, ఇండియాలో బెంగాలులో ఎందఱు గలరో తెలియునా? నూటికి 7 మందికి పైగాగలరు. ఇట్టి పరిస్థితులలో ఇండియాలో మరణసంఖ్య యితర దేశములందుకంటె నెక్కువగనున్న దుల కాశ్చర్యపడవలెనా ? ఇండియాలో మరణసంఖ్య 1000కిని, 34కు పైగా నున్నది. ఇంగ్లండునకు జపానులోను నూటికి 11 కు పైగా 20 పైగాను నున్నది. ఇండియాదేశపు పై పరిస్థితుల నితర దేశపు తులతోఁ బోల్చి చూచితిమేని మరణసంఖ్యయం దింత కొద్దివ్యత్యా మున్నందుకు సంతసింపవలెఁగాని యబ్బురపడవలెనా !

4-వ హేతువు:— (అనఁగా బాల్యవివాహముచేఁ దల్లులు బిడ్డలును దుర్బలశరీరములు గలవారగుచున్నారను విషయము,)

సమాధానము:— విచారింపఁగాఁ బై దానివలె నిదియును సరియైన హేతువుకాదు. జనాభాలెక్కలరిపోర్టులో 303-వ పుటలో. ఓమ్లీ (Mr. O'Mally) యనువారీక్రిందిరీతిగ రిమార్కు వ్రాసియున్నాడు. బాల్యవివాహములను నిల్పివేయవలయు నను నుద్యమముతో వీరు పాల్గొనియున్నవారే సుమీ:—

"బాల్యవివాహములు విరివిగా వ్యాపించియున్నను, బీహారు దేశమం దాడువారి మరణసంఖ్యను మగవారిమరణసంఖ్యతోఁ బోల్చి చూడఁగా, నూటికి 89 తేలుచున్నది; బెంగాలులో 91 కిఁ గొంచెము పైగాఁ దేలుచున్నది. కాని, యూరపునందు 90 కిఁ గొంచెము పైగ దేలుచున్నది. దీనినిబట్టి బాల్యవివాహములు చేయు దేశమునకును జేయనిదేశమునకును, నెక్కువవ్యత్యాసమే గనుపట్టుటలేదనిభావము."

హిందూస్త్రీలు జీవించు విధానము తక్కిన యితరమతముల దన్నిఁటియందును బురుషులు జీవించు విధానముకంటె బాగుగానున్నది.

19?8-వ సంవత్సరపు జనాభారిపోర్టు 233-వ పుటలో నిట్లు వ్రాయఁబడియున్నది:— మహమ్మదీయస్త్రీలకంటె హిందూస్త్రీలె క్కువకాలము జీవించుచున్నట్లు గనుపట్టుచున్నది. 10 సం॥రము మొదలు 15 సం॥రముల యీడులోపలఁ బెండ్లియగువారు, హిందూ స్త్రీలసంఖ్యలో ముప్పాతికభాగము మాత్రమే మహమ్మదీయ స్త్రీ లోఁగలరు. బాల్యవివాహములు సృష్ట్యాదినుండియు వచ్చుచున్న

సాధ్యాచారమని తెలిసికొనదగియున్నది. ధర్మశాస్త్రకర్తలలో సరిదీటికంటెను, బురాతనుఁడైన మనువు స్త్రీలకు 8 మొదలు 12 సం॥ర ముల యీడులోపలనే వివాహములను విధించియున్నాఁడు. కాని పూర్వకాలమందలి జనులలో హిందువు లందఱికంటెను నన్నివిధముల ముందంగవేయువారుగ నుండిరేగాని యేవిషయమునను నొకరికిఁదీసి పోయి యెఱుఁగరు. మహమ్మదీయప్రభుత్వము ప్రారంభము కాకముందును హిందువులు దీర్ఘకాలము జీవించుచుండిరి. అదిమొదలు వారి యాయువు క్రిమముగాఁ దగ్గిపోవ నారంభించెను.

మౌలానా–మియుడ్–హజుడ్డీన్ (Maulana Miud Hazuddin) అనువా రిట్లుచెప్పియున్నారు:—"హిందువులయొక్కయు, మహమ్మదీయులయొక్కయు, జరిత్రలను బరిశీలింపఁగా, సగటున (average) హిందువులయొక్కజీవితకాలమే మహమ్మదీయులయొక్కజీవితకాలము కంటె నెక్కువగనున్నది. శీతోష్ణపరిస్థితు లిరువురి విషయమునఁగూడ సరిసమానముగనే యున్నప్పటికిని, సగటున హిందువుఁడు 102 సం॥రములవఱకును జీవించుచున్నాఁడు. మహమ్మదీయుఁడు 76 సం॥లు మాత్రమే జీవించుచున్నాఁడు."

అబ్దులు-ఫజాల్ (Abdul-Fazal) అనుప్రసిద్ధచరిత్రకారుఁడు, క్రిందిరీతిగఁ జెప్పుచున్నాఁడు:—హిందువులు మహమ్మదీయులకంటె దీర్ఘకాలము జీవించుటమాత్రమేగాక, వారిలో మరణసంఖ్య సామాన్యముగ మహమ్మదీయులందుకంటె మిక్కిలి తక్కువగనున్నది. హిందువులు సగటున 90 యేడ్లవఱకును బ్రతుకుచున్నారు. మహమ్మదీయులట్లుగాక 78 సం॥ములు మాత్రమే బ్రతుకుచున్నారు."

దీనివలన బాల్యవివాహములుగల హిందువులందే యాయురారోగ్యములు తక్కినజనసంఘములందుకంటె నెక్కువగ నున్నవనిబుజువగుటలేదా !

౬-వ హేతువు:—(దేశమందలిజాతిబలవంతులును, నారోగ్యవంతులును నగుటకు బాల్యవివాహములు భంగకరములనువిషయము.)

సమా... బాల్యవివాహములను తుద

ముట్టింపఁ గోరురిఫార్మరుల కిది యింకొకనెపమేగాని యంతకంటె మియును లేదు.

లాలా లజపతిరాయిగారీవిషయమై అన్‌హ్యాపీ- ఇండియా నీక్రింది రీతిగ వ్రాయించియున్నారు. Lala Ms Lajpat R Unhappy India

"ఆదికాలము నుండియు బాల్యవివాహములేయాచారము రారుచున్న ప్రజాసంఘములనుండియే పేరుమోగిన నాగరికజా ద్భవించియున్నవి. గ్రీకువారు (Greeks) బాల్యవివాహములనే చరించియుండిరి. యోధాగ్రేసరులై యనేకదేశముల నాక్రమించిన మనుజాతివారు (Romance) బాల్యవివాహములను గావించుచు వారే. హీబ్రూజాతియునట్లుచేసినదే. ఇంగ్లండులోనూ'' స్టూవర్ట్ కాలమువరకును (Stuarts) బాల్యవివాహములే సామాన్యముగ చారమై యుండెను."

"బాల్యవివాహములు జాతికి నరిష్టదాయకములే మైయ చోఁ గ్రీకులును, రోమనులును, హీబ్రూలును, దేశచరిత్రయందుఁ ప్రఖ్యాతినొందుట కవకాశమే లేకుండెడిది."

అంతేగాక, బాల్యవివాహములు చేయక యాలస్యము వివాహములుచేయుటచేత సుఖవ్యాధులెక్కువగ వ్యాపించుటకు హే వగుచున్నదని యెఱుంగవలయును. ఈవిషయమై హ్యావులక్ - ఎ పండితుఁ డిట్లు వ్రాయుచున్నాఁడు:—

"న్యూయార్కుపట్టణమున (New York Havelock El ప్రతిసంవత్సరమునను గనీసము 2 లక్షల 50 వేలమంది ప్ర సుఖవ్యాధులచేఁ బీడింపఁబడు చుండిరనియు, నాపట్టణమందలి ప్పకుటుంబములలోఁ బుట్టినవారిలోఁ గూడ గనీసము మూఁడు లు మగపిల్లవాండ్రు' సిఫిలిస్ (Syphilis) అనగా సవాయి వ్యాధిచేత బాధపడుచుండుటను స్వయముగా నెఱుఁగుదు యానగరమందలి యొక వైద్యశాస్త్రజ్ఞుఁడు చెప్పెననియు, దెలిసి విషయమును విచారించుటకై యొక వైద్యసంఘ మేర్పాటుచేయఁ నది. జర్మనీదేశమునఁ బ్రతివత్సరమును సుఖవ్యాధులచే బీడింపఁ

వా రెనిమిదిలక్షలు గల రని యధికారులు లెక్కించిరి. గొప్ప విశ్వవిద్యాలయములలో (Universities) విద్యార్థులందు సుఖవ్యాధులు సర్వసామాన్యము. వారిలో నూటికి 25 వంతున సట్టివ్యాధులచే బీడింపఁబడుచుందురు. జర్మనీదేశపుసైనికులలోని సుఖవ్యాధిపీడితుల సంఖ్య ఫ్రాంకో-ప్రషియన్‌యుద్ధమున (Franco-Prussian War) గాయములు తగిలిన సైనికులసంఖ్యలో మూఁడవవంతుండును. ఐనప్పటికిని బ్రిటిషుసైనికులతోఁ బోల్చి చూచిన జర్మనీసైనికులే నయమనిపించుకొందురు. బ్రిటిషుసైనికులందున్నంతమంది సుఖవ్యాధిపీడితులుయూరపు నందలి యేయితరసైన్యమునందును లేరు. ఇండియాలోని సైనికుల మాట చూచిననుగూడ బ్రిటిషుసైనికులందున్న సుఖవ్యాధిపీడితులసంఖ్య ఇండియన్ సిపాయిలందున్నసంఖ్యకంటె పదిరెట్లెక్కువగనున్నది."

'గనేరియా (Gonorrhea) రోగమువిషయమై ఎల్లిస్‌పండితుఁడిట్లు వ్రాయుచున్నాఁడు:—"అమెరికాలో నీడువచ్చిన మగపిల్లవాండ్రలో గనేరియాచేఁ బీడింపఁబడువారు నూటికి 75 మొదలు 80 వఱకును గలరని 'ఉడ్-రగల్స్' (Wood Rugles) అనునతఁడు లెక్కవ్రాసియున్నాఁడు. ఇంగ్లండులో నీడువచ్చిన మగపిల్లవాండ్రు గనేరియాచేఁ బీడింపఁబడువారు నూటికి 75 వంతున నొకతూరియు, 40 వంతున నొకతూరియు, 15 వంతున మఱియొకతూరియు నుండిరి.

దీనిని బట్టి యింగ్లండు, అమెరికా మొదలగు దేశములందు బాల్యవివాహములు లేక ఆలస్యవివాహములు మాత్రమే యుండుటచే అట్టిదేశములందు ఇట్టి దురవస్థలన్నియు గలుగగలవను విషయమును దృష్టిలోనుంచికొనియే సర్వజ్ఞులగు మన్వాది మహర్షులెల్లరును ధర్మశాస్త్రములందు బాల్యవివాహములనే యేకగ్రీవముగ విధించి యుండిరి. వానినిదోసి రాజనినచో, మనదేశమునకుఁ గలుగబోవు ఫలము కూడఁ బైవిధముగనే యుండును.* జాగ్రత. జాగ్రత.

ఇట్లు. కనుపర్తి మార్కండేయశర్మ

* ఈవ్యాసమును ఆంధ్రదేశమునందుగల పత్రికాధిపతు లందఱు తమతమ పత్రికలందు మఱల ప్రకటించిగాని, లేక విమర్శించిగాని సానుభూతిచూప ప్రార్థన.
ప. సం.

# శ్రీ. పం. మదన మోహన మాలవ్యాగా[రి]

# శాస్త్రవిశ్వాస పరిణామము.

గతసంవత్సరము ప్రయాగలో కుంభమేళసమయమునందు శ్రీమాలవ్యా[గారి] సనాతనధర్మసభను సమకూర్పగా, అందు సభ్యులగు పండితులు స్త్రీ, శూద్ర, అంత్య[జు]లకు ప్రణవసహిత మంత్రోపదేశము అశాస్త్రీయమని నిర్ణయించి [యు]న్నను కాశీలో జరిగిన అఖిలభారతవర్షీయ బ్రాహ్మణసమ్మేళమునందు కూడా [నిర్ణ]యించిరి. అంతటితో తృప్తినొందక, శ్రీమాలవ్యాగారు, శ్రీ గోవర్ధనపీఠా[ధిప]తులవారి యాధిపత్యముతో, అఖిలభారతవర్షీయసనాతనధర్మసభయనుపేరులో [ప్రయాగ] నగరమున హిందూమహాలులో బ్రాహ్మణసభ జరిగిన మరునాటినుంచి మూడు[రోజులు] సభచేయగా ఆసభలోగూడా పైవారికి ప్రణవసహితమంత్రగ్రహణాధి[కారము] లేదనియు, ప్రణవరహితముగ గలదనియు తీర్మానింపబడెను. శ్రీమాలవ్యాగా[రు దీని]ని సమ్మతింపక కొందరు పండితులను కమిటీగానియమించి ఐదుమాసములు [తర్కించి] శాస్త్రసమ్మతముగా ఈవిషయమును నిర్ణయించకోరిరి. ఇప్పుడు తాను ఏర్ప[రచిన] కమిటీనికూడా తిరస్కరించి ఈవిభవసం॥ మార్గశిర, శుక్లపాడ్యమిమొదలు పంచ[మి వరకు] శ్రీకాశీక్షేత్రమున దశాశ్వమేధ ఘట్టమునందు రుద్రస్వాహాకారయాగముచే[సి, ఆ] నాడు షష్ఠిమంగళవారము నాడు, చండాలురకు ప్రణవపూర్వక, పంచాక్ష[రి, అష్టాక్ష]రి మంత్రములను శిరస్సుమీద చేయియుంచి శ్రీమాలవ్యాగారు ఉపదేశించి[రి. ...] గురు అంత్యజబాలకులు, 300 గురు ఇతరులును ఉపదేశము నొందిరి. అర్థా[ర్థులగు] దరిద్ర విద్యార్థులు మాత్రము కొందరు బుద్ధ్యాకులుగా పోయియుండిరి. మరు[నాడు] మార్గశిర, శుక్లసప్తమి, బుధవారము (19-12-28) కూచిబిహార్ రాజాగారితో [...] శ్రీద్వారక జగద్గురు పీఠాధిపతిగారి సభాధిపత్యముతో సనాతనధర్మ పరాయణులగు కా]శీపండితులు సభచేసి యందు మహామహోపాధ్యాయ, తర్కరత్న పంచానన, [...] చరణ భట్టాచార్య, రామభవన్ పండిట్ మున్నగుపండితశ్రేష్ఠులును, భారత[ధర్మ] మహామండల ప్రవర్తకులగు శ్రీ. దయానంద స్వామిమున్నగు వారలును, శ్రీమా[లవ్యాగా]రుచేసినది అశాస్త్రీయమనియు, దుష్కార్యమనియుగర్హించిరి. ఇంగ్లీషు చదు[వుకొన్న] బ్రాహ్మణులందఱు శ్రీమాలవ్యాగారికి గలశాస్త్రవిశ్వాసనటనమును ఇప్పుడైనా [గ్రహించి] జాగరూకులై ఉందురుగాక. ప్రారబ్ధవశమున సంభవించిన బ్రాహ్మణ, బ్రాహ్మ[ణేతర] ద్వేషము దేశమునకు చాలదని బ్రాహ్మణులకు, చండాలురకు కూడా ద్వేషమును [కలుగ]జేయు మార్గమును శాస్త్రవిశ్వాసముగల సనాతన ధర్మపరాయణుడనని చెప్పు[కొను]న్న శ్రీమాలవ్యాగారు చేయుట దేశదుర దృష్టము కాదా!

ఇట్లు

వేదుల్ల. సూర్యనారాయణ శాస్త్రి

కాశీక్షేత్రము, క్షేమేశ్వర[ఘట్టము]

# తైత్తిరీయ స్మార్తబ్రాహ్మణ

# నిత్యకర్మాష్టకము.

## సస్వరాంధ్ర టీకాతాత్పర్య స్వర సహితము.

విద్యారణ్యభాష్యము ననుసరించి వ్రాయబడిన టీకాతాత్పర్యస్వరములుగలది. ధ్యానశ్లోకానుసారము వ్రాయబడిన గాయత్రిగంగుపటముగలది. 6 వేలకాపీలు సెల వైనవి ఆలస్యముచేసినయెడల 4-వ కూర్పు అగువరకు నిరీక్షించవలెను. వెల 2-8-0

కాలికోబైండు 3-0-0 లైబ్రరీయెడిషను 4-0-0

☞ దాదాపు ౧౦౦ పుటలుగల పీఠిక, ఉపోద్ఘాతములయందు నిత్యకర్మలయొక్క ధర్మశాస్త్రవిషయములన్నియు సతాత్పర్యముగ గలవు.

### ఈ నిత్యకర్మాష్టకమునందుగల ముఖ్యవిషయములు.

౧. స్నానవిధి, ౨ శ్రుతిస్మృతి పురాణాచమనవిధి, ౩. ప్రాణాయామవివరణము, ౪. అష్టాచత్వారింసత్సంస్కారవివరణము ౫ సంకల్పవివరణము, ౬ తిథి, వార నక్షత్ర, సంవత్సర, యోగ, కరణ, మాసవివరణము, ౭. గాయత్రీజపసర్ప యాద్యనేక విషయములు ౮-౧౧. వస్త్ర, ఊర్ధ్వపుండ్ర, భస్మ, యజ్ఞోపవీతధారణవిధులు, ౧౨, సముద్రస్నానవిధి, ౧౩, త్రికాలసంధ్యావందనము, ౧౪, జపప్రకరణము, ౧౫ బ్రహ్మచారులకు అగ్నికార్యము, ౧౬, గృహస్థులకు ఔపాసనము, ౧౭-౨౩, ప్రాయశ్చిత్తౌపాసన, సమిధారోపణ, సమిధాధాన, పసుస్యహోమ పక్షహోమ, సూర్య, చంద్ర గ్రహణహోమములు, ౨౪, బ్రహ్మయజ్ఞము ౨౫, నిత్యపితృతర్పణము, ౨౬ బోధాయనసూత్రోక్తదేవతార్చనము, ౨౭, పురుషసూక్తవిధాన దేవతార్చనము, ౨౮-౨౯. శంఖ సాలగ్రామతీర్థప్రాసనవిధులు, ౩౦-౩౫. శివ, కృష్ణ, సూర్య, గణపతి, గౌరీ, శ్రీరామ, అష్టోత్తరశతనామములు, ౩౬ వైశ్వదేవమంత్రపాఠము, ౩౭ నిత్యవైశ్వదేవవిధి, ౩౮. వైశ్వదేవబలివిక్షేపణచక్రము, ౩౯. తీర్థవివరణహస్తము, ౪౦, విధుర వైశ్వదేవము ౪౧ గురుధ్యానము, ౪౨. తృచాకల్పసూర్యనమస్కారము, ౪౩. ఋగ్వేదీయమహాసౌరమంత్రపాఠము, ౪౪ సూర్యోపస్థానము, ౪౫ ఆత్మయజ్ఞము, ౪౬. భోజనవిధి, ౪౭. స్థాలీపాకవిధి ౪౮. స్థాలీపాకపరత్యాగప్రాయశ్చిత్తము, ౪౯. అతిథిపూజ, ౫౦. గోగ్రాసవిధి మొదలగువిషయములుగలవు.

ఆబ్దికమంత్రములు:—సస్వరాంధ్రప్రయోగ, టీకాతాత్పర్య ధర్మశాస్త్రసహితము. ఈగ్రంథమునందు అత్యావశ్యకములగు శ్రాద్ధభేదములు, ఉపవీత ప్రాచీనావీతనిమిత్తములు, నిమంత్రణవిధి, నిమంత్రణార్హబ్రాహ్మణులు, శ్రాద్ధమునందు వాడతగినకూరలు, ఫలములు, తగనికూరలు, స్త్రీలు మున్నగువారలు శ్రాద్ధము పెట్టవలసి నప్పుడు చేయవలసినరీతి, ... సున్నగునవి వివరముగ తెలుపబడినది. 1-8-0

# బృహత్ స్తోత్ర రత్నావళి.

## ప్రతిపదాంధ్రటీకాతాత్పర్యసహితము.

ప్రథమభాగము ఇప్పుడే సిద్ధమయినది వెల 0-12-0

స్త్రీపురుషాదులందఱకు సర్వకాలములందును అభ్యసింపదగు నానాస్తోత్ర
ములను రెండేసిమాసములకు ఒక్కొకభాగముచొప్పున ప్రకటింపదలచితిమి ఈ
భాగమునందు ౧ శ్రీశంకరాచార్యకృత దేవ్యపరాధక్షమాపణస్తోత్రము ౨ శివాప
రాధక్షమాపణస్తోత్రము 3 కనకధారాస్తోత్రము (లక్ష్మీస్తుతి) ౪ శ్రీరామభుజంగప్రయా
తస్తోత్రము. ౫. వ్యాసకృతవిష్ణుస్తోత్రము ౬ వాల్మీకికృత గంగాస్తోత్రము, ౭
డికరాయకృత లక్ష్మీలహరీస్తోత్రము. ౮. గురుధ్యానము, అనునవిగలవు.

# పాండవగీతలు.

ఆంధ్రటీకాతాత్పర్య పద్యసమన్వితము. వెల 0-10-0

ఈగ్రంథమునకు ప్రపన్నగీతలు, అని నామాంతరముగలదు. పాండవులకా
నందు భూభారము తీసివేయనవతరించిన శ్రీకృష్ణభగవానునిగూర్చి పాండవులు స
ధించిన భీష్మ, ధర్మరాజ భీమార్జున, నకుల, సహదేవ, అభిమన్యు, సాత్యకి, వి
ద్రుపద, ధృతరాష్ట్ర, దుర్యోధన, కర్ణ, సంజయ, విదుర, ఉత్తర, ధృష్టద్యు
ఘటోత్కచ, సంజయ, ఉద్ధవ, అక్రూర, కృతవర్మ, వికర్ణ, సోమదత్త, క
భూరిశ్రవాదులును, ధౌమ్య, ద్రోణ, కృప, అశ్వత్థామాదులును, ప్రహ్లాద, నా
పరాశర, పుండరీక, వ్యాస, అంబరీక, శుక, శౌనకాదులును, కశ్యప, అత్రి, భ
జ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, వసిష్ఠాదిమహర్షులును, సుభద్ర, ద్రౌపది,
గాంధారి, అరుంధతి మొదలగు పతివ్రతారత్నములును, దాదాపు ౧౦౦ భక్తులు శ్రీ
భగవానునిగూర్చి తమతమగల యభిప్రాయములను ప్రసన్నులయి విన్నవించిరి. హృ
పూర్వకముగ భగవత్ప్రపత్తినిగూర్చి చెప్పినవగుటచేత ఒక్కొకశ్లోకము చదువునప్పు
దేహము పులకాంకురములు గలుగుచుండును.

# శ్రీ విద్యారత్నసూత్రములు:— శ్రీశంకరారణ్య, అ
బ్రహ్మ పండితకృత వ్యాఖ్యాసహితము. శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యుల
పరమగురువులగు గౌడపాదాచార్యకృత శ్రీవిద్యావిషయక శాక్తమీమాంసా
ములు. 0-

సనత్సుజాతీయము:— శంకరభాష్య ఆంధ్రటీకాతాత్పర్యసహితము
త్సుజాతులవారు ధృతరాష్ట్రునకు ఉపదేశించినది, ఆంధ్రాక్షరములందు శ్రీ
శంకరభాష్యముతో ముద్రింపబడినగ్రంథము ౧-

ఉడుదశాప్రదీపిక:— సతాత్పర్యము 0-4-0 గ్లేసు

# యోగాభ్యాసదర్పణము.

శ్రీ పరమహంస పరివ్రాజకాచార్యవర్య

శ్రీబ్రహ్మానంద సరస్వతీయతీంద్ర విరచితము.

గ్లేసుకాగితములు 0-12-0 లైబ్రరీయడిషన్ 1-4-0

యోగపాతంజలసూత్రములు, హఠయోగప్రదీపిక మొదలగు యోగశాస్త్రగ్రంథములన్నియు పరిశీలించి స్వానుభవపూర్వకముగ యమ,నియమ ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణా, సమాధులను యోగశాస్త్రవిషయములను తేటతెనుగుమాటలలో తెలుపునట్టిగ్రంథము ఇదియొకటియే విషయసూచి:—

౧-వ ప్రకరణమునందు—అహింస, సత్యము, అస్తేయము,ఆర్జవము, క్షమ, ధైర్యము, శౌచము, బ్రహ్మచర్యము, మితాహారము, దయ అను ౧౦ విధములగు యమములయొక్క వివరము, వానిననుష్ఠించుటవలన కలుగుఫలము. ౨-వ ప్రకరణమునందు—జప, తపో, దాన, వేదాంతశాస్త్రశ్రవణ, ఆస్తిక్యభావ, వ్రత, ఈశ్వరపూజన, యదృచ్ఛాలాభసంతోష, శ్రద్ధా, లజ్జ యను ౧౦ విధములగు నియమముల లక్షణము తత్ఫలమున్ను, యోగాభ్యాసమునకు తగిన ప్రదేశము, కాలము, ఆహారనియమము, పథ్యాపథ్య పదార్థములును తెలుపబడినవి. మఱియు ఇడాపింగళ శంఖిన్యాదినాడులయొక్కయు, ధౌతి, బస్తి, నేతి, నౌలి త్రాటకము కపాలభాతియను షట్క్రియలయొక్కయు, దశవిధవాయువులయొక్కయు, మహాముద్ర, నభోముద్ర, ఉడ్యాణబంధముద్ర, జాలంధరముద్ర మొదలగు ౨౦ విధములగు యోగముద్రలయొక్కయు వివరము, వానిననుష్ఠించువిధము తేటతెల్లముగ స్వానుభవపూర్వకముగవ్రాయబడినది. షట్క్రియల ననుష్ఠించుటను అభ్యాసముచేసినవాడు ఆరోగ్యదృఢ శరీరముగలవాడున్ను, దీర్ఘాయుష్మంతుడుగలవాడున్ను అగును. ౩-వ ప్రకరణమున:—యోగాభ్యాసమున కత్యావశ్యకములగు సిద్ధాసన, వజ్రాసన, పద్మాసన, వృషాసన, వీరాసనము మున్నగు ౮౪ ఆసనములను వేయురీతి ఏయేయాసనమును అభ్యసించిన ఏయేశక్తి కలుగునదియు, ౪-వ ప్రకరణమున:—రేచక పూరక కుంభకములను త్రివిధప్రాణాయామభేదములయొక్కయు, అష్టకుంభకములయొక్కయు, ప్రాణాయామము నభ్యసింపువారు సలుపవలసిన అభ్యాసక్రియలు కాలనిర్ణయము మొదలగునవి ౫-వ ప్రకరణమున:యోగశాస్త్రము ననుసరించి ట్టియు వేదాంతశాస్త్రము ననుసరించినట్టియు ప్రత్యాహారభేదము వివరింపబడినది ౬-వ ప్రకరణమున:—స్థూలసూక్ష్మధారణయొక్కయు, స్థూలధారణాభేదములగు, పృథివి, అంభసి, ఆగ్నేయి, వాయవీ, ఆకాశధారణములయొక్కయు వివరము, వానినాచరించుటవలన కలుగుఫలము తెలుపబడినది. ౭-వ ప్రకరణమున:—స్థూల, సూక్ష్మ, జ్యోతిర్ధ్యానములును, తదవాంతరభేదములగు అంతస్థూల బహిస్థూల ధ్యానములు, షట్చక్రధ్యానము మున్నగు యోగశాస్త్రధ్యానభేదములున్నూ, పదస్థధ్యానము, పిండస్థధ్యానము, రూపస్థధ్యానము, రూపాతీతధ్యానము అను వేదాంతశాస్త్రధ్యానభేదములున్ను తెలుపబడినవి. ౮-వ ప్రకరణమున:—

ధ్యానయోగ, నాదయోగ, రసానందయోగ, లయయోగ, భక్తియోగ, రాజయోగ సమాధులను యోగశాస్త్ర సమాధిభేదములు, సవికల్ప, నిర్వికల్ప సమాధులయొక్కయు, తదవాంతరభేదములగు వితర్క, విచార, ఆనంద, అస్మితసమాధులనియు, వేదాంతశాస్త్ర సంబంధసమాధి భేదములయొక్కయు వివరముగలదు.

సనాతనధర్మప్రశ్నోత్తరావళి, ప్రథమవాచకము:— దీనియందు ధర్మములు, వేదములు, ఉపవేదములు, వేదశాఖలు, వేదాంగములు, ఉపాంగములు, షడ్దర్శనములు, అవతారములు, సంస్కారములు, వర్ణములు, ఆశ్రమములు, యజ్ఞములు, సంప్రదాయములు, పుణ్యతీర్థములు, పర్వకాలములు మున్నగు అత్యావశ్యకవిషయము బాలురకుకూడా తెలియునటుల ప్రశ్నోత్తరపూర్వకముగ సులభశైలిలో వ్రాయబడినవి దీని వెల 0-4-0

సదాచారము:—సాంధ్రితాత్పర్యము, సూర్యోదయమున లేచినది మొదలుకొని రాత్రిశయనించువరకు చేయవలసిన సకలవిధులు, ధర్మశాస్త్ర వైద్యశాస్త్ర ప్రమాణసహితముగతోడను, ఆయావిషయముల నాచరించుటవలన కలుగుమేలు, విడచుటవలన కలిగెడుకీడు తెలుపబడినవి. 180 కలికోబయిండు 2-0

దీనియందుగల విషయములు:—దాదాపు శివ,రామ, కృష్ణాది ౧౮ దేవతలయొక్క ప్రాతస్మరణశ్లోకములు, ఋగ్వేదాంతర్గత ప్రాతస్సూక్తములు, గ్రాహ్య,నిషిద్ధదంతకాష్ఠములు, కాష్ఠదంతధావన నిషిద్ధతిధులు, స్నానాగ్ని జలనిర్ణయము,ఋగ్వేద యజుర్వేదీయస్నానవిధి,వస్త్రధారణవిధి, ఊర్ధ్వపుండ్రభస్మధారణవిధులు,తృచాకల్ప సూర్యనమస్కారపద్ధతి, సౌరసూక్తములు, సూర్యోపస్థానము, గురుధ్యానము, బ్రహ్మయజ్ఞము, నమకచమకబ్రాహ్మణము, దేవీ, రుద్ర, విష్ణు, సారస్వత, గణపతి, సౌరసూక్తములు, ఋగ్వేద, యజుర్వేదీయ భోజనవిధులు, భోజనానంతరజప్య శ్లోకమంత్రములు, తాంబూలవిధి, తాంబూలగుణములు మున్నగునవిగలవు.

కైవల్యనవనీతము:—టీకాతాత్పర్య విశేషార్థసమన్వితము, ౯-న ముద్రణము. తనుపర్తి. వేంకటరామ శ్రీవిద్యానందనాథ విరచితము. తత్వబోధప్రకరణమను మొదటిభాగము. కలికోబయిండు 2-0

సందేహనివారణమను రెండవభాగము 2-0

రెండుభాగములుచేర్చి ఒకేబయిండు చేయబడినది 4-0

స్త్రీలు, బాలురు గ్రహించతగినంతటి సులభశైలిలో బ్రహ్మసూత్రములు, భాష్యము, ఉపనిషత్తులు మున్నగు వేదాంతగ్రంథములందుగల సకలవిషయములు ౧-౨ ప్రకరణములందు మనస్సునకు నాటుటకయి దృష్టాంతరూపములగు కథలతో బోధింపబడియున్నవి. వేదాంతగ్రంథములందింత ప్రచారముగల గ్రంథరాజము మరొకటి లేదు. ౫౦౦౦ వేలగ్రంథములు లోకమున వ్యాపించియున్నవి.

మానేజరు:—స్వధర్మప్రకాశిని,



నెం 82. పూనమల్లిహైరోడ్, బృందావనం, కీల్‌పాకు, మదరాసు.

# అభినవసరస్వతి

[ మాసపత్రిక ]

నాగరఖండ స్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్తయగు
జనపాటి పట్టాభిరామశాస్త్రిచే
ప్రకటింపఁబడుచున్నది.

గుంటూరు.

| సంపుటము | 1941 సం॥ జనవరి నెల 15 వ తేది | సంచిక |
|---|---|---|
| 32 | | 10 |


విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

| | | | |
|---|---|---|---|
| ప్రధానపోషకులకు | రు 25 0 0 | సహాయులకు | రు [illegible] 0 |
| పోషకులకు | 10 0 0 | చందాదారులకు | రు 8 0 0 |


Printed at the Chandrika Press, Guntur,
and published at Guntur by the Editor, Astavadhani
Janapati Pattabhirama Sastry,
author of Nagarakhandam, Swarnakaravyavaharam
etc., etc.

# రాజపోషకులు.

శ్రీమంతు, రాణి ఆదిలక్ష్మీదేవమ్మ బహద్దరుగారు,
గద్వాలసంస్థానము.

## ప్రధానపోషకులు.

౧ శ్రీశ్రీ జగద్గురు సచ్చిదానందాభినవశంకరభారతీస్వాములవారు, హంపి.

౨ శ్రీశ్రీ జగద్గురు, అఖిలవాద్దండ విద్యాశంకరభారతీ స్వాములవారు, పుష్ప

3 తంగెడ నరసింహారావుగారు, కరణము, మోర్జంపాడు.

౪ ఆర్. రామారెడ్డిగారు, దైవముదిన్నె.

౫ రాజా సురభి వెంకటరత్నాంబ బహద్దరుగారు, రాణి, ఆఫ్ జటప్రోలు, కొల్లాపురము.

౬ శ్రీశ్రీ లక్ష్మీనరసింహస్వామివారు, యాదగిరి.

౭ రాజా రఘునందనసింగుగారు, నెల్లుట్ల.

౮ లింగాల రంగారెడ్డి దేశముఖుగారు, గణపురము.

## పోషకులు.

౧ జాగర్లమూడి కుప్పుస్వామినాయుడుగారు, కారంచేడు.

౨ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారుగారు - దే

3 తాండ్ర వెంకటకృష్ణారెడ్డి దేశముఖుగారు, బసవాపురము.

౪ రామచంద్రారెడ్డి దేశముఖుగారు, ఇమనూరు.

# అభినవసరస్వతి

సంపుటము ౩౨ } వికృతిమ నామసంవత్సరము మార్గశిర పుష్యమాసములు { సంచికలు ౯,౧౦

## —॥ నిజాము రాష్ట్రీ బాల్యవివాహనిషేధశాసనము నిర్జితః ॥—

### సనాతనధర్మమునకు జే !

సంస్కర్తలమని బయలువెడలి సమభ్యస్తాంగ్లేయభాషులగు జనులు కొందఱు సర్వము జగన్నాథమని సల్పుచుఁ జండాలదేవాలయప్రవేశాది శాసనములకై శక్తిని ధారవోయుచుండుట జగద్విదితము. ఆబుద్ధిమంతు లాంగ్లేయపాల్యమా నాస్మద్దేశమం దట్టి శాసనము లాచరింపించుటయే కాక స్వదేశసంస్థానములఁ గూడ సల్పింపఁజూచుచున్నారు. వానిలోనిదే యీ నిజామురాష్ట్రపు బాల్యవివాహనిషేధశాసనము. తొల్లి బ్రిటిషురాజ్యమున శాసింపించిన శారదాశాసనమునకే తురుష్కులసమ్మతి దెల్పియుండ స్వరాష్ట్రమున సర్వథా సాగనీయరని పాప మాబిల్లు ప్రవేశపెట్టిన పతితపావనమన్యుఁడు భారతీయులకుమాత్రమే ప్రతిపాదించెను. భరతఖండమే ప్రకృతనివాసముగాఁ గలిగి భారతీయులే యనఁదగియున్న యీరాష్ట్రపు రాజు నన్యయజులయిన యవనవీరుల యలజడికి నిలువఁజాలమని తెలిసికొనియెను. అయినను నారాజ్యమే యావాసమగుటఁ గాఁబోలు భారతీయులే బాల్యవివాహనిషేధశాసనపుబిల్లును బాగుగాఁ బ్రతిఘటించిరి. అస్మద్రాజ్యమందాశాసన మమలులోఁ బెట్టఁబోవునపుడును నంతకంటె నధికప్రయత్నమే యాచరితము. అఖిలభారతవర్షీయ బ్రాహ్మణమహాసమ్మేళనమే యారబ్ధము. స్వరాజ్యవర్ణాశ్రమధర్మసభయే స్థాపితము. కాంగ్రెనువలె నాసభయుఁ గార్యము సాగించుచున్నది. సంవత్సరమునకొకసారి సంఖ్యకు మించిన సంఖ్యావంతుల సమావేశపఱచుచున్నది. కాని శాస్త్రసాధులకే సమ్మతముకాదు. అందువలననే యభిమతసిద్ధి యింకను నగుటలేదు. ప్రభుత్వసభ్యులే యానాఁడు పరిపంథిసభ్యులలోఁ బ్రవేశింపకున్న బాల్యవివాహనిషేధపు బిల్లు వటావించలయ్యెడిది. కాని యీయదృష్ట మస్మద్దేశమున కింకను నేర్పడదు. అదియట్లుంతము. నిజాము రాష్ట్రపు బాల్యవివాహనిషేధపు బిల్లును నెగ్గకుండఁజేయుటకుఁ బట్టుఁబట్టినవారిలోఁ బ్రముఖుఁడు వణిజవంశజుఁడగు వంగపల్లి నీలకంఠము గారు. ఈయన సికింద్రాబాదుపురవాసి. శ్రీమచ్ఛ్రేష్ఠుఁడా? కాదు. సామాన్యుఁడు. వినలేమి? ప్రాచీనాచార పరిరక్షణమున బద్ధకంకణుఁడు. అట్లయి యధికైశ్వర్యవంతులగు నత్రత్యాఖిల వైశ్యులకు నావేశ మెక్కించెను. సనాతనధర్మ సంరక్షణమునకు సన్నద్ధుల సలుపఁ గలిగెను. సభలు స్థాపించెను. ఉపన్యాసముల నొనరింపించెను. ఉపన్యాసకేసరియగు సుమామహేశ్వరపండితుల సమావేశపఱచుకొనియెను. స్నేహితుఁడైన చిపుకుల అప్పయ్యశాస్త్రిగారిని [illegible] ద్వారమున దేశదేశపు ధీమంతులకును బాల్యవివాహనిషేధపు బిల్లును బ్రతిఘటించుటకుఁ బ్రబోధించెను.

పైనఁ బ్రచారకులఁ బంపించెను. ప్రతిపట్టణముఁ బ్రతిగ్రామము ద్రిప్పించెను. ఖ్యాతుల యీశాసనవిషయమైన యసమ్మతుల నార్జించెను. కోట్లకొలఁదిఁ గూ అప్పయ్యశాస్త్రియుమామహేశ్వరపండితులే కాక జగద్గురు పుష్పగిరి పీఠాధిపతులుగా వణిజవీరులైన వంగపల్లి నీలకంఠముగారికి వలసినంత సాహాయ్యము సలుపఁగ స్వాములవారి సంస్థానపండితులు నిజామ్‌రాష్ట్రపుఁ బ్రజాసముదయమునకు బాల్య హామే పరమధర్మమని ప్రబోధించుటయుఁ జాలమంది సమ్మతులిచ్చిరి. ఎట్లయినను శ్రీ పుష్పగిరిపీఠస్వాములవారియొక్కయు నుమామహేశ్వరపండితులయొక్కయు య్యశాస్త్రిగారియొక్కయుఁ దోడ్పాటుతో నిజామ్‌రాష్ట్ర సనాతనధర్మసభా దర్శియగు నీలకంఠముగారి పట్టుదల హెచ్చఁగలిగెను. ప్రతిపక్షుల వోట్లకన్నను సనా ధర్మిష్ఠుల వోట్లు చాల నధికమగుటయు శాసనసభవారు నిజామురాష్ట్ర బాల్యవివా నిషేధపు బిల్లును నిర్జీవము గావించిరి. తత్సభ్యులు బ్రిటిషుప్రభుత్వసభ్యులవలెఁ పక్షసభ్యులలోఁ జేరక పరమతస్థు లయ్యును భారతీయధర్మమునే పరిపాలించిరి. గో కొండ కూనరాగములు దీసినట్లు సనాతనధర్మిష్ఠులు గాక శాసనసభనుండి ప్రతిప పైకట్టలు దులుపుకొనుచు బహిర్గతులైరి. బిల్లు ప్రిదిలిపోయిన పిదప నిఖిలసనా ధర్మలును నీలకంఠముగారి నాలింగనము చేసికొనిరని గోలకొండ హేళనము నన్నను సనాతనుల శాపములే మదాసురాష్ట్ర ప్రధానామాత్యపదవికి మమ్ముఁ దొ గించెనన్న రాజగోపాలాచారిగారి మాటవలె సాజమే యైయున్నది. శ్లో. ధర్మఏవహ హంతి, ధర్మో రక్షతి రక్షితః. ఈ నుడియే మా నీలకంఠముగారి మనోరథసిద్ధికైన కారణము. ఉమామహేశ్వరపండితుల యుపవాసవ్రతమున కుచితమైన ఫల అప్పయ్యశాస్త్రిగారి యావేశమున కర్హప్రతీకారము పుష్పగిరిస్వాములవారి భూ భూషణము.

శ్లో. జయతు సనాతనధర్మః । జయతుచ జగద్గురుపీఠసముదాయః
జయతు సచ నీలకంఠః । జయతు సదాచారరతజన స్సర్వః

---

## — శ్రీగద్వాలమహారాజ్ఞీదత్తస్వీకరణ మహోత్సవము — యావ రాజ్యపట్టాభిషేకము —

(శతావధాని, గాడేపల్లి వీరరాఘవశాస్త్రిగారు, గద్వాలాస్థానకవి.)

శ్రీమదఖండలక్ష్మీవిరాజమాన దక్షిణహిందూస్థాన మాననీయనిజాంపరిపాల న్వేత మండలాంతర్గత శ్రీగద్వాలమహారాజసంస్థానావతంసము సుజనవిదితము. కృష్ణా తుంగాపావనోదకపరివేష్టిత పుణ్యమండలమై పాకనాటిరెడ్డిక్షత్రియనిష్కళంకప్రేమా రామంబై శ్రీసోమనాద్రిప్రముఖ రెడ్డికులదీపభూపబాహాబలోపార్జిత వీరవిజయ క్రీడామందిరంబై లక్ష్మీసరస్వతీసమాన సౌభాగ్యవిభవాశ్రయంబై త్యాగభోగము నునికిపట్టయి ప్రబుధ కవిప్రజారంజనకళల [illegible] శ్రీవిద్యద్గద్వాలధర్మసం నాభిఖ్యతో భారతీయప్రాచీనపరిపాలనాధర్మ ప్రాయముగ నున్న దీనిని పయః పారావారరాకానుధాకరులు విద్వద్రాజులై రాజులై కులదేవమైన శ్రీలక్ష్మీ

శేశవసంతతోత్సవప్రతివత్సర సత్సపర్యాసత్కార చమత్కారములతో ననంతకీర్తి యుతులై పరిపాలించుచున్నారు. వీరిలో మహారాజశ్రీ సీతారామభూపాల్ బహద్దరు గారి యర్ధాంగలక్ష్మి యైనశ్రీమదాదిలక్ష్మీమహారాజ్ఞిగా రిపుడుగూడఁ దద్ధర్మసంస్థాన పరిపాలనకార్యక్రమములోఁ బూర్వరీతుల కన్నివిధముల నన్నియును గల్పించి కుల దైవత కేశవానుగ్రహమున రాజ్యాంగ విద్యాంగముల నుచితజ్ఞత నిర్వహించుచున్నారు. ఔరససంతానభాగ్య మెన్నితరములయేలుఁబడిలోనో కడిగిగాలించి చూచిన నగపడక మూలఁబడినయీమహారాజవంశమున నిరువురు కన్యకామణుల శ్రీభూదేవులవలెనో లక్ష్మీ సరస్వతులవలెనో పతిశుశ్రూషాఫలముగఁ బ్రజాసంతతి యదృష్టమో యన్నటులు భగవ దనుగ్రహమునఁ గాంచి వరలక్ష్మి శ్రీలక్ష్మి నామములతోఁ బ్రేమలత లల్లువెట్టుచున్న దీమహారాజ్ఞి యనుటలో నీతల్లియందలిపరమోత్కృష్టధర్మము వేఱుగఁ బ్రశంసింప నక్కఱలేదు. స్త్రీసంతానమాత్రవరలాభ మంది పదునెనిమిదిసంవత్సరములకిందటనే యర్ధాంగలక్ష్మికి సింహాసనాధికారము ప్రసాదించి స్వర్గసందర్శనకుతూహలియై భౌతిక శరీరమునువిడిచి జ్ఞానదృగ్గోచరుండై చేదోడువాఁదోడుగ నంతర్వహించుట సుస్పష్టము. కులస్థానపౌరుషములలోను నసాధారణసంస్థానధర్మపరిపాలనలోను విద్వత్కవిగాయ కానల్పకల్పనావిభవకళాకౌశలత్యాగభోగములలోను వినుతికెక్కినశ్రీరాజా దోమ కొండరాజేశ్వరరావు బహదరుగారి కగ్రపుత్రుఁడై నవనాగరకరాజవిద్యా పారంగ తుఁడై రూపజితనవమన్మథుఁడైన శ్రీరాజా సోమేశ్వరభూపాల్ బహదరుగారికి శ్రీమంతు గద్వాలమహారాజ్ఞిగారు నిజాగ్రవరపుత్రీమణి యైనశ్రీవరలక్ష్మీదేవమ్మగారి నిచ్చి శ్రీచెన్నకేశవప్రీతిగ సాలంకృతకన్యాదానమహోత్సవము జరిగించిరి. వారిదాం పత్యానోన్యాన్యానురాగఫలితముగఁ బండితకవిబుధాశీర్వాదదైవానుకూలముగఁ దిగ్రమా ర్తులవలె సుతత్రియు ముదయించి పాకనాటివంశాభరణములై విరాజిల్లి శ్రీకృష్ణరామ సీతారామభరతరామనామముల వర్ధిల్లిరి. శ్రీవరలక్ష్మీదేవియు నిజజనని స్త్రీసంతాన సౌభాగ్యమందినఁ దాను వీరమాతయై రాజరత్నముల ముప్పుర నుభయకులవర్ధనుల నను గ్రహించి యీమహోత్సవము స్వర్గమందున్న నిజజనకున కెఱిఁగింప నన్నట్టిరువది యాఱవయేటనే యీప్రజానిర్వాహణభారమును శ్రీరాణిగారి కర్పించి భౌతికశరీరమును విడిచి తండ్రియంకపీఠి నాశ్రయించె. ఘనత గాంచిననిజాం శ్రీఉస్మానలీపాదుషాసార్వ భౌముల ధర్మపరిపాలనానుగుణమైనదత్తస్వీకరణాధికారమును బొంది యీవిక్రమనామ సంవత్సర కార్తిక శు॥ ౫ పగలు 8 గం 15 నిమిషములకు నాఁడె 9 గం॥ 22 నిమిషముల కును దనప్రథమదౌహిత్రమణియు శ్రీరాజా దోమకొండ సోమేశ్వరరావు బహదరుగారి ప్రథమపుత్రరత్నమునగు చి॥ రాజా కృష్ణరామభూపాల్ బహదరు కులశేఖరుని సశాస్త్రీ యముగ ననంతవైభవములతో వేదవేదాంగపారంగతాశీర్వాద నినాదములతో నశ్వ గజ రథారూఢదాసదాసీపురోహితవిద్వత్కవిగాయక వందిమాగధ పౌరప్రముఖోద్యోగవా రాంగనాకదంబంబులతో దత్తస్వీకరణపట్టాభిషేకమహోత్సవములు జరిగించిరి. శ్రీ కేశవ సన్నిధానమునఁ బ్రతివత్సరకార్తికపూర్ణిమ శ్రీబ్రహ్మోత్సవపరీక్షావర్షాశననిమిత్తాగత విద్వద్వైదిక మహాజనసార్వదేశాధీమ పూజించి ... త్తాశ్రమమునందే ముహూర్త మేర్పఱచుటవలన నన్నదానములు వార్షికములు మామూలుగ భరించుచు నేతన్మహోత్స

వప్రియు క్తమణికనకరాంకవవస్త్రగంధమాల్యాదుల ననంతవైభవముగ భరింపవలసివచ్చి
నను గారోత్సాహము నిర్వాహణదీక్ష నద్వితీయముగ నెఱవేర్పఁబడినది. తొమ్మిదిసంస్థా
ములనుండి కొందఱధీశులుఁ గొందఱు ప్రతినిధులుఁ గొందఱాస్థానపండితులు సపరివా
బాంధవముగఁ గానుకలతో విచ్చేయఁగల్గిరి. సప్తఋషులవలె నేడుమఠములనుండి మఠా
చార్యప్రతినిధులుఁబండితులు మంగళాశాసనములతోఁ బారితోషికములనుజదివించి దీవిం
చిరి. స్వగురువులైన శ్రీమదహోబిలస్వాములప్రతినిధులతో దక్షిణమఠాచార్యషట్క
మంగళాశీస్సులతో నసంఖ్యాకపండితమండలముతో సభ క్రిక్కిఱిసియుండెను. భాగ్య
నగరప్రముఖులలో రాజబహదూర్ వెంకటరామారెడ్డి (ఓ, బి, ఇ.) గారు వారిప్రథమ
పుత్రరత్నము శ్రీ రంగారెడ్డిగారు (ఎక్సైజుడిపార్టుమెంటు కమీషనర్) రెండవపుత్ర
రత్నము శ్రీలక్ష్మారెడ్డిగారు (హైకోర్టుజడ్జి) మాడపాటి హనుమంతరావుగారు (భాషా
భిమానులు) ఏ. వెందల సీతారామరావుగారు (ఉస్మానియావిశ్వవిద్యాలయము సైన్సు
ప్రొఫెసరు) మొదలగువారనేకులు విచ్చేసిరి. కొందఱు సకుటుంబముగ దయచేసిరి. సక
లమునకు రాఁజాలని పండితప్రకాండులు కొందఱు తమయాశీర్వచన పద్యరత్నసు
పుష్పములను దపాద్వారమున సకాలమున కందించి సంస్థానాభిమానమును వెల్లడించి
శ్రీమహారాజ్ఞిగారి యాదరణకుఁ బాత్రభూతులైరి. వారిలో ముఖ్యులు ( 1. బ్రహ్మశ్రీ
కంకవీంద్రఘటాపంచాననాది బిరుదాంకిత శతావధాని చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగారు
(2) ఆచార్య రాయప్రోలు సుబ్బారావుగారు ( ఉస్మానియా ఆంధ్ర ప్రొఫెసరు)
(3) వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు (భాషోద్ధారక) (4) చతుర్వేది అమరేశ్వరశాస్త్రి
గారు, గుంటూరు (5) ఆంధ్రమహిళాసంఘము, హైదరాబాదు (6) భుజంగరాట్క
మొదలగువారు తమ మంగళాశీర్వాదకృతిరత్నములను బట్టాభిషేకార్హానుపమాన
గానుక లంపించి ధన్యతం జెందిరి.

గంగా గౌతమీకావేరీప్రముఖ పుణ్యనదీతీర్థంబులును, మహాసముద్రోదకంబులును
తిరుపతి భద్రగిరి ప్రయాగ రామేశ్వర హరిద్వార కేదార బదరీనాథాది నానాముక్తి
స్థాన తైర్థిక తీర్థదైవతప్రసాదసంగ్రహకార్యక్రమము యథావిధిగ సమకూరెను. వేదనాద
ములతో జయజయమంగళనినాదములతో ధ్రువమంత్రపఠన మొనరించు సిద్ధపురుష
పరాపాదములతో త్రిదశపీఠమున దేవతలు మహేంద్రు నభిషేకించి చతుర్దశ భువనా
ధిపత్య మిచ్చినట్లు గ్రహమండలంబున ఛాయానాథుని గణ్యగార్గేయకశ్యపవసిష్ఠాదులు
జ్యోతిర్మండలాధిపత్య మభిషేకించునట్లు సాకేతంబున నెల్లరాజులు శ్రీసీతారాము
నుంచి పట్టాభిషేక మొనరించినట్లు శ్రీగద్వాలరాజ్ఞీప్రయుక్త ఋత్విగ్గణంబులు, సాహి
త్యపశ్చాత్యానవద్యులగు శ్రీమేడవరము సుబ్రహ్మణ్యశాస్త్రిలుగారు పరిసర సంస్థానపాల
మఠాధిపసమక్షంబున నానాతైర్థిక బ్రహ్మమండల, ప్రసన్నతోద్యోగరాజబంధుసమాజము
క్రిక్కిఱిసినమహాసభలో ననర్ఘమణికనకసింహాసనాసీనుండై బాలభానునివలె విశాల
శుక్లపక్ష క్షపానాధునివలె నాహ్లాద మొసఁగుచున్న చిరంజీవి రాజా కృష్ణరామభూపాల
బహదరుగారిని గనకకలశధారోదక పావనతీర్థములతోఁ గనకాభిషేక సువర్ణపుష్ప
పూజల నాగమవిధిచోదిత మంత్రములతో న[illegible] లెల్లరు మూర్ధాభిషి
క్తకార్యాంతులలోఁ బాల్గొని 'చిరాయుష్మాన్ భవ' 'శతాయుర్భవ' ఇత్యాదిప్రా

శీర్వచనముల నలంకరించిరి. శ్రీ కేశవసందర్శనము, అశ్వగజపూజలుం బండితాశీర్వాదములుం గట్నములు చదివించుట ప్రతిసత్కారముం దదుపరి పండితబ్రాహ్మణసువాసినీపూజలు, ఫలకుసుమగంధదానసత్కారములుం బెద్దలకు నమస్కరింపం జేయుట జరిగెను. వస్త్రపాత్రతాంబూలమణికనకాదులతో నెల్లర నపారముగ సత్కరించిరి. పౌరజానపదులకు నిమ్నజాతులకు నన్నదానము సంతృప్తికరముగ నొనరించిరి. మాఘపూర్ణిమ కానందున విద్వత్కవిగాయకవారాంగనాది బృందములు వచ్చుటకుం దరువాయి రైనది. వా రప్పుడు స్వభావసిద్ధముగ కానదను కాదు. ఆహ్వానింపఁదలఁచిన మూడుమాసములలోనే తిరిగి రావలసియున్నది గాన వృథాప్రయాసలగునని కాఁబోలు నుపేక్షించిరి. ఐనను శ్రీవిద్వద్గద్వాల నేఁటికి 'రాజన్వతి' యగుచున్న దను నిర్భరానందమునం గొందఱు మఠాధిపతులు వాగీబుధులు శ్రీ సంస్థానసన్నిధి విద్వాంసులుం గవులు రాఁగలిగిన మతిఁగొందఱు పూజ్యులుం దరగతివారిగ నామహాసభలో శ్లోకపద్యపూర్వకమంగళాశీర్వచనములు పఠించిరి. పిదప రాజ్ఞిగారియనుమతితో నాశీర్వచనములు పంపిన పెద్దల పత్రికారత్నములను బఠింపఁగా వానినెల్ల గ్రంథరూపముగ ముద్రింపింప ననుజ్ఞ యిచ్చిరి. ప్రత్యక్షముగఁ జదివినవారిలో శ్రీమదహోబిలమఠ కార్యకర్తగారు, ఆస్థాన విద్వాన్ పుల్లగుమ్మి శ్రీనివాసాచార్యులవారు, ఆస్థానకవి గాడేపల్లి వీరరాఘవశాస్త్రి శతావధానిగారు విద్వాన్ తోపు వెంకటాచార్యులవారు, పండిత అనంతరాఘవాచార్యులవారు శ్రీపుష్కరపట్టణము కవితార్కిక సింహాచార్యులవారు (ఆత్మకూరు) వైద్యము శ్రీనివాసశాస్త్రి (ఆస్థానవైద్య) మొదలగువారు చదివిరి. అప్పుడే టీచరు నూరిరెడ్డిగారు చిరంజీవులగు శ్రీకృష్ణరామభూపాల్ బహదర్ గారిని గుఱించి వచనరచనతో నొక దీవనపత్రమును జదివి సమర్పించిరి. గొబ్బూరి సంజన్నగారు (భక్తులు) పూర్వరాజపరిపాలనానుగుణ ధర్మప్రబోధముగ నొక యభిమాన ప్రకటనను శ్రీకుమారరాజా కృష్ణరామ భూపాలుగారికిఁ జదివి సమర్పించిరి. బ్రాహ్మణ్యులగు శ్రీభట్టా అగ్నిహోత్రిశాస్త్రిగారు చతుర్వింశతి గాయత్రీమంత్రప్రారంభవర్ణశ్లోకములతో గీర్వాణభాషాశీర్వాద మతిమనోహరముగ నాశీర్వాద కాలమునం బఠించినందున వారి కాసభలో నుండెడి శ్రీరాజ్ఞిగారు రు. 116—0—0 రూపికలు బహుమాన మిచ్చి యుదారధర్మమును వెల్లడించిరి. ఆశీర్వాదపద్యములు రాఁగలపత్రికలలో వెల్లడికాఁగలవు. శ్రీకేశవానుగ్రహము చి॥ రాజా కృష్ణరామభూపాల్ బహదర్ గారిని శ్రీరాజ్ఞిగారిని వారి సామ్రాజ్యమును వారి కుటుంబములను నాచంద్రతారార్కము వర్ధిల్లఁజేయుంగాక! ప్రజలాధివ్యాధులు లేక క్షామబాధలు తొలఁగి, సంపూర్ణప్రేమతో నెసంగుదురుగాక! శ్రీ రాణిగారు స్వాజ్ఞావశవర్తులై యెల్లకార్యక్రమంబులలో నప్రమత్తులై కన్నులు దెఱచి పనులు జరిగించి జయప్రదముగ నెఱవేర్చిన వారిసన్నిధి సేవకులసేవను చిత్తగించిరి. వారికిఁ జేఁదోడు వాఁదోడై ధాత్రీశ్వరి యనుగ్రహించుఁగాక! సకాలవర్షములతో దేవుఁడు సముచిత కృపాకటాక్షములతో నిజాంప్రభువు లీసామ్రాజ్యలక్ష్మిని పాలకులను దత్ప్రజలను నాశ్రితులను సదా రక్షించుచుందురుగాక! స్వస్తి సర్వేషాం సన్మంగళాని భవంతు! శ్రీ శ్రీ శ్రీ.

## —◆ జాగుసేయకుఁడు. ◆—

(విద్వాన్ - అంబడిపూడి నరసింహశాస్త్రిగారు
పుష్పగిరిపీఠపండితుఁడు, ధర్మప్రచారకుఁడు.)

శా॥ రండో ధార్మికవీరులార! మన ధర్మంబెల్ల దుశ్శాసనా
ఖండోద్దండ కుఠార ధారలకు నగ్గంబయ్యె. హిందూ క్రియా
కాండంబెల్ల నశింపనయ్యె. హృదయాత్కంఠ్యంబుతో ధర్మ
ఖండంబందు నఖండమూర్తి సలుప దీక్షల్పూనరా రండహో॥

మ॥ మన తాతల్ మన తండ్రు లెల్లరును ధర్మ శ్రద్ధ చేఁబూని చే
సిన బాల్యోద్వహనంబు నేఁడు మనకుర్జేయంగ రాదంట. ఏ
మనఁగానౌ. పయి శాసనంబునకుఁ బూర్వాంశంబె యేమేని మా
ర్పును గావింపఁగ వేళ. రండు మనబాల్యోద్వాహముల్ నిల్పఁగన్

శా॥ వేదంబుల్ ప్రబలప్రమాణములు. ఆవెన్వెంట శాస్త్రంబు. లా
మీఁదన్ శిష్టచరిత్ర. మిద్దియె చుఁడీ మేధ్యార్యహిందూమత
ప్రాధాన్యప్రతిపాదకక్రమము. కూళల్కొంద ఱాత్మేచ్ఛచే
వేదం బొక్కటె మానమందు రిది యొప్పే? ధర్మముల్ నిల్పుసే

శా॥ బైబిల్కాదనువాఁడు క్రైస్తవుఁడె? గర్వస్ఫూర్తిచేతన్ ఖురా
ప్రాబల్యంబున నొప్పకున్నను మసల్మానౌనె; వేదస్మృతుల్
సాబాధంబు లటన్న హిందువుఁడె? ఈసంస్కర్త లెల్లన్ స్మృతి
ప్రాబల్యంబున నొప్ప. రిట్టిదుల దుర్వాదం బనర్థం. బహో!

సీ॥ తన పెంచి పెద్ద చేసిన పిల్లపెండిలి
నొనరుపం దండ్రి పెత్తనము లేదు.
కుల వయ శ్శీలము ల్గలవరాన్వేషణం
బిఁకఁ దల్లి తండ్రి ఘటింపఁ జనదు.
మంచి సంబంధ మీమధ్య వచ్చినఁగూడ
పదియునాల్గేండ్ల కావలనె పెండ్లి.
వేదశాస్త్రంబుల బోధ లింతకెగాని
ఇటుపైని చేయఁబూనుటలు తప్పు

తే॥గీ॥ బాధలెన్నొ వివాహ నిషేధశాస
నంబునం గల్గు. ధర్మంబు నామ రూప
మేమియున్ లేక నశియించు. ఇంత నిజము
కనులు దెఱపుఁడు హైందవాగ్రణ్యులార !!!

## —• యాదగిరి విశేషములు •—

ఇందలి శ్రీ లక్ష్మీనరసింహ దేవస్థానమున నీమార్గశిర శు॥ ఏకాదశిప్రభృతి పూర్ణిమాపర్యంతమును బండితసమావేశపరీక్షాదులును భగవదుత్సవసేవావైభవాదులును బ్రతివత్సరరీతినే బాగుగా జరిగినవి. అందు నిజాముర్రాష్ట్ర బాల్యవివాహనిషేధశాసనము సనాతనధర్మవిరుద్ధమని వ్యాకరణశిరోమణులగు ఖండవెల్లి నరసింహశాస్త్రిగారి యధ్యక్షతతో సభ జరిపిరి. అందు శ్రీశ్రీ జగద్గురు పుష్పగిరిసంస్థానపండితులును నేతద్దేవస్థాన విద్వత్పరీక్షాధికారులును నగు మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిగారు దర్కశాస్త్రపరీక్షాధికారులగు వంగల నరసింహాచార్యులుగారు కవితాసాహిత్య పరీక్షకులగు సహస్రావధాని జంధ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వ్యాకరణశిరోమణి గోవర్ధనము రామానుజాచార్యులుగారు గాయత్రీప్రచారక వంకమామిడి ఆదినారాయణశాస్త్రిగారు మొదలగు పలువురు విద్వాంసులు పాల్గొనిరి.

మఱియు వేదవేదాంగవిదులును బ్రతిభాశాలురు నగు బ్రాహ్మణులును ధార్మికులగు తదితరులును సుమారు 200 సమావిష్టులైరి. దక్షిణామూర్తిశాస్త్రిగారు సత్పురుషసమావేశమునకే భగవదుత్సవాదులు ప్రవర్తింపఁబడిన ట్లుద్బోధించిరి. వ్యాకరణపరీక్షకులగు సభ్యులు సనాతనధర్మమన నేమి యనువిషయమును సదాచారమువల్లఁగలుగు ఫలమును శాస్త్రానుభవములచే నిరూపించుచు రజోదర్శనానంతరవివాహితలగు దమయంతీప్రభృతుల జితేంద్రియతా పతిభక్తి శాపానుగ్రహసామర్థ్యాదు లీయుగమున నెవ్వరికి నలవడవుకావునఁ బ్రౌఢావివాహములు జరిగెడిచో బహువిధ దురాచరణములచేఁ బ్రజామండలి స్వేచ్ఛాచార వివాహవిచ్ఛేదాదులవల్లఁ బశుతుల్యత నొందునని నానావిధకష్టనష్టములఁ గనఁబఱచుచు నుపన్యసించిరి. నరసింహాచార్యులుగారు కన్యావివాహము కలికాలమున నార్షసమ్మత మగుటచే నాచరణ యోగ్య మనియుఁ దలి దండ్రులే తగిన వరున కిచ్చి పరిణయ మొనర్చుట పరమధర్మ మనియుఁ గన్యలే స్వయముగాఁ గన్యా వరయతే రూప మన్నట్లు రూపవంతుల వరించి వివాహమాడి భర్త్రధీనలు గాకయుండెడిచోఁ బలువిధములగు నధర్మకర్మలకుఁ బాల్పడుదురనియు నధర్మమువల్ల స్త్రీలు దుష్టలై వర్ణసంకరకారక లగుదురనియు నందుచే బాల్యవివాహములు శాస్త్రానుభవములచేఁ బ్రశస్తములనియు నుపన్యసించిరి. తదుపరి గోవర్ధనము రామానుజాచార్యులుగారు బాల్యవివాహములచే వైధవ్యము కలుగునన్నమాట ప్రౌఢావివాహములకును వర్తింపదాయని యుపన్యసించిరి. అనంతర మాదినారాయణశాస్త్రిగారు బాల్యమునుండి యభ్యస్తములైన భర్తృప్రేమ పాతివ్రత్యములకుఁ జెట్టున కల్లుకొనెడి తీఁగలాగుగాఁ బరస్పరానుకూలభావము కల్గి యానందమునకు మూలకందమగును గాన నాయభిమతముకూడ బాల్యవివాహమేయని యుపన్యసించిరి. ప్రతికూలభావముగలయట్టివారలకును నవకాశ మొసఁగఁబడినది. అటుపిమ్మట సభ్యులును సభ్యులును నామోదించి కరతాళధ్వనులతో సభ ముగించి తంతిద్వారమునఁ బ్రభుత్వమువారికిఁ దెలియపఱచిరి.

శ్రీ పుష్పగిరిపీఠాధిపతుల పనుపున సనాతనధర్మప్రచారకులైయుండిన మల్లాది దక్షిణామూర్తిశాస్త్రిగా రదే సందర్భమం దుత్సవమున కరుదెంచిన పండితమండలివలన

నిజామ్‌రాష్ట్ర సనాతనధర్మసభకుఁగాఁ గొన్ని చందాలు వేయించి తత్సభకుఁ జే
వీరు ధర్మపురియున్నగు చోట్లఁగూడ గాఢప్రచారము గావించి ప్రజాబాహుళ్య
బాల్యవివాహమునకే యభిముఖులఁ జేసి సంతకములు తీసికొనియుఁ జందాలు వసూలుచేసి
సభకు సమర్పించియున్నారు. యాదగిరి విద్వత్పరీక్షకులలోఁ బ్రధానులై విద్వద్బ్రా
ణులు చేయవలసిన విధులు వినిర్వర్తింపించుచు భగవత్సేవాబద్ధతం బ్రకటించుచుండు
మార్గశిర శు ౧౧ నాటికే తాను వచ్చి తక్కువిద్వాంసు లట్లురాకుండుచో నా
చెప్పుచుందురు.

---

## —◆ శ్రీశ్రీ జగద్గురు విరూపాక్షపీఠ సంచారము ◆—

శ్రీమచ్ఛంకరభగవత్పాదులయొక్కయు శ్రీ విద్యారణ్యులయొక్కయుఁ
పర విడకుండ వచ్చు ధర్మవ్యవస్థాపక గురుపీఠములలో నొకటియగు శ్రీ విరూపాక్షపీఠ
ప్రకృతము నిజామురాష్ట్రమున సంచరించుచున్నది. నిజామాబాదుజిల్లా నిర్మలగ్రామ
నీవిక్రమ సం॥ వైశాఖ బ ౧౧ ప్రవేశించి కార్తిక శు ౬ పర్యంతము ౫ నెలల
దినము లొక్కగ్రామమున నుండుటవలననే తద్గ్రామముయొక్కయుఁ దత్ప్రత్యే
క్కయు నౌత్కృష్ట్య మభివర్ణనీయమై యగపడియెడిని. నిర్మల నిజామాబాదుజిల్లా
యొక తాలూకాగ్రామమై హైస్కూలు మునసపుకోర్టు మొదలైనవానితో నలరారు
ఖ్యాతమై యున్నయది. బహుసంఖ్యాకులగు భాగ్యవద్గృహస్థులచేఁ బరివేష్టితము. భా
ముతోపాటు బ్రాహ్మణులయందును నందును నాచార్యులయందును నత్యంతమగు భ
యత్రత్యుల కలరుచున్నది. అందువలననే గురుపీఠము నింతకాలము కొసరికొసరి ని
కొని యనుదినభిక్షా పాదపూజాదు లాచరించుటయే కాక చాతుర్మాస్యదీక్ష చక్క
జరిపించిరి. ఈ చాతుర్మాస్య దీక్షామధ్యముననే ప్రకృతపీఠాధ్యక్షులైన సచ్చిదానంద
నవశంకరభారతీస్వాములవారి సాక్షాద్గురువులగు శ్రీ విద్యారణ్యభారతీస్వాముల నిర్యా
దిన మరుదెంచుటయుఁ దదారాధన మత్యంతవైభవముతో సహస్త్రియ మాచరించి
3 దినములు ముప్పదేసి బ్రాహ్మణుల గురుస్థానమునఁ గూర్చుండఁబెట్టి యైదేసిరూపాయ
విలువగల యంశుకములచే నలంకరించి యైదేసిరూపాయల దక్షిణలర్పించిరి. ఈ విష
మునఁ గనఁబఱచెడి సంస్థానామాత్యులగు రాచూరు సుబ్బయ్యశాస్త్రిగారి యాదా
మభివర్ణనీయము. కేవల వస్త్రములే కాక యప్పుడప్పుడీయారాధనమున శాలువలే స
ర్పించుచుందురు. ఈ సం॥ సమయమునకు సంసిద్ధము కాలేదుకాని వెండిగ్లాసులే వి
కొసంగుటకు సుబ్బయ్యశాస్త్రిగారు ప్రయత్నించిరి. భాద్రపద శు ౧౫ విశ్వరూపయా
విసర్జనవర్తిత మగుటయు దేవీనవరాత్రోత్సవముగూడ నిచ్చటనే జరుగవలెనని ప్రజ
ప్రార్థించిరి. ఐదాఱువేలరూపాయల వ్యయముతో నద్యుత్సవ మాచరింపించిరి.

యథోక్తపూజాదికము నాచరించుటయే కాక యానవరాత్రోత్సవమున సహ
సంఖ్యాకుల సంధృతనూతనవసనులం గావించుట సం స్మరణీయము. అంతటివ్యయము
కత్రత్య బ్రాహ్మణవైశ్యాదులభక్తిపురస్సర బహుధనప్రదానమే ప్రధానకారణము
అచ్చటి శిష్యు లనేకులు శక్తినిమించిన త్యాగమును సల్పిరనుట స్వభావోక్తి. ౫ నెల

పదిదినములు నప్పుర మలంకరించి యాచార్యు లన్యగ్రామమున కరుగునాఁ డత్తుల వెంబడి నంబువులు గార్చుచు నర్ధయోజనపర్యంతము ననుగమించిరని యాకర్ణించినవారి కవ్వారి గురుభక్తి యపారమని తోఁపకపోదు. ఇంతభక్తి యివ్వారికిఁ గలుగుటకుఁ బీఠమహిమయే కాక పీఠాధిపతుల ప్రబోధముగూడఁ గారణమయియున్నది. శిష్యులకుఁ జేయవలసిన బోధ స్వాములవారు చక్కఁగా నెఱవేర్చిరి. ఆస్థానపండితుల ముఖమున నన్వహముఁ బురాణ ప్రవచనమే కాక సదుపన్యాసములుకూడ సాఁగించిరి. పమిడిమఱ్ఱి చంద్రశేఖరశాస్త్రి ప్రభృతులు ప్రస్తుతాస్థానపండితులు. చంద్రశేఖరశాస్త్రిగారు సాహిత్యవన్మాత్రులే కాక తర్కవ్యాకరణవేదాంతశాస్త్రజ్ఞులు. సజ్జనులు. శాంతులు. అవ్వారి పురాణముగాని యుపన్యాసముగాని తుదకు సామాన్యసంభాషణమే కాని పండితపామరభేదము లేకుండ సర్వసులభమై చక్కఁగా విదితమయ్యెడిది. అమృతము గురియుచు నాచారవ్యవహారముల నన్యమార్గమున నరుగనీయక ధర్మమందును దైవమందును దత్పరత గూర్చెడిది. వారి ప్రబోధమునకుఁ దోడు వకీళ్ళు మువ్వు రవ్వీట వర్తించుచుఁ బ్రజల ఋజుపథమునకు లాగి విరూపాక్షపీఠమునకు వివిధోపచారములఁ జేయించి నిర్మలగ్రామాహ్వయమును సార్థకపఱచిరి. ప్రకృత మాపీఠసంచారము నిర్మలప్రాంతగ్రామములలో నెఱపఁబడుచు యల్కించి న్యూనాధికముగా నాగ్రామసంచారమునే యనుకరించుచున్నది. ఆయీవిశేషములు చాలవఱకుఁ జంద్రశేఖరశాస్త్రిగారి క్రింది శ్లోకములే చెప్పుచున్నవి. పై వకీళ్ళు మువ్వురు 1 సుదర్శనరావుగారు. 2 వెంకటరావుగారు. 3 శ్రీనివాసరావుగారు.

శ్లో. శ్రీసచ్చిదానంద నవీనపూర్వః శ్రీశంకరాఖ్యో యతిసార్వభౌమః
నిరంతరానందవిలీనచేతా దయార్ద్రదృష్ట్యావతు భక్తబృందం. ౧.

మోదాంబుధింకిల మనోమయమందరేణ
నిర్మథ్య బుద్ధిగుణవాసుకిసంయతేన
యే ప్రాపు రప్రతిహతం యతిరాజలక్ష్మీం
తాన్ శంకరార్యచరణాన్ సతతం నమామి. ౨

శ్రీనిర్మలాహ్వయపురే సకలాశ్చ విప్రాః
స్వీయాంచ కార్యవితతిం పరిముచ్య ధీరాః
శ్రీమజ్జగద్గురుపదాంబుజపీఠదేశే
కాలం నయంతి సతతం ముద మాప్నువంతః. 3

త్యక్త్వాన్యాన్ విషయాన్ సుదర్శనసమాఖ్యశ్చాత్ర శిష్యాగ్రణీః
శ్రీమచ్ఛంకరసద్గురూత్తమపదే భక్త్యా మహాత్మా యుతః
చాతుర్మాస్యే ... వ్రతమాచరయ్య ... తన్మాత్రతః
దేవీపూజనము ప్యచాలయ దహో పుణ్యం హి సౌదర్శనం. ౪

సుదర్శన! త్వం కరగో జగద్గురో ర్వ్యాఖ్యాత్వాఖిలాన్ ధర్మపథే యుః
అధర్మమార్గా ద్వియునక్తి యచ్చ సుదర్శనత్వం ప్రతిపద్యసే తత్
శ్రీమద్వేంకటరాయసద్గురువర స్యైతస్య పూర్ణోత్సవం
చాతుర్మాస్యపదాభిధేయ మమలం నిర్వాహ్య తన్మాత్రతః
నాతీ రప్రమదంగతః. పునరపి ప్రాచాలయోంబార్చనం.
కింవర్ణ్యే భవదీయసద్గుణగణం? చౌదార్యభక్త్యాదికం?
యద్వద్వ్యాతిజ్ఞానభక్త్యోస్సహాయం వైరాగ్యం చానంతముక్తిప్రసిద్ధ్యై
తద్వద్వ్యాతి శ్రీగురోః కార్యసిద్ధ్యై సాహాయ్యం శిష్యశ్రీశివాసాభిధాః
మూర్తిత్రయం భిన్నరూపం గుణతః కార్యతః పురా
ఇదం మూర్తిత్రయ మభూ ద్గురుకార్యైకతత్పరం.
శ్రీనిర్మలాహ్వయపురే గురుభక్తియుక్తాః
సర్వేపి చోరుజశిఖామణయ స్సమేత్య
హంపీజగద్గురు శరన్నవరాత్రరూప
పూర్ణోత్సవం నిరవహన్. కిము భాగ్య మేషాం!
పూజాన్నదానేనవినా నభాతీ త్యేతత్సమాలోచ్య సమస్త వైశ్యాః
శ్రీనిర్మలాఖ్యే నగరే దినేషు నవ స్వకార్షుః ప్రథితాన్నదానం. ౧

నిర్మలతాలూకాలోఁ జేరిన జెవిల గ్రామమును సమీపములో నుండు పొన్న గ్రామమునందుఁ బటేలు ముత్యపురెడ్డిగారి ప్రార్థనచేత శ్రీస్వాములవారు విజయము దత్తజయంతి మూడురోజులు జరిపిరి. ప్రతిదినముఁ బురాణము నభిషేకము దత్త పారాయణ మొదలగునవి జరిగినవి.

---

## శివకోటి మహోత్సవము

ఇయ్యది కార్తిక బ ౧౩ మొదలు మార్గశిర శు ౬ పర్యంతము నవరాత్రి నిజాము రాష్ట్రమునకుఁ జేరిన మెదకుజిల్లా సిద్దిపేటలో జరిగియున్నది. కర్త కాశీ భట్ల వెంకటరామసిద్ధాంతిగారు. వీరి నివాసము పల్నాడుతాలూకాలోనిదేయగు వోలు. ఈయన యిప్పటి కిరువది సం॥ల నుండి పంచాంగములను బ్రకటించుచుఁ బ్రఖ్యా పడయుచున్నవాఁడు. ఆ పంచాంగమునకు నిజామ్‌రాష్ట్రమున నితరాంప్రచారము యున్నది. ఆ దేశమం దాయనవద్ద సిద్ధాంతభాగమును జదువుకొని శిష్యులైన త్రితిసు కూడఁ గొందఱు కలరు. అట్టిచో నాసిద్ధాంతిగారు శివభక్తులై తనకుఁ బరిచితిగల శములఁ బలువురకును భక్తి గలిగించిరి.  శివనామమును వ్రాయఁ బ్రబోధించిరి. ఇట్లు ప్రబోధించి కోటినామములను వ్రాయించి అదియే శివకోటి. అందుఁ జతుర్థాంశము ( ... ) దగ్ధణమును ...

తుర్థాంశము (౬ లక్షల ౨౫ వేల) తో హోమమును గావించిరి కాఁబోలు. అందుఁ జతుర్థాంశ మన్నదాన మాచరింపవలెను. అప్పుడు లక్ష ౫౬ వేల ౨౫౦ యగును. అంత మంది కన్నదాన మశక్యము. కాని సకలవర్ణములకును జరుపుచోఁ జాలవఱకు సాఁగ వచ్చును. ప్రత్యహమును బగలును రాత్రియు బ్రాహ్మణులు పదిపండ్రెండువందలు భక్షిం చుచువచ్చిరఁట. అంతమందియో యత్కించిన్న్యూనాధికులో వైశ్యులును వచ్చి భుజించి యుండనోపు. వైశ్యులాసిద్ధిపేటలో సుమారు సహస్రసంఖ్యాకు లుండవచ్చును. అనేకు లైశ్వర్యవంతులు శివభక్తులు. ఆ వైశ్యుల తోడ్పాటుతోడనే సిద్ధాంతిగారు శివకోటి మహోత్సవమును జేయఁగలిగిరి. అందఱిలోను మొట్టమొదటివాఁడు మొలుగు కృష్ణయ్య గారు. దేవబ్రాహ్మణులయందు వీరికి విశ్వాసము విశేషము. ఇట్టిరు పదుగు రేకమై యీ శివకోటిమహోత్సవమును జేయించిరి. బ్రాహ్మణ వైశ్యులకే కాక పలువురు పరమదరిద్రు లకుఁ బ్రసాదమును బంచిపెట్టిరి. శివకోటివ్రాయించుట మొదలైనవే కాక సిద్ధాంతిగారి యీ కార్యములో నవరాత్రులును జరిగిన శివనామకీర్తనముతో జనులచెవుల త్రుప్పు వదలె నని నుడువవచ్చును.

కాంగ్రెసువాలంటరులవలెఁ గజ్జలుపట్టుకొని వణిగ్యువకులు శివనామసంకీర్తనము చేయుచుం జరించుట చూచి సంతోషింపని జన ముండదు. ఇట్టి జపతర్పణహోమాదిక ముతో సవనమువలె జరిగిన సిద్ధాంతిగారి శివకోటియుత్సవములో నర్త్విజు లఱువది గురు. అందు పౌండరీకము శ్రౌతముఁజదివినవారు చాల. తక్కుంగలవారు స్వాధ్యాయ పరులు శాస్త్రజ్ఞులు సాహిత్యవంతులు. ఆఋత్విజు లందఱును నాత్మీయకార్యము యథా తథముగా నాచరించుటయు నంతమం దర్వాపూజనము సిద్ధాంతిగారు చేసి తదాశీరక్షతలఁ దలఁదాల్చిరి. వీరుగాక యుపన్యాసకులు హరికథకులు భజనపరులు పలువురు పఱతెంచి స్వస్వవిద్యాప్రదర్శనపురస్సరముగా శివుని సేవించి సిద్ధాంతిగారి సత్కృతిని స్వీకరించిరి. అప్రతిగ్రహీతలయ్యుఁ బల్నాడు సత్తెనపల్లితాలూకాల బ్రాహ్మణగురుకులాశ్రమస్థాపకులును దర్కాలంకారవేదాంతశాస్త్రాభిజ్ఞులును నగు ముదిగొండ వెంకటరామశాస్త్రిగారుగూడ నియ్యుత్సవమున కేతెంచి స్వోపన్యాసముచేత నాప్రాంతజనుల నందఱ నానందపఱచిరి. గజవల్లి చంద్రమౌళిశాస్త్రిగారు మరుకూరు నారాయణశాస్త్రిగారు మున్నగు మహనీయులు బహుసంఖ్యాకులు పఱతెంచి యక్కార్యమున కలంకారభూతులైరి. చంద్రమౌళిశాస్త్రి గారు సత్తెనపల్లి పల్నాడుతాలూకాల గురుకులాశ్రమమునకుఁ జందా వేయించి ౧౧౬ రూపాయలు వసూలుచేసి ముదిగొండ వెంకటరామశాస్త్రిగారి ద్వారమునఁ దదాశ్రమము నకుఁ బంపించిరి.

---

## గద్వాలకబురులు

గద్వాల శ్రీ సీతారామభూపాలుఁడు కాలధర్మము నొందినతరువాత ధపరా హిత్యాది లోపములు తమకుఁ గలిగియున్నను దద్ద్వారమునకైన తలవాకి లోకవంకఁ దలయెత్తుచున్నను శ్రీమంతు,రాణి, ఆదిలక్ష్మీదేవమ్మ బహదరుగారు ప్రజాపరిపాలనమునను

కెల్లరకు నవగతమే. అవ్వారి దౌహిత్రులైన శ్రీకృష్ణరామభూపతియే యారాజ్య
పాలింపవలసినవారై యుండుటయు శ్రీ రాణిగా రీసం॥ కార్తిక బ ౧౧ దక్షిణ
పట్టాభిషేకమహోత్సవములు తాము నిర్వర్తించిరి.

శ్లో. శ్రీమత్కేశవదేవ శ్రితజనచింతామణి స్స సద్భావః
కామితఫలదో భూయా ద్గద్వాల్ సంస్థాన భూభుజా మేషాం.

సీ. వీరి దైవతభక్తి కారసి యేటేట
సలిపెడి కేశవోత్సవమె సాక్షి.
బ్రాహ్మణ్యమునఁగల పరమాదరమునకు
పోష్యమాణ ధరావిబుధులె సాక్షి
అనుపమా నైతదీయౌదార్యమున కల
విద్వద్బహూకారవిధులె సాక్షి.
కవితారసజ్ఞత కవితధైతత్పురీ
వర్తులౌ సత్కవివరులె సాక్షి
ఉన్న దెంతయొ సాక్ష్యం బహో తదీయ
యోగ్యతం దెల్పఁగలయది యుర్వి నింక,
వశమె గద్వాలభూపాలవంశభవుల
పేర్మి యేతాదృశంబని పేరుకొనఁగ!

---

## —• గృహప్రవేశ మహోత్సవము •—

అభినవసరస్వతి కొక పోషకులును నిజాంరాష్ట్రమునకుఁ జేరిన నల్లగొండ
జనగాముతాలూకా విసునూరుగ్రామనివాసులును 72 ఊళ్ళకు దేశముఖులై
దగిన దర్పగాంభీర్యాదులును బలుకుఁబడియు నున్నతోద్యోగుల మన్ననయుఁ
మహైశ్వర్యవంతులైయున్నవారును నగు రాపాక రామచంద్రారెడ్డి దొరవారు
సం॥ మార్గశిర శు ౬ నూతనగృహప్రవేశమహోత్సవమును గావించియున్నవారు.

కం. మునియే డే నాయూరిక
చనినపు డారామచంద్రజననాథు గృహ
మ్మునకుం బునాది యేర్పడి
యెను. నిరు డే నేగువఱకు నేమనవలయుఁ!

సీ. చుక్కలం జూచుచు శుభ్రసౌధాగ్రంబు
గన్పట్టె మెరనె కానవచ్చె.
ఊరిలోపలికేగి సౌరు గాంతునుగదా

మేడలోపలికిఁ బో గోడగోడను నాదు
ప్రతిబింబమే కానఁబడఁగఁదొడఁగె.
అబ్బురంపడి యంత నటునిటు తిరుగుచో
స్ఫటికంపు టడుగురాల్ జాఱినయ్యె.
మఱి యెలెక్ట్రిలైట్లు మందిరాంతర్బహి
స్థలుల లెక్కఁబెట్ట నలవికావు.
ఇట్టు తద్గృహంబు కట్టఁగాఁబడునాఁడె
ఎలమి కలవరింత గొలిపె నాకు.

మూడంతస్థులు. ఆపై నావరణరహిత విహారభూమి. ప్రతియంతస్తునను నిరుపార్శ్వముల నెన్నియో చిత్రవిచిత్ర నిర్మాణములు. చల్లనీళ్ళపంపులే కాక వేడినీళ్ళపంపులు, స్నానపుగదులు, జపగృహములు, శయనగృహములు, విలాసవేశ్మములు, బంధుమిత్రుల భవనములు, రాజకీయోద్యోగుల రమ్యప్రదేశములు మరపంకాలు అవి యివి యననేల? అఖిలసౌకర్యములును గలిగి యర్జునున కర్పింపఁబడిన మయసభను స్మరింపఁజేయు మందిరమునఁ బ్రాగుక్తశుభదినమున రామచంద్రారెడ్డిగారు తాము ప్రవేశించి ధరణీసురాశీర్వాదపురస్సర తండులాక్షతలు తలఁ దాల్చిరి. ధన్యులైరి.

ఉ. తోఁపఁగ నింద్రవైభవము తోడిమహీశశతంబుతోడ నీ
భూపు గృహప్రవేశ మది పొల్పువహింపఁగ నయ్యెనంట. ల
క్షోపరి యన్నదానమఁట. యుర్విసుపర్వుల వేయిచేతులన్
రూపికలం బదింబదిగ రోసి మఱిం గురియించెనం టహో!

సీ. ఒకటిరెండును మూడు నొసఁగినవాఁడఁట
భూరిసంభావనయే రహింప.
పద్యమ్ములం జెప్పఁ బదునైదు లిడెనంట
రాణఁ గామేశ్వరరాయముఖుల.
కిరువదిరూప్యంబు లీయంగఁబడెనంట
సుమతి నారాయణజోస్యులకును.
పంచవింశతి యిచ్చి పైన సాలువు గప్పి
రహిఁ బంపెనఁట యల్ల రంగరాజు.
నిఁక భుజంగరాట్కవీశు ప్రాగల్భ్యాన
కవధి 'లేనె లేదఁ టహహా రామ
చంద్రసింధుమేఖలేందుబిందు స్వగృహప్ర
వేశసమయమందు విశ్రుతముగ

ఆ. వె. తద్గృహప్రవేశ తరుణమ్మునను నాకు
నుత్తరంబుఁ బంపియుండఁబోలు.
కాని సిద్దిపేట కేసు శ్రీ శివకోటి
ఉత్సవమున కేగియుంటి నపుడు.

తే. గీ. అవునుగాక. గృహప్రవేశవిధిసత్కృ
తికి వహించి ప్రధానపోషకత యస్మ
దభినవసరస్వతిని వేగ నర్హపాత్రి
మును బొనర్పఁగలండు తదూర్జ్భవరుండు.

కం. తనమేడ మూఁడవంత
స్తున నినుఁ డుదయించునపుడె శుచియై నిత్య
మ్మును జపియింపఁగఁబడు న
మ్మను రాజ మనామయముగ మనుచుత మితనిన్.

---

## కాశీనగరము

(పింగళి లక్ష్మీనారాయణగారు)

... కాశిని గుఱించినవిషయములు సవిస్తరముగా వ్రాయఁబడినచో నొక గ్రంథమే యగును. హైందవనాగరకతయొక్క చరిత్రను జెప్పినట్లగును... చిత్రమగువిషయములు వినినంతమాత్రమున బోధపడని విషయములు: ఏగ్రంథములోను లేక ప్రజల జీవితమందే ప్రతిష్ఠింపఁబడిన విషయములు. అనేక గ్రంథములలో నుండి మహానుభావులచేఁ జెప్పఁబడి జ్ఞానిలోకముచేఁ గొనియాడఁబడి కాశీవాసులచే నిరాకరింపఁబడెడి విషయములు.

పురాతనములలోఁ బురాతనము. హరిశ్చంద్రునినాఁడు మహాపట్టణము. పాండవుల కాలమందు హిందూక్షేత్రము. బుద్ధుని కాలమం దార్యావర్తమునకెల్ల గొప్పపట్టణము. చీనాదేశమునుండి యేడవశతాబ్దము పూర్వార్ధమందు యాత్రికొఱకు వచ్చేసిన హీన్ త్సాంగు వ్రాసినట్లు హిందూస్థానమందలి వాణిజ్యమున కంతకుం గేంద్రస్థానమైన మహాపట్టణము. వరుణ యసి యనెడు రెండు నదులమధ్యనుండి వారాణసియని పేరు గాంచిన పట్టణము. ఒకనాఁ డేఁబదియడుగుల లోఁతునఁ బాఱినది నానాఁటికి మేట వేసినది. ఇపు డసీనదిమీఁద లక్షలు వెచ్చించి గొప్ప భవనములను నిర్మించుచున్నారు మఠములను గట్టుచున్నారు. నూతనదేవాలయములు ప్రతిష్ఠచేయఁబడినవి. ఇదియంతయుఁ బందొమ్మిదవ శతాబ్దమునందు సాధ్యమైనది. పూర్వము చక్రవర్తులు నివసించిన స్థలములు పాటిపెరడులుగా మాఱిపోయినవి. అట్టిప్రదేశములం దిపుడు కూరగాయతోఁటలున్నవి. వ్యాసులు తపసుచేసి నివసించిన పట్టణప్రాంతము పాడుపడి నిర్జనమై చెఱకు దోఁటలకుఁ బొలమైనది. ఉత్తరప్రాంత మొక మైలువఱకుఁ బ్రాముఖ్యమును గోల్పోయి

పాతకప్రజనములకు నివాసస్థానమైనది. దక్షిణమున నూంటేడ్లలో రెండుమైళ్ళవఱకు నది వెంబడి ప్రాకినది. ఇక్కడనే యిపుడు హిందూవిశ్వవిద్యాలయము నిర్మింపఁబడినది. ఈ సంస్థక్రింద నింతవఱకు రెండు కోట్లు వెచ్చింపఁబడినవి. మఱియొక రెండు కోట్ల ధనమును సంపాదించి దీనిని బూర్తిఁజేయనున్నారు. సామాన్యముగా నితరపట్టణముల పెరుఁగుతఱుఁగులను బరిశీలించి చూచినయెడలఁ బ్రతిపట్టణము రైల్వేస్టేషను వైపునకుఁ బెరుఁగుచుండును. కాశిలోనో రైలున కత్యంతదూరములో నున్న స్థలములే యభివృద్ధిఁగాంచుచున్నవి. నదివెంబడి నైదు మైళ్ళ పొడవుగల పట్టణము. నది యెంతపొంగినను బ్రజలకు భయములేని పట్టణము. నీటిమట్టము కేఁబదిమొదలు నూఱడుగులవఱకు నెత్తుగల యొక యతివిశాలమగు కట్టమీఁదఁ గట్టఁబడిన పట్టణము.

పురాతనమన నేమి? ఇంగ్లాండు ప్రజావంతము గాకమునుపు రోమనుమహాపట్టణమును గట్టుటకు మునుపు పరిసియాప్రభువులు గ్రీసుదేశముపై దండెత్తుటకు మునుపు ఆథెన్సురాజ్యము తన యాధిపత్యముక్రింద యవనసామ్రాజ్యమును నిర్మించుటకు మునుపు ...విద్యలకు వాణిజ్యమునకు విత్తమునకు వైభవమునకుఁ గళలకుఁ గర్మాగారములకు నగ్రస్థానముగాంచిన పట్టణము. 800 మైళ్ళ కైవరముగల రాజ్యమున కనేకశతాబ్దములవఱకు ముఖ్యపట్టణము.

వ్యాసుఁడు దనగ్రంథముల నిచటఁ దొలుదొల్తఁ జదివి ప్రజలకు వినిపించి పురాణములఁ జెప్పెను. ప్రసిద్ధిగాంచెను. ఆయన పురాణములను ద్వాదశినాఁడు చదువుచుండెను. ఆనాఁ డందఱుఁ దమ కాలక్షేపములఁ గట్టిపెట్టి వినఁబోవుచుండిరి. ఇప్పటికి మనమెంతబ్రతిమాలినను నెంతసొమ్మిచ్చినను గాశిలో నెవరును ద్వాదశినాఁడు పురాణమును జదివి వినిపించరు. బుద్ధుఁ డీమహాపట్టణమును గెల్చెనేఁ గాని తన మతము దేశమునందు వ్యాపింపదని శక్తి ధారఁబోసి గొప్ప ప్రబోధము గావించెను. ఆయన నివాసముకొఱకుఁ గట్టఁబడిన మఠము మఱి యనేక బౌద్ధశిథిలములును శారానాథములో నుండుటచే బౌద్ధులనేకులు గుంపులుగుంపులుగాఁ గాశీయాత్రఁ జేయుచున్నారు. ఇప్పటికిని జైనులకొక గొప్ప మఠమున్నది. ఇది దక్షిణప్రాంతమున. వీరికి భూతదయను గుఱించి పట్టుదల గలిగియుండుటచే నాప్రాంతమందు గంగలోఁ జేపలఁబట్టుట మొసళ్ళను దుపాకులచేఁ గొట్టి వేఁటాడుట సర్కారుచే నిప్పటికిని నిషేధింపఁబడుచున్నది. ఈ పట్టణము బౌద్ధమతమునకు లోనైన వెంటనే హైందవవిద్యలు క్షీణించి బ్రాహ్మణుల బ్రతుకు తలక్రిందగుటయే కాక పట్టణముగూడఁ గృశించి కొన్నిశతాబ్దములవఱకుఁ బ్రాముఖ్యమును గోల్పోయి యుండినది.

శ్రీ శంకరాచార్యులవారు రామానుజాచార్యులవారు జీవితములను విస్తారముగా నుత్తరభారతదేశమందే గడపిరి. రామానుజాచార్యులవారుత్తరదేశమందుఁగూడ లక్షలకొలఁది శిష్యవర్గము సంపాదించి వైష్ణవమతవ్యాపనము గావించిరి. శంకరాచార్యులవారు తన నిరుపమానమేధాశక్తిచే నన్యమతవాదుల నోడించి సనాతన మతమును దిరిగి స్థాపించుటయే కాక కాశీపట్టణమును సంస్కృతవిద్యను మహోన్నతపదవికిఁ దెచ్చిరి. ఆనాఁటి నుండియు మతస్థాపకులందఱును గాశికి వచ్చి తమ మతములను బ్రకటించుచుకొనుచుండిరి. చైతన్యస్వామి వంగదేశమునుండి కాశీనగరమున కేతెంచి కొంతకాలమునుండి తన ప్రేమ

కబీరుదాసు భక్తిమార్గమును హిందూస్థానమందు వ్యాపింపఁజేయుటకును హిందు మహమ్మదీయ సమీకరణము గావించుటకును గాశీనగరమును నివాసముగాఁ జేసి యుండెను. శృంగగిరిపీఠాధిపతి కిక్కడ నొక గొప్పమఠ మున్నది. ఇప్పటికి దాని దనేకులు భక్తులున్నారు. అట్లే రామానందుఁడును వల్లభాచార్యులును గొంతకాల కాశీవాసము గావించి తమ మతములను వ్యాపింపఁజేసికొనిరి. హిందీభాషకు నూతనవి సమునిచ్చి నిత్యత్వమొసఁగిన తులసీదాసు చిరకాల మిచ్చట నుండెను. ఆయన స్నా ముఁజేసి యక్కడనే సూర్యోదయకాల మంతయుఁ గడపుచువచ్చిన ప్రదేశమును తు సీదాసఘట్టమని వాడుచున్నారు. ఇది హరిశ్చంద్రఘట్టమునకు సమీపములోనే యున్నది.

గంగానదియెడలఁగల భక్తిచేతను గాశీవాసమందుఁగల విశ్వాసముచేతను ఇండియా లోనుండు ననేకసంస్థానాధీశులకును బీఠాధిపతులకును గోటీశ్వరులకును నుచితనివా భవనములు విశాలమగు మఠములుఁ గలవు. నేపాలు తిరువాన్కూరు కాశ్మీరు మైసూ ఇండోరు, కొచ్చి, దర్భాంగ, విజయనగరము, మొదలగు సంస్థానముల కధిపతులు వా కుటుంబములుఁ దఱుచుగాఁ గాశీవాసముఁ జేయుచుందురు. బొంబాయి కలకత్తా న ములలోఁ బేరుగాంచిన ధనికు లనేకులు నివాసముల నేర్పఱచుకొనిరి. వీరందఱికి ఢిల్లీ గాని సిమ్లాలోఁ గాని నివాసములు లేవే? కనుకఁ గాశీనగర మిండియాకు హృదయము వంటిది. మాళవ్యాగారీనగరమందుఁగల ప్రతిష్ఠచేతనే హిందూజాతి కంతకు నాయకు డనిపించుకొనెను. ఈ కారణముచేతనే కాశీవిశ్వవిద్యాలయముకొఱకు రెండు కోట్ల ధ మును సంపాదించఁగలిగెను. ఇందుచేతనే కాశిలోని పండితులు గొప్ప మేడలను సంపా దించఁగలిగిరి. కాశీనగర మొక జాతీయసంస్థ. ప్రజ లందఱు నిండియాలోని నానా ప్రములందుఁగల ప్రజల సొమ్ముచేఁ బోషింపఁబడుచున్నారు. ఇక్కడ నేయఁబడు పట్టు వస్త్రములు బెజవాడ కుంభకోణము పునహా మొదలగు పట్టణములలో విక్రయించఁబడు చున్నవి. యాత్రికులు కొనిపోవు పట్టువస్త్రములు విగ్రహములు పాత్రలు ననేక లక్ష విలువ గలిగియుండును.

ఇఁకఁ బట్టణమును వర్ణించిచూతము. ప్రాతపట్టణమందుఁగల మేడలు చాల పెద్దవి. కాని యావరణములు చిన్నవి. నాలుగైదంతస్తులుగల మేడ లనేకము లున్నవి. షుమారు మూడువందల గజముల స్థలములో నిరువదికుటుంబములు నివసించుటకు వసతి లుండును. పెద్దవీథులు రెండే. ఒకటి రాజఘాటురైల్వేష్టేషనులనుండి విశ్వవిద్యాలయము వఱకు 5 మైళ్ళ పొడవుగలిగియున్నది. రెండవరోడ్డు దశాశ్వమేధఘట్టమునుండి కంటో న్మెంటు వఱకు మూడుమైళ్ళపొడవుగలది. ఇఁక సందులు గొందులు గల్లీలు కొలఁది గలవు. బండ్లునడుచుటకు వీలులేదు. మోటారుకార్లకు వెడల్పు చాలదు. ఇరుకు చేతను జనసమ్మర్దముచేతను బైసికిలుకు వీలులేదు. బావులు లేవు. గంగాస్నానముఁ నడక తప్పనిసరి. ఒక్క గజములోనే యొక యాలయము. ఇట్టివి షుమారు వేయి ప్రతిష్ఠలు. నాలుగుగజముల చతురస్రతలముగల దేవాలయములు షుమారు నూఱుండును. అన్నిటిలోను నిత్యము నభిషేకములుఁ బూజలు జరుగుచునే యుండును. ఇరువదినైదు కోట్ల హిందువుల భక్తికి గుఱియైన విశ్వేశ్వరాలయము 500 గజముల స్థలములో గట్టఁబడినది.



ఈదేశమందు గొప్ప గాలిగోపురములు లేవు. విశ్వేశ్వరాలయ గర్భము షుమారు

యగు నహల్యాబాయిగారిచేఁ గట్టింపఁబడెను. ఈదేవాలయము సుమా ఇరువదియడుగుల యెత్తుండును... ఒకయడుగు లోఁతుగలిగి నలుప్రక్కలను మూడడుగుల పొడుగుగల యొక చదరపు గుంటలోఁ బ్రతిష్ఠింపఁబడినది. ఒకబిందెతో నీళ్ళు పై వ్రేలాడఁగట్టఁబడును. ఆబిందెకుఁ గ్రింద నొక చిన్న రంధ్ర మమర్చఁబడినది. ఈవిధముగా నిరంతరాభిషేకము జరుగుచుండును. ప్రతిదినము షుమారు రెండువేలమంది దర్శనమునకు వచ్చి పోవుచుందురు. కొన్నిపండుగదినములలో దర్శనము చాలఁ గష్టపడినఁగాని దొరకదు. ప్రతిగుడియొద్దను బ్రతిసందులోను బ్రతిగొందిలోను నావులు నాఁబోతులు సన్యాసులు విశంతువులు యాత్రికులుఁ గాననగును.

నలువదిచదరపుమైళ్ళ భూమి మహాక్షేత్రముగాఁ బరిగణింపఁబడుచున్నది. ఈక్షేత్రము ప్రత్యేకధర్మముచేఁ బాలింపఁబడుచున్నది. ఈభూమి యముని యధికారావరణములోఁ జేరియుండలేదు. ఇది కాలభైరవుని యధికారస్థానము. అష్టభైరవు లెనిమిది దిక్కులనుండి యీపుణ్యభూమిని గాపాడుచున్నారు. అందుచే యాత్రికు లెనమండ్రుగురు బ్రాహ్మణులకుఁ బంచభక్ష్యములతోఁ దృప్తియగు భోజన మిడి మంచిదక్షిణ ముట్టఁజేసెదరు. ఈకార్యమునకే కాలాష్టకమని వాడుక. కాలాష్టకముల కందఱుఁ బోరు. కాశిలోఁ బరాన్నాన్వేషణతత్పరులు మూడువందలమంది కలరు. వీరిలో నేఁబదిమంది మరలమరల భుజించు మహాభోక్తలై యున్నారు. ఈనాఁడు కాశీనగర మనశ్శులకు నివాసముగాలేదు. అన్నదానము క్రమముగా క్షీణించుచున్నధి.

కాశీవాసమును వ్రతముగాఁ బూనియున్నవారు దాదాపు నలువదివేలుండనగును. వంగదేశస్థులే రమారమి యిరువదివేలమంది కలరు. మహారాష్ట్రులు నాలుగువేలమంది. ఆంధ్రులుఁ గన్నడదేశస్థులుఁ దమిళదేశస్థులుఁ గలసి వేయిమంది రమారమిగా నున్నారు. ఆంధ్రులు రమారమి నూఱుమంది. వీరందఱు మద్రాసురాజధానినుండి వచ్చినవారే. ఇక్కడివారు వీరినిగుఱించి యతిలాఘవముగా మాటలాడుదురు ... కాలాష్టక ... భోక్తలు యాత్రికుల కెదురుపోయి ... కమీషనుపుచ్చుకొను సరఫరాదారులు విశంతువులు సన్యాసులుఁ జాలఁ జెడువాడుకతో నున్నారు. సన్యాసులుగూడ యాత్రికులను గుఱించిన లాభవ్యాపారమునందుఁ బూర్తిగాఁ బ్రవేశించియున్నారు ....

పూర్వము యాత్రలు ప్రవాసము గల్పించుచుండెడివి. కాలినడక నాఱుమాసములలోఁ గాశికిఁ జేరుచుండిరి. యాత్రల గృహాదులను బంధుమిత్రులను గుటుంబములను విడిచి సుఖములకు నహంకారమమకారములకు దూరస్థులై యనేక నూతనవిషయములను జూచి పరిశోధించి నేర్చి భక్తిజ్ఞానవైరాగ్యముల సమకూర్చుకొని పూర్తిఫలితమును గాంచిరి. ఇపుడు రైలులోఁ గదలకుండఁ గూర్చుండి పరుపులమీఁద హాయిగాఁ బరుండి ప్రతి పెద్దస్టేషనులోను మంచిమంచి భక్ష్యములను బానీయములనుగొని తిని త్రాగి మూఁడవ నాఁటికి గయకుఁ జేరి గౌతమబుద్ధుఁడు స్వస్వరూపదర్శనము గాంచి రాజ్యమును సకల సంపదలను విడచిన స్థలమందు నిలిచి యడ్డాకులవిస్తళ్ళనో గోంగూరనో త్యజించి మహాత్యాగులై యాత్రలఁ జేయుచున్నారు. యాత్రలందు వివిక్తదేశసేవిత్వము నేకభుక్తి ... మొదలగునవి ... [illegible] చిత్తశుద్ధి యంతఃకరణనిష్ఠ ప్రభవింపకున్నఁ బుణ్యనదులందు స్నానము రుద్రాక్షధారణము మొదలగు బాహ్యతంత్ర

భక్తులు కాశిలో మరణించినమాత్రముననే మోక్షము ప్రాప్తించునని నమ్మి కాశీవాసము చేయుచున్నారు.

...ఆంగ్లదేశమందు దృష్టిస్పర్శదోషములను గుఱించి యతి కఠినమగు కట్టుబాట్లు కలవు. ఇపుడు దేశసేవకులు గాంధిమతస్థులు స్పర్శనుగుఱించి చెప్పునుపన్యాసము విననవారికి స్పర్శయే యొక పుణ్యముఁ బురుషార్థమునని చెప్పుచున్నటులఁ గనుపించు కాని మహాత్ముని కట్టి యభిప్రాయ ముండనేరదు. స్పర్శచేతనే వ్యాధులు వ్యాపించుచున్నవి. పూర్వులు మడుగునకుఁ బోయి యెవరివస్త్రములు వారే శుభ్రపఱచుకొనుచుడిరి. ఇపు డందఱుఁ జాకలికి వేయుటయు మామావస్త్రములను పెద్దపెద్ద మూటలుగఁగట్టి బండిపైన వేసికొని చాకలి కొనిపోయి శుభ్రపఱచుటలో ననేకవ్యాధులను వ్యాపింపజేయుచున్నాఁడు. రైళ్ళు, ట్రాముబండ్లు, పట్టణములో నివాసము, ఆస్పిటలు, హోటళ్ళు కొంపలు, కాఫీక్లబ్బులు, మీటింగులు, మొదలగు నూతనసంస్థ లనేకవిధసంకరములను, బ్రబలపఱచుచున్నవి. మన సంఘనియమముల నెఱిఁగినవారి కొకరినొకరు ముట్టుకొనుట దోషమని తెలిసియే యున్నది. నిన్న కడకుఁ బోయిన స్త్రీని నేడు కడకుఁబోయిన స్త్రీ ముట్టుకొనఁగూడదు. మడితోనున్నవారుగూడ నొకరినొకరు ముట్టుకొనఁగూడదు. దంపతు లొకరినొకరు ముట్టుకొననగును. పిల్లలు తలిదండ్రుల ముట్టనగును. భోజనసమయముఁ గారణములేనిది యొకయింటిలోఁగూడ నొకరినొకరు ముట్టఁగూడదు. అస్పృశ్యత యత్యావశ్యకమైన ధర్మము. కాని...ఉత్తరభారతమండలములలో నస్పృశ్యత యొక్క ఘోరరూపములు కనిపించవు. చిన్న చిన్న పల్లెలందుమాత్రము పంచములను గుఱించి కొంత కొంత పట్టుదల కలదు...కాశీనగరమందు...సందులుగొందులున్నందున స్పర్శ ప్రమాదవంతముగా నున్నది. సాంకర్యమును సహించవలసివచ్చుచున్నది.

ఇంటింటికి నీళ్ళపంపులున్నవి. కాని పెద్దకుటుంబములవారికిని గొప్ప కార్యముల సంతర్పణలు జరుపఁబడు సమయములందును బంపుచే బ్రాప్తించు నీరు చాలదు...గంగ తెచ్చువా రున్నారు. వారిని, పానీవాలాయని పిలుతురు. భాగ్యవంతులగువారును పెద్ద కుటుంబములవారును, పానీవాలాను పెట్టుకొనక తప్పదు. పానీవాలాగా బ్రాహ్మణులుండుటలేదు. ఈ నీళ్ళు వంటలకుఁగూడ నుపయోగించెదరు. దేవతార్చనకరులుగూడ మడిమైలకు నీ గంగనే వాడుచున్నారు. పానీవాలా తన కడవలతోనే నీరు పట్టుకొనిపోయి పోసివచ్చుచుండును. ఈ గంగను వృద్ధలగు వితంతులుగూడ వాడుకొనుచున్నారు. ఇది రహస్యవిషయము గాదు...

కాశిలోఁ బ్రజ లందఱు నొక్కపూటమాత్రమే పప్పు కూర యన్నము భుజించుచున్నారు. రాత్రులందు సామాన్యముగా నిప్పుఁజేసి వంట చేయరు. బజారులోని ఫలాహారములనే భక్షించెదరు. నూఱురకముల పిండివంటలను జేసి దుకాణములలో విక్రయింతురు. ఇదిగాక యీ దేశమున నన్ని ధాన్యములను వేయించి పేలాలుగను వానిని పిండిగను నమ్ముచుందురు. ఇట్టిపిండిని సత్తని పిలిచెదరు. ఏధాన్యముసత్తు కావలెనన్న నా ధాన్యపుసత్తు నమ్మెదరు. ముఖ్యముగా నేకాదశి యిక్కడ నియమదినము. ఆనాఁడు దుకాణములు బంద. షాపులు బంద. కాని భోజ్యముల నమ్మువారు తీసియుంచెదరు. ప్రతిసాయంకాలము నేకాదశినాఁడు [illegible] బంద. కనుక దుకాణములకు బోయి నానావిధభోజ్యములను గొని తిననగును. వితంతులు వైదికులు పండితులు సంధ్యా బజారుసరకులనే భుజించుచున్నారు. వీనిని ద్విజులు చేయరు. ఆంధ్రదేశమందు

తే. మేను పేరిటి పెనుగోతిలోన దాగి
వేశలాకృతితోఁ గానుపించుచుండు
భోగతృష్ణాపిశాచి యెప్పుడును మమ్ము
మోసగించుచునున్నది. మునివతంస! 175

తే. అకట! యీపాడు దేహంబునందె యాస్థ
గల మృషాజ్ఞాన మనుకురాక్షసి చలంబు
తోడ నసహాయరైన సద్బుద్ధి నెపుడు
వంచనమొనర్చి దైన్య మొందించుచుండు. 176

చ. కనఁబడునట్టియీజగమె కల్ల యగుంగద! యింక దీనిలో
న నిమిడియున్న యీతనువనంగను సత్యమె? యిట్టులయ్యు దీ
నినె నిజమంచు నమ్మి యవనీజను లెల్ల నిరంతరంబు వం
చనములఁబొందుచుందు రిది సంయమినాయక! చిత్రమౌఁగదా! 177

కం. సెలయేటి నీటిబిందువు
వలె నెండిన పండుటాకు వడువున మఱియుఁ
జలబుద్బుదంబుగతి, ని
ష్ఫలమై పడిపోవుఁ దనువు త్వరలోనె మునీ! 178

ఆ. శారదాంబుదములఁ జంచలాలతల గం
ధర్వనగరములను స్థైర్య మెవఁడు
నిర్ణయించు నతఁడు నెరనమ్ముఁగాత, దే
హమ్ము, నొరులు దీని నమ్మరాదు. 179

వ. కావున మిథ్యాజ్ఞానవికారంబును స్వప్నసంభ్రమప్రత్తనంబును స్ఫుటతరాపాయంబును బ్రబలదోషసమన్వితంబును నగు నీకళేబరంబును దృణంబుగతి నిరసించి సుఖంబుండువాఁడ. దేవా! యిట్టి దేహంబునకు సంభవించు వివిధావస్థలయందు బాల్యంబానందదాయకంబని కొందఱు తలంతురుగాని. 180

## —♦ బాల్యనింద ♦—

తే. కార్యభారతరంగసంఘాతకలిత
చంచలాకార సంసారజలధియందు

జంతుసంతతి మానవజన్మ మెత్తి
బాల్యమును బొందుటయు వెతల్ వడుటకొఱకె.

ఉ. ఆపద, శక్తిహీనత, దురాశయు, మూకత, మూఢబుద్ధియున్,
జాపల, మార్తి, లోభమును సర్వము నీ శిశుభావమందె సం
స్థాపితమై తనర్చుననఁ దాపసనాయక! యింతకంటె సం
తాపకరం బొకండు కలదా? వలదా విసువంద దీనిపై.

ఉ. రోసమునందు దైన్యమున రోదనమే శరణంబుగాఁగ వి
డ్వాసితడోలికాంతరమె వాసముగాఁ గడు నస్వతంత్రతన్
గాసిని ముంచి కంబమునఁ గట్టిన దంతివిధాన మానవున్
జేసెడి శైశవంబు మునిసింహ! సుఖప్రద మెట్టులయ్యెడిన్.

క. మునినాథ! శైశవంబున, మనుజుఁడువడునట్టి వెతలు మఱియెట్టి
స్థనుబొందఁడనఁగ నిది సుఖ, మను వారలకంటె మూర్ఖు లవనిం గల

ఉ. అద్దమునందుఁ గానఁబడు నాకృతులన్ దలపించు మోహముల్
తద్దయుఁ గూర్చుచున్, బలుతలంపులఁ బెంపొనరించు, చందులో
నెద్ది లభింపకున్న వగ నేడ్చెడిమానస మొప్ప నిత్య మా
పద్దశలందు మున్గ శిశుభావము సౌఖ్యద మేరి కయ్యెడిన్?

తే. శైశవంబున నగ్నిచే జలముచేత
గాలిచే మాటి మాటి కజ్ఞానవశతఁ
గలుగుచుండెడి భయ మెట్టిసిలుగులందు
నైన మనుజుల కొదవునే మానిచంద్ర!

ఆ. దుర్విలాసయుతము, దుష్టాస్పదంబు, వ్య
ర్థక్రియాచయాభిరతము నైన
శైశవంబు తలఁప శాసింపఁబడుటకే
కాని శాంతికొఱకుఁ గాదు సుమ్ము.

ఆ. అఖిలదోషములును నఖిల దురాచార
ములును నఖిల దుర్వ్యథలును గూడి
బాల్యమందె యెపుడు బసచేయుఁ జీకటి
గొందిలోన గ్రుడ్లగూబ లట్టు.

క. పసితనము రమ్యమంచును, బోసగఁగ వచియించువ్యర్థబుద్ధుల మూర్ఖా
గ్రసరుల హతచిత్తులఁ దాపసవర! యేమనినఁగాని పాపము గలదే?

క. ఎందుఁ నరు డెందము డోలాందోలితవృత్తినుండు నల బాల్యం బా
నందద మగు టెట్లు? జగంబం దెల్ల నభవ్యకరమ యగుఁగాక మునీ!

తే. ఒక్క మనుజులకే కాదు నిక్కువముగ
నెల్లసత్త్వంబులకు నిల నెల్లదశల
కంటె శైశవమం దధికంబు చాప
లంబు పదిరెట్లుగా మానసంబు కాంచు. 191

ఆ. సహజముగ మనంబు చాంచల్యసహితంబు
శైశవంబు మఱియుఁ జంచలంబు
ఇట్టి రెండు నొకట నేకమై నిలిచిన
రక్షకుం డెవం డరాతిదమన! 192

తే. వెలఁది బిత్తరిచూపులు వీచికలును
వహ్నికీలలు నూత్నశంపాలతలును
జాపలం బభ్యసించినజాడ దోఁచు
శైశవాక్రాంతజన మానసముల చెంత. 193

తే. సతతచపలస్వభావత నతిశయిల్లు
శైశవంబు మనంబును సర్వవృత్తు
లందుఁ బరికించిచూచిన నన్నదమ్ము
లట్టు గనుపట్టుచున్నవి యఘవిదూర! 194

క. తిర్యగ్జంతువువిధమున మర్యాదాహీనవృత్తి మసలుచుఁ జిత్త
స్థైర్యంబు లేక హేయపుఁగార్యములొనరించు శిశువు గాధితనూజా!

ఉ. లీలల నాటపాటల మలీమసకార్యములం దురీహలం
జాలఁగ మోహమందు నతిచంచలవృత్తిఁ జరించు వాంఛితా
ర్థాలి లభింపకున్న వగనందు నకారణభీతిఁ జెందు జం
బాలమునందుఁ బ్రీతిగను బాలుఁడు మోహలతాలవాలుఁడై 196

తే. అనుదినము నూతనముఁ బ్రీతిజనక మైన
వస్తువు లభింపకున్నఁ బెంవగ మునుంగు

బాష్పశింఘాణ కర్దమపంకిలాస్యుఁ
డగుచు నింతకు నంతకు ననిశ మేడ్చు. 1

క. ఊరకె భయపడు, నెపు డాహారపరత దైన్యమందు, నలిజడమతి
కోరును గన్నది కననిది సారెకుఁ దనుమానసములఁ జపలత మించు

క. కోరినయర్థంబులుచే, కూరనియెడమానసమునఁగుములుచుఁబడయు
నేరక సిగ్గటి బిగ్గఱగా రోదన మాచరింపఁగాఁ గడఁగు మునీ! 1

క. వశుఁడగు నించుకలోనె వివశత నొకింతనె వికారపరుఁడగుచుండు
శిశు వతిసంతోషంబున నశుద్ధమున శునకమట్టు లాటలనాడుఁ 2

క. బలవంతమును మనోరథ విలసనకలితమును నయిన స్వీయమనము చే
బలుగతుల బాలుఁడు వనస్థలి గ్రీష్మముచేతఁబోలెఁ దాపమునందు

క. బడిలోనఁబారతంత్ర్యము గుడుచుచు బలుతాడనము లగురువులచే
బడయుచు బుడుతఁడు కష్టం, పడు నాలానంబునఁ ద్విపంబువిధా

ఆ. సంతసంబుతోడ జగమెల్లఁదిననెంచుఁ జంద్రుఁబట్టఁదలఁచుఁజదలను
వీఁక తెక్కలెత్తి యాఁకొన్న వేళలఁ శైకి నెగురఁగోరుఁ బక్షిరీతి.

తే. అంతరంబున శీతాతపాదివేదనాన్వితుండయ్యుఁ దద్వారణాసమర్థు
డైన శిశువునకుర్వీరుహంబునకును, అంతరంబేమికలదు? మహానుభా

ఆ. తల్లివలన భీతి తండ్రివలన భీతి, ఇతరజనులవలన నెంతో భీతి
అన్నవలన భీతి యాచార్యుచే భీతి, శైశవంబు భీతిసదనముగదా

క. చెడుకోరిక లీడేరమిఁ గొడమెడు క్రూరంపుదుఃఖములు సతతంబు
బుడుతలఁ గారించెడు నై వడి నితరుల నొంపలేవు పరమమునీంద్రా

ఆ. ఇంతనుడువ నేల? యెల్లతోసంగులు నెల్లదుఃఖములు మహీసురేంద్ర
బాలునాశ్రయించి బ్రతుకుఁ బేదజనంబు ధనికునొద్దఁజేరి మనువిధా

వ. కావున సకలదోషదశావిహతాశయంబును నవివేకనిలయంబు
నగు బాల్యం బెవ్వరికేనియు బరితుష్టి గలిగింపమి నిక్కువం 2

పలికి రఘుపుంగవుండు మరల నిట్లనియె.

## —◆ పసిపిల్లలఁ బెంచు నేర్పాటులు ◆—

ప్రసవానంతరము 3 దినములు చనుఁబా లెవరివో తెచ్చియు నావుపాలు కొని తెచ్చియు శిశువులకుఁ బోయుదురు. ఇక్కాలంబున బాలెంతరాలికడఁ బా లుండవని సామాన్యస్త్రీలు తలంతురు. కాని యేస్త్రీల పాలో తెచ్చిపోయుట శిశువులదీర్ఘాయుర్భాగ్యమునకు భంగకరమని పండితులు కనిపెట్టియున్నారు. పరమేశ్వరుఁడు సర్వజంతువులకువలెనే మానవులకును గాలోచితాహారమును మాతృస్తన్యమున నిమిడ్చియే శిశుజన్మ మొనరించుచున్నాఁడని తెలిసి వా రానందించుచున్నారు. ఇది పరమ రహస్యము. ముఱ్ఱుపాలు శిశువుల దృఢగాత్రుల నొనరించి దీర్ఘాయుష్మంతులఁ గావించును గానఁదల్లి స్తన్య మిప్పింపుఁడు.

మొదటి నెలలోఁ బగలు గంటన్నర కొకసారియు రాత్రిలు 3 గంటల కొకసారియు రెండవ నెలలోఁ బగలు రెండుగంటల కొకసారియు రాత్రిలు నాలుగు గంటల కొకసారియుఁ బాలిచ్చుచుఁ దుదకుఁ బగలు నాలుగుగంటల కొకసారి యిచ్చుచు బిడ్డ యెదిగినకొలఁదిఁ గాలవ్యవధి హెచ్చుచేయుచు రావలెను. నియమితకాలమునకుఁ దల్లి యెడము కలుగఁ బాలిచ్చుచుండిన బిడ్డలకది యలవడి యితరకాలములందుఁ బాలకొఱకేడ్చుట మానెదరు, ఎప్పుడైనను వారేడ్చిన నప్పుడు చీమ దోమ నల్లి కుట్టుటగాని చలిగాని మఱియొకవిధమగు బాధకాని కలుగుచుండును. అట్టికారణముల వానింగనిపెట్టి బాధఁ దొలఁగించి యూఱడించుచుండవలెను గాని కాలపరిమితి తప్పి పాలీయరాదు.

పాలిచ్చుదినములందు శిశువుల కనుకూలములగు పదార్థములే తల్లి భుజించుచుండవలెను. బలకరమగు పిండివంటలు మొదలగునవి భుజింపరాదు. పగటివేళఁ దల్లి కూర్చుండి శిశువు తల పైకుండునట్లేటవాలుగ నుంచియు రాత్రిలందుఁ బరుండియుఁ జనుగుడుపుట శ్రేయస్కరి. పాలిచ్చునప్పుడు తల్లి యుల్లాస పూరితరాలై యుండవలెను. కోపశోకభయాదులం గూడి పాలిచ్చుట మానవలెను పాలిచ్చునప్పుడు స్తనములకు గాలి సోకనియ్యరాదు. నేఁటి కిది చాలును. నాకు సెలవొసంగుఁడు (అని వెడలిపోయెను)

(పదిదినము లయిన యనంతరము రాజనగరమునుండి గణపతిశాస్త్రిగారు తల్లి దండ్రులతోఁ గూడ వచ్చి నామకరణాదికము లొనరించుకొని స్వస్థానమున కరిగిరి. శిశువునకు వేణీబాయియని నామ మొనరించిరి. మరలఁ గొలఁదిదినములకు మంత్రసాని వచ్చి) పాలిచ్చుటం గూర్చి నేను మీ కెఱిఁగింపవలసిన యంశములు కొలదిగ నున్నవి, ఆలకింపుఁడని యిట్లు చెప్పఁదొడంగెను.

తల్లిపాలు చాలనప్పుడుమాత్రమే మఱియొకవిధముగ శిశుపోషణ మొనరింపవలెను. దాది నేర్పాటు చేయవలసివచ్చిన నాయమపతి సాధ్యమైనంతవఱకుఁ దల్లి యీడుదిగను దగుపదార్థము లాహారించునదిగను గృత్యములందుఁ దల్లితో పాటుగ మాత్రము కష్టమొనరించునదిగను నుండనిచో శిశువున కాపాలు సరిపడ నేరవు. అన్నియుఁ గుదిరినను దల్లిపాలవలె సరిపడుట గొప్పయదృష్టమని చెప్పవచ్చును. ఆవుపాలు పోయవలసివచ్చిన నాల్గూటఁబిదికిన పచ్చిపాలలో గోరువెచ్చని నీరు

కొంచెముగ నొకటిరెండుచిటికెల పంచదారయుఁ జేర్చవలెను. అవుపా
చిక్కనివియగుటచే నీరు కలుపకున్న నజీర్తిచేయును. మాధుర్యముకొఱకు
టచేఁ బంచదార చేర్చకుండిన శిశువులు సరిగఁ ద్రావరు. శిశువు లెదిగిన కొలఁది
పాలలో నీరు కలుపుట తగ్గించుచుండఁదగును. శిశువుల కుపయోగించు
పాలనిచ్చు నావులను బోడినేలయందును మంచు తగులనట్టియు వానకుఁ దడి
నట్టియుఁ బ్రదేశములందును గట్టివేయుచు వాతప్రకోపములగు మేఁతలుగా
సెనగలు, పత్తివిత్తులు, మొదలగునవి కుడితిగఁ గాని పెట్టక కనిపెట్టుచుం
వలెను. ఎన్నివిధములఁ గనిపెట్టుచుండినను శిశుతత్త్వములకు సరిపడి యారోగ్య
భంగము కాకుండుట గొప్ప యదృష్టమని చెప్పనగు.

కన్నతల్లి శిశువులకుఁ బాలీయక దాదులచే నిప్పించుటయు మఱియొకపా
పోయుటయుఁ బిల్లల యారోగ్యమును నాయుర్భాగ్యమును నంతరింపఁజేయు
నంతటి హానికరములనియు నట్టియేర్పాటా తల్లికిని నారోగ్యభంగ మొనరించు
ననియుఁ బలువురెఱుంగరు. అట్టివారు సంతానప్రాప్తిచేఁ గలుగఁదగిన సు
సంతోషములఁ బూర్ణముగ ననుభవింపఁజాలరు. పోఁతపాలు శిశుమరణమున
ముఖ్యకారణమని చెప్పవలసివచ్చినందులకు విచారముగ నున్నది. తల్లిపా
ద్రావెడువారలలో నూటికిఁ బదుగురకంటెఁ దక్కువశిశువులు మరణించుటయు
పాలుపోసి పెంచువారలలో నూటికిఁ బదుగురుమాత్రమే జీవించుటయుఁ ఎ
కాలముక్రిందటనే కనిపెట్టఁబడినది.

శిశువులకు నవమాసములు నిండినవెనుకఁ బాలు మఱపించు టుచితము. సామా
న్యముగ నేఁడాదివెళ్ళినవెనుకఁ బాలీయరాదు. ఆఱవమాసము వచ్చినది మొదలు
స్తన్యమునకుఁదోడుగ నితరాహారము నభ్యాసపఱచి నవమాసములు నిండునప్పటికి
దినక్రమమున స్తన్యము తఱుగునట్లును నితరాహారము చాలినంతగఁ దినునట్లు
నలవాటుచేయవలెను. శిశువు నలఁతగ నుండిననే దశమాదిమాసములం బాలీయ
వలెను. ఆరోగ్యముగ నున్న శిశువులకు దశమాదిమాసములం బాలిచ్చుచుండి
వారి దేహములు బలహీనములై గుల్లపాఱిపోవును. పాలు మఱపింపఁదలంచిన తల్లి
కొంచెము మూసాంబర మఱుఁగఁదీసి చనుమొనలకు రాచినఁ బిల్లలు ద్రావరు
మరలఁ గడిగి యనుకూలతరుణములఁ బాలిచ్చుచు శిశువుల నందుకు విముఖుల
గావించి మఱచిపోవునట్టు లొనరించవలెను. ఇన్ని విషయముల నొకసంవత్స
కాలము కనిపెట్టి గమనించుట సామాన్యజనుల కలవిగానిదగుటచేతనే పసిబిడ్డ
బెంచినట్లు కనిపెట్టుచున్నామని లోకమున సామెత ప్రబలియున్నది.
కుటుంబమునంగలవారి కెల్లరకును భగవంతుఁ డొసఁగిన తెలివి దయాపూర్వ
ముగ కొంతకనిపెట్టి యుపయోగించినను పసిబిడ్డను సరిగఁ బెంచుటకుఁ బాటు
పించునంతటి కష్టసాధ్యమగును. ఇంతలత్త్య మవసరమగు పని మఱియొకటి లే
ఇంటిశుభ్రతవంటి శుభ్రత తల్లియారోగ్యము, భోజనము, తుదకుఁ దల్లి రొం
యందును వానయందును దిరుగుటగూడ శిశువు నారోగ్యమున భేదమొనరించు
చుండును. తల్లి కజీర్ణము మొదలగు జబ్బులు కలిగినప్పుడు బిడ్డల కాపాలిచ్చు

నాజబ్బులే శిశువుల కంకురించును. కావున నట్టితరుణముల నోరులచే బాలిప్పించుట మంచిది. పాలిచ్చుటను గుఱించి కొన్ని మీకు దెల్పియున్నాను. ఈసారి వచ్చినప్పుడు మఱియొకయంశముంగూర్చి నాచేతనయినంతవఱకుఁ దెల్పెదను.

దు:- నీవు వివరించిన యంశములలో మేమెఱుఁగనివి పెక్కు కలవు. వాని నన్నిటిని మేము చేతనయినంతవఱకు గమనించుచుండెదము. పసిపిల్లను బెంచుట కిప్పటినుంచియు మేము తెలిసికొనవలసినయితర విషయములను మాకుఁ దొడనే తెల్పఁ గోరుచున్నాను.

కృ:- నే నీవిషయముల నిదివఱ కొక యుపన్యాసమునఁ జదివియుంటిని. ఇప్పుడు నీవు మరల వినిపించుటచే వాని యావశ్యకత చక్కఁగ బోధపడినది. ఇట్టివిషయము లెన్నిసారులు వినినను దెలిసికొనినను సంపూర్తిగఁ దెలియుట దుస్తరమని నా తలంపు. మాయమ్మగారు కోరినటుల మేము ముఖ్యముగ నాచరించవలసిన యంశముల నుపదేశింపఁగోరుచున్నాను.

రం:- (వీరి సెలవు గైకొని యరిగి మరలఁ గొన్నిదినములకు వచ్చి తల్లిపిల్లల క్షేమాదికము లారసి) మీరుకోరిన యితరాంశములం గూర్చికొలఁదిగ వివరించెద నాలింపుఁడు.

శిశువుల కనుదినము స్నానము సేయించు టవసరమని యెల్లరు నెఱుఁగుదురు. కాని యనేకు లాచరించునటుల నుడుకునీరు స్నానము సేయించుటచే ననేకవ్యాధు లంకురించును. ఎప్పుడును మోచేయి భరింపఁగల వేఁడికంటె నధికోష్ణత కూడదు. వేసవికాలమున నీయుష్ణత యింకను దక్కువగ నుండునటులఁ గనిపెట్టుట మంచిది. ద్వితీయమాసము వచ్చినవెనుక శిశువు బలహీనముగ నున్నచో స్నానము చేయించు నుదకమునం జిటికెఁ డుప్పు వేసి యానీళ్ళు పోయుచు వచ్చినచో శిశువుకు బలము కలుగును. స్నానముచేయించక పూర్వము పాలీయరాదు. చేయించినవెనుక నీయవలెను.

శిశువులకుఁ బండ్లువచ్చు సమయమునఁ గొన్నిజబ్బులు చేయును: కావున నట్టితరుణములందును గొంచెము జాగ్రత్త కలిగియుండు టవసరము. పండ్లువచ్చునప్పుడు శిశువులకుఁ దఱుచుగ విరేచనము లగును. అట్టి తరుణములఁ గొంచెము చిట్టాముద మిచ్చినఁ బ్రేగునందలి మాలిన్యము విరేచనరూపమున వదలి యనంతర మట్టివిరేచనములు మానును. శిశువులకు మంచిగాలియుఁదగుమాత్ర మెండయు సోఁకునటులఁ ద్రిప్పుచుండినఁ బండ్లువచ్చునప్పుడు కలిగెడి జబ్బు లనేకములు తొలఁగును. ఆహారమిచ్చువట్ల నీతరుణమునఁ గడు జాగరూకతకలిగియుండవలెను.

శిశుసంరక్షణమున ముఖ్యముగ జాగ్రత్తపుచ్చుకొనవలసిన యంశము వారి యారోగ్యము. కాలభేదముచేఁ గలుగుచుండు శీతవాతవ్యత్యయముల నుండియు, నవాంతరగండములనుండియు వారి కేవిధమగు ముప్పు రాకుండఁ గనిపెట్టియుండవలెను. వారి శరీరములు కోమలములైనటుల శక్తియుఁ గోమలము. జాగ్రత్తతోఁ గనిపెట్టి నడుపుచుండనిచో వారికిఁ దఱుచుగ నారోగ్యభంగము గలుగుచుండును. మీ కవసరమగువఱకు నాకుఁ దెలిసిన విషయముల వివరించితిని. మా తేణిబాయిగారి కన్నప్రాశనాదికము లైనవెనుకఁ దెలిసికొనవలసిన యంశములు

కొలఁదిగ నుండును. అవి తఱుచుగ నందఱు నెఱిఁగినవి. ఇఁక నాకు చెప్ప సంగదు.

కృ:- శ్రమయనక యిన్ని యంశములు సులభగ్రాహ్యముగ మా కెఱిఁగించినందుకు నీయెడఁ గృతజ్ఞతగ నుండఁగలము కాని యన్యథా బహూకరింపఁజాలము (అని చెప్పి రంగసానిం బంపెను. వేణిబాయి కేడవమాసము వచ్చెను.

గణ:- (వచ్చి పిల్లను దల్లిని వెంటఁబెట్టుకొని పోయి కొన్నిదినములు జరిగిన యనంతరమున శిశువునకుఁ గొలఁదిగ నజీర్ణము కలిగి పాలు కక్కుచు రాత్రుల నిద్రించక యేడ్చుచుండుట, దగ్గుచుండుట తటస్థించుటయుఁ గొంచెముగ వైద్యమెఱిఁగియుండుటచేఁ దల్లిని దేలికయాహారమును దినునట్లేర్పాటు లొనరించి సెనగగింజంత మడ్డివెలిగారమును బొంగించి కాల్చిన పిప్పలిగింజంజేర్చి నూఱించి చనుబాలం గల్పి పోయించి యజీర్ణమును దగ్గును శమించునట్లొనరించి కొలఁది దినములకు భార్యతో) ఇప్పు డమ్మాయి కన్నప్రాశన మొనరించితిమి. అంతయో యింతయో దినదినము నాకించుచుంటిమి. దానింగూర్చి నీ వెఱుఁగవలసిన యంశములఁ గొంచెము వివరించెద. మన యవయవములన్నియు మితముగ మాత్రము పనిచేయఁగలవు. చేతులతోఁ గొంచెముకాలము పనిచేసిన నవి తీఁపెత్తి విశ్రాంతికోరును. కాళ్ళతో నడచుచుండినఁ గొంత విశ్రమించిన గాని నడవఁజాలము. అటులనే ప్రీతిసాధనముకుఁ బనిచేయు దార్ఢ్యము కలుటకుఁ గొంత విశ్రాంతి యవసరము. కనుక జీర్ణకోశమునకుఁ గొంత విశ్రాంతి కలిగినఁగాని భుజించిన పదార్థము నది జీర్ణముచేయఁజాలదు. ఒకసారి భుజించిన పదార్థమును జీర్ణముచేయుటకు మూఁడుగంటలు వ్యవధికావలెను. ఈ మూడుగంటలకాలమును జీర్ణకోశము విడువక పనిచేయుచుండును. అది మరల బనిచేయ నారంభించుటకు మఱియొక మూడుగంటల విశ్రాంతి యవసరము గాన మన మొకసారి భుజించి మరల భోజనమున కరుగునప్పటి కాఱుగంటల వ్యవధి యుండవలెను. అట్టి వ్యవధి కలిగిననే చుఱుచుఱు నాఁకలి యగును. ఇంత మాత్రము వ్యవధి లేకుండఁ దినువారికి రుచియెట్టిదో యాఁకలియెట్టిదో తెలియదనవచ్చును. ఈ పైన వివరించిన యంశ మెఱిఁగిన మానవులకు వయసు చిన్నదైనకొలఁది కాలవ్యవధియుఁ దగ్గుచుండవలెనని తెలియవలెను. కాలనియమమును మితియును లేక శిశువుల కాహార మొసంగుచుండినను జెఱితిండి పెట్టుచుండినను నారోగ్యము తప్పుటే కాక సోమరితన మలవడును. ఆరోగ్యమ కోరువారు హితభుక్కులుగను మితభుక్కులుగను నుండు టావశ్యక మను సంగతి తల్లి జ్ఞాపకముంచుకొని బిడ్డలకును నలవఱచవలెను. నియమిత కాలమున మితాహార మొసఁగుచుండినఁ బసిబిడ్డల జాడ్యము లాక్రమించక తొలఁగుట నిజము. కొలఁది కాలముననే వారు నందుల కలవడి నియమితకాలముననే పాల ద్రావుటకును నితరాహారము గొనుటకును నభిలషించుచుందురు. నియమము లే యాహార మొసంగుచుండినచో నవసరము తెలిసినప్పుడును ఎప్పుడును భుజించి మిగుల నాయాసపడుచుందురు.

—॥ అవధానముదితుఁడై యప్పయ్య నాకు బిడ్డనిచ్చి పెండ్లిచేయుట ॥—

సీ. ఆశుభదినమునం దందఱు భుజియించి
తాంబూలములు వేయుతఱిఁ గరంబు
పేర్కు చేతనభట్ల వేంకటకృష్ణశా
స్త్రిలు లోనుగాఁగల సూరిజనులు
తంగెడవంశాబ్జతరణి లక్ష్మీకాంత
కవి రామకృష్ణసత్కవియు మఱియు
ఘనుఁడు తుమ్మలచెర్వు హనుమయాహ్వయ మంత్రి
మొదలుగాఁగలయట్టి ముఖ్యబంధు
లందఱును విన సూర్యనారాయణాభి
ధానుఁ డగ్గలపుం బ్రేమ దండఁ జీరి
నవ్వుమొగమున ననుఁజూచి నయముదొలుక
పలికె నొకమాట తేనియ లొలుకునటుల.

గీ సతత మష్టావధానంబు శతవధాన
మొనరిచెడివార లున్నార లనుచు మేము
విందు మితిహాసములలోని వింతకథలు
వినినలాగున. కాని కన్గొనియెఱుఁగము.

గీ. పలుపు చష్టావధానంబు శతవధాన
మిలపయిని గోనసీమలోపలఁ దిరుపతి
వేంకటేశకవీంద్రులు వెలసి రనుచు
వినుటయే కాని వారినేఁ గని యెఱుంగ.

కం. నేఁటికిఁ గనుగొంటిమి యి
చ్చోఁటనె మీర లొనరింపఁ జోద్యంబుగ. ప
ల్నాట భవాదృశు లుండుట
నాటికి యశ మబ్బెఁగాదె నరపతివినుతా!

గీ. దాచెపలి యెంత? మఱియుఁ దద్ఘనత యెంత?
దానిఁ బెద్దఁగఁ జేసి భూస్థలిని వెలయ
రచనచేసితి గ్రంథంబె రసయుతముగ
రసికజనవర! పట్టాభిరామసుకవి!

వ. అని మఱియు నాచే మున్ను రచింపఁబడిన దేవీనవరాత్రమహోత్సవాభివర్ణనం[illegible]
పద్యకావ్యమ్మును శ్రీశ్రీ జగద్గురు విరూపాక్షసంస్థానమునం జెప్పిన యాశుకవి[illegible]
చాటుపద్యాదులును నాకర్ణించి తద్విరూపాక్ష పీఠాధిపతియగు శ్రీ విద్యార[illegible]
భారతీస్వామి యొసంగిన యాశీర్వాదపత్రముం బొడగాంచి,

గీ. ఇరువదేనింటిగంటాల కిద్ధకవిత
చెప్పె సభ నని శ్రీవారి చేతి మొహరు
కలుగు నీపత్రముం జూడఁ దెలియవచ్చె
కానుపింపవె యావేడుకయును మాకు.

క. అనుటయు నే నాకవితయు
కనఁబఱిచితిఁ దద్వివాహకార్యంబున నే
కనెనఁట యప్పయ నన్నట
వినెనఁట యవధానముదితవిబుధులు వొగడన్.

విన్నది మొదలు నన్నల్లునిఁ జేసికొనుట కభిలషించెను. పిలిచి పిల్లనిచ్చెను. 5 ది[illegible] ములు వివాహము చేసెను. అంత్యతోత్సాహ మగపఱిచెను. పిడుగురాళ్ళలో నీచే[illegible] యష్టావధాన మీ బిడ్డను నాచే నీకిప్పించినది కాఁబట్టి యాబిడ్డ వివాహమం దష్టావ[illegible] మాచరింపవలెనని యర్థించెను. బిడ్డకెదురుగాఁ గూర్చుండఁబెట్టి పెండ్లికొడుకుచే న[illegible] ధాన మాచరింపించెను. ఆనందించెను. అట్లాచరితోద్వాహుండై యది మొదలు[illegible] యల్లుఁడనైన నాపై నత్యంతానురాగముతో నలరుచు వచ్చెను. అత్యుదారుఁడు. [illegible] నున్నంతవఱకు రూపాయి దమ్మిడిగఁ జూచెడివాఁడు. కాని కలవాఁడు కాఁడు. [illegible] యథాశక్తి నల్లు నాదరించుచునే యుండెడివాఁడు. మర్యాదగనే చూచెడివాఁ[illegible] 5 రోజులవివాహము దలుకదీర్చినపుడు హస్తములకు హైమాభరణము లర్పింప[illegible] యనియు బహుదినములవఱకుఁ బ్రతిశ్రుతమును బాలింపలేకపోవుటయు నప్పుడప్పు[illegible] యక్కఱకువచ్చుచున్న యాయన యాడగుఱ్ఱపుఁబిల్ల నగ్గము చేసికొని యే నెక్క[illegible] మొదలుపెట్టితిని. ఆయనయు నంగీకరించెను. అద్దానికిఁ బిల్లలు పుట్ట మొదలు[illegible] టయు నయ్యశ్వార్భకములపైననే మరల మనసువెట్టెను. అశ్వములన్న నాయన క[illegible] తోత్సాహము. ఎప్పుడును నేదో యొక గుఱ్ఱ ముండవలసినదే కాని పరగ్రామము[illegible] పాదచారియై పయనము చేసెడివాఁడు కాఁడు. బహుసైంధవములఁ బరిపాలించె[illegible] అక్కాలమున హయాంతర మమరకుంటఁ గాఁబోలు నర్పితపూర్వమని యన[illegible] యస్మదశ్వముపై నాశపడియెను.

క. మక్కువపడి గుఱ్ఱముపై నెక్కుటకున్ లేదు ప్రకృత మిమ్మియ్యదియ[illegible]
చొక్కమొగి నడుగ నిచ్చితిఁ జక్కని తొల్లింటిపిల్ల సంతోషమునన్[illegible]

యథాశక్తి నట్లన్యోన్యసహాయ మాచరించుకొనుచు మన్మామనిని యుండున[illegible] వఱకు మామయల్లుండ్ర[illegible]గ నెలఁగితిమి. పెండ్లినాటికన్నను [illegible] పెరుఁగుటకును నాఁడు పెట్టిన నగలకంటె నాతిని నానాభరణములచే నలంకరించుట[illegible]

గుటుంబజీవనము వెళ్ళఁదగినంత కొత్తభూమిని గొనఁగలుగుటకును దనబిడ్డపైనను దమపైనను దద్దయుఁ బ్రేమతోఁ దనరుచుండుటకును బొంగిపోవు మామ పుత్రిమరణానంతర మత్యంతము వంగలార్చవలసివచ్చెను. పుత్రికిఁబుట్టిన బిడ్డలయినను దక్కక పూర్తిగా సంబంధము తెగిపోవుటకు వగఁజెందెను. అట్లయ్యుఁ బునర్వివాహితనే కొంతకాలము పుత్రిగాఁ జూచుకొనుచుఁ దానుజేసిన సప్తాహాది సత్కార్యముల కాహ్వానించుచును గట్నములుఁ గానుకలుఁ బెట్టుచును గడుఁబ్రేమతోఁ బ్రవర్తిలెను. ఇది కేవలము మర్యాదాపురస్సరము గాని కడుపులోనుండి వచ్చెడి సహజమైన ప్రేమ గాదు. తమ్ముల నాహ్వానించి మర్యాదచేయుటయే కాని మాయూరికిమాత్ర మాయన యరుదెంచెడివాఁడు కాఁడు. బిడ్డ కాఁపురము చేసిన ప్రదేశములు కనుటతోడనే కడుపు చెక్కలగుచుండుటం బట్టి కడకుఁ బిడుగురాళ్ళకు వచ్చికూడ నటుదిక్కడుగిడలేక పోయెను. ఇప్పటి నాయిల్లాలీతనను నాయనయనియే పిల్చుచుఁ బాయని ప్రేమతో నుండుచున్నను నిటువచ్చుట కెదఁదలంపకపోవుటచేఁ గ్రమక్రమముగా నాతని మనసు విఱిగెను. ప్రకృత మన్యోన్యగ్రామముల కన్యోన్యగమనాగమనము లభిన్నప్రాయములే యైనవనవచ్చును. ఇంతవఱ కగపఱచిన యీయన ప్రేమకే యెంతయు నేను గృతజ్ఞుఁడను. నాభార్యతరువాత నాయప్పయ్య కొక కొడుకు నొక కూఁతురు నుదయించి వృద్ధికివచ్చిరి. సుతమాత్రము పతిచేఁ బాల్యమున గాక జనకునింటనే మనుచున్నయది. కొనకు గోమలియుఁగోడలును గూలిపోవుటయు నప్పయ్య కాబిడ్డయే యన్నపానీయము లమర్చుట కాధారమైనయది.

---

## శ్వశ్రువు (అత్త)

ఈకె మాకుఁ ద్రిరాత్రిజ్ఞాతిరైన తంగెడలోని జానపాటి వెంకయ్య చెల్లెలు. అభిధాన మంతమ్మ. ఆవెంకయ్య యర్ధదేహి యస్మచ్ఛ్వశురుఁడైన యప్పయ్య సహోదరి లక్ష్మీనరసమ్మ. బదులుకుబదు లీసంబంధము. అంతమ్మ యప్పయ్యల దాంపత్యము 50 ఏండ్లు. అప్పడఁతి నిప్పుతునక గాని సామాన్య గాదు. కృతయుగపు మానిసి. యథార్థవాదిని. బ్రతికినంతకాలముఁ బతిమాట కెదురుచెప్పని పతివ్రత. చదువుసంధ్యలు లేకున్నను సతీమతల్లియనఁదగు నీచోటి పాటలుమాత్రము బాగుగాఁబాడెడిది. ఆ పాట లభిజ్ఞులకుఁగూడ నాహ్లాదము గలిగించెడివి. ఈ తన్వియు చేతనభట్ల వెంకటకృష్ణశాస్త్రియు నప్పచెల్లెండ్రబిడ్డలు. ప్లవ సం॥ మాఘమాసమున (1902) నేను దాచేపల్లిలో నవధానము లాచరించుచు నంతికస్థమగు నలుగుమల్లెపాటిలో నప్పుడగు నావెంకటకృష్ణశాస్త్రియగ్రజుఁడగు నప్పయ్య యాహ్వానమున కరిగియుంటిని. నాఁడీమె యావటువునకు హారతిపట్టుచుఁ బాడిన పాటకుఁ బరమానందము కలుగుటయు నింకొకటి యింకొకటి యని వెంకటకృష్ణశాస్త్రి ద్వారమున సంస్కృతభాషలోఁ గొసరికొసరి పాడించితిని. ఈమె యెవరని పృచ్ఛించి సోమయాజుల యప్పయ్య సుదతి యనియుఁ బతివ్రతయనియు శ్రుతమగుటయు నాఁటినుండియు నామెపై నత్యంతాదరముగలవాఁడ నైతిని. అటు తరువాత నదృష్టవశమున నామె యాత్మజయే యర్ధాంగియయ్యెను. ఆయర్ధాంగికిఁ బ్రాయమువచ్చిన పదపడి తల్లియుఁ దానును గలసి పరిణయాదులలోఁ బాటలు పాడెడివారు. వీరియువురును సుస్వరముతోఁ గంఠమెత్తి పాడుచో శిక్షితలైన స్త్రీల పాట

చలేఁ గడు హాయిగలిపించెడిది. భర్తతోఁ గాఁపురము చేయ మొదలుపెట్టినప్పటి
డియుఁ బాప మా పతివ్రతకు బొట్టె లెందఱో పుట్టిపోయిరి. అట్లు పుట్టి పోయి పో
యస్మద్దర్భ దేహీ నిలిచెను. దానితరువాతఁ గూడ మఱికొందఱు పుట్టిపోయి మగపిల్లఁడొక
మనిరెను. అంత వినుగుమీఁద బ్రతికినవారగుటనే యయ్యిరువురిని బిచ్చమ్మయని
బిచ్చయ్యయనియుఁ బిలువ మొదలుపెట్టుటయుఁ బేరు లవియే యైపోయెను. పిచ్చ
పిదపఁ గూడ బిడ్డలు కొందఱు పుట్టిపోయి కొన కొక కూఁతురు మనఁగలిగెను.
మువ్వురిని బెంచి పెద్దఁజేసి పెండ్లి పేరంటములు చేసినది కాని యత్త యామరణ
నలమటించుచునే వచ్చినది. పెద్దబిడ్డ పెండ్లియైనది మొదలుకొని యది యంతరించు
మాత్రము కొంత సంతోషముతో నుండినది కాని కొనపటికు నటు మనలేకపోయె
అల్లుఁడు యశస్వియని యానందపడుచు నతిప్రేమ చూపెడిది. బిడ్డదగ్గఱవచ్చి పెద్ద
మఁడెడిది. జానపాటివారి యాడబిడ్డయే యగుట నేనును నీమెపై నెక్కువ పక్ష
పతో నుండెడివాఁడను. తన బిడ్డకుఁ గాని యల్లునకుఁ గాని తలనొప్పి వచ్చినను
వెత్తివచ్చి [illegible]ఉపచారములు చేసెడిది. చివరకు జానపాటికిని దమకును ఋణము
నందులకు సంతతముఁ జింతించినది. చింతించి యూరకుండక యాయంతమ్మ య
దభివృద్ధి నత్యంతము నాశ్మఁ గోరినది. పునర్వివాహము చేసికొనుటకుఁ బ్రోత్సాహ
చేసినది. నిజముగా నీమె వేసిన బీజమే మన్మనః క్షేత్రమునఁ బునర్వివాహోత్సాహ
జనించుటకు ఘనకారణము. బిడ్డచచ్చి పెనుదుఃఖవారినిధి మునిఁగియుండియు మా
నాఁడే యాడుము పెండ్లియని యల్లునకుఁ జెప్పిన యామె ప్రేమ మనిర్వాచ్య
వివాహము చేసికొనిన యనంతరము వేమాఱులు చెప్పిపంపి వేమవరమునకుఁ బిలిపించి
కొని విందులు చేసిపంపిన యాయమ విశ్వాసము విస్మృతము కానిది. పెద్దదానిపై
గానఁ బెద్దబిడ్డ యున్న సద్దానియొద్దనే యుండుచుంటినని యనవరతము సంగలా
చును వెండియు దాని సవతిని విశేషప్రేమపై వీక్షించుచును సర్వమైన కట్నము
పెట్టి యనుపుచును దలిదండ్రుల మటుపించిన తచ్ఛ్వశ్రూశ్వశురులగు నంతమ్మ య
య్యల యమాయిక వాత్సల్య మవర్ణనీయము. మమ్మంత ప్రేమించువారలను మేము
ప్రేమాతిశయముతోనే చూచుచుంటిమి కాని మేము వారియింటి కేగినట్లు మాయింటి
వారు రాలేకపోయిరి. కడుపు పగిలిపోవుటయే కారణ మద్దానికి. తద్భార్యాదుఃఖ
నాకుఁ బునర్భార్య పోఁగొట్టినది కాని పుత్త్రీదుఃఖ మవ్వారిని నిరంతరముఁ బరిత
పఁజేసినది. మాయింటనైన గంగానమారాధనమునకుమాత్ర మవ్వారు కష్టము
వచ్చుట కిష్టపడిరి. కట్నములుఁ గానుకలుఁ బెట్టిరి. తన్నుఁ బోషింప
నని యనుకొన్న పెద్దబిడ్డ మృతికే బిట్టు వాపోయెడి యత్త చిన్నబిడ్డ స్థితికిఁ గూడ
జింతాసాగరమున మునుఁగవలసివచ్చెను. చచ్చి యది యేడిపించిన బ్రదికి యిది యే
పించెను. ఈ రెండేడుపులకుఁ దోడు కొడలు కూలిపోయి మూడవయేడుపునకుఁ గా
మూలమయ్యెను. పడతిని గోలుపోయిన కొడుకు స్థితి కుడుకుచునే పాప మామె
లోకమున కరిగెను. పెద్దపెరిఁగినది మువ్వురే యైనను బెక్కండ్రు బిడ్డలఁ గనుటచే
మయవిశిష్టమైన [illegible] పుకుంటుములలో
బంచషష్టివత్సరప్రాయమునఁ బరమపదించెను.

## —♦ అనంతరపు టత్తమామలు ♦—

అనంతరపుటత్తను నాత్మజయే రెఱుఁగదు. దాని పురిటిలోనో తరువాతనో తచ్ఛ్వశ్రువు తనువుఁ ద్యజించినది. ఆమె పేరు లక్ష్మమ్మ. ఆమె పోయిన యనంతరము మామ సుబ్బరామయ్యరు మఱలఁ బరిణయము జరుపుకొనియెను. ఆపెతోడను ననేక వత్సరములు కాఁపురము చేసెను. పుత్రత్రయము పుట్టెను. అం దొకఁడు మ్రిందెనఁట. తక్కటి యిరువురును దల్లిదండ్రిదగ్గఱఁ దనరుచుండిరఁట. తల్లి ధవుఁ డుండఁగనే తనువు త్యజించినది. అమ పోయినయనంతర మా మామగూడఁ దానుద్యోగము చేయుచున్న తిరువాన్కూరురాష్ట్రమున దేశాంతరమందు దిక్కులేక పడియుండఁ బదపడి చేసికొన్న భార్యకుఁ బ్రభవించిన పదియేండ్లబాలుఁడే పరిచర్య జరిపెనఁట. కొన్నాళ్ళు చెల్లెలొకతె వచ్చి చేసెనఁట. ఆయన ప్రథమభార్యకుఁ బ్రభవించిన పట్టి (నానాతి) పరిణయము జరిపి, పంపునాఁడు పరితపించుటయే కాక పదపడి రెండుమూఁడేండ్లు నెలకొక యుత్తరము వ్రాయుచుఁ గలవరించెను. రెండవపెండ్లము నిండుచూలాలనియుఁ బ్రసవసమయమునఁ బట్టిని నన్ను వచ్చి తోడ్కొనిపోవుదుననియు వ్రాయుచు వచ్చెను. కాని యష్టమమాసముననే యామె యతికష్టముమైఁ బ్రసవించుటయుఁ బరలోకగతురాలగుటయుఁ బ్రాప్తించెను. అటుతరువాత వ్యాధితుఁడయ్యెను. ఈకారణములచే నెక్కువప్రేమ గలవాఁడయియు నస్మద్గ్రామమున కరుదెంచుటకుఁ గాని యల్లుని బిడ్డను వెంబడించుకొని వెళ్ళుటకుఁ గాని వీలుపడదు. తా బ్రతుకననియుఁ దనయను దోడ్కొనివచ్చి యాఖరుచూపు చూపుమనియు నతిదైన్యముతో నంత్యలేఖ యంపెను. కాని పాలకాడే బహుదూరముగా నక్కడికిఁ గూడ నంత దూరమం దున్న యన్యద్వీపమనఁదగు నాదేశమున కస్మదగ్రసుతుఁడగు సుబ్రహ్మణ్య మైదునెలలవాఁడై యుండుటచే నా నెత్తురుకందును వేసికొని యరుగలేకపోతిమి. తదనంతరావ్యవహితకాలముననే తన ధామమునకుఁ జనుదెంచి తనువు విడిచెను. తత్పారలౌకికమునకుఁ బఱతెండని పత్రిక పంపిరి కాని పూర్వోక్తకారణమునుండియే పోయినవారము కాము. అంతలోనే యాయన చరిత్ర ముగిసెను. ఆయన చతుశ్శాస్త్రవేత్తయగు వైద్యనాథదీక్షితుల యాద్యసంతానమే కాని తాఁ జదివినదిమాత్రము రాజవిద్య.

## —♦ స్యాలకులు ♦—

మొదటిమఱఁది పిచ్చయ్యయని యిదివరకే యుదాహృతము. వాఁడు పలువురు బిడ్డలు పోయినతరువాత బ్రతికినవాఁడగుటఁ గడుగారాబముతోఁ బట్టుమని పాఠశాలకుఁ బంపుటకే తలిదండ్రులు తలఁపకపోయిరి. అతిలాలనము చేసి నెత్తి నెక్కించుకొనిరి. అదియే యలవాటుతో నవ్వాఁడు బడియున్న బంధముగా భావించెను. ఎట్టుభావించినను దుట్టతుదకుఁ జదువను వ్రాయను సామాన్యముగా సమకూరెను. వెనుకటినుండియు విద్యాకుటుంబము గాకునికిని వేదశాస్త్రాభ్యాసవాసనయే యంకురింపదు. కాని సంగీతముమాత్రము వీనికి సహజసిద్ధము. పద్యము బాగుగాఁ బఠింపలేకున్నను జదివినంత మట్టుకు శ్రావ్యము. నానాఁటి కాపాట నాటకపాత్రధారణకును హరికథాకథనమునకును ననుకూలించెను. [illegible] వెనుక మాయూర విశ్వబ్రాహ్మణులు మొదలైనవారు వేసినప్పుడు వీనిని బిలిపించుటయు నక్రూరపాత్రధారియై యన్వే

త్రుకుల కన్యలకన్న మిన్నగా నానందము గలిగించుటయు నయ్యెను. అదియే జీవికగా బెట్టుకొని యటనము చేయకున్నను హరికథలుగూడ వీఁడు సరిగాఁ జెప్పఁగలఁడు. వీని వివాహము చెల్లెలిని బదులిచ్చియే చేయవలసివచ్చినది. ఆచెల్లెలిని బిన్నెలిగ్రామ నివాసి తంగిరాల సుబ్బయ్యకొడుకు నరసింహమున కిచ్చి వానిచెల్లెలు భ్రమరాంబను వీనికిఁ బెండ్లిచేసిరి. భ్రమరాంబతో వీఁడు 10, 12 ఏండ్లు బద్ధానురాగుఁడై ప్రవర్తిలెను. అది కాఁపురమునకు వచ్చినది మొదల త్తమామ లన్యత్రి యుండవలసివచ్చెను. ఐనను నవ్వాఁడొకఁడే యాత్మజుఁడగుటఁ దలిదండ్రులు తంగెడలోఁబోయి యుండియు దత్తేమలాభములను మరలఁ దామే విచారించిరి. వాఁడైనను నూఁడుమూడునన్న కం త్తోనే చేడను జననిని నొకచోట నుంచఁడు కాని భిన్నభావముచేఁ గాదు. అత్తగా డండ్రును నన్యోన్యము రాకపోకలు జరుపుకొనుచు ననుకూలతతోనే మనెడివారు. కోడలి కోరికను గ్రహించి కొడుకును గోడలును నెక్కడనో యొక్కడ నానుకూల్యముతో నుండి యభివృద్ధికి వచ్చినఁ జాలునని యత్తమామలే యవలఁ దొలఁగిరి గా రసాభాస రవంతయు నవలోకింపఁబడదు. పిచ్చయ్య భ్రమరాంబతోఁ బెద్దకాలము కాఁపురము చేసినను సంతానవంతుఁడగుట సంభవింపదు. మువ్వురో నల్వురో యవ్వారికిఁ బుట్టి యొక్కింత పెరిఁగియు దక్కకపోయిరి. సంతానసృష్టి కవ్వాఁడు చింతించి చేయఁదగిన చికిత్స లెన్నో చేసెనుగాని సిద్ధార్థుఁడు కాలేకపోయెను. రమణితోఁగూడ రామేశ్వరయాత్రగూడఁ జేసివచ్చెను. నాగప్రతిష్ఠ నడపెను. దేనినుండియుఁదీఱక కర్మము కడకుఁ గాంతయే తీఱనయ్యెను. నాకు మఱఁదియైనందుల కవ్వాఁడు కొంతవఱకు నన్నే పోలెను. నారి నారోగ్యవతిఁజేయుటకు నర్సరావుపేటకే నడచెను. అప్పటి లోనే యుంచెను. పడవలసిన పాట్లన్నియుఁ బడియెను. ఆఖరు కాయూరికే యప్ప జెప్పెను. తన్మరణానంతరము తనయుఁడును దలిదండ్రులును వెండియు వేమవరములో యుండిరి. కూఁతుండ్ర దుఃఖమునకుఁ గోడలిదుఃఖము తోడగుటయు జరాజర్జరిత యగు జనని స్వర్గమునకుఁ జనియెను. అర్ధాంగియే కాక యంబగూడ నట్లగుటయు బిచ్చయ్య పిచ్చయ్యయే యయ్యెను. అయ్య యప్పుడు యవ్వాని పునర్వివాహమున కనేకధా ప్రయత్నింపఁ బ్రయత్నింప నబ్దత్రయమున కది సిద్ధించెను. వెలంపల్లి గ్రామ నిలయుఁడు దేవరపల్లి సత్యనారాయణ బిడ్డ యా వివాహిత. అది యింకను నక్కాపు రాలేదు. మేనత్తయగు దేవరపల్లి సుబ్బమ్మ యన్నపానీయము లమర్చుచు వేమవరములో వీనివద్ద నుండుచున్నది. తండ్రి తనయు జానకిని మనుపుచును దా దానిచే మనుపఁబడు చును స్థవిరత్వమున మరలఁ దనయునితో వేఱుగనే యుండవలసివచ్చినది. అన్నకు జెల్లెలికిని నంకురించిన యానుకూల్యాభావమే యద్దానికిఁ గారణము. పిచ్చయ్యయు బిచ్చిప్రేమకలవాఁడు. పెక్కులేల? ఆకుటుంబపుఁ బ్రేమయే యటువంటిది. అస్మద్విషయమై యంతప్రేమగౌరవములు కలవారలైనను నస్మదంగన యాప్రేమబంధమును [illegible] పోవుటచేఁ గ్రమక్రమముగా వారికిని నాకును దూరమైనది. పిచ్చయ్యగూడఁ [illegible] రాళ్ళకు వచ్చి జానపాటికిఁ జనుదెంచుట చాలించుకొన్నవాఁడు. చాలించుకొనుఁగాక. సత్వరముగా [illegible] మును జేయఁగాక. గౌతమసగోత్రము ఖ్యాతిం గాంచుఁగాక!

## సహాయులు

౧ మెదక్ శివాజీ రావు దేశముఖుగారు, నల్లపల్లి
౨ వావిళ్ళ వెంకటేశ్వరశాస్త్రిగారు, చెన్నపట్టణము.
౩ తిప్పరాజు కామేశ్వరరావుగారు, కరణము, దుగ్గిరాల
౪ తిరుమలనల్లాన్ చక్రవర్తి వరదాచార్యులు అయ్యవార్లంగారు. [illegible]
౫ రాయమూరి బంటేరావుగారు, అయినాపురము.
౬ రాజా మంత్రిప్రెగడ రాఘవరావుగారు - లింగగిరి
౭ చిక్కరాజా మట్టపల్లిరావుగారు - చెలుర్తి. [పీఠంబు
౮ వాదరగుల్ సంగమేశ్వరరావు ద్యేగారు శ్రీశ్రీ జగద్గురు శృంగగిరి సంసావళి
౯ అద్దంకి ... తిరువెంగడతాతదేశికాచార్యులయ్యవార్లంగారు, శ్రీకాళహస్తి.
౧౦ మిర్యాపురం రామకృష్ణారావుగారు, కొల్లాపురం.
౧౧ మల్లాది నరసింహమూర్తిగారు. ప్లీడరు, గురజాల.
౧౨ కొత్వాలి కమలాకరరావు దేశముఖుగారు, నల్లపల్లి.
౧౩ పటికాల వెంకటేశ్వరరావుదేశముఖుగారు, పులిగిళ్ళ
౧౪ రాజా మంత్రిప్రగడ వెంకటహనుమంతరావుగారు, లింగగిరి.
౧౫ జంకా వెంకటసుబ్బారావుగారు, వకీలు, గురజాల.
౧౬ వద్దిరాజు సత్యనారాయణరావు దేశపాండ్యాగారు, హేడిపల్లి
౧౭ గొట్టిపర్తి సుబ్బారావుగారు. వకీలు, పింగళి కోలనీసు.
౧౮ మాశేపల్లి వెంకటకిషన్ రావు, సూర్యనరావు దేశముఖుగార్లు, కొత్తపల్లి.
౧౯ దంటు లక్ష్మీనరసింహముగారు - సుద్దపల్లి.
౨౦ మద్దూరు సాంబయ్యగారు - సాగానికంపెని - పరుచూరు.
౨౧ కేశవరావు దేశముఖుగారు - సెల్లంట్ల
౨౨ ముద్దు చంద్రయ్య, మాశేపల్లి మారుతిరావు దేశముఖుగార్లు-కొత్తపల్లి. [బాదు.
౨౩ రాయప్రోలు సుబ్బారావుగారు, ప్రొఫెసర్, యూనివర్సిటికాలేజి, హైదరా

---

### —♦ ఆఱుబయట నుండుట ♦—

... గదులలో బసించుటవలన ... బడలిక కనబడును. ఆఱుబయట బసించినచో ... కనబడదు ... మన శరీరములో ...ల్లకోట్లకుపైబడి గోళము లున్నవి ... వానికి చాలినంత వాయువు కావలసియున్నది. గదులలో బసచేసినచో గాలి ... సమృద్ధిగా లభించదు.



(ఆరోగ్యప్రకాశిని)

# అభినవసరస్వతి

సంపాదకుడు - నాగరఖండస్వర్ణకారవ్యవహారాది బహుగ్రంథకర్త

జానపాటి పట్టాభిరామశాస్త్రి.

ఇది యొకమాసపత్రిక. ఇందు వర్ణాశ్రమధర్మబోధక గ్రంథములును విమర్శ-
నాలు వ్యాసములును ప్రకటింపబడును. చందా సం॥ 1 కి రు 8...

## ఈ కార్యస్థానమున వెలకు దొరకు పుస్తకములు.

| | | | |
|---|---|---|---|
| 1 | విద్యారణ్యపీఠగురుపరంపర ... | 0 | 3 |
| 2 | నీతిగీతులు (సుమతీశతకము, దానికి శ్లోకములు) ... | 0 | 2 |
| 3 | వాసంతికాపరిణయ నాటకము ... | 0 | 4 |
| 4 | కరిణీకోద్ధారిణి [ప్రాచీనప్రబంధము] ... | 0 | 4 |
| 5 | విశ్వబ్రాహ్మణశబ్దఖండనము, బ్రాహ్మణశబ్దవిచారము | 0 | 2 |
| 6 | వత్సలనీతిశతకము ... | 0 | 1 |
| 7 | సర్వారాయ కవి శతావధానము (తిరుపతి వేంకటీయము) | 0 | 8 |
| 8 | సంగరోత్సవము ... | 0 | 8 |
| 9 | వాక్యశుద్ధివిచారము ... | 0 | 3 |
| 10 | పురశ్చరణము ... | 0 | 3 |
| 11 | విగ్రహారాధన ఖండనఖండనము ... | 0 | 4 |
| 12 | స్వర్ణకారవ్యవహారము ... | 1 | 8 |
| 13 | ఉద్ధాంధ్రమహారాష్ట్ర చరిత్రము .. | 0 | 10 |
| 14 | సూతసంహిత (ఆంధ్రము) | 2 | 8 |
| 15 | భారతీయప్రబోధము (పిసుపాటి చిదంబరశాస్త్రి) | 0 | 4 |
| 16 | ధర్మనిర్ణయము. | 0 | 4 |
| 17 | అస్పృశ్యతానివారణఖండనము (మల్లాది రామకృష్ణ చయనులు గారు) | 0 | 8 |
| 18 | స్కాందమహాపురాణాంతర్గత నాగరఖండము (౧ సంపుటము) | 1 | 0 |
| 19 | డిటో నాగరఖండము (౨ సంపుటము) | 1 | 8 |
| 20 | డిటో నాగరఖండము (౩ సంపుటము) | 1 | 8 |
| 21 | డిటో నాగరఖండము (౪ సంపుటము) | 1 | 8 |
| 22 | పల్నాటివీరచరిత్ర | 0 | 12 |
| 23 | ఆరోగ్యభాస్కరము | 0 | 6 |
| 24 | భాగవతరహస్యములు | 0 | 4 |
| 25 | సౌందర్యశతకము | 0 | [illegible] |

అభినవసరస్వతి కార్యస్థానము, జానపాడు, పిడుగురాళ్ళ పోస్టు,
గుంటూరు జిల్లా

Hyderabad Reg No. 170

# తెలుగుతల్లి

సచిత్ర మాస పత్రిక.

సంపుటము ౨ | 1 నవంబర్, 1940. | సంచిక ౧




గోలకొండ దుర్గము.



సంవత్సరము చందా 1-8-0 విడిసంచిక 0-2-0

# "తెలుఁగుతల్లి" రాజపోషకులు.

1. శ్రీ శ్రీ మహారాణీసాహెబాగారు, గద్వాల సంస్థానము.
2. ,, ,, రాణీసాహెబాగారు, అమరచింత సంస్థానము.
3. ,, ,, రాజా మహాదేవరావు బహద్దరుగారు, వనపర్తి.
4. ,, ,, రాజా నాయని వేంకటరంగారావు, బహద్దరుగారు, రా
5. ,, ,, దండు ఆగయ్య పెంటయ్యగారు. [మునగా
6. ,, ,, రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారు, పోషకులు.

## పోషకులు

7. ,, ,, బెలిదె జగదీశ్వరయ్యగారు.

## అభిమానులు

8. ,, ,, రాయకంటి హనుమయ్యగారు.

---

# విషయసూచిక.

# తెలుఁగుతల్లి

## సచిత్రమాసపత్రిక.

సంపాదకురాలు:- రాచమల్ల సత్యవతీదేవి.

సహాయసంపాదకురాలు:- ఇల్లిందల సరస్వతి.

| సంపుటము ౨ | 1 నవంబర్, 1940. | సంచిక ౧ |
| --- | --- | --- |


## ఆశీస్సు

విద్వాన్, వెల్లంకి వేంకటరమణయ్య.

సీ॥ దినమొక్క తీరునఁ దేజరిల్లెడుఁగాక ♦
తెనుఁగుకండ్రికలరాజ నపుఁబంట ♦
తొలిమలిపూఁతలఁ దోఁచుచుండెడుఁగాక ♦
తెనుఁగుఁదీవెగమి వాసనలునించి ♦
చిరుగాడ్పు కెరటాలఁ జిందుచుండెడుఁగాక
తెనుఁగుఁదేనియబొట్లు దేటితేటి ♦
నురుగుసుడులతోడఁ బరువులెత్తెడుఁగాక ♦
తెనుఁగు దేటలజాల్లు దెసలఁగ్రిమ్మి
గీ॥ మూలగాడ్పుసోఁకులఁజీడఁ ♦ బొదలు తెన్గు
తోటలింకఁజప్పరముల ♦ తోడఁజవికె
పిండుతోడ, వెలయుఁగాక, ♦ పెంపుఁగొనుచు
దెసలు, నీరాకవలననో ♦ తెనుగుతల్లి.

# సంపాదకీయము

## స్వవిషయము.

---

మా తెలుఁగుతల్లికి విద్వజ్జనుల చేతులలో మెలగుచు తప్పటడుగు
వేసికొనుచు ఎట్టెటో ఒక యేఁడునిండి ఈసంచికతో రెండవ
ప్రారంభమైనది. ఈతల్లి బాలారిష్టాదికష్టములు కలిగియు వాటినుండి
క్రమక్రమాభివృద్ధియగుచున్నను గతినత్వరగాభివృద్ధియంత సం
కరముగాలేదు. ప్రథమ సంచికయందు స్వవిమర్శాలోకన స
ములొందు జేసినసంకల్పమును స్వల్పాంశమైనను నిర్వహించుకో
పోయినందులకు విషాదమును గల్గుచున్నది. అయినను ఉత్సా
సఫలక మమ్ములనింకను అమహదాశయముల కార్యరూపము
ప్రోత్సహించు చున్నందున స్వధర్మ నిర్వాహణమునకు నడుముగట్టి
నేడు ప్రపంచమునందు సకలవ్యవస్థల యందును ప్రఖ్యాతమగు
మహాపరివర్తనము రాజ్యాంగ, సాంఘిక, మత, సాహిత్య ఆర్థిక,
భ్యుదయములకే గాక మానవ స్వాతంత్ర్య ధర్మపరిణామమున
విధముల అవరోధమగుచున్నది. ఇట్టి స్వాతంత్ర్యధర్మసంస్థాప నా
మతాచార్యులు కవులు, గాయకులు, శాస్త్రజ్ఞులు, కళాభిజ్ఞులు,
వంచనలేక పాటుబడుచున్నారు. ఇట్టిమహోదయ సమయమున ఆ
భ్యుదయము నిమిత్తము ఆంధ్రావని జేయు ప్రయత్నమునకు దోడు
తెలుఁగుతల్లియు నిత్యోధిక సేవజేయ బద్ధకంకణ యగుచున్నది.

గత సంవత్సరమున దీని నిర్వాహణభారమునపాల్గొనిన శ్రీ
ఇల్లిందల సీతారామారావుగారికిని, మరియు వ్యాసవిలేఖరులకును,
వర్గంబున జేరిన మహనీయులకును తదితరమైన సహాయసంపత్తుల నొ
మిత్రబృందమునకును మేమెంతయు కృతజ్ఞులము గతవత్సరమున
వలె భావికాలమునందును ఈనిర్వహణకార్యమును సాధ్యము చేయ
వ్యాసలేఖకులు, విద్యాభిమానులు, పోషకులు, మున్నగువారు
శక్తి మాకు తోడ్పడెదరని మాప్రార్థనము. కాగితము ధరలు పెరి

వలన మాపత్రికాకారమును సంకుచితపరచినందులకు మన్నింపవేడెదము. విద్యాభిమానులు, విద్యావేత్తలు, విద్యాప్రచారకులు, నీ తెలుఁగుతల్లి నారాధించి కృతార్థులగుదురుగాక.

# మదూరిరాఘవులు భాషాకల్పవల్లి సంఘము.

---

శికిందాబాదులో దీనికి పూర్వమును, తర్వాతను స్థాపించిన గ్రంథాలములున్నను, ఇంతప్రసిద్ధికి వచ్చినదొక్కటియు లేదన్న అతిశయోక్తిగాదు. నిల్వధనములలోగాని, పుస్తకసంఖ్యలోగాని, దీనికి మించినవున్నను, సేవలోమాత్రము తర్వాతవే. ప్రతిరోజువచ్చేపుస్తకప్రతిపాఠకులసంఖ్యచే. గతవత్సరము 8000 ఎనిమిదివేల పుస్తకములు చదువబడినవన్న యీగ్రంథాలయము ఎంతప్రజోపయోగముగ నున్నదో తెలియును. ఇది శ్రీయుత, బొలుసాని దేవేంద్రభీమారపు రామచంద్రయ్యగారల యపారకృషియొక్క ఫలితము వారే గ్రంథాలయము, గ్రంథాలయమేవారు దీనికి స్వంతభవనము లేమియే యొకకొఱత. అదిగూడయొనగూడు సూచనలు గన్పడుచున్నవి. ఈ సమయమున పురజనులు తప్పక తమ యథాశక్తి తోడ్పడుదురని నమ్ముచున్నాము. 2 వ తేదిని మహోపాధ్యాయ, మధ్వశ్రీ కాశీ కృష్ణాచార్యులవారి ఆధ్యక్షతక్రింద 20 వ వార్షికోత్సవము అతులితవైభవముగ జరుగనున్నది.

# ఆంధ్రయువతీ మండలి.

ఐదుసంవత్సరములలోనే, ఆంధ్రయువతీ మండలి, వారసభలు, బహిరంగసభలు, వార్షికసభలు, గృహపరిశ్రమల ప్రదర్శనములు మున్నగునవిజరిపి, హైదరాబాదుస్త్రీలలో తగినసంచలనముగలిగించి, మహాశాణుల మన్ననకు పాత్రురాలై; స్వంతభవనము సంపాదించుకొనబోవుచున్నమండలి యెంతయుఁగొనియాడ దగియున్నది. కార్యనిర్వాహకులు యీ సంవత్సరముగూడా ద్విగుణీకృతోత్సాహముతో పనిజేసి ఆంధ్రుల ఆదరణాభిమానములను బడయగలరని నమ్ముచున్నాము.

# ఈ అఘాయిత్యాలు అంతమొందే తరుణం రాదా?

పసుపులేటి లలితాదేవి, (శారదానికేతనము, గుంటూ

రాత్రి 12 గంటలైంది. బళ్ళారినుంచి వచ్చే "ఎక్సుప్రెస్" రంయిమంటూ, గర్వంతో చుట్టుప్రక్కల ఉండే జీవరాసుల్ని తన ధ్వనితో మేలొల్పుతూ, నిప్పులు గ్రక్కుతూ, అంధకారాన్ని చీల్చుకొని, వేగంగా పరువెత్తుతూ ఉంది. తన నెదుర్కొనడానికి వచ్చే పర్వతాలనూ, వృక్షాలను వెనక్కినెడుతూ తన పనిలో లీనమైయుంది. ఆకాశంనిండ మబ్బులు కమ్ముకొన్నాయి. భీషణరావాల్తో మేఘాలు గర్జిస్తున్నై. ఆ మేఘగర్జనకు భయపడి నిద్రలో ఉన్న పిల్లలు తమ తల్లులను కౌగలించుకుంటున్నారు. తల్లులు తమ బిడ్డలపైనుండే వాత్సల్యం కొద్దీ చిన్నచిన్న కబుర్లతో భయాన్ని నివారించి నిద్రపుచ్చుతున్నారు. బండిలో చాలావరకు జనం గాఢనిద్రలో మునిగి ఉంది.

స్త్రీల కంపార్టుమెంటులో షుమారు 20 సంవత్సరాల ఒకమ్మాయి మూర్తీభవించిన శోకదేవతలాగా కిటికీలో తల ఉంచి ఏదో దీర్ఘంగా యోచిస్తూఉంది. ప్రపంచమంతటా తన ప్రభావాన్ని నెఱపి నా నిద్రాదేవి-యీయమ్మాయిని మాత్రం తన వశం చేసుకోలేక పోయింది ఆ అమ్మాయిదీనాస్యంచూచే సరికి నిశాదేవికి జాలివేసింది గాబోలు, దూరంగా ఉండి ఆ అమ్మాయి స్థితికి కంటనీరు పెడుతుందా అన్నట్లు చిటపటచినుకులు ప్రారంభించినై. ఆమెను ఓదార్చాలనే ఉద్దేశంతో వస్తున్న విద్యుల్లతాతరుణులు ఆభీషణ గర్జనకు భయపడి మేఘాల చాటున దాక్కున్నాయా మెరుపులు తళుక్కున మెఱిసి మా తున్నాయి.

ఆ వాతావరణాన్ని మించిన వుడి ఆ అమ్మాయిహృదయంలో ధికంగాఉంది. మధ్య మధ్య ఆ ప్రయత్న ఆమెకళ్ళనుండి నీళ్ళు రాల్తున్నై. రైలు వేగంగా ఆమె మనస్సు పనిచేస్తూ ఉం సమయంలో ఆ ప్రపంచప్రకృతికీ, ఆమె య ప్రకృతికీ కించిద్భేదంకూడా లేదు. ధ్యస్టేషన్లలో చాలావరకు స్త్రీలుదిగిపో ఆమెగమనించడమే లేదు. ప్రస్తుతం ఆ లో ఒక వృద్ధురాలు నిద్రాదేవికి తనశరీ స్వాధీనంచేసి స్వప్నవీధిలో సంచారంచేస్తు

వర్షం కొంచెం సద్దుకుంది. కొ కల్లా రైలు తన నడకను మందంగా చి సంధ్యాల స్టేషన్లో విశ్రాంతి కుంది. ఆ స్టేషన్లో ఒక్క దీపస్తం మాత్రం ఉంది. స్త్రీల పెట్టెచివరగా డంచేత ఆ వెలుతురెక్కువగా కన్పి డంలేదు.

రెండునిమిషాలైన తర్వాత "టి టికెట్" అనుకుంటూ అంగ్లవేషంలో సంవత్సరాల ఆంధ్రయువకుడు ఆపెట్టె వకేవచ్చాడు. తన వికృతరూపాన్ని చ్చడానికతడెన్ని వేషాలు వేసుకున్నా! నిశరీరపరిసరాలమీద ఆవేషాలేమీ లేకపోయనై. అతని మాటలను బట్టి ఆంధ్రుడని [illegible] వచ్చు. ఆ అమ్మా రధ్యానంలో అతనిమాటలను విను

లేదు. తిరిగిఅతడు 'టికెట్' అనిచెయిచాపుతూ సరాసరి ఆపెట్టెలోకిదూరాడు. ఆ అమ్మాయి తన టిక్కెట్టునుచూపింది. అమసలమ్మనడిగివేసారి అతడుదిగివెళ్లిపోయి మళ్లీరెండునిమిషాల్లోతిరిగివచ్చి ఆప్రాంతాల్లోనేతిరగడం ఆరంభించాడు. ఆజాలిగొలిపేకళ్ళనూ, దుఃఖదేవతచాటునుంచి తొంగిచూచేచంద్రబింబంలాంటి ఆముఖముచూచేసరికి ఆయువకునిమనస్సు చలించింది.

వెంటనే అతని ఆ పాపిష్టి హృదయములో ఎన్నోదుర్మార్గపు టూహాలుపుట్టుకొచ్చాయి పేదకువెన్నిధిదొరికినట్లైనదతని స్థితి. వెటకారంగాఒకనవ్వు నవ్వుకున్నాడు ఇది నాకసాధ్యం గానిపనా? నాయాత్మ నీపాటి సంతృప్తి పరచలేనా? ఆనేభావం విషపూరితమై కుళ్ళిపోయిన ఆ నవ్వులో ధ్వనించింది. మానవత్వం గోల్పోయిన ఆ ద్విపాదనగ వ్యాఘ్రపు అఘాయిత్యానికి వీళ్ళలాంటి యిలాంటి నిస్సహాయులైన కన్య లెంతమంది బలైపోయారో! దయ ఆమాధునిహృదయంలో ఉండలేక కూకటి వ్రేళ్ళతో సహాకూలిపోయింది. ఇలాటిదుర్మార్గపుటూహాలతో దుర్గంధపూరితమైన ఆ శరీరంలోని వేడిరక్తం వెల్లువయై ప్రవహించింది. తలనొకసారిపంకించాడు. మొదటిఘంట, అయింది, రెండోదిఅయింది. సెలవు తీసుకుంటానన్నట్లు రైలు ఒక్క కేక వేసి తననడకను యథాప్రకారంగాసాగించింది. అతడువేరే పెట్టెలో యెక్కాడు.

అర్ధ రాత్రిళ్ళు ప్రయాణం యిబ్బంది కలవాళ్ళకో, లేకదూరపుప్రయాణాలవాళ్ళకోతప్ప మరెవరికి తటస్థించదు. ఎవరు ఆస్టేషన్లో యెక్కలేదు. ఆ అమ్మాయి యివేమిగమనించడంలేదుబండివెళ్లూతూనేఉంది రెండు స్టేషన్లు దాటి [illegible] స్టేషన్ దగ్గరఆగింది. అతడుఅప్రమత్తుడై చూస్తూనే ఉన్నాడు. ఎవరైన యెక్కుతారేమో నని కాని అలాంటి దేమీ జరుగలేదు. "దైవము దోసకారులకు తోడైవచ్చు నెప్పట్టునన్" అనిగదాసామెత!— చీకటి అలాగే ఉంది మెల్లగా ఆదుర్మార్గుడు, ఆ అసహాయ కన్యామానాపహరణోద్యుక్తుడు, అకిరాతుడు ఆ పెట్టెతలుపు తెరిచాడు. ఒకచోట కూర్చున్నాడు.

ఉలిక్కిపడి ఆ అమ్మాయి ఆ వైపు చూచింది. ఇందాకటి టిక్కెట్టుకలెక్టరే! అతడే! ఆ అమ్మాయిగుండె తీవ్రంగా కొట్టుకోసాగింది నిలువునీరైపోయింది. లేడిలాగాబెదిరె చూపుల్తో 'నిన్ను రక్షించే వాళ్లెవరూ లేరా? అన్నట్లు ఒకనిట్టూర్పువిడిచింది ప్రస్తుతం 'లేరు! లేరు! ధైర్యాన్నివదలబోకు' అని అంతరాత్మసమాధానం!_నిజమే! ఏవరూ లేరు. ఆమెకేమీతోచలేదు. భగవంతుని మీదభారంవేసింది. కానిభగవంతుడూ అప్పుడామె మొఱవినలేదు. ఆ అమ్మాయి అంతరాత్మద్వారా పంపే ఆదీనాలాపాలనతడు వినిపించుకోలేదు.

ఇంతలోరైలు కదిలింది. కూర్చున్న చోటునుంచి లేచాడా నరపిశాచి. ఆ అమ్మాయినిసమీపించాడు. నయాన్నే తనకార్యక్రమాన్ని సాగిద్దామనుకున్నాడు. ఏవోకుంటిప్రశ్నలు వేస్తాడు. ఇకఅడ్డుఏమీ లేదారాక్షసునికి. ఆ అమ్మాయిజీవితమంతా తనహస్తగతమే అని అతనిధైర్యం. ఆ అమ్మాయి దగ్గరినుంచి సమాధానంలేదు. భయాన్నే ఆ అమ్మాయిని స్వాధీనంచేసుకోవాలనుకొని దృఢనిశ్చయంచేసుకున్నాడు. ఆ అమ్మాయికేటూతోచిందిగాదు. కూర్చునే ఏదో అందోళనపడుతూఉంది.

మెల్లగా నల్లత్రాచులాంటి తనచేత్తో [illegible] పట్టుకోబోయాడు. ఆ అమ్మాయిశరీరం ఆపాదమస్తకం కంపించిపో

శాలంకాయన రాజులయొక్క శాసనముల యందు దొరకినవి తెలుగక్షరములనియు నిది మిక్కిలి పురాతన లిపియనియు, వీనికే వేంగి లిపిపేరు పెట్టబడినదనియు (వేంగీపురము ఏలూరి వద్దనున్నదట.) చరిత్రపరిశోధకుల యభిప్రాయము ఈ వేంగీపురమునకు ఇదిరాజధానిగా నుండెనట. 7. వ శతాబ్దమునందు ఈ దేశమును చాళుక్యులాక్రమించుకొనిరట. ప్రస్తుతము నందున్న యిప్పటి మనలిపికి ఈ వేంగీచాళుక్యలిపి సన్నిహితస్వరూపమట. ఆంధ్రభాషయందలి ప్రథమగ్రంథములను బుట్టించినది యీలిపియేయనియు, శబ్దశాసనుఁడైన నన్నయ వ్రాసినది యీలిపికితోడ నేయనియు, చరిత్ర పరిశోధకుల యభిప్రాయము. 11 వ శతాబ్దినాటి నన్నయలిపి యొకవిధముగను, 12వ శతాబ్ది యందలి తిక్కనలిపి ఇంకకొంత మార్పుగ 14 వ శతాబ్దినాటి శ్రీనాథకాలపు లిపియింకకొంత విస్పష్టముగ మార్పుగనుపట్టును.

తోఁబుట్టువులైన కర్ణాటాంధ్రములు 13 వ శతాబ్దము మొదలు క్రమక్రమముగా 14 వ శతాబ్ది నాటికి విడిపోయినవి.

ఇట్లు లిపులు విడిపోవుటలో పశ్చిమభాగము నందలి లిపి కర్ణాటపులిపిగను, తూర్పు భాగము లిపి తెలుగుగానయ్యెను, ఇప్పటికిని మనకర్ణాట కాక్షరములను జూచినచో తెనుగక్షరము లేమో యని భ్రమజెందుదుము. కర్ణాటాక్షరములకు తలకట్టులలో కొంచెము భేదమును; అందలి ఉ ఊ ఋ ౠ ఇా అక్షరములయందు భేదమును గనుపట్టును.

# గోలకొండ.



మ॥ ఒకకాలంబున దక్షిణాపథము ♦ సర్వోత్కృష్టరాజ్యంబు గా
బ్రకటింపించిన రాజధాని ♦ శిథిలప్రాయంబునుంబొంది నే
టికిఁ గాథానివహంబు శేషమును ♦ జాటింపందలంకొన్న దీ
పృకధూర్తంబులు సుప్తముద్రణముఁ ♦ బ్రాప్తింగొన్న కార్కొనలన్. 1.

సీ॥ ఎన్ని హేమంతంబు లీశిథిలప్రభు ♦ తాఖిలసాలవిన్యాస మెంతొ?
ఎన్ని దినాంతంబులీ కదర్థిత వైభ ♦ వంబున కొక్క నిశ్వాసమిడుదొ?
ఎన్ని నిశీథంబు లీయవాచ్యస్పృగాల ♦ నిస్వనాకర్ణనిర్ణీత మెంతొ?
ఎన్ని కేయెండలందీని కృష్టస్థాన ♦ విచ్ఛేదప్రాప్తి కువ్విళ్లుజార్తొ?

గీ॥ ఎన్నియబ్దంబు లీయాధః ♦ కృతవ్రణంబు
మాన్పనోషధీవ్రాత ♦ సామాన్యమునకుఁ
బొగిలినై రాశ్యముఘటింతొ ♦ పూర్వకృతము
బోలియనుభవంబగుఁగాదె ♦ గోలకొండ॥ 2.

మ॥ కటుగంధంబు వెలార్చు పావ్యమియుమః ♦ కాలంబులన్ మేలుకొ
ల్పుటకే తెంచెడి వందిమాగధ ♦ గణంబుల్ బోలి నేడక్కటా!
కిటిడింభంబులు ఘుర్ఘురధ్వనులు ♦ సాగింపం, గొదల్పడ్డము
న్పటిమ చ్చెట్లు స్మృతింఘటించి ♦ యెదగాల్పం జార్తొ? కన్నీటికిన్॥ 3.

సీ॥ ఉగ్రదంష్ట్రాగ్రసమగ్రద్యుతివిసక్తి ♦ దిగ్గజాగండలుద్దీప్తమొంద
నిలకురూక్షేక్షణవిస్ఫులింగంబులు ♦ ప్రాణిశుష్కద్రుమముల్ భస్మజేయ
దర్శవిభావరీస్పర్శితతనుకాంతి ♦ సితకపాలశ్రేణిఁ జెదరఁజూప
రుధిరారుణస్నానయురుచిరోపవీతంబు ♦ లురుతరోరఃపీఠినూగియాడ

గీ॥ భూధరేంద్రోపమస్థూల్య ♦ మునఁగడించి
భూనభోంత రాళమునిండు ♦ మూర్తి యొకఁడు
నీదుశీర్షంబుపైలాస్య ♦ పాదమిడిన
వాటి, యట్టహాసంబులీ ♦ నాఁడుదలతొ? 4.

విద్వాన్, మల్లాది వేంకటరమణయ్య.

# ఆధ్యాత్మిక సూ(త్ర)

1. ప్రతి ఉదయమునను 4 గంటలకు లెమ్ము, భగవత్స్వా...

2. ఆసనము:—పద్మ, సిద్ధ, సుఖాసనములలో నేదైన నొ...
అరగంటసేపైనను జపము చేయవలెను. ఈ కాలమును క్రమశః మూ...
శీర్ష, సర్వాంగ, పశ్చిమోత్తాసనాదులలో నేదేనొక దానిని చేయు...

3. జపము:—ఓమ్, ఓమ్ నమశ్శివాయ. ఓమ్ సర్వభవాయ న...
ఓమ్, లేక గాయత్రిమున్నగు మంత్రములలో నీయిష్టానుసారమొ...

4. ఆహారము:—శుద్ధాహారమనబడు సాత్వికాహారము...
ములను వర్జించుము. నీకిష్టమైనవస్తువులను సంవత్సరములో నొక...
నుసరించుము. పాలుపండ్లు ఏకధ్యానమునకు విశేషముగనుపకరించు...

5. ప్రత్యేకమొక గదిని తపోధ్యానములనిమిత్తమేర్పరచి...

6. దానము:— అనుదినము నీశక్త్యానుసారము బీదలకు, ...

7. స్వాధ్యాయము;—గీత, రామాయణము, భాగవత...
మున్నగువానిలో దేనినైనను దినమొక అరగంటసేపు పద్ధతి...

8. వీర్యమునుభద్రపరుచుము. చలనస్వరూపమైన భగవ...

9. ఏదేని కొన్ని స్తోత్రములను కంఠస్థముచేసి, ఆసనా...

10. దుస్సహవాసమును వర్జించి, నిరంతరము సత్సాంగ...
దురభ్యాసముల నభివృద్ధి జెందనీకుము. 11. ఏకాదశీ దినము...

12. ప్రత్యేకమొక జపమాలను సంపాదించి, దానిని ...

13. అనుదినము కొంతసేపు మౌనవ్రతమాచరించుము. ...

15. నీ కోరికలను తగ్గించుకొనుము, ఉన్నదానితో ...

16. "అహింసా పరమోధర్మః" అన్నసూక్తిని గమని...
చుము. దయ దాక్షిణ్యము సహనము, మున్నగుసద్గుణముల...

17. నీ సేవకులపై యాధారపడియుండక, స్వయం...

18. దినదినము నీ వొనరించు దోషములను గూర్చి ...
పోవు సమయమున గుణదోష విచారణ సలుపుచు, దోషముల...

19. నిద్రనుండి లేచినతోడనే, భగవంతుని ధ్యానింపు...

20. మరణదేవత అనుక్షణము నిన్ను వెన్నంటి యున్న...
డవై యుండి సర్వ కార్యములు భగవదర్పణముగా నొన...



ఈ వింశతి సూత్రాచరణమే సకలఆధ్యాత్మిక సాధన...

# ...ంశ త్రి.

(శ్రీ స్వామి శివానంద, హృషీకేశము.)

...సమయము దే, అదియే బ్రాహ్మీముహూర్తము.
...పూర్వముఖముగాగాని, ఉత్తరముఖముగాగాని కూర్చుండి సుమారు ఒక
...హెచ్చింపుము. బ్రహ్మచర్యానుష్ఠాననిమిత్తమున్న, ఆరోగ్యనిమిత్తమున్న,
...న్నగు అల్పవ్యాయామము చేయుము. ఇరువదిప్రాణాయామములను చేయుము.
...నారాయణాయ, ఓమ్నమో భగవతే వాసుదేవాయ, సీతారాం శ్రీరామ్ హాకీ
...దినము 108నుండి21600 సార్లవరకుజపించుము. (200మాలలు108-21600)
... నూనె, ఆవ, మిర్చి, చింతపండు, ఉల్లిమున్నగు ఉద్రేకపూరితములగు పదార్థ
...వర్జించుచుండుము. హితవైనది మితముగా భుజించవలెనను సూత్రమున
...కే తినవలెనని గమనించుము.
...వేసి యుంచుకొనుము.
...లాంగులకు దానము చేయుము.
... విష్ణుసహస్రనామస్తోత్రములు, యోగవాశిష్టము, ఆదిత్యహృదయము
...అనంతరము శుద్ధవిచారము సలుపవలెను.
...వీర్యమే సర్వశక్తి, విభూతి. వీర్యమే ధనము. వీర్యమే సకలజీవితసారము.
...పక్రమింపక పూర్వము పఠించుము. దీనివలన మానసౌన్నత్యము కలుగును
... చుట్ట, త్రాగుడు ఇత్యాది మత్తుపదార్థములను పూర్ణముగావర్జించుము

...లోగాని, నిద్రించునపుడు తలగడ క్రిందగాని నుంచుకొనుము.
...త్యము పలుకుము. మితభాషిత్వము, ప్రియభాషిత్వము నలవరుచుకొనుము.
... సరళమైనజీవితమును గడుపుము.
...వరకు హింసామార్గమునకు దూరుడవై యుండుము. కోపమును నిరోధిం
...ద్ధి జేయుము.
...ని గ్రహించుము.
...జమిన్ ఫ్రాంక్లిన్ చెప్పినట్లు దినచర్యాక్రమమును వ్రాసికొనుచు నిద్ర
...క్షించుచు సద్గుణములనభివృద్ధి పరచుకొనుము. [నాచరించుము.
... ముందుకూడ. సర్వమునకు ఈశ్వరునే నమ్మి శరణాగతుడవై కార్యముల
...నిత్యైనం దినవిధి కృత్యముల నెరవేర్చ నుపేక్షింపకుము: సదాచార బద్ధు



...పదము. వీనినన్నిటిని నియమబద్ధముగ కఠినముగ అక్షరక్రమమున నను
...ంతి.,

# ఆరోగ్య సమస్య.

టి. వరలక్ష్మమ్మ.

అన్ని సమస్యలలో ఆరోగ్య సమస్య చాల ముఖ్యమైనది. భూములున్నను, తోటలున్నను, పాడిపంటలున్నను యెంత వైభవమున్నను, మనుజులకు [స్త్రీపురుషులకు] శరీరారోగ్యము లేనట్లైన ఇదంతయు వ్యర్థముగా దోచుచుండును. పురుషుడు డబ్బు సంపాదించుటకును, స్త్రీ సంసారమందు తనకర్తవ్యములను చక్కగా నెరవేర్చుటకును ఆరోగ్యము ప్రధానము. శరీరారోగ్యము లేనియెడల సంసారమందు సుఖముగాని మనశ్శాంతిగాని యుండనేరదు. కాబట్టి, దేహారోగ్యము ప్రతివారికి ముఖ్యమైనదని గట్టిగా నమ్మవలయును. ఆరోగ్య సమస్య ఇంతముఖ్యమైనదైనను దీనిని గురించి చాల అశ్రద్ధ జరుగుచుండుట విచారకరముగా నున్నది.

మన దేశమందలి యువతులు రానురాను దుర్బలులగుచుండుట అనుభవైకవేద్యమే! పరీక్షించి చూచినట్లైన, నూటికి ఐదుగురు పడుచులు మాత్రమే సంపూర్ణారోగ్యవతులుగా నుండుట కానబడుచున్నది. ఇరువది మంది దుర్బలులై యుందురు. తక్కిన వారెల్లరు ఏదోయొక జబ్బుచేత పీడింపబడి ఒంట్లోశక్తిసామర్థ్యములు లేకయున్నారు. ౧౬-౧౭ సంవత్సరముల పడుచు పిల్లలు, దేహపటుత్వము శరీర దార్ఢ్యము కలిగియుండవలసినట్టివారు అగ్నిమాంద్యము, తిన్నది అరుగక పోవుట మున్నగు అజీర్తి వికారములవలన బాధపడుచుందురు. వీరిని జూచినట్లైన ముఖము తెల్లబారి చురుకుదనము ఉత్సాహము మున్నగునవి కనుపించకున్నవి. కావున, ఇతరవిషయములను గురించి శ్రద్ధ తీసుకొనులాగున ఆరోగ్యమును కాపాడుకొనుటను గురించియు శ్రద్ధతో పాటుబడుట అత్యావశ్యకము. ఇది వారి కర్తవ్యములలో మొట్టమొదటి కర్తవ్యమని యెరుగవలయును. శరీరారోగ్యము చాల ముఖ్యమైనదన్నమాట యెరుగక కొందరు ఎరిగినను దేహారోగ్యమును ఎట్లు కాపాడుకొనవలయునో యెరుగక కొందరు, ఇంటిపనుల యందును ఇతరపనుల యందును శ్రద్ధబూని, తమ ఆరోగ్యమును గురించి అజాగ్రతగా నుండువారు కొందరు, ఈ ప్రకారముగా యువతులు తమ ఆరోగ్యమును కాపాడుకొనుట యందశ్రద్ధగా నుందురు. సంసారమందు చిక్కులుండుట సహజము! మరియు, సంసారమందు స్త్రీల కర్తవ్యము లనేకములుండుటయు గలదు. ఐతే, దేహమందు శక్తి కలిగియుండు నతడే అన్నిటిని సులభముగా చక్కబెట్టుకొనవచ్చును. దుర్బలతకు తోంబైఆరు జబ్బులన్నట్లు, దేహము దుర్బలమైనట్టులైన చిన్నచిన్న జబ్బులనేకములు యువతుల నాశ్రయించుట నా అనుభవమున జూచుట సంభవించినది. ఎనిమియాకేసులు, (అనగా ఒంట్లోరక్తము లేకపోవుట) సాధారణముగా ప్రస్తుత కాలమందు విశేషముగా కనబడుచున్నవి. ఒంట్లోరక్తము సరిగాలేకపోవుట వలననే ఈ వ్యాధి వచ్చుట కలదు. ఆరోగ్యమును గురించి తెలుపునట్టి పుస్తకములనేకములు కలవు. కథలు, చరిత్రలు, నవలలు, మున్నగు వానిని చదువునట్లె ఆరోగ్య పుస్తకములను గూడ తెప్పించుకొని వానిని బాగుగా జదివి ఆరోగ్య నియమముల ప్రకారము నడుచుట వలన అనేక వ్యాధులను దూరము జేయవచ్చును.

సోదరీమణులందరు ఆరోగ్యరక్షణకొరకు ప్రయత్నించి శరీరదార్ఢ్యమును పొందుదురుగాక

# ఆంధ్రయువతీ మండలి.

## యొక్క పంచమ వార్షికోత్సవ సందర్భమున.

దివి 26-10-40 వ తేదీని కడపబోర్డు అధ్యక్షురాలైన.

శ్రీమతి కె. రామసుబ్బమ్మగారి అధ్యక్షోపన్యాసము,

నందలి ముఖ్యభాగములు.

---

ఇపుడిప్పుడు కొందరు విదుషీమణులు స్త్రీజనోన్నతికై పాటుపడుచున్నారు. వారిసేవాఫలితముగా నేయీ 10. 12 సంవత్సరములుగా భారతనారీలోకమున గొప్పపరివర్తనము కలిగియున్నది. రాజకీయ ఆర్థిక సాంఘీక విజ్ఞాన విద్యావైదువ్యములందు స్త్రీలకు ప్రవేశముకలిగి అందుపాల్గొనుచున్నా. స్త్రీలకు అనర్హములని ఎంచబడు అన్ని సంస్థలలోనుమహిళలకిప్పుడు ప్రవేశముకల్గినది.

ఏకుటుంబిని విద్యావిహీనయో యేదేశపు స్త్రీసంతతివిజ్ఞానరహితయో యేజాతి నారీమణి అస్వాతంత్రయో ఆకుటుంబము ఆదేశము ఆజాతి కీర్తి ప్రతిష్ట ఔన్నత్య ఐశ్వర్య సౌభాగ్యసంతతులకు దూరమగును. నేటివిద్యావిధానము హైందవనారీమణికిఅనుగుణ్యము గాలేదు. స్త్రీవ్యక్తిత్వమును సంపూర్ణముగ నశింపచేసి యిటుగృహనిర్వాహణమునకుగాని అటుసతీత్వ మాతృత్వ ధర్మములకుగాని దేశసేవాతత్పరతకు గాని అక్కరకురాని కేవల సంఘాలంకార ప్రాయమైయున్నది. అట్టివిద్య శిశురక్షణ చిత్రలేఖన సంగీత సాహిత్య ఆరోగ్య పాక కళానైపుణ్యతలను పెంపొందింపవలయును. బాలబాలికల సౌశీల్య సౌజన్య సౌహార్ద్ర భావములను వృద్ధినొందించవలెను ఇంతటి బాధ్యతను నిర్వహించవలసిన స్త్రీలకయినను నిర్బంధ విద్యావిధానమును ప్రవేశపెట్టవలెనన ప్రభుత్వమును ఒత్తిడి జేయవలయును. బ్రిటిషుయిండియాకంటె హైదరాబాదు సంస్థానమునందు స్త్రీవిద్య వెనుకబడియున్నదని చెప్పవలసి వచ్చినందులకు విచారముగానున్నది. స్వదేశ సంస్థానములయిన మైసూరు బరోడ తిరువాన్కూరు మున్నగు రాజ్యములందు స్త్రీవిద్య బ్రిటిషు యిండియాకంటె విపులవ్యాప్తి చెందినది.

పురుషులకన్నను స్త్రీలకే వయోజన విద్య ఎక్కువ ముఖ్యము. ఒకకుటుంబమందలి గృహిణి విద్యావతి అయిన ఆకుటుంబ మంతయు విద్యావంతమే కుటుంబ సమృద్ధియే పల్లెలు పట్టణములు దేశములు.

భారతరమణీమణి అవసరమైనపుడు రాజ్యాంగపరిపాలనా దక్షతయందు స్వాయత్తయై యుండవలయును. ఒక్కప్పుడు వుయ్యాలలూపిన మృదుమృణాల హస్త మతొకప్పుడు కత్తిబట్టి కదనరంగమున వీరవిహారమొనర్చి విజయపతాకమును స్థాపించి యున్నది. సంయమని సాన్నిధ్యమునకేగిన సహచరుని సాధించుకొని తెచ్చినది. వేదా ములలో విహరించి విజ్ఞానవైగుప్యాంకురముల వెదజల్లినది. అట్టిభారతనారీమణి పవిత్ర క్యత నేటి భారతరమణీమణులయందు సహా మిక్కుటముగ కలదని నొక్కిచెప్పగలను.

స్త్రీ పురుషులు తమస్వతంత్రి బాధ్యతలను చక్కగాగుర్తించ వుభయుల సంఘర్షణకు చోటివ్వకుందురని ఆశించుచున్నాను. ఆర్థికమునందు స్త్రీకి సంపూర్ణస్వేచ్ఛ ముండవలెను. భారతనారీ భావిభాగ్యోదయమునకు వారసత్వపుహక్కులు పునాదులు. వారసత్వపు పునాదిలేకున్న స్త్రీ యెంతటికార్య కౌశలవతియైనను, పురుషునికి గుది బండ యైయుండి అతినిదృష్టిలో చులకనగా పరిగణింపబడుచుండును.

హిందూసంఘమునకు చీడపురుగువంటి బాల్యవివాహమును పూర్తిగనిషేధింపవలయును. నోరెరుగని పసికూనలను శ్మశానవాటికకు సుసిద్ధులయిన ముదుకాళ్ళ మెడకు అంటకట్టడం పుస్తెతెంచడం ఒకేమాటు జరుగుచుండుట దేశసౌభాగ్యమునకు అనర్థదాయకమో మీరించుక యోచింపుడు. తల్లిదండ్రులొనర్చిన అపచారమునకు సంపూర్ణముగ బలికావలసినదేనా? వేరుదారిలేదా? యుక్తవయస్సువచ్చిన యువతీయువకులకే వైవాహికము లొనర్చవలెననియు అందుకుప్రతిగా నడుచుకొన్నవారిని ప్రభుత్వము వారు తమంతటతామే చర్యగైకొని కఠినశిక్ష విధించవలెను. అట్లయినగాని ఈఘోరాచారము రూపుమాయదు, చట్టమునకుతోడు ప్రచారముద్వారా బాల్యవివాహము లెప్పుడు ఆ కట్టకలుగుదుమో అప్పుడే బాల వితంతువులసంఖ్య భారతభూమినుండి తొల గలదు.

ఈదుష్టులైన బాలవితంతువులకు పునర్వివాహము ఎందుకుచేయకూడదో తెలియరాకున్నది. ఏధర్మశాస్త్రము చూచినను బాలవితంతు వివాహమును నిషేధించి యుండలేదు. సమ్మతమునే నిరూపించుచు ప్రోత్సహించుచున్నది. మనదేశ జనసంఖ్యలో నూటికి మి 16 వంతున వితంతువులు ఉండుట ఎంతకళంకము. బాలవితంతువులకు సంఘమున పూజ్యస్థానమొసగి వాడిపోయిన వారి జీవితకుసుమమును పునర్వివాహముద్వారా తిరిగి తెత్తజేయుట సకలశాస్త్రసమ్మతమని మనము ఘంటాపథముగ ఋజువుచేయవలయును. ఆంధ్రియువతీమండలివారు తను యాజమాన్యమున యిట్టివితంతు శరణాలయము నొకటైనను యీపట్టణమునస్థాపించి యీఅభాగినులను ఉద్ధరించవలెనని నాప్రార్థన.

ఏనాగరికతా ప్రపంచమునను ఈబహుపత్నీత్వము ఆచరణలోలేదు. శాస్త్రసమ్మతమైనదికాదు. ఈదురాచారమును శాసనరీతిన నిషేధింపవలెనని సోదరీమణులు ఏక ముక్తకంఠముతో తీవ్రాందోళనచేసి కృతార్థతకనవలెను.

ఎందరో సంపూర్ణ ఆరోగ్యవతులైన సోదరీమణులు పరిశుద్ధవాయువును బాలక భయంకరమైన క్షయ మున్నగువ్యాధులకులోనై అకాలమృత్యువువాత బడుచున్నారు. మాతృత్వ బాధ్యత ... ఆరోగ్యవతిగా నుండవలెనని మీరెరుగుదురని ఊహించి ఈనిర్బంధమును తొలగించికొనుటమంచిది. ప్రతిజీవికి శరీరపరిశ్రమ మ

వసరము. ఘోషావలన ఉత్సాహారోగ్యాదులన్నియు నశించును. పరదా మాటున సంఘోన్నతి కలుగజాలదు. సౌశీల్య సౌజన్యాదులు కాపాడుకొనుటకు ఘోషాఅవసరమనుట దురభిప్రాయము. సహజశీలవతులైన భారతనారీమణుల పావనత్వమును పరదామందర ఈఘోషా ఎంతటిది? ఈఘోషావలన శీలమును కాపాడనెంచుట వ్యతిరేకముగ పరిణమించుననుభీతి జనించుచున్నది. ప్రాచీన భారతరమణి పరదావెలుపలనుండియే తనపాతివ్రత్య ప్రభావము దిగంతముల విరజిమ్మినది. ఘోషాపద్ధతిని తప్పక తొలగించవలెను.

నిజాం ఆంధ్ర సోదరీమణులు ముఖ్యముగ గమనించి గుర్తించి ఆచరించ ప్రతి గృహమందును గృహపరిశ్రమలు నెలకొల్పి కుటుంబ ఆర్థిక సౌకర్యములు చేకూర్చ కొనవలెను. గృహ పరిశ్రమలలో రాట్నము ప్రాముఖ్యత వహించినది. కదురు కవ్వమాడిన కలవులేనిది లోక ప్రతీతి. ఖద్దరును ప్రోత్సహించ వలయును. విదేశ వస్తువులను బహిష్కరించి స్వదేశోద్యమమునకు ప్రాముఖ్యత యివ్వవలెను. యువతీమండలిలో రాట్నపరిశ్రమ యేర్పరచి ఖద్దరు ధారణయే తమపరమావధిగా భావించి నిజాం మండలమున ఆదర్శప్రాయముగా ఖ్యాతిని ఈ యువతీ మండలి గడించునని విశ్వసించుచున్నాను. సామ్రాజ్య కాంక్షవిదేశములందు వీరవిహారమొనరించుచున్నది. శాంతియుతజీవితమేసన్నగిల్లినది యేనాటికైనా అహింసాసిద్ధాంతముతో కూడుకున్న భారతావనియే భవిష్యత్ప్రపంచమునకంతయు మార్గదర్శకత్వము వహించి తన సిద్ధాంతములు సర్వప్రపంచ శిరోధార్యములని నిరూపింప గలదు.

అస్పృశ్యత హిందూసంఘమునకు తీరని కళంకము. దయాపరులై ప్రియభ్రాతృత్వముగా తోడిమానవుల అవమానమునకు పాల్పడ చేసిన దోషమునుండి విడవవలెను.

సంఘ దురాచారములు మాన్పనిగాని స్త్రీజాతి మోక్షమందజాలదు. ఎటుజూచినను స్త్రీలకు జ్ఞానోదయమైనగాని యీదురాచారములు మానవు. ఆర్థికస్వాతంత్ర్యములేని స్త్రీలకు పురుషులు తోడ్పడినేకాని స్త్రీ జనోద్యమములకువలయుధనము చేకూరదు.

రెండుకోట్ల డెబ్బదిలక్షలు జనసంఖ్యగల ప్రాచీనజాతి మన ఆంధ్రజాతి నైజాము ఆంధ్రయువతీ మండలి ఆంధ్రత్వమును విస్మరింపకుండు గాక ఆంధ్రజాతి ఒకప్పుడు యించుమించు భరతఖండమంతయు ఏకచ్ఛత్రాధిపత్యము వహించి 450 సంవత్సరములు పరిపాలించినది. అతులితైశ్వర్యముతో తులతూగుచు విశ్వవిద్యాపరిషత్తులను నెలకొల్పి ప్రతిదినము 15000 విద్యార్థులకు ఆహారాది సౌకర్యములొసగి విద్యాదానము చేయుచు పరదేశస్థులకు యాత్రాస్థలమై ప్రశంసింప బడుచుండుట చరిత్ర ప్రసిద్ధము. సారస్వత ప్రబంధములను రచించి విజ్ఞాన వైదుష్యకత్వ నిపుణతలను చాటించి అష్టదిగ్గజములను ఆదరించినది ఆంధ్ర సామ్రాజ్యము ఇట్టి ఆంధ్రత్వమునకు ఆటంక మొదవకుండా ఆంధ్రయువతులు ఆరాధింతురుగాక. ఒకతల్లిపాలు త్రాగు బిడ్డలవలె ఒక భాషామతల్లిని సేవించువారు ఎందున్నను ఒకజాతికి చెందిన వారనుట నిస్సంశయము దాదాపుఒక కోటి జనసంఖ్యగల నిజామాంధ్ర యువతీయువకులు తమ ప్రాచీన ఔన్నత్యమును స్మరించి ఆంధ్రాభ్యుదయమును ఆ[illegible] సంతోషభావము [illegible]వలెను. ఆంధ్రమాత సిగపూవు వాడకుండ కాపాడుకొని ఆంధ్ర భాషామతల్లి సేవయేమతి కుందురని దాసప్రార్థన.

అంత్రా ఇట్లా పెరిగిపోతోంది! ఇది యేదైన నంజువ్యాధేమోనని భయ కలిగి ఒకడాక్టరుగారి దగ్గరికి వెళ్లితే ఆయనపాపం Clinical tests చేసి చూచినా ఈ వ్యాధి అనుపాను తెలియక ఇదమిత్థమని నిర్ణయిం లేకపోయాడు! ఇంతలో ఆయన ఆమెను "అమ్మా! నీవేం పనిచేస్తా అడుగగా" బాబూ నేనుమల్లెపూలమ్ముతానన్నదట! వెంటనే డాక్టరు రికి దివ్యదర్శనమైనట్లు తెప్పరిల్లి బూబమ్మతో! కుచ్ పరవానై! ఇ రోగంకాదు ఎందుకంటే మా కురాన్‌లో (వేదం) 'సుగంధిం పుష్టివర్ధ అనిద్రాశారుబడ ఆద్మీలు. మంచివాసనగలపువ్వులు అమ్ముతూడుంటే అట్లాఅవుతుంది, పరవానై. జావో, అన్నాడట. చూశారా! డాక్టరు కుశాగ్రబుద్ధి నిదానంలో (diagnosis)!

---

# గీతాంజలి

(రవీంద్రుడు.)

---

దేవా! నాచిత్తమందలి దారిద్ర్యవృక్షమును మూలచ్ఛేద చేయుము.

నాకష్ట సుఖములను సోల్లాసముతో వహించుశక్తి నొసగుము.

నాప్రేమ నీసేవయందు సఫలమగునట్లు చేయుశక్తి నిమ్ము.

దీనుల నెన్నటిని త్యజింపక, గర్వోన్నత్తులగు శక్తిమంతులకు తలవంచకుండునట్టి దార్ఢ్యము దయచేయుము.

దైనందినసంబంధమగు క్షుద్రవిషయములను సరకుగొనక నా మనసమున్నితముగా గొనిపోవుశక్తిని ప్రసాదింపుము.

నాశక్తిని నీయిచ్ఛకు ప్రేమపూర్వకముగా వశపరచునట్టి బలమును నను గ్రహింపుము, ఇదియేనా ప్రార్థనము!

సమయంలో నే బెజవాడ వెళ్తా ననిపించింది విశాల. నింపాదిగా లీల తన తండ్రి సంగతి గూడ చెప్పింది. విశాలకు విచారం వేసింది. అయినా ఏంచేస్తుంది పాపం! ధైర్యంగా ఏవో కబుర్లు చెప్పి ఊరడించుదామనుకుంది.

లీలా! ధైర్యం చిక్కబట్టుకో, అమ్మా తెలివిగల పిల్లవు, దైవము కొంచెం తోడు పడ్డాడు గనుక సరిపోయింది. ఆమాయిక లెంతమంది యిలాంటి ప్రయాణాలు చెయ్యరు? కాలపరిస్థితులను అర్థం చేసుకొని సదుద్దేశాలను హృదయంలో జీర్ణం జేసుకున్న ఏ కొందరో తప్ప జన సామాన్యం చాలావరకు ఒక స్త్రీ ఒంటరిగా కంటబడిందంటే దుర్మార్గపుటా వేశాలతో ఏదో ఒక అఘాయిత్యానికి పూనుకుంటూ ఉంటుంది. నీ వేమిటి? ధన్యురాలివి. ఎంతమంది దీనికి పాల్పడుతున్నారో? పేపర్లలో ఒడేవి, నలుగురి కంటాబడి, పదిమంది నోట్లో నానిననే! మనం విననివీ, కననివీ. యింకా ఎన్ని జరుగడం లేదు, యీ ప్రపంచంలో? ఏముంది? వయస్సు మీరుతుంటే మాత్రం బుద్ధులు నానాటికీ కురచవై పోతున్నాయి. ఇవాళ్ల టిక్కెటు కలెక్టరు, రే పింకొకడు, ఎల్లుండి మరి ఒకడు! ఆలాంటి వాళ్లను మనంయెంత కాలమని అడ్డు పెట్టగలం చెప్పు.

అపుడే జరిగిన అన్యాయాన్ని గూర్చి మాత్రం అందరూ సానుభూతి చూపుతారంటావా? కొంచెం విశాలదృష్టి ఉన్న వాళ్లు నిజమే ఒంటరిగా ఉన్న పిల్ల పాపం ప్రయాణం తప్పని సరి అయింది! ఇంతలో వాడి కలాంటి పెరబుద్ధులు పుట్టాలా? అంటారు. సంకుచిత దృష్టి ఉన్నవాళ్ళు అయితే మాత్రం ఆ అమ్మాయి ఒంటరిగా ఇంతదూరపు ప్రయాణాన్ని ఎందుకు సాగించాలి? అని [illegible] అంటారు. అది వాళ్లవరకూ వస్తేగాని ఎవరికి తెలియదు, అని ఊరుకుంది.

లీల అందుకొని, విశాలా! అయితే ఈ అఘాయిత్యాలు అంతమొందే తరుణం రాదా! అని అనుగుతుండగానే గుంటూరు స్టేషన్‌లో రైలాగింది. లీల అన్నయ్య రైలు దగ్గరకు వచ్చాడు. లీల విశాలదగ్గర సెలవు తీసుకుంది, జబ్బు సంగతి. యేలాఉందీ ఉత్తరం వ్రాయమని చెప్పి విశాల వెళ్లింది. రైలు కదిలింది. 11. గంటల షుమారైంది టైం

అన్నా చెల్లెలు యింటికి చేరుకున్నారగ గంటలో. తండ్రిని చూచింది లీల. కొంచెం నెమ్మదిగానే ఉంది. ఆ క్రిందట దినం కొంచెం ఎక్కువగా ఉంటే టెలిగ్రాం యిచ్చారట. తండ్రి బిడ్డను కళ్లనిండా చూచుకున్నాడు. క్రమేణ తేరుకోసాగాడు తండ్రి. 15 రోజులైన తర్వాత ఒక నెల రోజులు ఉద్యోగానికి శెలవు పెట్టి ముగ్గురు బళ్లారికి ప్రయాణం కట్టారు ప్రయాణం సాగిస్తున్నారు రైలు దొనకొండ స్టేషన్ దాటింది. షుమారు రెండు నెలల క్రిందట ఆ ప్రదేశంలో జరిగిన కథానిక అంత తన కళ్లకట్టినట్టు శరీరం గగుర్పొడిచింది లీలకు. అన్నయ్యకూ తండ్రికీ ఆ సంగతి వినుపించింది. లీల ధైర్యానికి వాళ్ళిద్దరూ సంతోషించారు.

అప్పటినుంచి లీలకు ఒంటరి ప్రయాణమంటే భయంగా ఉండేది!



# బాత్రాఖానీ

అసాధ్యప్ప S. V. P

టంకారాలు! టుమ్రీలు! ముక్తాయింపులు! ఓట్లు!

పరిశోధన:— ఈ మధ్య అఖిలభారత పరిశోధన సమితివా (The All India Research Committee) సమావేశమై వచ్చే సం రములో జరగబోయే సదరు సమితి సంవత్సరీకోత్సవము నాటికి ఈ పరిశోధనలు గావించి, వాటి వివరాలు తెలిపే వా "పరిశోధనాచార్య" అనే బిరుదాన్ని ప్రసాదిస్తామని తీర్మానించి టించారు. నేడిదంతా పరిశోధనయుగం గనుక ప్రస్తుత దేశపరిస్థితు దేశీయులకు మహోపకారం కలుగుతుందని తలంచిఉంటారు.

పరిశోధనల వివరం:—

(అ) వంటలక్కలోనుండి లక్క తీయుట.

(ఆ) పెరుగుతోటకూరలోనుండి పెరుగు తీయుట.

(ఇ) విభూతిపండ్లతో Jam తయారు చేసేవిధానము.

(ఈ) కర్పూరచక్రకేళీనుండి కర్పూరమును తీయుట.

(ఉ) మిఠాయికిల్లీనుండి మిఠాయి తయారుచేయుట.

(ఊ) ఆవుకాయనుండి ఆవునుగాని అధమపక్షం దూడనుగాని తీయుట.

చూడండి? పరిశోధనలంటె ఎంత అపహాస్యమైపోయింది లోకాని!

అంతు:—అఖిలభారత వైవాహిక విశ్వవిద్యాలయమువారి మాన్యమున (The All India Matrimonial University) పరశురామ్ H. P. H. గారు (1) "విధవా పునర్వివాహము వేదసమ్మ (2) అతిబాల్య వివాహములు నిషేధములు (3) హిందూ గృహ స్త్రీయే అధికారి మున్నగుమహత్తరవిషయాల్ని గురించి సప్రమాణ వేదానువాకముల తోసహా జడివానలవంటిగంభీరోపన్యాసాలు చేశా అందుపైని వర్ణాశ్రమధర్మసభవారు, సదాచారనిబంధినీపత్రవా

వైదికధర్మబోధినీ సంఘమువారు కలిసి, వేదమతబాహ్యాలైన విషయాల్ని జనులకు ప్రబోధించినందుకు పండితులవారిని "అంతు" చేయాలని తీర్మానించారట! అయ్యా తీర్మానాలతో కాల ప్రవాహాన్ని అరికట్టుతామా! నిర్మాణ కార్యక్రమాన్ని అనుసరించండి! ఉడుత ఊపులకు ఉసరికాయలు రాలుతాయండి!

కాంగ్రెసు:— కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గమువారి కార్యక్రమకలాపాన్ని పురస్కరించుకొని కర్మనీరుడు కరంచాద్ గారు ప్రదర్శింపదలచిన వ్యక్తిగత సత్యాగ్రహనాటకానికి శ్రీ వినోబాభావే గారిని గజ్జ కట్టించి సూత్రధారుణ్ణిగా నియమించాడు. నాందీస్తుతిచేయడంతోనే "ప్రథమకబళేమక్షికాపాతః" అన్నట్లు భరతవాక్యం చెప్పవలసివస్తే మంగళహారతిపాడినాడు. తెరపడినది. భారతదేశ భావిభాగ్యోదయభారం అంతా భావేగారిమీదనే ఉన్నదని భావిస్తున్న భారతకాంగ్రెసునియంత బాపూజీగారి భావం ఏమిటో భారతీయులకు తెలియకుండా ఉన్నది. సత్యాగ్రహంతో స్వరాజ్యసిద్ధి అవుతుందా అని సరదారులు కొందరు శంకిస్తున్నారు! దోబూచులకు భూతాలు భయపడతాయండి!

మితవ్యయం:—భార్యాభర్తలిరువురు ఒక సంవత్సరములో పట్టభద్రులైనందున ఒకే సంవత్సరములోనే స్నాతక మహోత్సవానికి (Convocation) వెళ్ళవలసివస్తే భర్త రెండుగౌన్లు కొనడమా? కొనకపోవటమా? Inabsentia లో తెప్పించుకోవటమా అని తటపటాయిస్తూంటే భార్యవచ్చి రెండుగౌన్లు ఎందులకండీ? ఒక్కదాంట్లోనే దూరివస్తామనిన్ని అందుకు అనుమతించాలనిన్ని అధికారుల పేర వ్రాయండి అన్నదట! అవును బాగా నేయుంది నీసలహా! తప్పక వ్రాస్తాను! చదుకొన్న చదువు అట్లా Apply చేయాలి! చూశావా Domestic Economy నీవు Ortional గా తీసుకోవడంవల్ల ఎంత Utility ఉందో అని అన్నాడు భర్త.

నిదానం:—ఒకతురక బూబమ్మ ఎప్పుడూ మల్లెపూలే అమ్ముతూ ఉండేదట! ఏం కారణంచేతనో శరీరంలో స్థౌల్యంఏర్పడింది, ఏమిటి! శరీరం



16 వ పేజీచూడుడు.

# గ్రంథసమీక్ష.

దేశోద్ధారక గ్రంథమాల పుస్తకములు,

ఇమాంబావిడివీధి. శికిందాబాద్.

---

సంస్థానసమస్యలు:- వెల ఆరణాలు. గ్రంథమాలలోని 8 వ ప్రచురణము. డా॥ భోగరాజు, పట్టాభి సీతారామయ్యగారి యుపన్యాసములకు జానపాటి సత్యనారాయణగారి ఆంధ్రానువాదము. ఇందు, సంస్థానప్రజల హక్కులు, వారికష్టనిష్ఠురములు సంస్థానముల పరిపాలనావిధానములు, వాటిలోపములు, ఉద్యోగులప్రవర్తనలు, బ్రిటిషువారిరాజనీతి సుబోధకముగవివరించబడినవి. ప్రతిసంస్థానవాసియు తెలిసికొనదగిన విషయములై యున్నవి.

ఈయుపన్యాసములను గ్రంథములు ప్రచురించిన గ్రంథమాల వారికి సంస్థాన ప్రజలు ఎంతయో కృతజ్ఞతజూపవలసి యున్నది.

కాంగ్రెసు- సంస్థానములు వెల ఆరణాలు. గ్రంథమాల 7వ ప్రచురణము, డా॥ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు నవసారిలోనొసగిన అధ్యక్షోపన్యాసమునకు, జానపాటి సత్యనారాయణ అనువాదము.

ఇందు కాంగ్రెసుకు సంస్థానములకు యాదినుండి ఇప్పటివరకుగల సంబంధములు, ఆయా సంస్థానములలో క్రమశః జరుగుచు వచ్చిన రాజకీయమార్పులు పూసగుచ్చినట్లు వర్ణింపబడినవి. ప్రజలయొక్కయు సంస్థానాధీశ్వరులయొక్కయు కర్తవ్యములు విస్పష్టముగ జెప్పబడినవి. ఒకసారిచదివి పడవేయ దగిన పుస్తకముగాదు.

---

Hyderabad Reg No. 170

# తెలుగుతల్లి

సచిత్ర మాస పత్రిక.


| సంపుటము ౧ | 1 డిశంబర్, 1940. | సంచిక ౧ |
|---|---|---|





నిజాంసాగర్ ఆనకట్ట

సంవత్సరము చందా 1-8-0 విడిసంచిక 0-2-0

# విషయసూచిక.







Edited Published by R. Satyavathi Devi, Printed at Bharathi Press, Sec

# తెలుఁగుతల్లి

## సచిత్రమాసపత్రిక.

సంపాదకురాలు:-రాచమల్ల సత్యవతీదేవి.

| సంపుటము ౨ | 1 డిసంబర్, 1940. | సంచిక ౨ |
| --- | --- | --- |


# సంపాదకీయము.

అవధానశిరోమణిమధ్వ(శ్రీ) కాశీకృష్ణాచార్యులుగారు శికింద్రాబాద్ ఉపన్యాసములలో తాను నవీన సనాతనుడననియు; సంస్కారులనియు, సనాతనులనియు రెండు తెగలు (పార్టీలు) యుండవలదనియు; ...మ ప్రాశస్త్యమును మెప్పించి వీరు వారిలోనో లేక వారు వీరిలోనో కలవవలయుననియు; వేరుగాయుండగూడదనియు; అది దేశమున కనర్థదాయకమనియు; సత్యము, దయ, ధర్మము. శౌచములు మొదలగునవియే సనాతన ధర్మములనియు; వాటికి నాశనమెప్పుడు లేదనియు; ఒకవేళ్ల మేఘము కప్పుకొనిన విడిపోవుననియు; సంస్కారప్రియులను దురాచారులని దూషించినలాభము లేదనియు; దానికి కారకులు సనాతనులేననియు; అదియెట్లన, మొట్టమొదట మాతృభాష సంస్కృతము నేర్పక ఇతర దేశభాషల నేర్పుట; మనయాచారముల యుత్కృష్టతలాభనష్టములు సహేతుకముగ దెలుపజాలక పోవుటయే కారణములనియు; మహాత్ములయాదేశానుసారము వెనుకకుమరలనిదే మోక్షమార్గము దొరకదనియు; హితోపదేశము జేసిరి.

సదాచారనిబంధినీ పరిషత్తువారు ఆచార్యులవారి హితోపదేశమును గ్రహించి, మాతృభాషతోపాటు, సంస్కృతభాషను గూడ జనసామాన్యము నేర్చుకొనను, సావకాశముల, తామిప్పుడు ప్రచారము జేయు

చున్న చోటులలో నెల్ల, గల్పించి, సదాచారముల సహేతుక
బోధించి, వైదికాచారములయందును, వైదికవాఙ్మయమునందును వి
సము కలుగజేసి, ఆచరణలో బెట్టించి దురాచారముల మాన్పి
యునని మాహితువు.

ఉస్మానియా విద్యాపీఠ కళాశాలలో రైట్ ఆనరబుల్ న
సర్ హైదర్ నవాబ్ జంగ్ బహాదర్ గారి రూపపట బహిరంగోత్స
జరిగినది అప్పుడు దివాన్ బహద్దరు ఆరావమదయ్యంగార్ బి.
ఎల్. యం. బి. ఇ. అడ్వకేటుగారు, సర్ అక్బర్ హైదరీగారిని
చెప్పుచు ఉర్దూను ఏట్లో అట్లే రాష్ట్రములోని ఇతర భాషలయొక్క
తెనుగు, మరాఠి, కన్నడ, భాషలయొక్క అభివృద్ధికి తోడ్పడి
వృద్ధిలోనవియు పాల్గొనునట్లు చేయలేరా? యని చెప్పిరి.

మన ప్రధానామాత్యులవారు, ఇదివరకే తమ మనస్సులో
గుచున్న ఈ సదుద్దేశ్యమును నెరవేర్చెదరుగాక.

---

## హేమంతఋతువులో

(మార్గశిర—పుష్యమాసాలు) | ఆరోగ్యముగాఉండవలెన

సంపూర్ణ వ్యాయామము జేయుట, శరీరము బాగుగా మ
కొనుట, చెవులలో తైలమునింపుకొని, వాతహర తైలములచే
గస్నానముజేయుట వెచ్చనివస్త్రములతొడగుకొనుట, ప్రాతఃకా
ననే భోజనముజేయుట, మొదలగు యుక్తవిహారములను గలిగి య
వలయును. వేడి వేడి యాహారము మితముగాభుజించవలెను.

### ఆహారములో.

చమురుగలిగి, బలకరంగాయుండే పిండివంటలు, కొత్త బి
ము, గోధుమలు, జొన్నలు, సజ్జలు, కందులు, మినుములు,
బొబ్బర్లు, అనుములు, నువ్వులు, చిక్కుడుకాయలు, గుమ్మడికా
గెడ్డలు, నేయి, పెరుగు, శీతాఫలములు, ఇంకా ఈ ఋతువులో
జముగా లభించెడి పండ్లు, కూరగాయలు, యుండి తీరవలెను.

# ప్రేమపుష్పము.

"..............................

చక్కని కురుల నెమ్మ్యంపు పక్కవీడి,
కఠినమైనట్టి యీనాదు కరముఁజేరి
సౌఖ్యమనుభవింప దలంచి, దుఃఖ సాగ
రమ్మునందిప్డు తెలియక రాలినావు!

వాడకుండగ నటునిటు నాడకుండఁ
శోక విరహాగ్ని నీమెయి సోకకుండఁ
దాచి కాచునట్టిది యా లతాంగియేను;
ఒరుల వశమాయె; అబ్బ! యీ నరుని వశమ!

వదరు చుంటిని ఇష్టము వచ్చినట్లు
అయ్యో! నిన్ను నిమిషమైన బాయగలనె!
నీదు వాసన యింపార నాదుమనసు
నందు వెలయు నంతవఱకు పొందు జేతు.

అంత కతన నీవీచిత్రి ముందు నిల్పి
రమణి సింగారమునకు శుభమును గూర్చ
కూర్చి నాకనులం ద్వింద్వో నర్చు చుండు
ఉండి నాశోక భారము చెందు మమ్మ.

.............................."

'తులసి' నుండి.

నేతేటి వాయునందన శర్మ-సరస్వతీ కుటీరం.

# వాయు విమానములు

నెల్లూరి రామమూర్తి (సాధనసమితి)

సృష్టి రహస్యములను బయల్పెట్టుటకును, ప్రకృతిలో లీన యున్న భౌతికమహా శక్తిని వశమొనర్చుకొనుటకును, చిద్విలాస త మును గ్రహించుటకును, విజ్ఞానమే ముఖ్యసాధనమై వెలయుచున్న ఇట్టి విజ్ఞాన వర్థనమునకనేకులనేక విధముల దోహదకారులైరి. మహా భావులు పరిశోధన లెన్నియో చేసి, నూతనములగు, విషయములనెన్ని కనుగొను చున్నారు. ఒకప్పుడు ప్రకృతి దేవత తన రహస్యము సర్వ సాధారణముగా బయల్పెట్టదు. మరొకప్పుడు కనికరించు అందుచే, కొన్ని పరిశోధనలు, ఒక్కొక్క వైజ్ఞానికుని జీవితాంతము వ సాగుచున్నవి. ఇట్టి విజ్ఞాన పరిశోధనలలో "విమానయానము" గు చేయబడిన ప్రయత్నము అగ్ర తాంబూలమును బడయక తప్పదు.

నేటి ప్రజాహృదయము పరికించి చూచిన, ఎన్నియో వ్యత్యా వ్యతిరేకములు కనబడు చున్నవి. ప్రకృతి సిద్ధమైనటువంటి స్త్రీ పు ప్రకృతుల కలియికలోనే మార్పు లేర్పడుచున్నవి. శివుడు దిగంబరు పరిహసించిన వారెందరో, నేడు దిగంబరత్వమే సర్వశ్రేష్ఠ "దిగంబర సంస్థలు" స్థాపించు చున్నారు. ఓంకారేత్యాది సదోచ్చా వెఱ్ఱి అఱుపులనువారెందరో, నేడు శబ్దోచ్చారణ సంస్థల నియమి శబ్దపటిమనుగ్రహింప పూనుచున్నారు. ఈ విధముగనే — శ్రీరామ పుష్పకవిమానయాత్ర బూటకముగా భావించిరి కానకాలపరిమితి భా తీయుల మాహాత్మ్యపూర్ణ ప్రాచీన నాగరికత వెలిబుచ్చు చున్నది.

ఇంకా "ఏరోప్లేను" జీవిత చరిత్రమును గమనించెదము.

1937 సం॥ రములో జూలై 14 వ తేదిన ముగ్గురు భల్లూ (Russians) మాస్కోనుండి, ఎక్కడను ఆగక కలిఫోర్నియాలో విమానములపైన వచ్చిరి. ఈ ప్రయాణము కేవలము ప్రయదర్శనార్థ



(26 వ పేజీ చూడుడు)

# జన్మదినం.

'ఉత్తరకురుభూములలో!'

౧. కపాల పాత్రిక
రుధిరస్నేహం
విద్యుద్వర్తిక
కాలజ్యోతీ
పరిజ్వాలా
కన్పడదంటావ్
కన్నీప్పవ్.

౨. నిశీథిసమయం
కరాళ కంఠాల్
భేతాళమ్మల
ఘోరారావం
భీభత్సం
విన్పడదంటావ్
శ్రుతులియ్యవ్.

3. ఉబుముల్ మెఱపుల్
ఘటాభిషేకం
పిశాచనృత్యం
హాహాకారం
పెన్బొబ్బల్
కన్పడదంటావ్
విన్పడదంటావ్
కన్నిప్పవ్
శ్రుతులివ్వవ్.

౪. రక్తపుకేరుప్
మించుకన్నెల
నగ్నికక్రీడ
వేణీధూపం
హ్రీజ్యోతీ
ఎత్తినవేళా
నే పుట్టానోయ్
పుట్టానోయ్
ఓయ్.

౫. గిరికుచపాళీ
పొంగిన పాలూ
ఆనందాశ్రుల
అమ్మఒళ్లో గుండెల్లో
నిదురించానోయ్
కలగన్నానోయ్
ఓయ్.



'ఆనంద'

చేయబడలేదు. కాని మానవునియొక్క సర్వశక్తుల విజృంభణము కనుగొనుటకై చేయబడినయాత్ర ఇది జయప్రదముగా జరిగి... మాస్కోనుండి, అమేరికాకు "రాదారి" యేర్పాటు చేయదలచి... ఈ ప్రయత్నము, బ్రిటీషు తపాల విమానములు అమెరికాకు వెళ్ళ... 15 సంవత్సరముల పూర్వమే జరిగినది. మానవుడు ఇరవదవ శతాబ్ద... మొదటిలో ఇట్టి ఫలితములు బడయుట వలన మరికొంత ఉత్సా... మేర్పడినది.

1903 సం॥ రమున డిశంబరు 17వ తారీఖున "ఆర్ విల్లిరైట్ (Ar ville wright) తన సహోదరుడగు "విల్బిరు" సహాయము... నొక విమానమును కనుగొనెను దానితో వారు పండ్రెండు సెకండ్ల వరకే ఎగరగలిగి, 120 అడుగుల దూరము పోగలిగిరి. ఆరోజుననే... మూడు మార్లు ప్రయత్నించిరి. ఏబది తొమ్మిది సెకండ్లలో 350 అ... గులు వెళ్ళిరి. వాయి విమాన జీవితము నేటితో ప్రారంభించడమైన...

మొట్టమొదట విల్బిరుకు ఈ ఏరోనాటిక్సు చదువుట కేమాత్ర... యిష్టము లేకుండినది. కాని "అటోలిలియెంథాలు" మరణానంతర... శ్రద్ధ తీసుకొనవలెనని తలంచెను. ఆటోలిలియెంథాలు, గ్లైడి... (Gliding) కుమూల విరాట్టు విల్బిరు తన సహోదరుడగు ఆర్... తోనాటి గ్రంథ రాజముల నెల్లను పరిశోధించి ఏడు సంవత్సరములు... చిన తర్వాత తమ పరిశోధనములలో జయము గాంచిరి. ఒక్కొక్క... వీరికి చీకాకుగా ఉండగా పరిశోధనములు మానుకొన పూనిరి. వారియొక్క మొట్టమొదట కార్యదీక్షత ఏమాత్రము వెనుకంజ... నీయ లేదు. వీరి పరిశోధనల గురించి వినినతోడనే ప్రపంచము... దరును విస్మితులైరి.

ఆర్ విల్లిరైటు, 1871 వ సం॥రమున డెయిటను అను అమెరి... నగరములో జన్మించెను. చిన్ననాటినుండియు పత్రికలు చదువుటలో... పత్రికలకు రచియించుట యందును యెంతయో శ్రద్ధతీసుకొనెడివాడు... యేడవ యేటనే "వెస్టుసైడు–న్యూసు" (West side News) పత్రికకు తానుసంపాదకుడై అచ్చు వేయించుచుండెను. కాని నొక్కని వలననైనని చురుకుగా నడువనందున తన పత్రికలోనికి తన స...

దరునికూడా చేర్చుకొని, తానేమో పత్రికాధిపతియై అచ్చు వేయించుచుండెను. ఈ లోపుగా ద్విచక్రి శకటములు (Cycles) బజారులోనికి వచ్చినవి. అందుచేత విల్బరు పత్రిక సరిగా నడవకుండెను. అప్పుడు పత్రిక నాపివేసి (Wright Cycle Co) "రైటు-సైకిల్-కంపెని" అను దానిని తెరవవలసి వచ్చెను. వారి ఏడు సంవత్సరముల పరిశోధన కాలములో చాలకష్టముల ననుభవించవలసి యుండెను. ఒక్కొక్కప్పుడు తమ యింటిదగ్గరగా ఉన్న వాళ్లవద్దనుండి డబ్బు అప్పు తీసుకొనెడివారు. వారికి, వివాహము చేసుకొనుటకుకూడ ఏమాత్రము ధనము లేకుండెను. పైమనిషి కేమాత్రము తెలియనివ్వక, తమ పరిశోధనములను రెండు సంవత్సరములు గడపిరి. 1905 సం॥రము అక్టోబరు 5 వ తారీఖున, గంటకు ముప్పది యెనిమిది మైళ్ళ వేగముతో 24½ మైళ్ళు తమ విమానములో ఎగరగలిగిరి; ఈ పైవార్తనుకాని, తమ ఫలితములనుకాని ప్రజలకు తెలుపక, గూఢముగా నుంచదలచిరి. కాని ఏటులనో వీరి పరిశోధనలుప్రజలకు తెలియవచ్చినవి. ఈలోపుగా వీరు కొన్ని రాజ్యాధికారులతో తమ పరిశోధన ఫలితముల నమ్ముకొన ప్రయత్నించు చుండిరి.

1908 సం॥ రమున విల్బరురైటు తనవిమానమగు "వైటుఫ్లైయరు" (White Flier) లో కూర్చుని ఎక్కడను ఆగక 77½ మైళ్లదూరము ఫ్రాంసులోనికి పయనమయ్యెను. అప్పటివరకునుకూడా విల్బరు సహోదరుల విషయమై అనేకగాలివార్తలు వచ్చుచుండెడివి. కాని పైప్రయాణమువలన, నిజానిజములు తేటతెల్లమైనవి. ఇంగ్లాడు దేశములో వాయుసంచారమునకై 1908 సం॥ రాంతమువఱకు "కోడి" (Cody) "రోయి" (Roe) అను వారు తగు ప్రయత్నములు సల్పుచుండిరి. "లార్డునార్తుక్లిప్పు" ఈ నూతనవిజ్ఞానవికాసమును గమనించి తానుయెవ్వరికైనను, 'ఇంగ్లీషుచనలు'నువిమానములో దాటగలిగిన వేయ్యిపౌండ్లు యిచ్చెదనననెను. అప్పుడు మొట్టమొదట "చనెలు" పైకెగిరినవాడు, హ్యూబర్టులాథెము (Hnbert Latham) అను ఫ్రెంచివాడు, లాథెము ఎగురుసమయమున, ఎక్కడనైనను సముద్రములో హ్యూబర్టు పడిపోయినచో ఎత్తివేయుటకై ఒక ఫ్రెంచిటార్పిడోపడవ నీటిపైన వెంబడించి

(36 వ పేజీ చూడుడు)

# కలిమి-చెలిమి.

'పవనసుత.'

రామారావు ఆనర్సుగ్రాడ్యుయేటు. మొదట్నుంచి పాపం పేరు ప్రతిష్టలకోసం పెనుగులాడేవాడు. మంచిఉదారస్వభావం కలవాడు.పిల్లల్తో పిల్లాడిలాగాఆడుకుంటాడు పెద్దల్తో పెద్దమనిషితరహాగా ఉంటాడు. నలుగురితోపాటూ మతబేధంలేకుండాభోం చేస్తాడు. సమయముబట్టి సాగితేతాను తన శివపూజ చేసుకుంటాడు నవనాగరీకుడులాగ సూట్లువేసి టాక్‌టీక్‌గాఉంటాడు. పూర్వీకునివిధంగా బొల్లగోచీలు_వీభూదిరేకలూపెట్టాడు. అబద్ధాలాడటం, అప్రమాణాలు చేయటం, అతనిప్రవర్తనకువిరుద్ధాలు.గొప్ప పండితవంశంలోపుట్టినవాడుకావడంమూలాన రామారావుకు మంచి సంస్కారం అలవడింది. దానికితోడు పెంపుడుపోవడంమూలాననలుగురితో పెద్దవాడనిపించుకున్నాడు గురుభవమాత్రంచెడకుండా. ఎన్ని ఉల్లాసీదాలొచ్చినా వాటినిఎదుర్కొన్నగుండె నిబ్బరం కలవాడు రామారావు!

నిజానికిప్పుడు కాలేజి ప్రొఫెసరుగాఉన్న రామారావునుచూస్తే నేచెప్పబోయ్యే సంగతంతా అబద్ధమనివాదిస్తారు అతన్ని.ఎరిగినవాళ్లు. అంటే, రామారావు తన కష్టసుకాల్ని తెలిసినవాళ్లకూ్కడాచెప్పడు ఎప్పుడూచాలా సరదాగఉంటాడు! ఒక్క మాటాయనపడిన ఉల్లాసీదాలు చెప్పితేకాని ప్రపంచంలో ఆలాంటి మనుష్యులున్నారని బోధపడదు.

పెద్దవాడయింతర్వాత, సంసారంనెత్తినపడింతర్వాత, కాలేజీలో చదవాలనేకుతూహలంపుట్టిన వాళ్లలో రామారావొకడు. తన్నెరిగినవాళ్లంతా నిరుత్సాహప్రో హించదక్కన్న సమయంలో తెగించి బ అనర్సుడిగ్రీ ప్రథమకక్షలో గైకొన్న రామారావు! అంతే అంతపట్టుదలమని మాట."ఫారిన్ స్కాలరు"గావెళ్లమని వర్సిటి కోరితే పూర్వాచారం తమపెద్దలసలహాతోదాన్నివదలుకున్న మూర్తి రామారావు!

రామారావు ఆనర్సుకోర్సుకొ మ్మనూ పసిగుడ్డైన శారదనూ తీసుకొ పట్నానికి. పట్నంలో కాపురంపెట్టా పాపంసీతమ్మకు చిన్నతనంలోనే తల్లిదం లుపోవడంచేత పింతండ్రి పెంచి పెండ్లి చేసి రామారావు చేతులోపె రామారావు సీతమ్మ లిద్దరూ నాగ ఎరుగకుండేటట్లు పెంచబడినవారే! క బిడ్డల్లాగాపెరిగినవాళ్లె! డబ్బంటేవిలు నివాళ్లే! అందుకని పాశ్చాత్యానుకరణ దలెట్టేఆరోజుల్లో మనరామారావు లు మాత్రం ఊరికే ఉంటారా! వాళ్లు లుపెట్టారు ఒకర్ని మించివకళ్లుకర్చు ళ్లు! చూసినవస్తువల్లా కొనడమేచూసి షన్లన్నీ అనుకరణీయాలేకావాలి! పిల్లకు సినబొమ్మలన్నీ కొనాలి చీరల్లోఏదైనా న్నరొ్వ్యా దుకాణంలో వేరేచూడక్క దు మనరామారావు ఇంట్లోచూస్తే! ప్ర ణాలు సెకండు క్లాసులోనే! ప్రతి చూడాల్సిందే!ప్రతినాటకమూచూడా దే! పొద్దునవండింది రాత్రికిపనికిరాదు గడిపారు పట్నంలో ఆ అయిదేళ్లూ!

ఇంకేముంది. డిగ్రీవచ్చింది. ఉన్న ఆస్తిలో సగం ఖర్చైంది! ఆ అయిదేళ్లలో పరిచయం ఎక్కువైంది—నూతన స్నేహితులతో బంధువులతో. ఎవరే పనిమీద వచ్చినా వీళ్లింటికే రావడం ఒ ధర్మసత్రంలాగ తయారయింది. రామారావు వైపు చుట్టాలు, సీతమ్మ వైపు చుట్టాలు! ఇందులో కానివాళ్లెవరు? ఒకర్నొద్దంటె సీతమ్మకు కోపం—మరొకర్నొద్దంటే రామారావుకు కోపం సంసారం జరగొద్దు మరి? అందుకని వచ్చేవాళ్లు వస్తూనే ఉన్నారు చేసేవంటవాడు చేస్తూనే ఉన్నాడు. అప్పుడప్పుడు కళ్లు తెరచినప్పుడల్లా భార్యాభర్తలు పోట్లాడుకునేవాళ్లు మీవాళ్లొస్తున్నారంటే మీవాళ్లొస్తున్నారని! మళ్లీ కలసేవాళ్లు...

స్నేహితులనే యుద్దేశంతో రామారావు వారి కష్టాల్లో ఆదుకునేవాడు. వాళ్ల కప్పులిచ్చి వాళ్ల బాకీలు తీర్పించేవాడు. కొన్ని సమయాల్లో స్నేహితుల్ని కాపాడేవాడు. హామీ ఉండి వాళ్లను రక్షించేవాడు. సీతమ్మ ఎంత చెప్పినా వినేవాడు కాదు. గొప్పకుటుంబంలాగా గడిచిపోయినా కొన్ని రోజులు ఉన్న ఆస్తి అంతా సరిపోయింది...

......దురభ్యాసాలేమీ లేవు మళ్లీ! ఏమైతే? తనమిత్రులంతా ద్రోహంచేశారు. విశ్వసించినవాళ్లంతా మళ్లీ అగుపించలేదు. సీతమ్మ నగలుతాకట్టుపెట్టి స్నేహితుని కాపాడాడు రామారావు! మంచివాడే! కాని ఆ స్నేహితుడో? ఏమైనాడో? ఉన్నన్నాళ్లూ మనవాళ్లు—అంతే అటుపిమ్మట పరాయివాళ్లవుతారు!

సీతమ్మ దుఃఖానికి అంతేలేదు. స్నేహితులు ద్రోహము చేసినందుకు రామారావు ఏంచేస్తాడు. హామీ ఉంటంవల్ల ఆ స్నేహితుడు తప్పించుకొనిపోయి రామారావును మోసంచేశాడు! ఒక్క స్నేహితుడూ రాలేదు మళ్లీ! రామారావుకు ఒక్కటే ఆధారం!

బంధువులంతా ఎవరిదారిన వాళ్లు దూసుకున్నారు.

పాపం రామారావు సీతమ్మ శారదలతో ఉద్యోగమొచ్చిన వూరికి వెళ్లాడు. ఒక నెలపని చెయ్యంగానే పెద్దజబ్బుచేసింది రామారావుకు దిక్కెవ్వరూ లేరు! మందులకూ, పండ్లకూ, పాలకూ ఆ నెలజీతం సరిపోయింది. మళ్లీ వూరికి వెళ్లడానికి డబ్బేదీ? డాక్టరుఫీసుకు? అప్పెవరిస్తారు? తమ రైలుచార్జీకి తిండిఖర్చుకూ? రామారావు లోలోన క్షోభించిపోతున్నాడు సీతమ్మకేమీ ధైర్యంలేదు. తినిపోయినవాళ్లందర్నీ తిట్టింది ఒక్కరూ ఉత్తరంరాయనందుకు. రామారావు బలహీనమైన చేతుల్తో వారించాడు తిట్టకూడదని! జబ్బునయం కాగానే రామారావు యింట్లో ఉన్న వెండిసామానంతా అమ్మి అప్పులన్నీ సర్దేసి, ప్రయాణమైనారు స్వగ్రామానికి.

చాలామందికి విరోధులైనారు. హోదాకలవాటుపడిన ప్రాణాలకు గ్రామజీవనం దుర్భరమనిపించింది. బంధువుల్లో తలెత్తుకోలేక రామారావు ఉద్యోగప్రయత్నం మొదలెట్టి చివరికో కాలేజీలో ప్రొఫెసరుగా నియమింపబడ్డాడు. స్నేహితులూ, బంధువులూ త్యజించినా సరస్వతి వదలదుగదా! లక్ష్మి తొలగినా సరస్వతీభాగ్యమున్నదని సంతృప్తి రామారావుకు.

మళ్లీ మంచిరోజులొచ్చాయి రామారావుకు, మనిషిమాత్రం మారలేదు. మొదటిల్లాంటి ఉదారస్వభావుడో యిప్పుడూ అంతే! మొదటినుంచి తల్లిదండ్రులు లేరనే జాలితో భార్యమీద ఎక్కువ ప్రేమగా ఉండేవాడు రామారావు అవిడ కోరటంతరువాయిగా ఏర్పరిచేవాడు. అంతదెబ్బతిని ఆస్తంతా పోయినా హోదామటుకు తగ్గ

(41 వ పేజీ చూడుడు.)

# ఆహారము నందలి మూల ద్రవ్యములు.

## (1) జీవాణువులు

డాక్టర్, పాలపర్తి నరసింహారావు,
వేటపాలెం (M. S. M.)

మానవశరీరములు పోషింపబడుటకు [1] జీవాణువులు [2] సేంద్రియలోహణములు [ధాతుపోషకలవణములు] [3] పిండి [4] క్రొవ్వు [5] మాంసకృత్తులు [6] నీరు అను ఆరుమూలద్రవ్యము లావశ్యకము లైయున్నవి. ఈద్రవ్యములలో ఏయొకటిలోపించినను, ఏయొక ద్రవ్యమధికమైనను మానవులారోగ్యమును పొందజాలరు. మనము భుజించుభోజనపదార్థములలో, ఒక్కొక్కపదార్థమందుకొన్ని ద్రవ్యము లెక్కువగను, కొన్ని తక్కువగ నుండును. కాబట్టి యీమూలద్రవ్యములయొక్క అనుగుణ్యత (Proportion) కాపాడుకొనుటకు మనమేపదార్థముల నెంతెంత భుజింపవలెనో దీర్ఘాయు రారోగ్యములనుగోరు ప్రతిమానవుడు తెలుసుకొనితీరవలయును. కాబట్టి ఒక్కొక్క ద్రవ్యముయొక్క ఉపయోగమును తెలుసుకొని, తత్సంబంధమగు ఆహారపదార్థములను భుజించుటత్యావసరము.

[1] జీవాణువులు:- వీటినిఆంగ్లేయ వైద్యులు విటమైనులు (Vitamins) అనియు, ఆయుర్వేద వైద్యులు జీవనీయాలనియు వ్యవహరింతురు. ఇవిమనకంటికి కానరాని రసాయనిక ద్రవ్యములు. ఇవిమన పెంపున కత్యావసరమైయున్నవి. ఇవిపచ్చి ఆకులలోను, లేతకాయలలోను, సారవంతమైనఫలములలోను, మొలకెత్తుధాన్యములలోనుపాలు వెన్న, మొదలగు పదార్థములలో నున్నవి. ఇట్టి జీవాణువులుగల పండ్లు కాయలు, ఆకులు చెట్టునుండికోసిన క్షణమునుండియు క్రమేణ వాడి ఎండిపోవుచున్నవి. అనగా వాటియందుండు జీవాణువులు జీవమును కోల్పోవుచున్నవి. ఇట్టిపదార్థములకు సూర్యరశ్మి సోకిన యందలి జీవాణువులు మరింత త్వరితముగ జీవపదార్థమును గోల్పోవుచున్నవి. పదార్థములను వండుటవలన, వాటియందుండు జీవశక్తిసంపూర్ణముగ నశించుచున్నది. అందువలన పక్వపదార్థములన్నియు నిర్జీవములగుచున్నవి. వంటచేయుటవలన మనము నిర్జీవపదార్థములను దినుచున్నాము. జీవము లేని పదార్థములన్నియు మనదేహములో దుర్రుళ్లిపోవును. ప్రాణములేని పదార్థములను భుజింతుమేని, మానవుడు నిర్జీవముగ ప్రమింగినప్పుడదిరక్తములో పోషకపదార్థముగ కలియక, ఎట్లాసనముద్వారా బయటికి పోవుచున్నదో, అలాగుననే, నిర్జీవములగు నపదార్థములుగూడ నిరుపయోగముగ విసర్జింపబడుచున్నది. అదియునుగాక జీవము లేని యీపదార్థములను బయటికి పంపు యుటలో నాడీశక్తి క్షీణించి పలువిధముల నాడీవ్యాధులు కలుగుచున్నవి.

పచ్చిపాలయందు సమృద్ధిగ జీవాణువులుండును. ఆవులుపచ్చిగడ్డిని తినుకాలమున దిట్టిక్షీరములలో జీవాణువులు విశేషముగ నుండును. పాలనుకాచి బిడ్డలకుపోయుట వలన, యందలిజీవాణువులు నశించి ఆరోగ్యము తగ్గుచున్నది.

ధాన్యములు పైరునందు పాలలో యున్నపుడు. వాటియందుసమృద్ధిగ జీవాణువులుండును. వాటినెండబెట్టుటవలన జీవాణువులు చాలభాగమునశించుచున్నవి. ధాన్యములనువిసరుట, రుబ్బుట గానుగట్టుట, దంపుట, వండుట, మొదలగు కార్యములవలన గింజలలోని జీవము మొలకెత్తుస్వభావము పోవుచున్నది. కాబట్టివండుటవలన మనము నిర్జీవపదార్థములను దినుచున్నాము.

జీవాణువులు శరీరమందులో

నెడల పలువిధములగు వ్యాధులు గలుగునని
యు, అల్పాయువుగలుగుననియు, ఇవిశరీ
రారోగ్యమున కత్యవసరమనియు వివిధవై
ద్యసాంప్రదాయముల వారంగీకరించిన విష
యము. ఆంగ్లేయ వైద్యశాస్త్రజ్ఞులు జీవాణువు
లకు, ఎ బి1, బి2, బి3, సి, డి, యిఅనుగుర్తులు
పెట్టి ఇవిపలువిధములనియు, ఒక్కొక్కర
కము వివిధపదార్థములం దిమిడియుండునని
యు సిద్ధాంతీకరించిరి. ఆంగ్లేయవైద్యశాస్త్ర
మంతయు వ్యాపారదృష్టితో నిండియున్న
ది. ఆంగ్లేయులుతయారుచేయు హార్లిక్సు,
ఓవల్ టిన్, గ్లాక్సో, లాక్టోజిన్, సెనటో
జిన్, గ్లూకోజు, మొదలగు ఆహారపానీయ
ములను, కాడ్లివర్ ఆయిల్ మొదలగుఔష
ధములను విక్రయించుటకు, యీ పలువిధము
లగు జీవాణువులను వ్యాపారచలోక్తులుగ
(Selling point) తీసుకొనివీటినికల్పించి
ప్రకటన చేయునట్లు తోచుచున్నది. తాము
తయారుచేయు ఆహార పానీయములందును,
ఔషధములయందును, వివిధ జీవాణువుల
న్నవను వ్యామోహముకల్పించి, విక్రయించి
ధనమునార్జించుచున్నారు. ఇవియన్నియు
నిరుపయోగములు అస్వాభావికమైనవి. వా
రుధనికులగుటకు సృష్టికాబడినవి గాని, మాన
వులనుద్ధరించుటకు గాదు. అపక్వపదార్థముల
న్నియు సజీవములు మగలమందు తయారగు
పదార్థములన్నియు నిర్జీవములు కాబట్టివీటిను
పయోగింపతగదు. జీవాణువులు మనముభుజిం
సమస్త ఫలాదులలోను, కాయగూరలలోను,
ఆకుకూరలలోను, ముడిదంపుడు బియ్యము
లోను, మొలక లెత్తుధాన్యములలోను, పాలు,
వెన్న, తేనె మొదలగు అపక్వపదార్థముల
లోనుగసమృద్ధిగలవు. ఆంగ్లేయవైద్యసిద్ధాం
తము ననుసరించి పలువిధములగు జీవాణు
వులున్నప్పటికి, వాటికొరకు మనము శ్రమ
పడి ఇంగ్లాండు, [illegible], అమెరికా, మొ॥
దేశములనుండి దిగుమతి చేసికొనవలసిన
పనిలేదు. ఒక్కొక్కఋతువునందు పలువిధ
ములగు ఫలములును, కాయగూరలును తిన
చుందుము గనుక, వివిధ జీవాణువులు మన
కప్రయత్నముగ లభించుచుండును. 3 రూ
పాయలు ఖరీదుగల హార్లిక్సు నందుకంటె,
మనదొడ్లలోను, తోటలలోను, ఉచితము
గా దొరకు తోటకూర, బచ్చలికూర,
చుక్కకూర, పొన్నగంటికూర, పాలకూర,
మొదలగు వాటియందు వేయిరెట్లెక్కువ
జీవాణువులు గలవు. కాబట్టి హార్లిక్సు,
ఓవల్ టిన్, గ్లూకోజు మొదలగు ఆహారము
ల కొరకు శ్రమపడుట శుద్ధతెలివి తక్కువ
ఇవియన్నియుమూఢులకొరకును అజ్ఞానులకొ
రకును తయారగుచున్నవి. డబ్బాలపై
"Rich in vitamins," అనియు
"Contains vitamins A and D."
అనియువ్రాసి ప్రకటన చేయుటవలన, ప్రజ
లావ్యామోహములో పడి ధనమునుగోల్పో
వుట యేగాక, ఆరోగ్యమును కూడగోల్పో
వుచున్నారు. కాబట్టి వివిధ జీవాణువుల
కొరకై దొరకని పదార్థముల కొరకు శ్రమ
పడవలసిన పనిలేదు. ముఖ్యవిషయమేమనగా:
భోజనములో కాయగూరలను, ఆకుకూరలను
సమృద్ధిగ దినుటయు ఏఋతువునందు దొరకు
ఫలాదుల నాఋతువులో ప్రతినిత్యము శక్తిన
నుసరించి తినుటయు అత్యవసరము. జీవా
ణు రహిత మైనట్టియు. ఉద్రేకము కలుగ
జేయు నట్టియు కాఫి, టీ, ఓవల్ టిన్,
మొదలగు పానీయములకును, చిరుదిండ్లకును
వెచ్చించు ధనమును ఫలాదులకును. కాయ
గూరలకును వెచ్చించిన దీర్ఘాయురారోగ్య
ములు గలిగి సుఖింపగలరు.

ఊరగాయలు, ఊరుపచ్చళ్లు, (మామిడికాయ
ఆవ-చింత-నిమ్మకాయ తొక్కులు) మొదల
గునవిమరబియ్యము, (గిర్ని బియ్యములు) గరం
మసాల మొదలగునవి నిర్జీవములుజీవాణురహి
తమైనవి కాబట్టి వీటినిఉపయోగింప తగదు.

# ఆరణ్యక.

బి. అండాళమ్మ.

గీ॥ తెలుగుమిన్నేటిరాయంచ బలగమైన
భారతీయులమనములు పల్లవించు
నెపుడుతద్వృత్త వనజ సమృద్ధ మధుర
వాఙ్మరందపరంపరా వలితమగుచు

మ॥ తెలుగుందల్లి! కవిత్వకన్యక సవిత్రీహీనమైకంటెనీ
రొలుకన్ మోమునవిన్న బాటొదవ నిట్టూర్పుల్ పయింబర్వెదు
ర్బలమైమూలలడాగికొన్నయదినీ ప్రారంభమంజాచిగం
తులువై చెంజెలరేగవ్రాలునికనీ దౌర్భాగ్యమంబాసతో

మ॥ సుమమారందరసోర్మిలంజిగురులే జొంపాలక్రొమ్మావులం
బ్రమదంబొప్పగ బాడుకోయిలల రావంబందు చిత్తంబుల
గ్నముగా వేడ్కచిగుర్చకోర్కెలుఫలించంగా నపెంపొందె! నీ
యమస్వేచ్ఛావతివైమెఱుంగదు సుమా యైశ్వర్యభోగంబులన్

సీ॥ కమలకల్లోలినీ విమలాంబువులదోగి
పూలజల్లులకు సమ్మోదమొంది
సెలయేటిదరులపసిమి పచ్చికనెసంగి
భృంగసంగీతాల బొంగియాడి
దరహాసమల్లికా దామంబుదిగ్వధూ
వేణీభరంబుల విసరివైచి
క్రొన్నెలవంకలోనున్న జింకనుబట్టి
జ్యోత్స్నవిహంగాల జోపిజోపి

గీ॥ పూదుమారంబు పత్రముల్ పుడమిరాల
తీవెయుండుల నూరుచు దిరిగె వయసు
యడవిగాచిన వెన్నెల యట్లుగాగ
తెలుపు[illegible] మిక నో తెలుగుతల్లి!




# ఆనందానుభూతి



ఎవని నమ్మకము కష్టపరంపగల మధ్యమందైనను చలింపక నిల్చబడి యుండునో వాఁడే సరియైన భగవద్భక్తుఁడు ఎవఁడు సుఖస్థితిలోనే భగవత్కటాక్షమును జూచి కష్టస్థితిలో నట్లు చూడలేఁడో వాడు సరియైన భక్తుఁడు కాఁడు.

కష్టస్థితిలో తన సహనమును కోల్పోవక భగవత్కటాక్షముపై విశ్వాసముంచి సత్యమార్గమునుండి తొలఁగక యెవఁడుండునో వాని కష్టములన్నియు మటుమాయమై సుఖముగ మారును. కష్టములువానినే విధముగను బాధింపవు.

ఎవని యొద్దనుండి యేమియుకోరకుము; అప్పుడు జనులందరు నీపాదములకడ నీకుఁగావలసినవాని నన్నిఁటిని సమర్పింతురు. గౌరవము నెప్పుడును కోరకుము. అది తనంతటతానే నీకడకు వచ్చును. స్వర్గమును కాంక్షింపకుము. స్వర్గములోని దేవదూతలు తమ విమానములు తీసికొని వచ్చి స్వర్గమునకుఁ దీసికొని పోవుదురు. కాని వానినికూడ నీవునిరసించి తివేని భగవంతుఁడే ప్రత్యక్షమై నిన్ను కౌగలించు కొనును.

ఎవఁడు భగవంతుని మఱచి గౌరవమును, కీర్తిని, స్వాభివృద్ధిని కోరుచుండునో వాని జీవితము దోషయుక్తమైనది. భగవంతుని మఱచి ధనమును, శరీర సుఖమును, ఇంద్రియ సుఖమును కోరువాఁడు పైవాని కన్నను అధముఁడు. ధర్మముపేర భగవంతుని మరచినవాఁడు కూడ దోషియే. ధర్మమునకును భగవంతునికిని, శరీరమునకును ప్రాణమున కున్నంతి సన్నిహిత సంబంధమున్నది. భగవంతుఁడు లేని ధర్మము ఒక కళేబరము వంటిది.

గతమునుగూర్చి పశ్చాత్తాప మొందకుము. భావినిగూర్చి బాధపడకుము. నీ ప్రస్తుతమును మాత్రము దిద్దుకొనుము. నీ యావచ్ఛక్తిని భగవత్కటాక్షముపై తిప్పి, ధైర్యమును, విశ్వాసము,

# బాతాఖానీ

అసాధ్యప్ర…

టంకారాలు—టుమ్రీలు—ముక్తాయింపులు—ఓట్లు.

* * * *

లాఘవం:— మాతృస్వరూప, అవ్యాపృతశక్తి సంపన్న, రసపు… స్థితికారక కర్తవ్యశక్తి యుతమగు స్త్రీ అధునికలోక దృష్ట్యా ఎంతలాసు… అయిపోయిందో ఎవరైనా గమనించారా? ఆయుర్వేదాది ఔషధాల… ఆంధ్రాది ఇన్స్యూరెన్సు కంపెనీలకు, అదిఇది యేమిటి అన్నివిధా… అడ్వర్టైజుమెంటులకు ఆడుదాని ఆకృతియే కావలసి వచ్చింది ఆధు… కలోకం ఆడువారి విషయంలో ఎంత అసభ్యతకు అవతరించింది ఇ… అపనీతికి పాల్పడిన దేశానికి అభ్యుదయసిద్ధి కలుగుతుందా? ఒక మహి… సంఘమైన వ్యతిరేక ప్రచారానికి ఉద్యమించ లేదుగదా? మాన… అర్థాంగీ కారమా? పూర్ణాంగీ కారమా?

భక్తిప్రవాహం:— "కలౌస్మరణాన్ముక్తిః" అన్నట్లు నేడు దే… మంతా ఎక్కడచూచినా భగవన్నామ సంకీర్తనలు, బాబాగారి భజ… సమాజాలు, భాగవత సప్తాహాలు, భగవద్గీతా పారాయణలు, భాగ… తారుల కాలక్షేపాలు, భక్తుల బ్రహ్మోత్సవాలు, ప్రవాహ రూపం… జరుగుతున్నా, భారత దేశానికి విముక్తి ఏమీ సిద్ధించలేదే మంది ఆ… ఒక భక్తుడు ఒక బైరాగిని ప్రశ్నిస్తే ఆయన "నాయనా" భగవంతుడు బాహ్యాన్ని పరీక్షిస్తాడా? అంతర పరివర్తనం కావాలిగాని" అని అన్నా… డట. అందుకనే కాబోలు వేమనకవి తలలు బోడులైన తలపు… బోడులా? అన్నాడు కాబట్టి ఆంతరంగిక పరివర్తనం పొందాలి! ఆధ్యా… త్మికసిద్ధి అనుభవించాలి!



అర్థకాంక్ష:— అర్థకామాలు అనర్థ హేతువులనిన్ని, ఆధ్యాత్మి…

సంసిద్ధికి అవరోధాలనిన్ని అనుకొని అవతల పెట్టివేసి ఆశ్రమ స్వీకారం చేసిన అవధూతశిఖామణుల కే అర్థకాంక్షఉంటే, ఐకహిమే అంతాసుమా! అర్థం లేకపోతే వ్యర్థంసుమా'' అని అనుకొనేవాళ్ళు అపరాధులౌతా రేమో ఆలోచించండి? అర్థోపార్జనా సక్తులైన అవధూతల అధ్యాత్మిక ప్రసంగాలవల్ల ఆత్మానుభవ సంసిద్ధి కలుతుందా? ఆహా! ఏమి! ఆధునిక కాల ఆధ్యాత్మిక సాధానాప్రబోధం! ''ఉదర నిమిత్తం బహుకృత వేషః'' అన్నఆచార్యస్వాములవారివాక్కు ఇటువంటివారి కేఅన్వయిస్తుంది కాబోలు.

---

## ఆనందానుభూతి

గలిగి నీప్రస్తుతమును దిద్దుకొనుము. భావి తనంతటతానే మారిపోవును.

ఎవఁడు తన ప్రస్తుతమును దిద్దుకొనక ముందురాఁబోవు సౌఖ్యములను భావించి తన గతముకై వగచునో వానికి అశ్రుకణములేగతి.

ప్రపంచములో ఎదైన నొకదాని సాధించినపుడు దానిచే గర్వమొందకుము. ప్రతిచోటను మనమూహించెడు వానికన్నను గొప్పగొప్ప విషయములుండును. నీవీభూమిపై ఒక రేణువనని భావించి ప్రతి వస్తువుపైడ గౌరవముతోను అడకువతోను వర్తింపుము. అప్పుడే సత్యమైన మార్గము నీకుఁగోచరింపఁ గలదు. ఎవఁనికి గర్వముచే గఁన్నులు కనఁబడవో వాఁడు అసత్య మార్గమునఁ బోవుచున్నాడు.

అన్నిటియడను గౌరవముఁజూపుము. అందరికిని హిత మొనర్పుము. ఎల్లప్పుడును అందఱికి మేలుచేయ వలెనని తలంచుచుండుము. అప్పుడే నీకు శుభమును, ఆనందమును గలుగును.

("కల్యాణ కల్పతరు'' నుండి.)

---

నది. లాథెము, "అండోనిమెటు" (andowette) అను విమానములో కూర్చుని మేఘములవైపు పోవుటకొందరు కుతూహలులైచూచుచుండిరి. కొంతసేపటికి "డవరు" (Dwer) ను సమీపించుచుండెను. కానితీరమునకు లో అరుమైళ్లు సమీపమున సముద్రములో విమానముపడిపోయినది. వెంబడివచ్చుచున్న పడవలో లాథెను నెత్తుకునిరి. విమానము సముద్రములో పడిపోయినను, మొట్టమొదట "చనెలు" పైకెగర ప్రయత్నించెను కాబట్టి, ఈతని ననేకులుకొనియాడిరి. ఇదేసమయమున "బ్లెరియటు" (Bleriot) అను మరొకఫ్రెంచివాడు తనవిమానముపై ప్రయత్నించెను. 1909 సం॥ రము జూలై 25 వ తారీఖున ప్రొద్దున 3-30 గంటలకు బ్లెరియటు తనవిమానములో డవరుకువెళ్లెను. అతని వెంబడి ఎస్కోపెటు (Excopette) అను యుద్ధనావ వెంబడించుచుండినది. కాని, బ్లెరియటు తనవెంబడి వాయుసంచారముచేయునపుడు కావలసిన పరికరములేమియు వెళ్లసందున త్రోవలో దారితప్పెను. వెంబడివచ్చుచున్న యుద్ధనావ కూడా కనబడలేదు. విమానముచాలావఱకు గాలివశమై మొనర్చుకొనప్రయత్నించెను, కాని వెంబడి ఏవస్తువునులేకపోవుటచేత మిక్కిలి కష్టపడవలసి వచ్చినది. తుదకు, ప్రొద్దున 5-12 గంటలకు "డవరు-క్యాసెలు" (Dwer Castle) వెనక "నార్తుఫాలుమెండో" (North FallMeadow) లో తన విమానముతో చేరెను. మరుసటి సంవత్సరమున "క్లాడుగ్రహాము వైట్" (Clande Graham White) అను ఇంగ్లీషువానికిని, లూయిపాల్హాను (Locis panlhan) అను ఫ్రెంచివానికి పెద్దపోటీజరిగినది. లండనునుండి, మాంచెస్టరు వఱకు ఇరవైనాలుగు గంటలలో వెళ్లగలిగిన వారికి వేయిపౌండ్లు యిచ్చెదమని పత్రికలలో ప్రచురించబడెను.

గ్రహమువైటు తన ఫార్మను బైప్లేను (Farman Biplane) ను విల్లెస్డెన్ జంక్షను (Willesdentn) నుండి ఎప్రెలు 23, 1910 సంవత్సరమున అయిదు గంటలకు బయలుదేరి వెళ్లిన కొంత కాలమునకు, ఆకాశవాయుచలనము మిక్కుటముగానుండుటచేత "లిచ్‌ఫీల్డ్" )Lichfield) అను ప్రదేశములో దిగవలసివచ్చెను. గ్రహముతిరిగి ప్రయత్నించెను, కానితన విమానము విరిగిపోవుటచేత మానుకొనవలసివచ్చెను. పిమ్మట వాత తన విమానమును లండనుకు తీసుకవెళ్లిబాగుచేయించ

# వార్తావాహిని.



ఇంతవఱకు యూరపుఖండమున జరుగుచున్న యుద్ధమును ఈవిధముగ సంక్షిప్తముచేసి చెప్పవచ్చును. పోలండ్ దేశమునకు భంగముకలిగించి హిట్లర్ పడమరవైపు ముఖముపెట్టి దేశాక్రమణము చేయుచుపోయినాడు. అన్నిదేశాలు ఇతని క్రౌర్యానికి లోబడినను, ఇంగ్లండు మాత్రము హిట్లర్ ప్రవాహమునకు అడ్డుతగిలినది. తక్కిన దేశములను కొద్దికాలములోనే భస్మముచేసిన హిట్లరు ఇంగ్లండునుకూడ అట్లేచేయవచ్చునని తలచి బాంబులు ఇంగ్లండుమీద అగ్నివర్షము కురిపింప మొదలుపెట్టినాడు. ఇంగ్లండుయొక్క బలము నాతడు సరిగ గుర్తింపలేదు. కొన్ని పడవలు మునిగిపోయినను, అంతకు రెట్టింపు నావలు మరునాటికే ఇంగ్లండులో సిద్ధమగుచున్నవి. అమెరికా దేశమునుండి విమానములు మున్నగునవి ఇంగ్లండుకు వచ్చుచున్నవి. ఇట్లు దినదినము శుక్లపక్ష చంద్రుని వలె ఇంగ్లండు బలము వృద్ధిపొందుచున్నది. ఇగ్లండులో లండనులో జనసమృద్ధమైన ప్రదేశములందు, బాంబులుకురిపించినాడు. ఇంగ్లండుపై దాడివెడలి వచ్చుచున్న జర్మను విమానములు చాలావరకు రాజుగారి వాయుబలము (R. A. F.) చే క్రిందికి కొట్టబడుచున్నవి.

హిట్లర్ నిర్దయుడై ఇట్లుండగ ఇతనితో సమానగుణ సంపత్తిగల ఇటలీ దేశపునియంత ముసోలిని పద్ధతులను చూతము. ముసోలినితన దృష్టియంతయు దక్షిణపువైపు త్రిప్పినాడు. ఇదివరకే అన్యాయముగ అబిసీనియా రాజ్యమును దండెత్తి ఆక్రమించుకొన్న సంగతి అందరికి తెలిసినదే. ఇదివరకే స్పెయిన్ దేశములో ఫ్రాంకో ప్రభుత్వము తన బలముతో స్థాపించినాడు. ఇంతేకాక అల్బేనియా రాజ్యమును స్వాధీనం చేసికొన్నాడు. ఆఫ్రికాలోని బ్రిటిష్ సోమాలిలాండ్ ఆక్రమించినాడు. ఇతడు ఎంతసేపటికి దేశములు దిగమ్రింగుట ప్రారంభించినాడు. ఇతని మనస్సులో తృప్తి నేడు పడమన్నట్లు కనబడదు. తన బింకముతో ఈజిప్టును జయింపవలెనని, ...

చన చేయుచున్నాడు. అలెగ్జాండ్రియా లోనున్న బ్రిటిష్ సేనలదాటి ఆగలేక ఇటలీ సైన్యములు నిత్యమును ఓడిపోవుచున్నవి ఇట్టిస్థితిలో అక్టో బరునెల చివర తూర్పువైపు తిరిగి గ్రీసుదేశముపై దండెత్తినాడు. గ్రీసు దగ్గరలో నున్న అల్బేనియా ఇదివఱకే మసోలిని లోబడినదికదా. బల్గేరియారాజు ఇటలీరాజు అల్లుడగుటవలన అది గ్రీసుదేశమునకు సహా యము చేయదు. అల్బేనియాకు పైనున్న యుగోస్లోవియా గ్రీసుకు సహా యము చేయకుండగ ఇదివరకే ఒక సంధిచేసికొన్నాడు. గ్రీసు వీరులను గన్నభూమి. ఇట్లు మసోలిని దండెత్తినను, ఆదేశము తుదివఱకు పోరా డుదునని చెప్పినదికాని దాసోహమ్మని కాళ్లపై బడలేదు. గ్రీసు దేశ రాజు ఇంగ్లండు రాజకుటుంబములోనివాడు. ఇట్టి పరిస్థితులలో ఇంగ్లండు దేశముపై గ్రీసు ద్వీపముల రక్షణభారము పడినది ఇదివరకుచేసిన వా గ్దానప్రకారము ఇగ్లండు గ్రీసుకు సహాయముచేసి ఆదేశపు జాతీయతను నిర్మూలము గాకుండ కాపాడగలదు.

ఇది యిట్లుండగ రష్యా విదేశాంగమంత్రి మాల్టోనో అనునతడు ఈనేల 10 వ తేది బెర్లిన్ వచ్చి హిట్లర్‌తో సంప్రతించెను. అతడక్క డ నున్న రెండుదినములలో బ్రిటిష్ వాయుబలము ఒక్కరాత్రి బెర్లిన్ పట్టణమును ముట్టడించినది. వారు ఏవిషయములు మాట్లాడినది ఇంకను గుప్తముగనే ఉన్నది.

ఈనెల 9 వ తేదిరాత్రి రుమేనియా దేశములో గొప్ప భూకం పము కలిగినది 1802 సంవత్సరము తర్వాత ఆదేశమున మరల ఇప్పుడే భూకంపము తటస్థించి బుకారెస్టు పట్టణమును ధ్వంసమయ్యెను 200 పైగాజననష్టమును కొన్నినూనె గనులు పాడైపోవుటయును తటస్థించె.

* * * * *

పండిత జవాహర్‌లాలుగారు మహాత్మునితో ప్రస్తుత కర్తవ్యా గురించి ఆలోచించుకొని అలహాబాదుకు తిరిగి వచ్చునప్పుడు అరెస్టు కాబడెను, నాలుగు సంవత్సరముల శిక్ష విధింపబడినది.

కాంగ్రెసు వర్కింగ్ కమిటీవారు 5 వ నవంబరునాడు ఖాయి కాంగ్రెసు సభ్యులు శాసన సభా సమావేశములో పాల్గొని పైనాన్సు

బిల్లును ప్రతిఘటించ వలయునని తీర్మానించిరి. అదేవిధముగ ప్రతిఘటించి బిల్లు నోడించిరి, ముస్లిములీగువారు తటస్థముగా నుండిరి.

వ్యక్తిగత సత్యాగ్రహము ఆసేతు హిమాచలము. వివిధరాష్ట్ర ములందు వివిధవిధముల మొదలు పెట్టబడినది. ఇంతవరకు, సర్దారువల్ల భాయిపటేలు, టి. యస్.యస్. రాజన్. భి. జి. ఖేర్.రావిశంకర్ శుక్ల శ్రీమతి రుక్మిణీ లక్ష్మీపతి మొదలగు ప్రముఖులు యింతవరకు డిఫెన్సు ఆఫ్ ఇండియా యాక్టుక్రింద బంధింపబడిరి.

రాబోవు ఆంధ్ర మహాసభ వరంగల్ తాలుకాలో జరుప దలంచి నట్లు తెలియుచున్నది.

రాయల సీమ సర్కారు సీమలు హైద్రాబాదుకు యిచ్చి వేయాలని బహదూర్ యార్ జంగుగారు యంటే, మ. ఘ. వ. నిజాం ప్రభువుగారు జిమ్మేదారి ప్రభుత్వాన్ని స్థిరపరిస్తే ఆంధ్రరాష్ట్రమే వారి యధీనములోనికి వస్తుందన్నారు కోటిరెడ్డిగారు.

నిజాంరాష్ట్ర ద్వితీయ వైశ్యమహాసభను, జగిత్యాల వాస్తవ్యులు ఆహ్వానించుచున్నటుల తెలియుచున్నది.

ఆంధ్రమహాసభాధ్యక్షుడు వరంగల్ జిల్లాలో కొంతిపర్యటనము చేసి కొన్నితాలుకా సంఘముల స్థాపించిరి, ఆంధ్రమహాసభాసభ్యులుగ చేరవలయునని ప్రబోధము జేసిరి.

యూనిఫారంగురించిన్ని, స్త్రీశిక్షాప్రపఠనముగురించిన్ని, మాతృ భాషనుగురించిన్ని, వివాదపరిష్కారము చేయింతుమని మాట యిచ్చిన పెద్దమనుష్యులంతా తమవాగ్దానాలచెల్లించుకోలేదు, ఇంకెంత కాల మిట్లు వేచియుండవలయునని ఉస్మానియావిద్యాపీఠ హిందూవిద్యార్థులు పత్రి కాప్రకటన గావించియున్నారు.

హైదరాబాదు వైమానిక దళముకూల్చిన జర్మను విమానబా గమును ఒకస్తూపాను విజయచిహ్నముగా రెసి డెంటుగారు మనప్రభువు గారికి సమర్పించిరి.

శ్రీ బీరారు యువరాజులుగారికి, ఉస్మానియా విద్యాపీఠము వారు ఎల్. ఎల్. డి. బిరుదము సమర్పించిరి.

పెట్టుచుండ "లూయిపాల్హాను" తన ఫార్మనుప్లేనులో లండనునువచ్చి యుండెను. 'లూయి' లండనునగరమును సాయంత్రము యైదు గంటలకు విడిచి తన విమానములో "లిచ్ ఫీల్డు" వఱకు ఆగక పదిహేనునిమిషములలో రాగలిగెను. ఏప్రిల్ 28 వ తారీకున, "పాల్హాను" మాంచెష్టరుకు సరిగాఉదయము 5-32 గంటలకు చేరెను. ఇంగ్లాడు దేశమంతయును ఫ్రెంచి వైమానికుడు గెలిచినాడనియు, ఇంగ్లీషువాడికి బహుమతి రాకపోయెననియు, అసూయచెందుచుండిరి. 'లూయీ' గెలిచినాడని సనగానే, సహృదయుడు 'గ్రాహాము' వైటు ఇట్లనియెను. (సశేషము)

## గ్రంథసమీక్ష

అణాగ్రంథమాలవారి ౭.౮ వ ప్రచురణములు. ఒక్కొక్కదాని వెల అణాయని గ్రంథమాల పేరే చెప్పుచున్నది. ఒకటి ౪౦ పుటలు రెండవది 3౪ పుటలు గలది. గ్రంథకర్త 'సేవయే ధర్మమని యెంచిన శ్రీజానపాటి సత్యనారాయణ గారు. దొరుకుచోటు 3౬౯ గ బి. తూర్పు బజారు హైద్రాబాద్

"కాంగ్రెసు చరిత్రయనగా, భారతీయులయొక్క ౫౫ సంవత్సరముల జాతీయ పోరాటము స్వాతంత్ర్య సమరము... ఈలాంటి చారిత్రిక గ్రంథమును, తెలంగాణములోని సాధారణ ప్రజలకు అందు బాటులోనుండి భారతజాతీయ వికాసమును తెలుసుకొనుటకు లఘు పుస్తక రూపమున...... మొగలు సామ్రాజ్యము యొక్క అంత్యదశలో బ్రిటీషువారు భారతదేశమును ఆక్రమించిన చరిత్రమును క్లుప్తముగా తెలుపుచు ఈజాతీయ మహాసభ స్థాపన లోనికి వచ్చిన హేతువులును, తరువాత క్రమ వికాసము పొందుచు పరివర్తనము పొందిన వివరములను క్లుప్తముగా గ్రంథస్థము చేసినారు. సామాన్యుల కైనను తేలికగా అర్థమై విషయము సుబోధితముగా నుండునటుల వర్తించినారు" పీఠికలోని, తెలంగాణమునకు చిరపరిచితులగు శ్రీమందుముల రామచంద్రరావు గారి యీ వాక్యములు అక్షరాల నిజముగా యున్నవి.

బాలకేసరి:__మేడిచెర్ల ఆంజనేయమూర్తిగారి సంపాదకత్వమున బెజవాడ నుండి ప్రచురింప బడుచున్న క్రొత్తసచిత్ర మాసపత్రిక. ప్రథమ సంచిక 12 పుటలతో దిచేరినది. సంవత్సర చందా ఒక రూపాయి. విడిసంచిక 0_1_6.

విద్యార్థి విద్యార్థినీ జనులు విజ్ఞాన గుణశీలముల నభివృద్ధి చేసకొనుటకు, బలము పెంపొందించుకొనుటకు, ఆరోగ్యసంపద కాపాడుకొనుటకు, దేశభావయందభిమానముంచుకొనుటకు, "ఆంధ్రవిద్యార్థి లోకము నా ఈపత్రికమూలమున కలయికను సంపాదించి తమ స్నేహ ప్రేమ లక్ష్యముల నభివృద్ధి కొన గల్గుటకు" సహాయ పడుచు విద్యార్థులతో డ్పాటుసంపూర్ణముగ లభించిన మహ సటి నెలనుండి ముప్పది లేక అంతకుమించిన పుటలతో యీపత్రికను ప్రకటించ వలయును. సంపాదకుల సదుద్దేశ్యము సఫలమగు గాక యని కోరుచున్నాము. దీనిని నిలబెట్టుకొను భారము విద్యార్థుల పైనున్నది. కాలేజీ, హైస్కూల్ లేక ఇంకా క్రింది వారిని వీరిలో యెవరినో యొకరి నుద్దేశించి వారికి యుక్త ... దీని ప్రకటించు ... యొక్క ... నుండు ... బాగుండునని మా అభిప్రాయము.

...ము మల్లీయథాప్రకారంగా నగాంభగు ...రీ ధర్జాగా గడుపుతున్నారు సంసారం. ...తుళ్లో కొందరు పుట్టి పోయినారు ...దంపతులకు. ఉన్న ఒక శారదనూ ...సముదుగా పెంచారు. అడిగినవన్నీ అమ ...వాళ్లు. రోజుకో కొత్తగౌను, కొత్తపరికిణీ ...కి పంపించి చదువుచెప్పించారు. ఇం ...సంగీతం నేర్పించారు ఆదర్శప్రాయ ... సంసారంగా తయారైందావూళ్లో ...రావుని పేరు ప్రతిష్టలట్లాగే ఉన్నై. ...మంచియిల్లొకటి కొన్నాడు. డబ్బు ...చాలక పోయినప్పటికీ అప్పుజేసి దుబా ...చేశారు నలుగుర్నీ చూశి నేర్చు ...కున్నారు పొందికగా వాడుకోటం. లక్ష్మి పరిసన్నంకూడా బాగానే కలిగించి. ఇంకా కావల్సిందేముంది ఆదంపతులకు? శారదయు క్తవయస్సు రాగానే వివాహంచేసి ఆచిన్న దంపతుల్ని ఆశీర్వదించటమే! ఆసంగతిమనం చెప్పనక్కరలేదు. రామారావు తనకాలేజీలో విద్యార్థి నే, సుగుణసంపత్తి కలవాణ్ణి ఏరిశారదనిచ్చి మహావైభవంతో వివాహం చేశాడు.

చిలకాగోరింకల్లాగా ఉన్న ఆచిన్న దంపతుల్ని చూసి ముచ్చటపడుతూ ఉంటాడు. శారద కలస్వనంలో ఋసుకుతూంటాడు రామారావు. తనకష్టాలన్నీ మరిపించే ఆ శారదకోకిల నినాదంలో లీనుడై పోతాడు......!

---

## మనవి.

"తెలుగుతల్లికి" ప్రచురణార్థము పంపబడు వ్యాసములు ప్రతి మాసము 10 వ తేదికి లోపుగ మాకు చేరవలెను. వ్యాసములు ఒకవైపు నే విడివిడి కాగితములమీద వ్రాసి పంపగోరెదము. వ్యాసములు తిరిగి కోరువారు తపాలా బిళ్ళలు పంపవలెను. ఉత్తరములు వ్రాయు వారలు, స్పష్టవిడివిడిగ అక్షరములు తెలియు నటుల వ్రాయవలెను. పత్రిక సక్రమముగ ప్రతి ఆంగ్ల మాసాదిన వెలువడు చుండును. పత్రిక వారము రోజులలో చేరనియెడల చందాదారులు మాకొక యుత్తరమును పోష్టువారికి ఒక యుత్తరము వ్రాయగలరు. మాకు వ్రాయునపుడు తమ అడ్రసు చందాసంఖ్య ...క్షరములలో వ్రాయవలెను.

తెలుగుతల్లి కార్యాలయము,
36. మ. బస్సెలాల్ పేట,
సికింద్రాబాద్-దక్కన్.

# "తెలుఁగుతల్లి" రాజపోషకులు.

1. శ్రీ శ్రీ మహారాణీసాహెబాగారు, గద్వాల సంస్థానము.
2. ,, ,, రాణిసాహెబాగారు, అమరచింత సంస్థానము.
3. ,, ,, రాజా మహాదేవరావు బహద్దరుగరు, వనపర్తి.
4. ,, ,, రాజా నాయని వేంకటరంగారావు, బహద్దరుగారు, [మునగాల
5. ,, ,, దండు ఆగయ్య పెంటయ్యగారు.
6. ,, ,, రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారు.
7. ,, ,, బూలుసాని దేవేంద్ర బి. ఏ. బి. ఎల్. వకీలు శికింద్రాబాద్

## పోషకులు

8. ,, ,, బెలిదె జగదీశ్వరయ్యగారు.
9. ,, ,, నంబూరి కృష్ణమూర్తిగారు.
10. ,, ,, ఉప్పల గౌరీశంకర్‌గారు.
11. ,, ,, భీమారపు రామచంద్రయ్యగారు.

## అభిమానులు

12. ,, ,, రాయకంటి హనుమయ్యగారు.
13. ,, ,, ప్రొద్దుటూరిగోపాలకృష్ణయ్యయర్రమల్లిలక్ష్మయ్యగారలు
14. ,, ,, దాచ బుచ్చివీరయ్య రామలింగంగారలు.
15. ,, ,, అమనబోలు యీరన్న విశ్వనాథంగారలు.
16. ,, ,, కాచం శివ్వయ్య కొడిత్యాల నరశిములుగారలు.
17. ,, ,, గుజ్జురు రాణోజి పండరినాథ్ గారలు.
18. ,, ,, గుండా ఆగయ్య అండ్ సన్సు గారలు.
19. ,, ,, తెలుకుంట వేంకటేశ్వరరావుగారు.

Hyderabad Reg No. 170

# తెలుగుతల్లి

సచిత్ర మాసపత్రిక.


| | | |
|---|---|---|
| ...పుటము ౧ | 1 ఫిబ్రివరి, 1940. | సంచికలు 3-౪ |


ఈ సంచికలో





గద్వాల సంస్థానాధీశ్వరులు.

...ము చందా 1-8-0 విడిసంచిక 0-2-0

# "తెలుఁగుతల్లి" రాజపోషకులు.

1. శ్రీ శ్రీ మహారాణీసాహెబాగారు, గద్వాల సంస్థానము.
2. ,, ,, రాణిసాహెబాగారు, అమరచింత సంస్థానము.
3. ,, ,, రాజా రామదేవరావు బహద్దరుగారు, వనపర్తి.
4. ,, ,, రాజా నాయని వేంకటరంగారావు, బహద్దరుగారు, [మునగాల
5. :, ,, దండు ఆగయ్య పెంటయ్యగారు.
6. ,, ,, రాజాబహద్దరు వేంకటరామారెడ్డిగారు.
7. ,, ,, బొలుసాని దేవేంద్ర బి. ఏ. బి. ఎల్. వకీలు శికింద్రాబాద్

## పోషకులు

8. ,, ,, బెలిదె జగదీశ్వరయ్యగారు.
9. ,, ,, నంబూరి కృష్ణమూర్తిగారు.
10. ,, ,, ఉప్పల గౌరీశంకర్ గారు.
11. ,, ,, భీమారపు రామచంద్రయ్యగారు.
12. ,, ,, బచ్చు వీరన్నగారు.

## అభిమానులు

13. ,, ,, రాయకంటి హనుమయ్యగారు.
14. ,, ,, ప్రొద్దుటూరిగోపాలకృష్ణయ్యయఱ్ఱమల్లిలక్ష్మయ్యగారలు
15. ,, ,, దాచ బుచ్చివీరయ్య రామలింగంగారలు.
16. ,, ,, అమనబోలు యీరన్న విశ్వనాథంగారలు.
17. ,, ,, కాచం శివ్వయ్య కొడిత్యాల సరశిములుగారలు.
18. ,, ,, గుజ్జురు రాణోజి పండరినాథ్ గారలు.
19. ,, ,, గుండా ఆగయ్య అండ్ సన్సు గారలు.
20. ,, ,, తెలుకుంట వేంకటేశ్వరరావుగారు.
21. ,, ,, అన్నం రత్నయ్యగారు.

# తెలుఁగుతల్లి

## సచిత్ర మాసపత్రిక.

సంపాదకురాలు:- రాచమళ్ళ సత్యవతీదేవి.

| సంపుటము ౨ | 1 ఫిబ్రవరి, 1941. | సంచికలు 3-౪ |
|---|---|---|

# శ్రీశ్రీశ్రీ రాజా రామకృష్ణభూపాలుని మూర్ధాభిషేకము.

---

శ్రీశ్రీశ్రీ మహారాణిగారు కడునేర్పుతోను, సామర్థ్యముతోను, ...ము గద్వాల సంస్థానమును పరిపాలించిరి. వీరి పరిపాలనా సామర్థ్యత, ప్రాచ్యకాలపు హిందూనారీమణుల సమర్థతను మనస్స్మరణకు దెచ్చుచున్నది. వీరు తమ సంస్థాన ప్రజలనేగాక, బహుదూరమునుంచి ఏతెంచిన సంస్థానాభిమానులను, హృదయపూర్వకముగ నాహ్వానించి, సన్మానించి, యాదరించుట సంస్థాన వైభవమును ఎన్నోరెట్లధికము జేయుచున్నది. వీరు యీపదునెనిమిది సంవత్సరములు గడుసమర్థతతో సంస్థానపాలనము ప్రజల సౌకర్యార్థము గొనసాగించుటయేగాక, తమసంస్థానమును కోర్టుఆఫ్‌వార్డ్సు వశముగానీయక, సంస్థానాభివృద్ధియే తమువిధిగా భావించి సంస్థానప్రజలకేగాక తదితరులకు సహితము విద్యయందేమి, సాహిత్యమందేమి, సహాయమొనర్చుట వారివిశాలహృదయము నందరకు వెల్లడిచేయుచున్నది. వీరు నవనాగరిక సౌకర్యములెన్నియో ప్రజల సౌకర్యార్థము స్థాపించియున్నారు వీటిలో పేర్కొనదగినవి స్త్రీలప్రసూతి వైద్యశాల, అనాధశరణాలయము, ప్రజల విద్యాభివృద్ధికై యున్నతపాఠశాల స్త్రీలవిద్యాపోషణకై ప్రత్యేకపాఠశాల మొదలయినవి ఇట్టివి ఎన్నియో దేశకాల పరిస్థితులబట్టి గద్వాల నగరమున స్థాపింపజేసియున్నారు. వీటినిబట్టి తమప్రజలయందు వారికిగల మాతృవాత్సల్యము విశదమగుచున్నది.

ఇటీవలనే శ్రీమహారాణిగారు మ. ఘ. వ. నిజాం ప్రభువుగారి ఫర్మానను ననుసరించి, తమపుత్రికల సంతానములో పెద్దవారును, శ్రీదోమకొండ రాజు, శ్రీరాజా సోమేశ్వరరావుగారి ప్రథమ పుత్రులునగు శ్రీరాజా రామకృష్ణభూపాల్ బహద్దరుగారిని దత్తతస్వీకరించి సంస్థానమునకు పట్టాభిషిక్తునిగ జేసిరి.

శ్రీశ్రీశ్రీ రాజా కృష్ణరావు భూపాల్ బహద్దరుగారు, సింహాసనారూఢులైన తదుపరి హిందూదేశ సార్వభౌములగు శ్రీశ్రీజార్జి చక్రవర్తిగారికిని, హైదరాబాదు రాష్ట్రపాలకులగు మ. ఘ. వ. నిజాం ప్రభువుగారికిని తమ యభివందనముల వెలిబుచ్చుచు, వారివారి యాయురారోగ్యైశ్వర్యముల గోరుచు క్లుప్తముగ నుపన్యసించిరి. వీరి పరిపాలనము మనకు శ్రీరామరాజ్య పరిపాలము స్మరణకు దెచ్చుననుటలో సందియమొంతమాత్రము లేదు

"తండ్రి క్రియ రామచంద్రుడు, తండ్రుల మరపించు ప్రజలతా రక్షింపన్,
తండ్రుల నందఱు మరచిరి, తండ్రిగదా రామచంద్రు ధరణీభుజుడనుచున్."

అనునట్లు శ్రీశ్రీరాజాకృష్ణరామ భూపాల్ బహద్దరుగారి పరిపాలన సర్వజనసమ్మతమై, ప్రజల సౌఖ్యదాయకంబై యుండగలదు.

శ్రీ దోమకొండ రాజాగారిపుత్రుని దత్తతగావించుటచే గద్వాల సంస్థానమునకు దోమకొండ సంస్థాన మన్నివిధముల దోడునీడైయుండ గలదు. శ్రీదోమకొండ రాజాగారగు శ్రీ రాజా సోమేశ్వరరావు బహద్దరుగారు తమ సంస్థానక్షేమము నేగాక, గద్వాల సంస్థానక్షేమమున్నకై తమ సహజసామర్థ్యముచే పాటుపడి యుభయ సంస్థానముల యభివృద్ధికై శక్తివంచనలేక కృషిసలిపి తత్సంస్థానముల నుచ్ఛదశకు దెత్తురనుట నతిశయోక్తిగాజాలదు, శ్రీవారి పితామహులగు స్వర్గీయ రాజా రాజేశ్వరరావు బహద్దరువారు ఇట్టి సమయమున లేనందుకు యుభయ సంస్థానప్రజలు కించిత్ చింతిల్లుచున్నారు.

సర్వోదయామయుడగు భగవంతుడు వీరిరాజ్యము చిరస్థాయిగా వర్ధిల్లునటుల బ్రోచుగాక.

(ఎస్. శ్యామరావు)

## రంగవల్లికలు



విప్పర్తి విశ్వేశ్వరావు బి. ఏ.,

★

కనుగనరానిచీకటి, వికారముగా నోడిపెట్టుశీతలం
బున, నొక చిన్నలాంతరుకునుందు, ప్రకాశములేని మెరవె
ల్గున, విసువన్నదే మెరుగకుండగ, వంచిననడ్డినెత్తకా
మొనగలవేణికేరచన ముద్దుగనేరు పుచుంటిబాలికా?

తలచినదృశ్యముల్ గనుల దాండవమాడ బరాయిపిల్పులీ
నుల నులిగాలి రీతయిన నూసక, భావపరంపరల్ తనుం
తల దము ఆకృతుల్ నారయ దత్వరలేకవిశేఖరున్కనీ
సలలితబాహువల్లరులు స్థానములో కృతరంగవల్లికా!

బాలిక! యుష్మదీయకర పాలితరేఖల దాటనట్టియా
శాలలు కోటబుర్జులును సంస్కృత వ్యూహముల్ యుగాలవె
న్నాటివి భారతీయులకు గాంచినమాత్రమె వచ్చురీతి. యీ
వేళిట శైలిమార్చియిటు వింతగవ్రాసితె రాజకీయముల్.

అసమతరాగబుద్ధి నెలయంతముగా మునుపైనపాఠమో
జనహితమైన నేరుపున సాంతముగా నేఃగించినావ్రకా
ని సమయవీక్షణాగరిమనీ విమయాకసమందు వేగువా
ని సరిగజూడు నాట్యమదె! నేర్చెనుబో? మనరాజ్యతంత్రముల్.

ఆముత్యాల సరాలసారమున కాయూవర్ణముల్ నేర్చినీ
సామర్థ్యంబిటగూర్చి తీర్చితివియూశాసౌధముల్ మాకుబా
లా! మర్యాదల బూర్వవైభవము లీలామాత్రమే జాలుమా
కీమూర్ణాలవెలుంగు సుస్థిగతకాయిచ్చల్ సజీవాలుగన్.

ఆబలి చక్రవర్తిమనదా భరతావని పాలనంబుగై
కో బెజసౌఖ్యపెట్టు తనకోరికతీగలు సాగిపందర
ల్లన్, బలువర్ణపుష్పముల లక్ష్యము తావులజిమ్మభారతి
యూ! బలవంతుడైతి ముదమందగరమ్మని పిల్చునీడకన్.

లింతయుపాసనన్ బ్రకృతి నీవిధమిట్టుల గట్టినావు! కా
లాంతరమందు చంద్రుని నయూచితదీప్తిగ జేసినావు! ఆ
చేత ధనస్సుసాచ పరసేనలె? బాలిక! శాంతిమార్గసం
క్రాంతి సువర్ణశీర్షికల రంజిలజాటు స్వతంత్రపాలనన్.

ఈ పర్యాయము రంగవల్లికల మాయిచ్చల్ సగర్వంబుగా
మో పైనాట్యము చేయువారు కవియిమ్మాలించు శ్రీమూర్తులై
రూపవ్యాజము బాలికాజనిత సారూప్యాజిలానందగీ
తాపారాయణసేయ విశ్వమది తాత్పర్యంబునన్ జూడదే.

# అతిథులకు కొన్ని సలహాలు.

( నందగిరి ఇందిరాదేవి )

స్నేహితుల యిళ్ళకు అతిథులుగా వెళ్ళటం మనకందరికి తరచు అనుభవంలోనిదే అతిథులుగా వెళ్ళేవాళ్ళ దృష్టికి కొన్నివిషయాలు తేవ టానికి సాహసిస్తున్నాను.

మొట్టమొదట ఆహ్వానం రాగానే వెళ్ళదలచుకోనట్లయితే ఆ విషయం పిలిచినవాళ్ళకు తెలియ చెయ్యాలి. వెళ్లదలచుకొనికూడా ఆ సమయానికి ఏదయినా ఆటంకం కలిగితే సకారణంగా రాజాల మనకు క్షమాపణ వేడుతూ చెప్పిపంపాలి. లేకపోయిన మనసు కలసిన స్నేహితులయితే ఫరవాలేదు. కాని మనకళ్ళకు (పిలిచినవాళ్ళు) కనపడ కుండా ఆపోహ పడతారు. అంతేకాకుండ (Hosts) పిలిచినవాళ్ళనుని రీక్షలో ఉంచటం మంచిదికాదు.

వెళ్ళదలచుకున్నారా సరిగా సమయానికి వెళ్లటం నేర్చుకోవాలి. నాలుగు గంటలకంటె తిన్నగా ఏ ఏడింటికో లేక మునిగి పోయినట్టు పదింటికే రావటం నాగరకతకు లక్షణంకాదు, "ఆ" మగళ్ళకూ! పైన ఉన్నకోటు తగిలించుకొని బయలుదేరటానికి అనటం పరిపాట్లు చేసి, మగవాళ్ళయినా ఒక్క వంకెన ఉన్నకోటు మట్టుకు తగిలించు కొని బయలుదేరటం అనాగరికం అనపించు కుంటుంది. రోజూ ఆఫీసుకు వెళ్తూ వేసుకుపోయిన చెమటపట్టినకోటు లాంఛనంగా తగిలించు కోవటంకంటె అధమ పక్షంముఖం కడుక్కొని శుభ్రమయిన బట్టలు వేసు కోవటం మంచిది. ఇట్లా ఎక్కడికయినా వెళ్ళటానికని మహామంచి బట్టలు లేకపోయినా ఒక్కొక్కళ్ళకు రెండు జతలన్నా ఉంటాయికదా. ఉన్న వాటిల్లోనే శుభ్రంగా ఉంచుకోవాలి, ఇహ ఆడవాళ్ళు పెట్టెల్లో చీరలు తిరగవేయటంలోనే సమయం వ్యర్థపుచ్చక త్వరలో ముగించుకోవాలి.

బట్టలు వేసుకోనటంలో ఆడవాళ్ళయినా మగవాళ్ళయినా కంబట్టలు వేసుకొన్నప్పటికి అందరి కళ్ళను ఆకర్షించేటట్టు ఉండగూడదు. (Conspicuous) కొన్నిసార్లు మనడ్రెస్సు పిలుపుకు తగినట్టు లేకపోటం మూలాన అట్లా (Conspicuous) కనపడతాము అంటే మనయిళ్ళలో భోజనానికి పిలిచినప్పుడు సూటు యీవినింగుహాటు టక్కు టక్కు బూట్లతో (Table dining బల్లమీది భోజనానికి వచ్చినట్లు) రావటంకంటే మన పద్ధతిన తెల్లనిదోవతి, షర్టు, అలవాటుంటే అంగవస్త్రంతో రావటం ఎక్కువ సహజంగా ఉంటుంది. అట్లాగే ఎక్కడ కూర్చుంటే ఏం మాసిపోతుందో అనే తళతళలాడే బనారసు చీరకంటే సామాన్యపు చీర కొంచం నలిగినా పరవాలేనిది కట్టుకుంటే బాగుంటుంది.

అసలు బట్టల విలువ కట్టటంలోఉంది యూభైరూపాయల చీర కావచ్చు-నూరురూపాయల సూటు కావచ్చును. కాని చీరకు అంచులు ముడతపడి చింగులు నేల ఈడుస్తూ, కొంగు బుజం దాటకుండా కడ్తే దాని అందమే పోతుంది. అట్లాగే నూరురూపాయల సూటు అయినప్పటికీ గీజు లేకుండా ఇస్త్రీలేక సంచిలోదిగ వేసినట్టు మనిషి అందంలో దిబడితే అందం ఉండదు. అందుకని కట్టేవిధానంలో కొంత(fashion) గమనించాలి. ఆడవాళ్ళు పాయితాపాలు వేసుకొని దానిమీద కాళ్ళకు ఆభరణాలు సార్లకడియాలు సఫేదుకడియాలు తోడాలు పట్టగొలుసులు వేసి పంపుషూతొడిగితే ఎట్లా ఉంటుందో సూటుమీద రూమీ టోపీ షేర్వాని పైజామామీద హాటుపెట్టుకుంటే అట్లాగె ఉంటుంది. ఏడ్రెస్సుకు ఏదివాడాలో గమనించటం అవసరం అట్లా రావటం ఫాషను క్రిందికివస్తే ఫరవాలేదు. కాని ఫాషనును గమనించటంలోనూ పా...

Be not the fist by whom the new is tried
Nor yet the last to cast the old aside.

అన్నట్టు కొత్తరకం ఆరంభించటంలో మనమే ముందు కాకూడదు. లేక పాత ఫాషను విడనాడటానికి చివరవాళ్ళ మూ కాకూడదు. ఫాషనునుగమనించి ఎవరికేది బాగనిపిస్తే ఆవిధానం అవలంబించవచ్చు.

(ఏవ పేజీ చూడుడు)

# సరోజ



కోటీశ్వరరావు.

గంగాధర్రావు బాగా కలిగిన వాడు. భూము లేమి లేవు కాని, ఉన్న దంత బ్యాంకులో ఉంది. ఆయన మంచి ఆదా పరుడు. ఖర్చు ఆలోచించి చేసేది. అంటే ఖర్చుకు డబ్బుకు లంకెలాంటిది కాదు. పుట్టుకనుంచి మోటారు, బంగళా ఉన్నై.

రావు కొరత ఒకటి. పిల్లలు లేక పోవటమని; అందులో ఆడపిల్లలూ అంటే మహాముద్దు; ప్రేమ. ఆయన భార్య భాగ్యవతమ్మకూడ ఇటువంటి మనసుదే. కనుక ఇద్దరూ ఒక ఆడపిల్లను పెంచుకొందాం అనుకొన్నారు. అని ఒక బీద ఇంటిపిల్లను సరోజ అనే అమ్మాయను పెంచుకొన్నారు.

ఆడవాళ్ళకు మగవాళ్ళతో పాటు అన్ని విధాల పైకి రావటానికి అవకాశాలుండాలి; అందులో విద్య విషయంలో లోటు ఉండరాదు అని అనేవాళ్ళలో రావు ఒకడు. కనుక సరోజ విద్యావతి కావటానికి సావకాశం బాగా ఉంది. బడికి పోతుంది. ప్రతిఏడు ప్రతిక్లాసు తప్పకుండా పరీక్షఅయింది. తెలివి తేటలూ ఉన్నై బాగా చదివేదికూడాను. అట్లా బి. ఏ. క్లాసుకు వచ్చింది ఆక్లాసులో క్లాసు వచ్చింది. రావుకు అపరిమితమయిన సంతోషమయింది పిల్లలు లేరను కొన్నందుకు సరోజను పెంచు కొన్నందుకు ఆయనకు కొరత తీరింది.

"ఇహ పెండ్లి చేయాలి; సరోజ సుఖ్యంగా కాపురం చేస్తుంటాలి; అది చూసి ఆనందించాలి" అని రావుకు ఉద్దేశ్యం కలిగింది. "ఇంకా ఏన్నాళ్ళు; అమ్మాయి పెళ్ళి ఆలోచించండీ ఇట్లా ఎన్నాళ్ళుంచుకొంటె బాగుంటుందీ" అని ఒకమారు నాలుగుమార్లు కాదు అదేపనిగా భాగ్యవతమ్మ అనటం సాగించింది. సరె చూట్టంలేదా ఏమిటి; ఆ ఘడియరావద్దూ అని ఈయన అంటుండేది. ఈయన ఉద్దేశ్యం "సరోజకు మంచి సంబంధంచేయాలి, మనకు సరితూగాలి, ఆ సంబంధం; పిల్లవాడు M. A. దాకన్న చదివుండాలి. వాళ్ళ వాళ్ళంతా గవర్మెంటు ఉద్యోగాల్లో ఉండాలి; అని అందుకుచాలచోట్లకుతిరిగాడు; ఆలోచించాడు. నలుగురు స్నేహితులతో చెప్పాడు.

2

ఒకనాడు వాళ్ళమ్మతో అందిగదా సరోజ; "అమ్మా, నీవు చెప్పిందంతా బాగుంది. పిల్లవాడూ నాకూ నచ్చాలి అన్నిటికంటె పెళ్ళికిముందు ఇదేముఖ్యం, అవసరంకూడాను" తల్లిసరీగా ఈమాటలే తీసుకొనిపోయి తండ్రితో అంది. ఆయన; సరే; మనం ఆలోచించేదంతా సరోజమంచికే నా. అటువంటప్పుడు సరోజకు నచ్చదా ఏమిటి మనమాటు అన్నాడు.

ఇట్లాఅంటూనె పిల్లవానికోసం తిరుగుతున్నాడు; ఆలోచించుతున్నాడు. ఒకటుంటె ఒకటుండదాయె. అన్నికలసివచ్చినా ఎంతకట్నమయినా ఇవ్వటానికి తయారు. చివరకు ఒక సంబంధం కుదిరింది, పిల్లవా

డు ఎం. ఏ; మంచిసాంప్రదాయం. వాళ్ల నాన్న అన్నలు గవర్మెంటులో పెద్దఉద్యోగస్తులు. అదిగాక వాళ్లువస్తుదా భాగ్యవంతులుకూడాను. అంతా బాగుందనిరావుపోయినాడు. 10 వేలకట్నంతో శెటిలు_అనుకొన్నారు. మంచిరోజున, పిల్లవాడు వచ్చిచూసి ఈపిల్లనాకివ్వమే అన్నాడు. దానితో ఇహాలగ్నంఎప్పుడు అని ఆలోచించారు. 6 నెలలదాక పెండ్లివిషయం దలపెట్టకూడదన్నారు. కనుకఅప్పటికట్లా ఊరుకొన్నారు. కానిమనుముఖాయం, పండ్లుపసుపు పెట్టకపోయినా.

ఒకరోజురాత్రి భోజనాల తర్వాత రావుఅమ్మయ్యా అని కుర్చీలోకూర్చొని, సరోజా! అనిపిలిచి, రాంగానె సరోజా మీఅత్తవారు చాలభాగ్యవంతులు. అక్కడఎట్లా మెలుగుతావో మరి, అన్నాడు.

సరోజ. నాన్నా; దానికేంగాని. ఈసంబంధం మీకు నచ్చటం

రావు. నచ్చటానికా, అనుకొన్న వన్నీ బాగా ఉన్నాయి గనుక అదీగాక పిల్లవాడు ఒప్పుకొన్నాడు.

స. అయితేనాన్నా! పిల్లసరేఅందా.

రావు. అందా ఏమిటి (నవ్వి)ఒప్పుకొన్నానను సరిపోతుంది_అనూ.

సరోజ. ఇది చాలా బాగుంది.

రా. ఏం; ఆట్లా!

స. హానా, నాకీమనువు నచ్చదు. నాకిష్టంలేదు.

రా. ఎందుకనేమిటి. సంపదకుసంపద; చదువుకుచదువు; సాంప్రదాయానికి సాంప్రదాయం_ఇన్నియోచించి ఏర్పాటుచేస్తే, నీవుకొద్దిలో

నచ్చలేదూ, ఇష్టంలేదూ ...
ఎట్లా!

స. ఏంచేయాలినేను.

రా. ఏంచేయాల్నంటె, ఇష్ట...
మరి మంచిదైనప్పుడు.

స. నాన్నా, అదివావల్లకాదు.

రా. నీవల్ల కాకపోతే మాట్లాడక...
అవతలికిపో నాన్నా.(...
యించాడు)

సరోజ చిన్నముఖంచేసుకొని ...
తడిపెట్టుకుంటూ తనగదికితిరిగి పోయి...

పక్కగదిలో పనిచేసుకొంటు...
టూన్న భాగ్యవతమ్మ చటుక్కున...
ఏమిటండీ, అట్లా గదమాయించారు...
దానిమనసు బహుసుతిమెత్తంది. ...
గినట్లు మెల్లిగానచ్చ చెప్పాలిగాని...
కాస్త_అంటుండగా.

రావు. ఏంకాస్త, ఇదంతాదాని ...
కేనా

భా. కాని, అదేదానికినచ్చ ...
చిన్నపిల్ల.

రా, అయితే, ఈసంబంధంలో ...
ముంది చెప్పు. వాళ్లా భాగ్య...
లు; మనతోసరితూగేవాళ్లు...
వాడా బాగాచదువు కొన్న...
డు. సంసారమామంచిది. ...
న్నఏముండాలింకా. మన...
ఒకయ్య చేతుల్లోపెట్ట...
చదువు, సంపద,స్థితి, సాంప్ర...
యంచూడాలా సరే. నేను...
ని; నీవు తల్లివిగా; దానికి ...
యినా నచ్చ జెప్పి ఇష్ట...
పించు సద్దుబాయంగా ...

అంతట భాగ్యవతమ్మ సరోజదగ్గర (క్కు)పోయింది.

గదిలో సరోజముందు బల్లమీదచేతుల్లోముఖంపెట్టుకొని ఏడుస్తూకూర్చుంది. అంతలో తల్లివచ్చి; సరోజా! ఇటుచూడు.

స. ఊహూఁ

తల్లి. ఎందుకే, నామాటవిను.

స. ఎందుకూలేదులేవే; నీవుపో;

తల్లి. అట్లాగాదు, ఏంటినాకు చెప్పు.

స. నీవూనాన్నా ఒకటి. నామాటవినరు.

తల్లి. నేవింటాగా.

స. నీవుచెప్పవే; నా పెండ్లికినాయిష్టం కూడాఉండాలా!

తల్లి. అంతానీదేగా.

స. అంతాకైటిలు అని, నన్ను ఇష్టపడూ! అంటున్నారుమీరు. దిగమింగమంటున్నారు.

తల్లి. నాన్నఏదిచేసినా నీమంచికేగా; నాన్న అన్ని తెలిసినవారు నాన్న మాటలినగూడదూ.

స. అందుకే ఒకటి అంది.

త. కాదే; నీఉద్దేశ్యంఏంటే.

స. నాకా అబ్బాయి అసలు ఇష్టం లేదు.

త. అన్ని నిశ్చయించుకొంటిమీ, అన్ని విధాలమంచి సంబంధం. అట్లా అంటేఎట్లాగా. నాన్న గారికి కోపంవస్తుంది.

సరోజ. వచ్చిందికూడాను

త. చూశావా ఇహన్న ఇష్టం అనిఊరుకో

స. ఎన్నన్న చెప్పు! ముమ్మాటికి నాకిష్టంలేదు. అంటూ చటుక్కునలేచి అక్కడనుంచి పోయింది.

సరోజమనసు "నా పెండ్లికి నాకిష్టం లేదన్నమాట; అదేమంటే నాన్నను ఎదిరించటం; అపవాదు. వాదుఎండాకాలపు ఎండుగడ్డిలోమంట. పోనీనాన్న ఇష్టప్రకారం పోతా, నాఇష్టాన్ని, నాహృదయాన్ని అణచుకోవాలి, సురేశును మోసగించాలి, ఎండారినగుడిశ తగలేయాలి. వివాహాన్ని ప్రేమబంధమున ముడుచుటకాదు. ప్రేమమయమయినహృదయాన్ని గాలికివదలాలి. వెలివబ్బినవాసచినుకును దేవులాడాలి, ప్రేమవల్ల పెండ్లికాదు. పెండ్లితో ప్రేమ తెచ్చిపెట్టుకోవాల్నన్నమాట. సురేశుతో కాదన్నమాట నా పెండ్లి. ఈ ప్రేమఆర్పుకొని నాన్న మనిలో రాజేసుకోవాలి. అట్లానేచేయను. కాని నాన్నమనసుకష్టం అవదా! అన్నది.

సురేశు ఎం. ఏ; చాలబీదవాడు, తెలివయినవాడు; విశాలదృష్టి సూక్ష్మభావాలు; వినిర్మలహృదయం. చూస్తున్నాడుకాని ఎక్కడాఇంకా నౌకరిజతపడలా. అతనుసరోజ చిన్నప్పటినుండి ఆడు కొంటుండేది; చదువుకొంటుండేది. పెద్దక్లాసుల్లోసరోజ తెలియనివన్ని చెప్పించు కొంటూండేది అతనుబహుతరుచుగా సరోజబంగళాకువస్తుండేది. ఇట్లాఉండగా వాళ్లనడుమప్రేమఅంకురించి, చిగిర్చింది. కాని ఎవళ్లకూ ఇదిసంకోచానికైనా దొరికిందిగాదు.

కానిఅది ఇప్పుడుపొక్కవలసి వచ్చింది. తప్పదు. తల్లితోసరోజ సూచనగా అంది. ఈమనసుముఆమెకునచ్చిందే. ధనధాన్యాలు లేకపోయినా, బాగాచదువుంది. ఆదీగాకమనకున్న సంపదచాలదా మంచివాడు గుణవంతుడు, అనిఅనుకొంది భాగ్యవతమ్మ. ఈసంగతి మెల్లగాతండ్రితో అంది. [illegible] తెలుసుఅయినను, బాగా

యోచించాడు. ఏమయినాకుదుర్చుకొన్న మనుమే మనుమన్నాడు.

ఇట్లా కొన్నాళ్ళు నలిగింది. అయినవాళ్ళతో, పెద్దవాళ్ళతో, రావుసరోజకు చెప్పించాడు. మాప్పురాలా. ఈ సంగతంతా పాక్కింది. వాళ్ళు వీళ్ళు స్నేహితులు క్లబ్బులో ఏమిటండీఅన్నారు. రావుమనసుకు చాల కష్టమయింది, చాలనొచ్చుకొన్నాడు.

విద్యవల్లకలిగినదోషం అనుకొన్నాడు. సరోజను పిలిచి గట్టిగాచెప్పాడు:

'సరోజా, పరిస్థితులన్నీ నీకు బాగా తెలియవు, నీవు ఆలోచించటంలా. ఇకనైనా రభసఎందుకు. నామాటవిను.

సరోజ. నీమాటవినటంలా నాన్నా. నేకోరేది, బతిమిలాడేది_ నా పెండ్లికి నాఇష్టంకూడాఉండాల్నని.

రావు. నీపట్టువిడవ్వా.

స. నాన్నా, చిన్నదాన్ని గారాబంతో పెద్దదాన్నిచేశావు. విద్యచెప్పించావు. కానిఇక్కడ

రా. సరోజా, నా మనసు ముక్కలై పోవాల్సన్నమాట.

స. నాన్నా, నా వివాహంవల్ల అదివద్దు. నాజీవితానికి ఆయువుపట్టుదగ్గర అదివద్దు. నామంగళసూత్రం ప్రకాశించటానికి నీ హృదయం ఆవశ్యకం.

రా. కాని, నీవు, ఇప్పుడు నావశం తప్పింది. నీపెండ్లి నీసంగతిఅంతా నీఇష్టం. నీవేచూసుకోవాలి నాజోక్యంలేదు. సరోజ మెల్లగాలోపలికి పోయింది.

ఆవిధంగా రావుగారింట శాంతి ప్రబలింది.

సరోజ సేవాశ్రమంలో చేరింది; తల్లిదండ్రుల యిష్టంమీదనే. ఇట్లా అయిపోయెనే అని తల్లిచాల దుఃఖించింది. ఇట్లాగా కుదుటబడటం అని తండ్రి చా[illegible]చారించాడు.

3

సరోజ. సేవాశ్రమం: ఆంధ్రలో ఒకపెద్ద. ఆయన దేశసేవమీద మానవసేవమీద ఉపన్యసించుతుంటాడు. విద్యార్థిత్యజీవితం పరిశీలించుతూంటాడు. విద్యార్థుల్లో మగ ఆడ ఇద్దరూఉన్నారు. అందులో బాగుగా చదువుకున్నవాళ్ళు కూడా_ పండితులు, డాక్టర్లు, B.A.లు M.A.లు పెద్దపెద్దవాళ్ళు సేవాదరణతో అక్కడకు కొంతమంది వచ్చారు. విద్యార్థులు ఉదయాన్నలేవాలి; స్నానసంధ్యావన చేయాలి; ఉపన్యాసాల వినాలి. 10 [illegible] 11 గం. లకు భోజనాలు; సాయంత్రం పరిసర గ్రామాలకు పోవటం; గ్రామస్తులకు చదవ రాయ నేర్పటం; ఆరోగ్యవిధానాలు జూపటం; బజార్లు ఊడవటం; రోగులకు సేవజేయటం; బీదలకు పొట్టకూటి విద్యలు నేర్పటం. ఇట్లాంటి ఆశ్రమంలో సరోజ ఉంది. ఆయాపనుల నిర్వర్తించుటలో [illegible] కథ చాలవరకు మర్చిపోతూండేది. [illegible]మ, సురేశుమీద ప్రేమ, మరవాలనుకొం[illegible]

ఇట్లాచాలారోజులు గడచినై [illegible]టికిపోయివస్తూనేఉంది. అంతాఎప్పటి[illegible]నేసాగుతూంది చింతించుచు క్షమార్పణ[illegible]తో రావు శిథిలమైన మనుమువదలు[illegible]న్నాడు.

సరోజహృదయం చాలదుర్బలం[illegible] అయింది. శరీరంగూడ కాలచిక్కిపోయి[illegible]

...కుతెం డ్రినిఆయాస పెట్టినట్లయింది. ఇటు
...హృదయాన్ని అణచిపెట్టుకొన్నట్లయిం
...నిద్రలేనిరాత్రిళ్లెన్నో ఉన్నై కంటినీటి
...లో దువ్వాళ్లెన్నోమార్లు ముద్దగాతడప
...అవుతూంది. ఆశ్రమంపెద్ద సరోజను
...శాస్త్రగా పరిశీలించుతూవున్నాడు.
...హృదయం ఆవేదన భరితంగాఉందని
...కున్నాడు. ఒకరాత్రివచ్చి బిడ్డానిద్ర
...లి ఆరోగ్యంచెడును.

... తండ్రీ నిద్రరావటంలా.

... బిడ్డా శాంతినిబొందాలిమరి, ఆ గాలి; నిద్రపోవాలి. రాత్రిచీకటి పొద్దున మాసిపోతుంది వెలుగురా మానదు. ప్రకృతిలోమార్పుఅగత్యం.

ఇటువంటి అశాంతిరాత్రిళ్లెన్నో స...రోజు దిగమింగినై; చాలబలహీనమ...ది. చివరకు జబ్బుపడింది సీరియస్ దా...వచ్చింది. తల్లిదండ్రులేకాదు ఆశ్రమవా...అంతా ప్రాణాలు అరచేతుల్లో పెట్టు...కున్నారు.

...లండులో Borrister-at-Law పూ...ర్తిగానే దేశానికిసోమనాధరావు తిరిగివచ్చాడు. ఈ విషయం తెలిసిచప్పున ఆశ్రమానికి వచ్చాడు సరోజనుచూడంగానేదుఃఖంఆగలా. భాగ్యవతమ్మ ఆయిన అక్క జరిగినదంతా ముక్కలు ముక్కలు చేర్చినట్లు చెప్పింది సరోజమేనమామ అంటెకళ్ళు తెరచింది. చిన్నప్పటినుండి మేనకోడల్ను తనబిడ్డకంటె ఎక్కువప్రేమించేవాడు సరోజకు మామఅంటె ప్రాణాలులేచివచ్చినై.

సోమనాధరావు బావతో చాలసేపుమాట్లాడాడు సురేశుమంచి ప్రవర్తనకలవాడు. ఎం. ఏ. ఉద్యోగం ఇవ్వాళ కాకపోతే రేపన్న దొరుకుతుంది. ఆ స్తిఅంటేనా నాకున్నదానిలో సగంఇస్తాను బావా మాటవిను సరోజనుఒద్దనవేయి కరుగుతూకరుగుతూఉన్న రావుహృదయం మాటలకే కరిగి బయటకుప్రవహించింది కంటనీరుతుడుచుకుంటూ సరోజ వంకకుబోయి తల్లీ! నీప్రాణమేనా ప్రాణం నీఇష్టమే నాఇష్టం.

స, (మెల్లగా)నాన్నా, నాఇష్టానికినీ తృప్తిఒప్పుదలచే కూరింది..

(46వ పేజీ తరువాయి)

సాధ్యమైనంతమట్టుకు డ్రెస్సు (సింపిలు) సామాన్యంగా ఉండటం మంచిది (gaudyగా) చిక్కని రంగులు కొట్టవచ్చేటట్లు ఉండేవి వదలిపెట్టి భాగుంటుంది.

మొత్తంమీద సమయానుకూలంగా శుభ్రంగా చక్కగాడ్రెస్సు చేసుకోవాలి కాని "నన్నుచూడూ నాబట్టలను చూడూ" అన్నట్లు నాటకంలో వేషంలాగ తయారు కాకూడదు.

నగల విషయంలో ఒక్కమాట నగలు పెట్టుకోవాల్సిందే కాని సామాన్యంగా ఉన్నవాళ్ళయినప్పటికీ అన్నీ ఒక్కసారే ప్రదర్శనార్థం. దిగ చేసుకొని టంకంటె వెళ్ళినప్పుడల్లా ఒకరకం వేసుకుంటే మోత తప్పుతుంది. ...త్తగా ఉంటుంది.

## ★ భాతాఖానీ

★ అసాధ్యప్ప

అమాత్యశేఖరులైన అక్బర్ హైదరీగారు అవకాశము దొరికి నప్పుడల్లా అరవిందాశ్రమానికి వెళ్ళుతూ ఉంటారే, అర్థోపార్జనాసక్తి చేతనా? ఆధ్యాత్మిక సంసిద్ధికోరకా? లేక ఆనందోపలబ్ధి నిమిత్తమా? అని అనేకులు అనేకవిధాల అవకతవకగా అనుకోటం మొదలు పెట్టారు. పాపం ఆంతర్యం వారికేం అర్థమౌతుంది! ఏది ఏట్లున్నా ఆయానందాన్ని వారొక్కరే స్వార్థపరులై అనుభవించకపోతే తదితరులకుకూడా కలిగేటట్టు ప్రబోధిస్తే బాగుంటుందేమో!

---

గోచిపాతరాయుడైన గాంధీమహాత్ముడు సద్యాగ్రహసమరానికి సన్నద్ధుడై వినోభా భావేగారితో ఉపక్రమింపగానే 'ఉడుత ఊపులకు చింతకాయలు రాలుతవా' అని పరిహాసంచేసిన పండిత శిఖామణులందరు నేడు ప్రవాహరూపంగా పరిణమించిన ఉద్యమ ప్రభావాన్నిచూచి ఆశ్చర్య చకితులై పోతున్నారు? ఏపుట్టలో ఏపాముందో అని ఎవరి కెరుక? మహాత్ములు సంకల్పసిద్ధులుగదా! అందుకనే "క్రియాసిద్ధి స్సత్త్వేభవతి మహతాంనోపకరణే" అని అన్నాడు కవి.

---

నేడు మనదేశంలో ఆంధ్రవాల్మీకులు, వ్యాసులు, కాళిదాసులు, షేక్సుపియర్లు, టెన్నిసనులు, దన్వంతర్లు చరిత్రచతురాననులు, వాగ్గేయ కారకులు, హరికథా పితామహులు మున్నగు వారెందరో బయలుదేరి స్వతంత్ర రచనలు, అనువాదాలు శాస్త్రాది గ్రంథాలు నవలలు, నాటకాలు, పరశ్శతాలుగా రచించి తమ భాషాభిమానాన్ని వెలువరిస్తున్నారు. వాఙ్మయాభివృద్ధియో, భాషాసేవయో లేక ఉదరపోషణమో ఏదో ఒకటి వారిలక్ష్యము అయి ఉండాలి. ఏదైంది ఆపరమేశునకే తెలియాలి. ఏదైతే ఏమి ఈ అల్పకాలోత్పన్నమైన అభివృద్ధిచూచి, ఇది భాషావధూటికి బలుపావాపా అనే ప్రశ్న ఉత్పన్నమైతే ఏం సమాధానం చెప్పాలో నిజంగా కష్టమే. ఎందుచేతనంటే నిజమాడితే నిష్ఠూరమెక్కువగదా!

# ఆహారమునందలి మూలద్రవ్యములు

## 2—ధాతుపోషక లవణములు (సేంద్రియ లవణములు)

ఆహారమునందలి మూలద్రవ్యములలో ధాతుపోషకలవణములు మిక్కిలి ప్రధాన మైనవి. భవననిర్మాణమునకు రాయి ఏవిధముగ నుపయోగించుచున్నదో, శరీరనిర్మాణమున కవసరముగ ధాతుపోషకలవణము లుపయోగపడుచున్నవి. ఇదిరక్తమును, మాంసమును, ఎముకలను, నరములను, చర్మమును, వెంద్రుకలను, మెదటినిపోషించును. బుద్ధిబలమునిచ్చును. జీర్ణశక్తినివెంపొందించును. శరీరమునకు నిరుపయోగమైన పదార్థములను బహిష్కరించి వేయును. పిండి, క్రొవ్వు, మాంసకృత్తులుశరీరమునందరగిన భాగములనుపూర్తిచేసి శక్తినిచ్చు ను ప్రధానమైన మేడిమినోసంగును జీవాణువులు శరీరమందు జీవపదార్థమునువెంపొదించి ఆరోగ్యమునిచ్చును రోగసంబంధమైనసూక్ష్మ జీవులచేరనీయవు. వ్యాధులనుండి రక్షించును.

ఈలవణములు 12 రకములు. రక్తమాంసాదిధాతువులను పోషించుటకేర్పడినవి గాన, వీనికి ధాతుపోషక లవణములనిపేరు. శరీరమందు ఏధాతువుక్షీణించునో, తత్సంబంధమగు లవణము లోపించినదనియర్థము. అందువలన ఔషధరూపమున, ఆ లోపించిన లవణమును పూర్తిచేయుటకు వైద్యులు ప్రయత్నించుచున్నారు. హోమోపతివైద్యులు ద్వాదశలవణముల సహాయముతో లోపించినధాతువును పూర్తిచేయుచున్నారు.

### ధాతుపోషకలవణములు.

(1) ఐరన్—దీనికిఇనుము లేక లోహమనియర్థము లవణములలోనిది మిక్కిలిప్రధానమైనది. ఈలోహము శరీరమందులోపించినపుడు చాలినంతప్రాణవాయురక్తములోనికి ఆకర్షింపబడదు. ప్రాణవాయువు దేహమునందలి దహనక్రియకుచాల అవసరమైయున్నది గాన, ఇదిలోపించుటవలన దేహమునందుచేరు మాలిన్యముదహింప బడకయు, వెలువరింప బడక యు నిలిచిపోవును. అందుచే ఆకలిమందగించును. లోహము లేనట్టిపదార్థములను భుజించు టవలన శరీరమందు ప్రాణవాయువు లోపించిరక్తక్షయము, పాండు రోగములు జనించుచున్నవి.

(2) సోడియం—బొగ్గుదహనమగునపుడు విషవాయువులుత్పత్తియగునట్లు, మన శరీరమందాహారపదార్థములు జీర్ణమగునపుడు అంగారక్షారమను విషవాయువు జనించుచున్నది. ఇదిశరీరము నావరించెనేని ప్రాణవాయువును చేరనీయదు ఆందువలనతక్షణమే ప్రాణములకు ప్రమాదము కలుగును కనుకదీనిని బహిష్కరించుటకు సోడియంఅను లవణముచాల ముఖ్యమైయున్నది. దీనిలోపమువలన అంగారక్షారము శరీరమునావరించి, అకలిలేమి, ఆహారము జీర్ణముకాకుండుట. (బరువుతగ్గుట) కాళ్లుచేతులు చల్లగనుండుట, రక్తముక్షీణించుట, చర్మము కాంతిహీనమగుట, నంజువ్రణములు మొదలగు వ్యాధులుంత్పత్తియగుచున్నవి.

(3) లైం-దీనికి సున్నమని యర్థము. మానవదేహమందీలవణమునాల్గింట మూడుపాళ్ళు గనులుండును. ఎముకలన్నియు "లైం" అనుపదార్థముతో నిర్మింపబడియున్నది. మనము సాధారణముగ ఎముకలలోసున్నము లేకుండలేన్నము అనియనుచుందుము. శరీరమందీయనేక విశేషభాగముండుటచే, వీనినిపోషించుటకీ లవణము చాలముఖ్యము. అస్వాభావిక జీవనము వలన సున్నములోపించి, ఎముకలసంబంధమగు వ్యాధులుకలుగుచున్నవి ఎముకలు మెత్తబడి పటుత్వములేక వంగిపోవును. గట్టిపనులుచేయజాలరు దీనికి రిక్కెట్సు అనిపేరు. దీనిలోపమువలన దంతములూడిపోవును.

(4) పొటాషియం- లైం అనులవణమెట్లు ఎముకలను పోషించుచున్నదో, అట్లే గునపొటాషియంకండరములను పోషించుచున్నది. ఇదిలోపించినచో కండరపటుత్వము తగ్గిపోవును.

(5) మాగ్నీషియం- ఇదినాడీమండలమును పోషించును. ధాతుశక్తి నివృద్ధిచేయును. దీనిలోపమువలన పక్షవాతము, మూర్ఛ, హిస్టీరియ మొదలగునాడీ వ్యాధులుకలుగును.

(6) ఫాస్ఫరస్- ఇదివెండ్రుకలను పోషించును. ఇదిశరీరమందు లోపించినప్పుడు వెండ్రుకలూడి బట్టతలయగును త్వరితముగ వెండ్రుకలు నెరియును.

(7) సల్ఫర్-దీనికి గంధకమని పేరు ఇదిచర్మమును పోషించి శుభ్రముగనుంచును. ఇదిలోపించినపుడు చర్మవ్యాధు లంకురించును.

(8) అయొడిక్- గ్రింథులనుపోషించును.

(9) మాంగనీస్- మెదటినిపోషించి ఆలోచనజ్ఞాపకశక్తులను వృద్ధిచేయును.

(10) సిలికాక్- శరీరమునకు స్థితస్థాపక స్వభావమును పెంపొందించును.

(11) ఫ్లోరిక్- వ్యాదులనుండి కాపాడును.

(12) క్లోరిక్- శరీరమును శుభ్రముగనుంచును.

పైనవివరించినద్వాదశ లవణములు (ధాతుపోషక లవణములు) స్వాభావికములనియు ఖనిజములనియు రెండురకములు. వృక్షములు భూగర్భమునుండియు, జలమునుండియు, వాయువునుండియు, లోహదులను ఆకర్షించి, ఫలాదులలోను, కాయగూరలలోను, ఆకులలోను స్వాభావికమార్గమున ఇమిడ్చి మనుష్యుల కొసంగుచున్నవి. మనముభుజించుఫలాదులయందును, కాయగూరలయందును, ఆకుకూరలయందును, పాలయందును, వివిధధాన్యములయందును యీస్వాభావిక లవణములుండును. భోజనపదార్థములను వండుట, విసరుట, కొట్టుట, గానుగాడుట, ఊరబెట్టుట మొదలగు వ్యాపారములవలన స్వాభావికలవణములు నశించుచున్నవి. అందువలన వివిధధాతువులుపోషింపబడక ఏలవణములోపించునో తత్సంబంధమగురోగములు కలుగుచున్నవి. అందువలన రోగములువచ్చినపుడు ధాతువులను పోషించుటకు ఔషధములవసరమని వైద్యులుచెప్పెదరు. మనముభుజించు ఆహారపదార్థములందీ స్వాభావికలవణము లున్నవని తెలియక, గనులయందు దొరకుఇనుము, సున్నము, గంధకము పాదరసము మొదలగు లోహదులనుఔషధములని ఉపయోగించుచున్నారు. ఇవినిర్జీవములైనవి, అస్వాభావికములైనవి. ఇవిరక్తములోకలియక వేరుగనిలిచిపోవును. జీవశక్తి నిలగ్గించి

విరుద్ధములైన నూతనరోగముల నుత్పత్తిచేయుచున్నవి. పదార్థవస్తుశాస్త్రమును పరిశీలన
చేసి, యీలోహాదులస్వభావమును గమనింతుమేని, అవియన్నియు, విషములనియు, నిర్జీ
వములనియు, నిరుపయోగములనియు తెలియగలదు.
పదార్థములను వండుట, విసరుట మొదలగు వ్యాపారములవలన స్వాభావిక లవణములు
నశించుటచే, అపక్వపదార్థములవలె పక్వపదార్థములు రుచించుటలేదు. అందుచే వండిన
పదార్థములయందు అస్వాభావికమగు ఖనిజలవణము సముద్రపు నీటినుండితయారు చేయబడిన
ఉప్పుగడ్డలలోవాడుకొను లవణమునుచేర్చి తినుచున్నాము. కాని యీఖనిజలవణము శరీర
మున కుపయోగపడక, మూత్రము వెంబడి, స్వేదము వెంబడి బహిష్కరింపబడుచున్నది. ప
ళ్ళకాయలయందును, దుంపయందును స్వాభావిక లవణములున్నవనుటకు దృష్టాంతము, ప
చ్చిదోసకాయ, పచ్చిపుచ్చ, చిరుగడమ (గెనుసుగడ్డ) బీర, బెండ, గుమ్మడి మొదలగు
వానిని స్వాభావిక స్థితియందు. (అనగాపచ్చివాటిని) భుజింపగలముగాని, వండినతరువాత
లవణమును చేర్చక భుజింపజాలము దీనిని బట్టివండుటవలన సహజ లవణములునశించు
చున్నవని తెలియుచున్నది.
వండుటవలన స్వాభావిక లవణములు నశించుటచేతను పదార్థము అస్వాభావికరుచి బోవు
టచేతను ఖనిజలవణము నుపయోగించుచున్నాము. దీనివలనదాహమధికముగ కలుగుచున్నది.
ఏమనగా ఇది శరీరమునకు నిరుపయోగమైన పదార్థమగుటచే, దానినివెంటనే బహిష్క
రించుటకు శరీరము అధికమగునీటినికోరును. అందువలనమనము విశేషముగదాహము పుచ్చు
కొనెదము, ఈ ఖనిజలవణము మూత్రము వెంటను, స్వేదము వెంటను బహిష్కరింపబడుచుం
డును, మిక్కిలి సున్నితములగు మూత్రపిండములకు దీనివలన నధికమగుశ్రమగలిగి మూత్ర
పిండ మూత్రాశయవ్యాధులు కలుగుచున్నవి. మూత్రపిండములు దీనినిబహిష్కరించలేని
స్థితులందు రక్తమువడిగా ప్రవహించుటకు వీలులేని దిగువభాగములందు (పాదములందు)
చేరి శరీరములావెక్కును. బరువెక్కును. దీనికినంజువ్యాధిఅనిపేరు. అందువలన నంజు
వ్యాధులలో లవణరహితమైనభోజనము పెట్టించెదరు. మధుమేహము అతిమూత్రము, స్వే
దధాతుమేహము, సవామేహము, నంజు, రక్తపుపోటు, చర్మవ్యాధులలోను లవణముచేర్చ
నిపదార్థముల నిచ్చుటవలన మిక్కిలిసులభముగ నివారణయగుచున్నవి. అధికలవణమును సే
వించుటవలన దాహమధికమై త్రాగుడుకుదారి చూపుచున్నది.
ఈ ఖనిజలవణము రక్తనాళముల యొక్క స్థితస్థాపక స్వభావమును తగ్గించి కఠినపర
చును. అందుచేరక్తము స్వాభావిక మార్గమునప్రవహింప జాలకరక్తపుపోటు వ్యాధికలుగు
చున్నది. కాబట్టి ఆరోగ్యదీర్ఘాయువులుగోరు ప్రతిమానవుడు పైనవివరించిన ధాతుపోషక
లవణములను స్వాభావికమార్గమున సేవించుటవపరము పండ్లను, కాయలను, దుంపలను,
స్వాభావికస్థితియందు అనగాపచ్చివానిని ప్రతినిత్యముకొన్నియైనను తినుచుండవలెను.
ఫలాదులలో యేలవణమెక్కువగలదను విచక్షణమనక్కరలేదు. భగవంతుడు ఒక్కొ
క్క ఋతువులో కొన్నిరకములైన ఫలాదులను కాయలను, ప్రసాదించుచున్నాడు.
కాబట్టి ఏఋతువునందుదొరకు ఫలములను ఆఋతువునందుసమృద్ధిగ తినుచుండినచో దీర్ఘా
యురారోగ్యములతో సుఖింపగలరు.

# వాయు విమానములు

(వెనుకసంచిక తరువాయి)

నెల్లూరి రామమూర్తి (సాధారణ

పాల్మానుపోటి జరిగిన కొన్నాళ్ళ తరువాత, "వాల్టరు వెల్మాను" అను అమెరికా దేశీయుడు అట్లాంటి మహాసముద్రమును వాయువిమానములో దాట ప్రయత్నించెను. ఇది కేవలము మోసమని అనేకులు భావించిరి. కాని వెల్మానుమాత్రము అనేక పరిశోధనలు చేయుచు 'Cigar Shaped Airohip' అను దానిని తయారుచేసెను. దీనిలో ఒక లైఫుబోటు, వైర్ లెస్ పరికరములు, "ఈక్వాలిబేటారు" అను నూతన యంత్రము, మొదలగునవి అమర్చబడియుండెను. ఈయంత్రము "ఏరుషిప్పు"ను నీటిపైన కొంత పైకిమాత్రమే ఎగురనిచ్చును. ఎప్పుడైనను గాలి ఎక్కువగా వీచినచో, ఈగాలిపడవను కావలసినంత ఎగురవేసు కొనుటయేకాక, చాలవరకు పైకెగిరినచో ఈయంత్ర సహాయమువలన క్రిందికి తీసుకొని రావచ్చును.

అక్టోబరు 15, 1940 సం'లో వెల్మాను అట్లాంటికు మహాసముద్రముపై కెగిరి, దాట ప్రయత్నించెను. వెల్మానునకు తన పడవపై చాలవరకు నమ్మకముండినది. కాని బయలుదేరిన గంటసేపటికి ఇంజనెక్కువ వేడిగా జొచ్చెను చానిలో కొంతధూళిపడినట్లు తెలిసెను. సూర్యుని వేడిమిచే ఏరుషిప్పులోని "గ్యాసు" వేడిమెక్కువగా జొచ్చెను. మరికొంతసేపటికి ఏరుషిప్పు అటుయిటు ఊగసాగినది. రాత్రి ఎనిమిది గంటలవరకు వెల్మాను తన సహచరులతో రెండువందల ఏభైమైళ్ళు వెళ్ళ గలిగెను. రాత్రిగాజొచ్చినకొలది వారికష్టములు మరింతగా జొచ్చినవి. విమానము పూర్తిగా చెడిపోయెను. ఆలసించిన ప్రాణములు గోల్పోవుస్థితిలో నుండిరి. అదృష్టవశాత్తు దగ్గరగా ఒకస్టీమరు 'Trent' పోవుచుండెను, అంతట వారు దానికి సంజ్ఞలు చేసిరి. అప్పుడు

యను యూస్టీమరు అందరిని రక్షించ గలిగినది. "ఏక్ షిప్పు" మాత్రము ...కిపోవుచు ఆకాశమధ్యములో మటుమాయమై పోయెను.

మూడు సంవత్సరముల తరువాత లండనువార్తా పత్రికలో నొక ...మానము ప్రకటించబడెను. ఎవ్వరైనను 'న్యూఫౌండులాండు' ...కి బ్రిటీషుదీవులకు వాయుసంచారముచేసి అట్లాంటికు మహాసముద్ర ...దాటి రాగలిగిన పది వేలుపౌండ్లు ఇవ్వబడునని కలదు. ఈలోపుగా ...14 సం॥ ములో ప్రపంచమహా సంగ్రామము మొదలయ్యెను.

యుద్ధప్రారంభములో బ్రిటనువద్ద వాయువిమానము లెక్కువగా ...డినవి. 1500 మిలిటరీ విమానములు, 500 సివిలు విమానములు ...నుకును, 400 ప్రయివేటు విమానములు, 1000 గవర్నమెంటు ...మానములు 40 ఏరుషిప్పులు, 14 జపెలినులు జర్మనీకును కలవు. ...నీ ఫ్రాంసులకన్న బ్రిటనుకే వాయువిమానబలము చాలతక్కువగా ...డినది. అందుచేత నూతన పరిశోధనలు జరుపవలసిన ఆవశ్యకత ...డెను.

1914 అక్టోబరు 23,26, తేదీలలో కొన్ని బ్రిటీషు విమానములు ...సెన్సు' చేసి వచ్చినవి. ఆగష్టు 29 నాడు 'కాంపీను' నగరముపై ...ను విమానములు బాంబులవర్షముగురిపించి సర్వనాశన మొనర్చెను. ...నెలల తరువాత దీనికి ప్రతిక్రియగా మూడు బ్రిటిషు విమాన ...లు 'ఫ్రీడురిచుషాఫెను' నగరములోనున్న 'జపెలినువర్క్సు'పై ...బులువేయ ప్రయత్నించినవి. జర్మను జలాంగ్గాముల విడిదిచోటును ...షు 'స్పాటింగ్ ప్లేను' కనుగొని కాగా; వాటిలో 93 వరకు ముంచ ...ను. యుద్ధము తీవ్రరూపము దాల్చినకొలది; ఇరుప్రక్కలవారు ...మానదళాభివృద్ధికై ప్రయత్నించుచుండిరి. 1912 సం॥లో 'రాయలు ...యింగు కోరు' ఏర్పాటుచబడెను. నాడు 7000 మాత్రమే పనిచేయు ...డిరి. యుద్ధము ముగియగానే మూడులక్షల పరిమితికి మారెను. ...మున్సు'వద్ద బ్రిటిషు సైన్యములు వెనకబడినపుడు, బ్రిటీషు రికన

సెన్సు' విమానమొకటి, జర్మను జనరలు 'క్లక్కు' యొక్క సైన్యము కేంద్రస్థానమును కనుగొని తెలయబరచెను. ఈవార్తవల్ల బ్రిటీషు వారికి కొంత విజయములు చేకూరినదని చెప్పుట నిర్వివాదాంశము. లేకున్నచో జనరలు క్లక్కు సైన్యములు బ్రిటీషుసైన్యముల ముట్టడించి చెండాడేడివి. మొట్టమొదట పదునెనిమిది నెలలవరకు జర్మనులవారు విమానబల మెక్కునగానుండినది. అటుతరువాత బ్రిటను జర్మనీపై పైచేయి వేసినది.

అమెరికా దేశపు సైన్యాధికారులకు, దేశీయులకు ఈవిమాన యంత్రములపై మోజు పుట్టినది. వారును కొన్ని పోటీలు గెలువవలెనని ఊహించిరి. 'న్యూఫౌండులాండు' నుండి రెండువేల రెండు వందలమైళ్ళ దూరములోనున్న లిస్బనుకు; అజోర్సుద్వారా నేవీకర్టిసు బైప్లేన్సు యను Nc 1, Nc 2, Nc 3, Nc 4, అనువాటివల్ల ప్రయత్నించిరి. ఈరెండువేలమైళ్ళదూరములో 21 అమెరికను డిస్ట్రాయర్లు అరవైమైళ్ళకు ఒకటిచొప్పున సముద్రముపైన ఉంచబడెను. పొగలు దగ్గిరమాత్రము బ్రిటీషు యుద్ధనావలు ఎదురుచూచుచుండినవి Nc. 1, Nc. 3 విమానములు మూడువందలమైళ్ళు వెళ్ళగనే చెడిపోయి అగిపోయినవి. కమాండరు రీడుమాత్రము; Nc, 4, 1230 మైళ్ళు 15 గంటలలో, అజోర్సు చేరుకొనెను. Nc. 4. మే 16, 1919 నాడు న్యూఫౌండునుండి బయలుదేరి; నాటి సాయంకాలమువరకు అజోర్సు వచ్చెను.

1919, మే 18 లో 'హాకరు' 'మెగంజిగ్రీవు' అనువారలు, ఒక 'బైప్లేను' లో అట్లాంటికు మహాసముద్రమునుదాటి, పదివేలపౌండ్ల బహుమానమును గెలువ ప్రయత్నములు సలిపి విఫలులైరి. కాని వేయిమైళ్ళదూరము ధైర్యముతో పోగలిగినందుకై చక్రవర్తి 'రాయలు ఏర్ ఫోర్సుక్రాసు' నిచ్చిఐదువేలపౌండ్లు బహూకరించెను. తుదకీ పదివేలపౌండ్ల బహుమానమును: కప్తాను ఆల్ కాకు, లెఫ్టినెంటు

ప్రముఖులకు లభించెను, వీరు న్యూఫౌండులాండునుండి బయలుదేరి 1960 మైళ్ళదూరములోనున్న 'క్లిఫ్డెను' కు తమ విమానములో చేరిరి. అట్లాంటికు మహాసాగరమును మొదట దాటగలిగినవారు వీరే, వీరి యొక్క 'విక్కర్సు లిమ్మీ బాంబింగు ప్లేను' నేటివరకును, సౌథాంప్టు టౌను మ్యూజియములో ప్రదర్శనార్థమై ఉంచబడినది. నాటివరకు అట్లాంటి మహాసాగరమును, సీప్లేను 'ఏరోప్లేను'వలనను మాత్రమే దాటగలిగిరి. పై ప్రయత్నములలో విజయము చేకూరగానే; 'ఏరుషిప్పు' వలనను ప్రయత్నములు చేయుచుండిరి. 1918 సం॥లో బర్లిను నగరముపై బాంబులువేయుటకై బ్రిటీషువారు R 34, R 33 అను రెండు ఏరుషిప్పులను తయారుచేయుచుండిరి. కాని ఇవి పూర్తిగాక పూర్వమే శాంతి యేర్పడెను. అటుతరువాత అట్లాంటి మహాసాగరము మీదుగా ఏరుషిప్పువలన అమెరికాకును, బ్రిటనుకును రహదారి ఏర్పాట్లు చేయుటకై ఆర్ 34 వలన కొన్ని ప్రయత్నములు సలిపిరి. Tiger Brown అను యుద్ధనావలు మధ్యలో ఏరుషిప్పుకు తగిన సలహాలనిచ్చుటకై నుంచబడెను. జూలై 2, 1919 నాడు ఆర్ 34 'వాటరు లేక' నుండి బయలుదేరి జూలై 4 వరకు 'ట్రినిటీ బే'కు చేరుకుని, జూలై 6వ దినమున రూజువెల్టు ఫీల్డులో దిగెను. 180 గంటలు 12 నిమిషములలో 3200 మైళ్ళు ప్రయాణముచేసివచ్చిన ఆర్ 34 విమానధికారులకును అమెరికాలో స్వాగతమిచ్చిరి. తిరిగి ఆర్ 34 అమెరికా నుండి బయలుదేరి 75 గంటలలో స్వదేశమునకు సురక్షితముగా చేరుకొనెను. ఈపై యాత్రవలన విమానశాఖాధికారులకెంత ఉత్సాహము కలిగెను. కాని ఆర్ 34, యార్కుషైరు పర్వతములతో ఢీకొని అగ్నిహోత్రుని వశమయ్యెను. ఇందువలన బ్రిటీషు ట్రాన్సు అట్లాంటికు సర్వీసు తలంపులన్నియు గాలిలోనిమేడలుగా మారెను.

ఇక వాయువిమాన యానములో మెక్కువగా ప్రఖ్యాతివడసిన లిండ్బర్గు గురించి తెలుసుకొనుట ముఖ్యము. ఈతను 1927 మే 20 నాడు ఎక్కడను ఆగక 3600 మైళ్ళదూరములోనున్న పారిసు

నకును, న్యూయార్కునుండి బయలుదేరి, 33½ గంటలలో ఫ్రెంచి ప్రధాననగరమును చేరుకొని, 25000 డాలర్ల బహుమతిని బడసెను. ఈబహుమతినే 1919లో యిచ్చుటకై ప్రకటించబడెను. ఈబహుమతికై ప్రయత్నములుసలిపి చార్లిసు నంగేసీరు; 'ఫ్రాంకోయి కోయిలు' అనువారలు ఆకాశములోనే మటుమాయమైపోయిరి. ఒకే ఇంజను కలిగిన, రీయానుమానోప్లేనగు స్పిరిట్ ఆఫ్ సెంటులూయీలో 1927 మే 20 నాడు ఉదయము లిండుబర్గు బయలుదేరుటచూచి అనేకులు యాతనిపై ఎంతయో జాలిజూపిరి. అమెరికా దేశీయులందరును లిండు బర్గుయొక్క అంత్యదశలని భావించిరి. వార్తాపత్రికలలోను, బజారు లోను లిండుబర్గుయొక్క విఫలప్రయత్నములే కనబడుచుండెను. కాని సాహసుడగు లిండుబర్గు ప్రపంచమునకంతయు ఆశ్చర్యము కలిగించి తన ప్రయాణము మాత్రము జయప్రదముగా సాగించెను. ఈతని సాహసకార్యములనుచూచి ప్రజాసముదాయమాతనని 'ప్లైంగుఫూల్' యని వెక్కిరించుచుండిరి. ఫ్రెంచి, రిపబ్లికు అధ్యక్షుడు 'లీజియను ఆఫుహనరు'ను బెల్జియనురాజు క్రాస్ ఆఫ్ ది ఆర్డర్ ఆఫ్ సేంటు లయో పాల్డు'ను జార్జి చక్రవర్తి 'ఏర్‌ఫోర్సు క్రాస్'ను అమెరికా దేశీయులు 'కాంగ్రెస్సునల్ మెడల్'ను మొదలగువాటినిచ్చి గౌరవించిరి. ఈ యునుకాక అనేక శాఖల కధికారునిగా చేసి, ఐదు వేలపౌండ్లు వుడ్రో విల్సను పౌండేషనులోనుండి ఇచ్చిరి. నేటివరకు 'లిండుబర్గును' మించిన విమానచతురుడు లేడనుట అతిశయోక్తిగాదు. (సశేషము)

# తెలుగుతల్లి

## విజ్ఞప్తి

పాఠకులకు: —

ఇప్పుడు మాపత్రికకు, అన్ని హంగులూ సరిగా సమకూరు తున్నాయి. ఇకమీద. ఇంకా పెద్దసైజులో, తక్కువధరతో; సున్నిత హాస్యధోరణిలో, చిత్రవిచిత్ర విషయాల్ని. కథల్ని ప్రకటించి హృదయాల్ని రంజింప చేస్తుంది. క్షమించాలి:-కారణాంతరములచే ఈపత్రిక ప్రకటింపజాలనందులకు

* * * *

రచయితలకు, కథకులకు: —

మాకు కథలేకాక. ఆర్థిక, సాంఘిక, విషయాలు, చక్కని సులభ శైలిలో హాస్యరచనలు, పిట్టకథలు, సినిమా విషయాలు, భావపద్యాలు స్త్రీ వ్యవహారాలకు తోడ్పడె వ్యాసాలు కావాలి.

* * * *

ఏజంట్లకు: —

ఇకమీదట మాపత్రిక ఒకటవ తేదికి మూడురోజులుముందు గానే వెల్వడుతుంది. ఏజంట్లందరూ తమ తమకు ప్రతినెల కావలసిన కాపీలకు ముందుగనే డబ్బుపంపుతూ, హెచ్చు కాపీలకు ఆర్డరిస్తారని, మా విశ్వాసం.

* * * *

చందాదారులకు: —

. చందాపైకము యీసంచికతో పూర్తియయిన చందా దారులు తమతమ చందాలు తొందరగా పంపాలి. లేనిచో ప్రతికలు పంపబడవు.

# మైనర్ కుమారునికి తండ్రినే గార్డియన్‌గా నియమించుటకు కోర్టువారి తీర్పు.

ప్రొద్దటూరి వీరన్నగారి కుమార్తెను అమ్మనబోలు రాజయ్య గారికి యిచ్చి వివాహము చేయబడెను. సుమారు 13 సంవత్సరముల క్రింద ఆమె హనుమంతరావుయను యొక పుత్రునిగని చనిపోయెను. ఆపిల్లవాడు తాతగారివద్దనే పెరుగుచుండెను.

ఇటీవల రాజయ్యగారు తమ కుమారుని తమకు అప్పగించవలయునని శికింద్రాబాదు డిస్ట్రిక్టుకోర్టులో దావా వేసిరి. క్రిందికోర్టువారు పిల్లవానిని తండ్రికే యప్పగించవలయునని తీర్మానించిరి.

ప్రొద్దటూరి వీరన్నగారు రెసిడెంటుకోర్టు అపీల్ దొరగారైన ఇ. జి. శార్టర్ గారియెదుట అపీలు జేసిరి.

దొరగారు 'బాలకుని పోషణగురించి, తండ్రిపైన యెట్టివిధమైన నిర్బంధమును కోర్టువారు కల్పించుట తగినదికాదు. ఐనను, బాలకుని శ్రేయస్సుకోరి కొంతకాలము హిందూబాయిస్ హాస్టలులో యుంచుటకు తండ్రిగారు ఆలోచించెదర'ను తమ ఆశను వ్యక్తపరుచుచు క్రిందికోర్టు తీర్మానమునే ఖాయపరచిరి. సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యర్ గారు వీరన్నగారి తరపునను, టి. ఆర్. వెంకటరామశాస్త్రిగారు అమ్మనబోలు రాజయ్యగారి తరపున వాదించిరి.

# సుదర్శనం.

## మాసపత్రిక.


| సంపుటము 2 | మార్చి, 1940. | సంచిక 1 |
|---|---|---|


—: ఈనెలలో సుదర్శనం సహాయులు :—

1 శ్రీ మహదాస్యం చూడికుడు తమ్మలమ్మయారు గారు, (మేలూరు) రు 2-0-0

2 శ్రీ కాండ్రకోట సావిత్రీదేవిగారు రు 1-0-0

3 శ్రీమాన్ కాండ్రకోట నరసింహారావుగారు రు 1-0-0

4 శ్రీ ఆసూరి నరసింహాచార్యులు గారు రు 1-0-0

5 శ్రీ టి. యస్. రంగయ్యగారు రు 1-0-0

6 శ్రీ కా. తిరువేంగడయ్యగారు రు 1-0-0

---

డానికి ప్రయత్నించలేదు. శ్రీనాథుడు అనాగరికులలో వాడుకలో నున్న 'సాతాని' పదం వాడేడు. శ్రీ కృష్ణరాయ విజయకారకులు 'సాతాని' శబ్దం గ్రామ్యం అని తలంచి దాన్ని సంస్కరిద్దామని 'సాత్తని' అనివాడేడు. అయితే రెండు ప్రయోగాలూ శుద్ధతప్పులే మొదటిది పచ్చిగ్రామ్యం! రెండోది 'కృత్రిమగ్రామ్యం'

## రెండో ఆక్షేపణ

చాత్తాద శ్రీవైష్ణవపదం తమిళపదం అది తెలుగుకి ఎలావరిస్తుంది!

సమాధానం:- "సాతాని" పదం తెలుగుపదం అనివీరిపుద్దేశం. సాతానిపదం తెలుగుపదమూకాదు ఏభాషపదం కూడాకాదు. చాత్తాద శ్రీవైష్ణవ పదం సంజ్ఞానామవాచకం కాబట్టి యేవిధమైన భాషాపరివర్తనానికి ఒప్పుకోదు. ఒకేమతానికి సంబంధించిన జాతిలో తెలుగుతమిళ విబేధాలు పెట్టుకుంటే వచ్చేలాభం కంటే నష్టమే యెక్కువ. కాబట్టి అలాంటి అభిప్రాయాలు పెట్టుకోవడం సమంజసంకాదు.

## మూడో ఆక్షేపణ

చాత్తాద శ్రీవైష్ణవులు అంటే సన్యాసులు అనే అర్థంలో వాడబడింది. హరిజనుడు చాత్తాద శ్రీవైష్ణవుడు కావచ్చు. యేవారు చాత్తాద శ్రీవైష్ణవుడు కావచ్చు. కాబట్టి చాత్తాద శ్రీవైష్ణవులమ నిమనం యెందుకు పిలుచుకోవాలి? మనలో ఒక్క సన్యాసిని చూపించు"

సమాధానం:— "చాతుర్వర్ణ్యం మయా సృష్టంగుణ కర్మ విభాగశః" అని అనడంలో ఆదిలో జాతులు గుణకర్మములబట్టి విభజింపబడ్డాయి. అయితే కాలక్రమంబట్టి పుట్టుకవల్ల నిర్ణయింపబడుతూ

...వి. కాబట్టి మొదట చాత్తాద శ్రీవైష్ణవులు ఒక మతమునకు చెందినవారు. అయితే అదె కాలక్రమంగా జాతిగా పరిణమించింది.

## నాలుగో ఆక్షేపణ

ఏపేరు పెట్టిపిలుస్తే యేమిటి? గుణం కుదరాలిగాని!

సమాధానం:— నిజమే! గుణం కుదరాలి అంటే జాత్యభిమానం ...వ కావాలి. పరాయి పేరుతో నీచమైన పేరుతో పిలవబడుతూ ...న్నాళ్లు మనలో బానిసత్వమే బలుస్తుంది కాని జాతి అభిమానం ...ను. జాతి అభిమానం కుదిరినప్పుడే మనకున్న విధులు తెలుస్తవి. ...లను ఆచరణలో పెట్టినప్పుడే మన గుణం కుదురుతుంది.

బ్రాహ్మణులను బాపనపదంలో జానపదులు వాడడంకద్దు. ...నులు వాడినంత మాత్రాన అదేసరియైన పదం కాదుగద! అల్లే ...'' చెట్టియారు'' పదాలు వుండడంవల్ల 'శ్రేష్ఠి' శబ్దానికి లోటు కాదు కదా. అల్లే "కంసాలి" పదం అనేక పర్యాయములు వ్యావహారిక ...గను గ్రంథములలోను ప్రయోగింపబడినను సరియైన విశ్వబ్రాహ్మణపదము' విస్మరింపదగనిదికదా! అల్లే అజ్ఞానులు చేతను ...లచేతను వ్యవహరింపబడుతూవున్న 'సాతాని' పదమే సరియైన పదమని నమ్మటం శోచనీయము. అదిమన బానిసత్వమునే తెలియచేస్తుంది. పైజాతులవారు వారి నిజనామము గురించి ఆందోళనచేసి ...భుత్వమువారినీ ప్రజలను ఒప్పించినట్లే మనమున్నూ చేయడం ...సిద్ధం.

## సగము జీతము

మనజాతిలో లెక్క వేసి చూచినట్లయితే సగము మందికిపైగా ...యపాత్రి పరులనడానికి సందేహములేదు. అందువల్ల సగము ...శాన్ని అర్హత మనము మాత్రము కలిగి వున్నాము. మనలను

విస్మరించి తక్కువ జాతులవారు ఆలాభమును పొందుతూవున్నారు. దానికి కారణము మనము ఆందోళనచేసి ప్రభుత్వము దృక్పథము నాకర్షించి సక్రమ మార్గములచే వారికి నివేదించ కుండుటయే.

## అసంబ్లీ సీట్లు

అసంబ్లీలో మనకు ప్రత్యేకస్థానం నిర్ణయింప బడాలి ప్రతి దేశాలలో సాంఘిక రాజకీయ, మతసంస్థలు విడి విడిగావున్నాం. మనదేశంలో రాజకీయమున్నూ సంఘమున్నూ మతంమీాదనే ఆధా పడియున్నవి. మనదేశంలో మతానికీ సాంఘికానికీ, రాజకీయానికీ అవినాభావసంబంధం అందువల్లనే యేసాంఘిక సంస్కరణ తలపెట్టి నామత సూత్రాలలో విరోధిస్తుంది. అందువల్ల హిందూదేశా నికి మత ప్రాబల్యం ఎక్కువ. హిందూదేశమును పాలించిన ప్రాచీన చక్రవర్తులు మతమునే ఆధారంగా చేసుకున్నారు. నేటికిన్నీ మతానికీ రాజకీయాలకీ వున్న సంబంధం వదలలేదు. చూడండి! హిందూదేశంలో ముస్లిములకు ప్రత్యేక సీట్లు, సిక్కులకు ప్రత్యేకసీట్లు, క్రిష్టియన్లకు ప్రత్యేకసీట్లు. కాబట్టి మనహక్కులను రక్షించుకోవడానికి మన ప్రత్యేక సీట్లు కోరడంలో యే అసందర్భమూ లేదు. కాబట్టి మన వారు 30 సం॥ పైగా అసెంబ్లీలో ప్రత్యేక నియోజకం కావాలని గోలపెట్టుతూవున్నారు. 1917 సం॥లో గవర్నరుగార్కి, శ్రీ గవర్నరు జనరలుగారికీ మహజర్లు పెట్టేరు. మనకు రాజకీయంలో స్థానంలేని మనం మన మతమును రక్షించుకోలేము. మనకు ఊరూరా, తాలూ కాలలోను, జిల్లాలలోను మతాధికారులు మతాధిపతులూ వున్నారు. వారికి జనసామాన్యంలో మంచిపలుకుబడి వున్నది. జనసామాన్యంలో మనవారికి వున్నంత పలుకుబడి యింకెవ్వరికీ లేదంటే అతిశయోక్తి కాదు. అయితే వారు వారిదురాచారాల మూలాన్ని వారి పలుకు బడిని దుర్వినియోగంచేసి తుదకు నాశనం చేసుకుంటున్నారు. వారి

జిహ్వాచాపల్యం, గుహ్యచాపల్యం కొంచెంకట్టిపెట్టితే చాలు, వారు కావలసినంత రాజకీయశక్తి సంపాదించుకోవచ్చు. మన మతాన్ని సన్యాసయోగం చేస్తేనే కాని అణగదొక్కబడిన మనమతమూ. మత శస్త్రులకు ఎక్కించుకున్న మన జాతీ, యితర జాతులతోపాటు సమాన గౌరవాన్ని పొందలేదు.

ఒక విన్నపంచేసి యీ వ్యాసాన్ని ముగిస్తాను. మనం సదా శోసంపన్నులం కావాలి. మనకు ఉగ్గుపాలతో అంటివచ్చిన దురాచారాలు సమసిపోవాలి. నైతికానికీ జీవితానికి పెనవేసుకొనివున్న సూత్రము చాల బలమైనది. నీతియే ప్రపంచలో సన్మానింపబడుతుంది. అవినీతి మొదటిలో కొంచెం తేజరిల్లినా త్రుటికాలంలో మటుమాయమైపోతూవుంది. అవినీతిపరుడికి సంఘంలో తావులేదు. నేను యిలావ్రాస్తే 'అయ్యో మనలోని లోటుపాటులు రచ్చకెక్కుతున్నవే?' అంటారు. జాగ్రత్తగా చూడండి. అవి రచ్చకెక్కివున్నాయి. అవి రహస్యములు అనుకుంటే మనలనుమనం మోసగించుకుంటున్నామన్న మాట. మీ రహస్యఅనుభవములు నామమాత్రముగనే రహస్యములు. అవి ఎవరికిరహస్యములో చెప్పండి? అవి రహస్యములని నమ్మి మనలనుమనం మోసగించుకోవద్దు. జాతినీమతాన్నీ అవమానంపాలు చేయవద్దు. త్వరలో సంస్కరించుకొని మన ప్రాచీన ఔన్నత్యాన్ని పొందుదాము. రాజకీయాలలో కూడా మనకుతగిన స్థానాన్ని మనంపొందుదాము. అయితే యితర బ్రాతములతోగాని జాతులతోగాని మన కేవిధమైన విరోధము లేదు. మన 'ప్రోగ్రాము', మతవైషమ్యానికీ జాతివైషమ్యానికీ తావులేదు. మనది ప్రేమమతం. ప్రేమతోటే మనం మనకార్యాల్ని సాధిద్దాం. సక్రమమైన ఆందోళనం నిరంతరం మనంచేసి మన గమ్యస్థానాన్ని చేరుదాం. అందుకు తగిన 'రాజబాట' మన మహాసభ వేస్తుందని ఆశిస్తాను.

సర్వేజనాః సుఖినోభవంతు. దాసుడు — రామావతారం.

## పత్రికా స్వీకారం.

### "శిల్పసామ్రాట్"

ఈ పత్రిక విశ్వబ్రాహ్మణుల జాత్యభివృద్ధి కొరకు విజయనగరం నుంచి విశ్వబ్రాహ్మణ ఫెడరేషన్ వారిచేత ప్రతినెల వెలువరింపబడుతూవున్నది. సంపాదకులు బ్రహ్మశ్రీ కాశీ రామమూర్తి గారు. ఈ పత్రిక విశ్వబ్రాహ్మణులకు మత రాజకీయములలో సుమార్గము అయినను సాంఘిక విషయములలో కొంత వెనుకబడుచున్నదని మా సంశయము. ఈపత్రికా రాజము సనాతనాభిప్రాయము లనేగాక సంస్కారుల అభిప్రాయములనను తావిచ్చి యువకులనుకూడ గట్టుకొని జాత్యౌన్నత్యమునకు పాటుపడుగాక యని కోరుచున్నాము.

## —: సుదర్శనం ప్రత్యేకసంచిక :—

జూన్ నెలలో సుదర్శనం ప్రత్యేకసంచిక వేయడానికి ప్రయత్నిస్తున్నాము. ఆసంచిక మామూలు సంచికవలెకాకుండా ఎక్కువ పేజీలతోను ఆకర్షణీయమైన వ్యాసములతోను కథలతోను పద్యములతోను నిండాలిఅని మా ఆశయం. మనలో అనేకులు పరమపదించిన మహనీయులు వున్నారు. ప్రస్తుతం వున్నవారిలో మతరాజకీయములలలో ప్రముఖస్థానములు వహించినవారున్నారు. వారి జీవితాన్ని సచిత్రంగా క్లుప్తంగా ప్రచురించాలని మావుద్దేశం. కాబట్టి లోగడ నాల్గుమహాసభలు నడిపిన మహనీయుల జీవితచరిత్రలున్నా చిత్రములున్నా యింకా కావాలి. వాటిని సేకరించి పంపించవలసిందని స్వాములను కోరుతూవున్నాను.

మనలను అనుదినం యెదుర్కొంటూవున్న మత సాంఘిక సమస్యలపైని కథానికలు కావాలి. కథలలో మన అభిప్రాయములను

యికించి పరిజాసామాన్యాన్ని ప్రభోదించడం చాలానులభం. కాబట్టి చాత్తాద శ్రీవైష్ణవులలోనున్న వ్యాసకారులంతా తగుప్రియత్నం చేసి మాకోర్కె నెరవేర్చాలిఅని మాప్రార్థన.

చాత్తాద శ్రీవైష్ణవులలో కవులు లేకపోలేదు. ప్రత్యేక సంచికను ఆకర్షవంతంగా చేయడానికి చిన్న చిన్న గీతికలూ పద్యాలూ అవసరం.

వ్యాసాలు రెండుపేజీలకు మించకుండావుండాలి తక్కువపేజీలలో ఆకర్షనీయంగా వ్రాయడమే కళ. వ్యవహారికభాషలో జనసామాన్యానికి అర్థమయేట్లు వుండాలి

వివరములకు: — సంపాదకుడు 'సుదర్శనం' విజయనగరం.

---

## సుదర్శనమే!

యతిరాజం శ్రీనివాసం.

మచిలీపట్నం, 8-3-40.

“చాత్తాద వైష్ణవ” అను మన కులనామము గవర్న మెంటువారిబీదకులజాబితాలో (G. O. No. 160 Education of 1940 January 29) ఈ రోజున చూచి పరమానందుడనైతిని. ...వారందరు సంతోషించెదరు. మన విద్యార్థులకు అర్ధజీతపు ... యిన్నాళ్లకు ప్రాప్తమైనది. పాఠశాల వారిచ్చు అర్ధజీతపు ...ములలో “చాత్తాద వైష్ణవ” అని వ్రాయండి. అంతేగాని ...యితర అపశబ్దం వ్రాయకండి. శ్రీకారం పెట్టించే వుపాయం తరు ... చేద్దాం. 'కష్టే. ఫలే' అన్నారు. పూర్వం నుండి మనము పడు ...ములు సుదర్శన కాలంలో ఫలించినది. ఇది నిజముగా సుదర్శనమే! ...త్వమిచ్చు దురాచారముల దూలించుచున్నదీ సుదర్శనమే.

మహాసభకు కారణమైనదీ సుదర్శనమే! మన సమస్యల ననే ... పూర్తి చేయుచున్నదీ సుదర్శమే! ఇది సుస్థిరముగ వర్ధిల్లుగాక! ...గులు, భాగవతులు, వర్తకులు ఎందుకునూ సందేహింపక ...ర్శనమును కాపాడెదరుగాక!

---

పూనా, 15-3-'40.

...భాగవతులారా!

చాలసంతోషకరమైనవార్త. మన ప్రయత్నములు ఫలిస్తూ ...న్నవి. “చాత్తాద శ్రీవైష్ణవ” శబ్దమునకు, ఒక చుక్క, లేక ...మా తక్కువైనను మనము సహించలేము ఆవిషయమును ప్రభు ... దృష్టిలోనికి సక్రమమార్గముల తెచ్చెదముగాక! ఆవిషయమును ...సంబ్లీ సీట్ల విషయమునను, భుక్తములయినను హక్కుల విషయము ... మహాసభలో తీర్మానించి ప్రభుత్వమునకు నివేదింతముగాక!

—దాసుడు రామావతారం.

# సుదర్శనం.

2 సంపుటము } జూలై, 1939. { సంచిక 2.

## అభీప్సితము, : : ఆలపాటి కామేశ్వరరాయ కవి.

ప్రకృతి రమణీయదృశ్య నిర్మలవిలాస
గణములో లీనమైన నీకమ్రమూర్తి
కరము నామది కానందకరముగాను
గానుపించుట యెన్నడో గద మహాత్మ!
సలలితానంద వీథుల సంచరించు
నిరుపమమనోజ్ఞ భవదీయ లీలమూర్తి
గోచరముగాగ నాకు నేకోరికలును
శాంతవిగ్రహ! వాంఛింపఁజాలనిన్ను.
సారహీనోగ్ర సంసార సాగరమ్ము
నేఁదరించఁగ మార్గమున్ దెలుపుమయ్య
యింకనైన భవత్పాద పంకజముల
నాశ్రయ మిచ్చి నాసేవ చేకొనఁగదే?
ఓమహానందమూర్తి నీ యరుణ రాచ్ఛ
పావనకటాక్ష సౌభాగ్య వార్ధిభంగ
మాలికా డోలికలనూగు మంచిదినము
లేవియునురాక యున్నవో యీ మహాత్మ!

## మతము—కర్తవ్యము,

ఉమర్ ఆలీషా M. L. A.

అనంతములగు సంఖ్యావాచకములలో నేదోయొకనిగూఢ మెవరికిని అర్థముకాలేదు. అది మృత్తికాఘట శక్తివలె నొక్కప్రదేశము నాశ్రయించి యావజ్జనితములగు చరాచరమునకట్టి అగోచరమును అంతులేనిలోతును గలిగించి విమర్శకున కగాధమగు దృశ్యమగపర్చుచున్నది. అదియే యీశ్వరుడని ఆస్తికులును శూన్యమని నాస్తికులును వ్యవహరించుచున్నారు. ఈఆస్తికనాస్తిక ములను శూన్యాభాసములు, సదసద్పదార్థములచే ద్వయాధిభూతములగు ప్రకృతికి నుపాదానకారణములై గొప్పపరివర్తనము పుట్టుచున్నది. అదుత్తీర్ణమైన వ్యక్తి మానవునిది. మానవుడు చరాచర జీవములకన్న అధికస్వార్థ మభిలషించెను. తుద కద్వైతమను పేర తానే ఈశ్వరుడని చాటినాడు. అనృతజడ దుఃఖాత్మక భౌతికప్రకృతి కేవో యుక్తులు పన్ని దానికవ్వల నేదియులేనందున నేతద్విపక్షణము చెప్పనెడ ఉపదేశమున కానృదమని తార్కికనివృత్తి నుద్దేశించి బింబప్రతిబింబాభాసము లుపాధిగాగైకొని యేదోపెద్ద ఊహాప్రపంచమును సృష్టించి దానికి మోక్షమని పేరుంచెను.

మోక్షమనునది ఒకదానినివిడచుట అనుధాత్వర్థము వచ్చుచుండగా అద్వైతమున కెక్కడచోటున్నదో తెలియవలసియున్నది. ఈప్రకారము మతమతాంతర దివ్యవ్యాసంగములు పెద్దమహాభ్రాంతులకు అవజ్ఞతలకు గురియై అనుల్లంఘనమైన భీభత్సమును గలిగించుచున్నవి.

అస్తిమాంసవసా వికారముగల దేహములు అస్థిపంజరములై ప్రోగుపడిన మృత్తికారేణు సముదాయముగానెరుంగవలయును. వస్తు సముదాయములు వివిధవిధముల పరివర్తనములబొంది తిరిగి ఆద్యప్రకృతికి బోయినిలచును. ఇది రూఢమగు తెరవు.

క్రియాసిద్ధ స్వభావాల నతిక్రమించి పోలేదు. అసలు జడము ప్రధానము. అందురూపించు పురుషప్రకృతిలు శక్తి పదార్థములుగా జదీయనచ్చును గాని వాసికిగల పరికరములులేవు. యాగికముగా కొన్నిప్రశంస లున్నవి. అవి యెవరును అమలులోపెట్టుచుండలేదు.

పాశ్చాత్యులు భౌతికశక్తి విద్యుత్తునుపట్టి పెద్దవిద్యావ్యాప్తి సృష్టించి ఆకాశయానములయందు తేజోమండలము నేలకుదింపుచు సృష్టిని ప్రకంపిత మొనరించుచున్నారు. అట్లేభారతీయులు ఆధ్యాత్మిక జీవశక్తినిపట్టి అణువులను భేదించి భౌతికోద్రేకముల నణచిపట్టి ప్రశాంతిని స్థాపించవలయును. లేదేని యీశాస్త్రీయయుద్ధాయుధములు (Scientific War weapons) లోకనాశనమును దెచ్చి పెట్టును.

ఆధునిక భారతరాజకీయము బాలబిభీషికలబోలి నీరసమై హాస్యాస్పదముగ నున్నది. వీరలకు భౌతికశక్తిగాని ఆధ్యాత్మికశక్తి గాని లేదు. సత్యాగ్రహమనేది నెత్తికోతల వాండ్రపని. శూరునికి గెలుపోటములు రెండును గమ్యస్థానములే.

---

# పునర్వివాహం,

కాండూరి లక్ష్మయ్య

పావుకోళ్ల శబ్దము టక్కు టక్కుమన, పోడుముకాయ ఒక చేతిని ధరించి రెండవచేత సగము పీల్చిన పొడుము చిట్టా పట్టుకొని, కొంచరగా అమ్మాయీ, అని పిల్చుకొని అగ్నిహోత్రావధానులు గారు వసారాలో నిల్చున్నారు.

కంటతడి పెట్టుకొని వీలులేదు అమ్మాయికి అయినదేదో అయినది, ఉన్నదైనా సఫలమైనట్టు చూడండని కామేశ్వరమ్మగారు

నిట్టూర్పు విడిచినారు. 'వెధవ ఏడ్పులు ఈసందటిలో మైలకలి పెస్తూన్నారు. స్నానముచేసుకొని జంధెమేసుకోవాలి.' విధివిధానము జరుగక తీరదు అమ్మాయికి వచ్చిన లోపమేమిటి నాకంటమున ప్రాణమున్నంతవరకు॥ పంచా లాల్చీ తొడుగుకొని ఉత్తరీయ మొల్ల వాటు వేసుకొని గాంధీటోపీ వేసుకొని కళ్లకు జోడు పెట్టుకొని ఒక యువకుడు 'ఏమిటాగోల జరిగినదేమిట'ని తొందరగా వచ్చుచుండెను 'అబ్బాయీ రాజేశ్వరికి దుఃఖదినములు వచ్చినాయిరా. గుండెలలో దాగియున్నది ఈవేళకాక రేపైనా బయటపెట్టవలెను గదా 'ఏమ ఱమ్మా' ప్రభాకరరావుగారు గొప్ప సంస్కారి. ఆయన మా అమ్మాయిని శాస్త్రయుక్తముగా వివాహము చేసుకుంటానన్నారు. అమ్మాయితో చిన్నతనములో వివాహమయినట్లు చెప్పి మొల ఆయన పోయిన తర్వాత రజస్వల అయినదని విచారమేలా నాలుగు జాతులు ఒకటవుతాయని విధవా వివాహములు రజస్వలైన తర్వాత పెళ్లిళ్లు మారుమనువులు వస్తాయని పరాశరస్మృతులు ఘోషి స్తుంటే! మేమంతా ఉన్నాముగదా అనుకొన్నాము' 'జాతిభ్రష్టు అలంఘ్యాలంఘ్యం రానేవచ్చింది. నేనుయింట్లో ఉండను. అడవిలోకి వెళ్లి తపస్సు చేసుకుంటా'నని అవధాన్లుగారు రింగున పొడుముకాయ పారవేసి వీధివైపు తిరిగాడు.

లలిత అవివాహిత. యౌవనాంకురములు శరీరమున వ్యాపించి సర్వాంగ సుందరత్వమూ పాదించుచుండెను. కళ్లలో మిలమిల కమల కాంతివలన గండభాగమున తళతళ నొక్కులుతీర్చిన కొప్పు పాల భాగ మున కొకవన్నెవే. వివాహమును నొకపుస్తకము పట్టుకొని 'అన్నయ్యా చూచితివా మనువేలాగున వ్రాసినాడో కన్య రజస్వల అయిన తర్వాత 3 సం॥రములువరకు పతిని వెతుకుచునుండి తనతో సమాన మగు పతిని బొందనగు' ఆకర్ణాంత విశాలలోచనము లొక్కసారి తళ తళకొట్టుకొని విశాలమయి ఒక్కసారి ముకుళత్వమునుబొంది. బాహ్య

దృష్టి దూరములయ్యెను లలిత కండ్లు. ఇంకొక పేజీ తిరుగవేసెను. 'శరీరము వృద్ధి 16 లగాయతూ 25 సం॥రములవరకు 25 మొదలు యౌవనమారంభము. 40 సం॥రములకు పూర్ణయౌవనడగును. కన్యకు 16 సంవత్సరములు దాటినతర్వాత 24 సంవత్సరములు వరకు వివాహము చేసుకోవచ్చును బాల్యవివాహ మనర్థదాయము. లలితకు ముఖమున ముచ్చెమటలు పోసె చాందసులు లోకమును నిర్వీర్యము చేసిరి. పూర్వులు వ్రాసిన శాస్త్రములు గమనించలేదు' అని పుస్తకము మూసివేసెను.

---

పరసుఖమే స్వసుఖము

# చాత్తాద శ్రీవైష్ణవ ఆచారములు.

భట్టోపాధ్యాయ, యతిరాజు శ్రీనివాసుగారు,
బందరు.

పరులసుఖము కోరి తోడ్పడువారికి దేవుడు తోడ్పడును. కులాచారములగురించి విపులముగా తెలిపినచో, వాటి కష్టనష్టములు తెలిసికొని వదలెదరు. అంత సమానాచార వర్ణనచే సంఘీభావము కలిగి అందరును సుఖించెదరు. ధర్మాధర్మ విచక్షణగురించి మనమందరము మాట్లాడుకొనుటకు కలియుట దుర్లభము. సుఖనిధానమందలి మనోభావములను సుదర్శనమందు వెలిబుచ్చుచో, అందలి సత్యమును సుఖముకొరకు సర్వులుగ్రహించగల్గుదురు. పుణ్యముకొరకు మనము చేయు దానములతోబాటు, సంఘీభావార్థము, సుఖవిధానమును చెప్పుటయు జన్మసాఫల్యముగదా!

సద్విషయములను ప్రత్యక్షముగా చెప్పుచో కొందరికి కోపము గల్గెను. కొందరు మోరుశాలలందు తనియల హెచ్చుతగ్గులకు తన్ను కొనగా, అట్టిది చాలాయగౌరముగాదాయని నేచెప్పగా, 'మాయిష్ట మనిరి'. 'ఎవరెట్లాతగలడితేమీకెందుకు, అందరూ యూరకొన్నట్లు మీరున్నూ యూరకొనరాదా' యని నాకు బోధించిరి. 'అధర్మ వర్తనచే చెడువారికి, ధర్మము తెలిసినవారు చెప్పకపోయిన పాపము మహాత్ములుచెప్పిరి .అంతేగాక మీరందరు నాబంధువులు మీమేలే కోరెదను. నామాటవినుడంటిని' ఇట్టితిప్పలుపడుతారనే, ఒకరికివ్యతిరేకంగా మాట్లడు టెందులకని, కొందరు తందన తానయని తాళం వేయుచున్నారు. ఇతాళంవేసినావర్తనభేధమువల్ల పార్టీలు తిప్పుటలేదు. అగౌరవానికి వెరువనివారికి ఎంతచెప్పిననూ లాభములేదు. అయిననూ ప్రయత్నలోపము యుండరాదుగదా! అందరును తమతమభావములను సుదర్శనమందు వ్రాయవలయు. అందరును పత్రికను తెప్పించవలయు. నాల్గణాలైన చెల్లించువీలులేనివారికి ధనికులుసహాయము చెయ్యావలయు. కృష్ణాజిల్లాలో ఎవరైన నన్ను అడుగుచో; వారిరుసుము నేనే చెల్లించెదను.—

సంఘీభావమే సుఖము. అందుకు సమానాచారవర్తనయే మూలము. ఇది లేనందున స్వాములు సంఘస్థాపనకు యెన్నిసార్లు ప్రయత్నించినను సఫలమవలేదు. ఆంధ్రదేశము మనవారల ననేకుల దర్శించితిని. సంఘీభావలోపముల కనిపెట్టితిని. ఐకమత్యతి చేకూర్చు కొన్ని నిబంధనలను ప్రచురించితిని. స్వాములనేకులు సెబాసనిరి.

—: చాత్తాద శ్రీవైష్ణవస్వాముల అష్ట నిబంధనలు. :—

1. ప్రతిగృహమున నిత్యతిరువారాధన యుండవలయు.
2. స్వసంఘపౌరోహిత్యము నెలకొల్పవలయు.
3. పీఠాధిపతులును, పౌరోహితులును, ముఖ్యముగా శిఖా యజ్ఞోపవీతనిరసనులుగా నుండవలయు.

4. ఏకులపువారికైన మతమివ్వవచ్చును, మరియు పౌరోహితము సేయవచ్చును. గాని
5. సదరు పరకుల మతస్థులకు భోక్తగా యుండరాదు.
6. మతాచార్యులయొక్కగాని, పురోహితునియొక్కగాని పంక్తిని అనాదీయులే యర్హులుగాని నవీనులు అర్హులు గాజాలరు.
7. తుచ్ఛదేవతారాధన, సురార్పణ, బలియనునవి కూడదు.
(సుర పంచమహాపాతకములలో నొకటి)
8. అవివాహికుల సంతానమును, సవర్ణులు వివాహమాడరాదు.

ఇందుకు భిన్నముగా, క్రితముజరిగిన లోటుబాట్లకు అసహ్యాంచుకొన నగత్యములేదు. ఇకనైన జాగ్రితతో మెలగుటమంచిది.

నిత్యతిరువారాధన క్రమముల క్లుప్తముగా దాదాపు 15 నిమిషములలో అవునటుల పీఠాధిపతులు అర్థ తాత్పర్యములతోసహా, సాధ్యమైనంతవరకు సంస్కృతశ్లోకములతో అమర్చి, 'సుదర్శనమందు ప్రచురించ ప్రార్థన'.

---

## వైష్ణవమతగురువు—వైరాగ్యము.

బూసి శేషాచలంగారు.

[ నిజంచెప్పవలసినచోట మోమాటం కొంచమైనాలేకుండా ముక్కుమీద గుద్దినట్లు చెప్తూతారు శ్రీమాన్ శేషాచలంగారు. వైష్ణవమతంపేరిట కొన్ని శాఖలలో వున్న దురాచారాల్ని ఖండించడంకోసమే యీనాటకమును వ్రాశారు. ఇది ఐదంకముల మహానాటకం. హితమనేది ప్రియముగా వుండదు కాబట్టి వారి వ్రాతలు కొందరికి కష్టంగా వుంటవి. ఒకరివ్రాతలనుచూచి కోపగించుకోవడం కంటె మన నడతను దిద్దుకోవడమే మంచిదేమో? ]

## ప్రవేశము.

మతాభిమాని-మార్యాన్నర్నంబి, శరణాగతుల-చక్రధరుడు,
తీర్థవడుల-తిరుపణ్యాళ్వార్లు ఉద్యానవనములో

మా:- (తనలో) ఈశ్వరునిచే సృజింపబడిన యీ మానవ లోకమందుగల మానవకోటంతయు నొక్క-తీరుగా నుండక పలువిధ భావములతో ప్రవర్తించుచు పరాత్పరుని పలువిధములుగ పూజించుచున్నారు. మన హిందూశాస్త్రములు షడ్మతములని ఘోషించుచుండ ప్రస్తుతకాలమున లెక్కకుమిక్కుటమై ప్రబలుచున్నయవి. ఏమతమునకు జెందినవారలు ఆయామతమే మంచిదనియు, తదితర మతములు మంచివికావనియు, మాగురువే మంచివాడనియు, తక్కిన వారు గురువులకే అర్హులుగారనియు, వితండవాదములు జేయుచు మతద్వేషములు పెంపుజేయుచున్నారు. గాని సర్వమతసమ్మతము జూపకుండుట కడుశోచనీయము.

చక్రి:- ధన్యుడను! మార్యాన్నర్నంబిగారి దర్శనంబిక్కడనే లభించినది. అడియేనుదాసోహమండి స్వామి.

మా:- అడియేనుదాసోహమండి! ఎంతవరకు వేంచేయుచున్న వారలు.

చక్రి:- దేవరవారి దర్శనార్థమై వచ్చుచున్నానండి స్వామి.

తిరు:- అదృష్టము, మార్యాన్నర్నంబి, చక్రధరుడుగార్ల దర్శన భాగ్యంబిక్కడనే లభ్యమైనది. వారిని సేవించుకొందును. అయ్యా స్వాములు అడియేనండి.

మా:- ఆ కుశలమా?

తి:- దేవరవారి కృపవలన అంతయు క్షేమము.

మా:- అయ్యగారి కృప.

తిరు:- దేవరవారు దీర్ఘాలోచననిమగ్నులై యున్నట్లు తోచు చున్నది. విషయమేమి?

మా:- విషయమా? మానవుండు యీ మాయాప్రపంచమున జరుగు కపట నాటకరంగమున నొకపాత్రధరించి తనువు శాశ్వతమని భ్రమించి కన్నుమిన్నుగానక న్యాయాన్యాయవిచక్షణలేక అపరివర్తకమై కర్మనార్జించుకొని మరల మరల జనన మరణావస్థలు పొందుచు పరిభ్రమమనుభవించుచున్నాడు.

తిరు:- మృతినొందినవారలు మరల జన్మించుచుందురా?

మా:- తప్పక జన్మకు వచ్చితీరుదురు.

చక్రి:- తిరిగి యెక్కడ పుట్టుచుండును.

మా:- కర్మసంబంధమునుబట్టి తానెచ్చట పుట్టవలయునో, అచ్చటనే పుట్టుచుండును.

నటి:- ఈనాటకము యేసమాజమువారును యింతవరకు ప్రదర్శించినటుల కని వినియుండలేదే?

సూత్రి:- ఔను! ఇదియొక నూతన సాంఘిక నాటకరాజము.

నటి:- నాధా! గ్రంధకర్తనామమెద్దియో విశదపర్చ ప్రార్థించుచున్నదానను.

సూత్రి:- కాంతా! కవినామము కావలయునా? దానిఅవసరమేమున్నది? అయినను కోరితివిగావున శ్రద్ధగా యాలకింపుము.

నటి:- చిత్తము. ఆసక్తియుడు.

పరమపావనమైనభరతఖండమునందు నలరారుచుండెడియాంధ్రభూమి గౌతమీనదికి ప్రాగ్భాగమండల నరసాపురంతాలూకా సదమలమగు చించినాడగ్రామ శ్రీహరిభక్తుండు బూసిరామానుజదాసవరుని పుత్రుడై జన్మించి పాత్రతనుతిగన్న శేషాచలం దాసశేఖరుండు

తే॥ గీ॥ స్వమతసంఘ దురాచారసమితి మాన్ప
సాంఘికౌన్నత్యమున్ గాంచి సంతసింప
సత్య సవిమర్శకులు జూచి సంతసింప
సరస నాటకంబు రచించె సాధ్వివినుమ.

వ॥ ఇట్లే ప్రస్తుత నాగరికత ప్రపంచమున ప్రతిజాతిలోను సంఘాభిమానులు, సంస్కరణాభిలాషులు, సంస్కర్తలు బయలువెడలి సంఘములుస్థాపించి మత, సాంఘిక, విద్య, నాగరికత, నైతికార్థిక రాజకీయాది విషయములలో నూతనవికాసముపొంది దేశసేవకులు, నాయకులై యెంతోఘనకార్యము లాచరించుచున్నవారలు

నటి: ఆర్యా! ఔను. ఆధునికప్రపంచమున అన్నిజాతులవార లభివృద్ధిజెందుచుండుట సత్యమేగాని, మన వైష్ణవులట్లుగాక యెవరికి వారే యమునాతీరే యను సామెతను సార్థకపర్చుచు కూపస్థమండూకములవలె తాము జూచుచున్నదే ప్రపంచమని మురయుచు అభివృద్ధి జెందకుండుట హాస్యాస్పదము.

సూత్రి: ఓసి వెఱ్ఱిదాన 'మతి యెంతో గతి యంతే' యను మహావాక్యము వినియుండలేదా? అభివృద్ధికాటంకములగు ఆశలను యినుపశృంఖలములు. వీగినిబంధించివైచినవి. వాటిని ద్రెంచజాలరు. ఎటులభివృద్ధిజెందెదరే?

నటి: మనోహరా! క్షమించుడు మేఘంబులకై వేచియుండు చాతకగణంబులపగది ఈప్రేక్షకులు మన కథాసందర్భమునకై వేచియుండి మన వ్యర్థప్రసంగములకు చీకాకుపడుచున్నవారట. ఆలసించినచో అవమానము వాటిల్లును. వేంచేయుడు పోవుదము.

సూత్రి: ప్రియా! ప్రసంగసందర్భమున పని మరచితిని సుమారు తొమ్మిదిన్నర గంటలు కావచ్చినది, మనము వెడలి రాబోవు కథారంగమున నాయక నాయికీపాత్రి ధరింతములెమ్ము.

నటి:- నాథా! చిన్నమనవి! మనజాతియొక్క అజ్ఞానాంధకారమును బాపి జ్ఞానతేజము ప్రసాదించి అభివృద్ధిజెందు సదుద్దేశములు కలిగింప నా శ్రియఃపతిని మనసారా ధ్యానించి పిదప ప్రస్తుతకర్తవ్యమును పూనుకొందము వేంచేయుడు.

ఆ॥ మానవుండు పుట్టి, మహిమీదకొన్నళ్లు! భార్యసుతులతోడ, క్షుద్రముగను జీవయాత్రగడిపి, చెడుగు దేహముబాసి, పుట్టుచుండు మరల, పుడమియందు,

తీ॥ తి:- ఎంతకాలమిట్టులు పుట్టుచుండును, దీనికేమైన హద్దులు గలదా?

మా:- హద్దా? లేకేమి? కర్మరహితమేహద్దు. అంతవరకు జననమరణావస్థలుపొందవలెను.

తి॥ ఆ॥ ఎంతకాలమిట్టులీ ప్రపంచంబున, పుట్టు గిట్టులను, పొందవలయును పుట్టుగిట్టులేని, పుణ్యలోకముజెందు మార్గమేదియైన యున్నచో ఆనతీయండి

మా:- పరముకు మార్గము జూపు వాడుగురువుతప్ప తదితరు ల వలన గాదు పోయి గురువును ఆశ్రయించండి.

చక్రి:- అయ్యా మనము వైష్ణవులముగదా? మనముగూడ గురువుని యొద్ద ఉపదేశము పొందవలయునా?

మా:- ఓరి పిచ్చివాడా! జన్మచేత బ్రాహ్మణుడైనను బ్రహ్మ జ్ఞానము దెలియనివాడెట్లు బ్రాహ్మణుడు కాజాలడో అట్లే జన్మచేత వైష్ణవుడే యైనను ధర్మము దీరనిచో వైష్ణవుడు కాజాలడు వానికి ఉత్తమ గతి లభ్యము కాజాలదు.

తిరు:- ఆ!అంతా వైష్ణవులేనండి వైష్ణవుడంటే అర్థము తెలియని వాడు వైష్ణవుడే. బొట్టు తిరుమణి శ్రీచూర్ణములు ధరించుటవలన ఫలితమేమో తెలియనివాడు, గంటతీర్థము జన్మలోచవిచూడనివాడు. పిన్నగాకమొన్న ధర్మముతీరినవాడు వైష్ణవుడే. అంతా వైష్ణవులేనండి. పెద్దవైష్ణవులు.

(పెద్దబొట్టు పేరుమాళ్లు ప్రవేశము).

పెరు:- స్వామానుస్వాములు, వేమాను వేదులు అయిన

వారలంతా యిక్కడనే తటస్థమైనారు. అడియేనుదాసోహమండి స్వాములారా!

మా:- అడియేనండి స్వామీ, అపరాధిని,

తిరు:_ ఏమండో! చూచారా? వైష్ణవుడంటే ఆయనేనండి, అసలైన వైష్ణవుడు, చూడండి ఆపిలక అయన దిద్దిన ద్వాదశి పట్టవర్ధనములు, ఆయనగట్టిన గండచేరుండంచుల పంచెలు, ఆయనబెట్టిన బిళ్లగోచి, దక్షిణాది అంచుల కండువవలెవాటు, ఆవిగ్రహపుష్టిచూస్తే సాక్షాత్ పెరుమాళ్లు దర్శనమైనట్లుంది, వైష్ణవుడంటె ఆలాయుండవలెను.

చక్రి:- అయ్యా! పెరుమాళ్లుగారూ! అపరాధిని! అయితేనండీ తిరుమణి శ్రీచూర్ణములు అంత విపరీతముగ ధరించుచున్నారు, మా బోటి బక్కవాళ్లకు మిగుల నక్కరలేదండిస్వామి?

పెరు:- అయ్యగారి కృపయుంటే మీకుపాత్రము కొదువా! కావలసినదాని కంటె అధికముగా నేమిగులుతుంది.

తిరు:- ఎల్లప్పుడు మీరీవిధముగ ధరించుచున్నయెడల తిరుమలలో శుద్ధ యెగుమతి చేయువారు, విసిగిపోతారు, శుద్ధకొండ తరిగిపోతుంది.

పెరు:- కొత్తవారు సిద్ధమాతారు, మరియొకకొండ బయలుపడుతుంది,

తిరు:_ శ్రీచూర్ణము సప్లయి చేయువారు చేయజాలక మిం మించు కుంటారు.

పెరు:- వారిబిడ్డలుంటారు గదండి, వారు సిద్ధమాతారు. భయపడకండి.

తిరు:- కొంత కాలమునకు శుద్ధ శ్రీచూర్ణములకు రేటు హెచ్చుతుంది, గవర్నమెంటువారు సుంకము విధిస్తారు,

పెరు:- కాంగ్రెస్ ప్రభుత్వమువారు కనికరిస్తారు, కంగారు పడకండి,

చక్రి:- శుద్ధశ్రీచూర్ణములయెుగుమతిదిగుమతులెట్లున్ననువ్రస్తు
తము మన పెరుమాళ్లుగారిని యీగ్రామమునసబుగారికి అబోతుచూచి
నయెడల అదిపడిబెదిరిపోయి పొలిమేర దాటువరకు తరిమితరిమి
కొమ్ములతో గ్రుమ్మతాది,

తిరు:- అప్పుడు పెరుమాళ్లే సాక్షాత్కార మగుతారు.

చక్రి:- తిరుప్పణ్యాళ్వారుగారూ! దాసునియందు దయయుంచి
చెప్పడంటేనేమి? తిరుమణి శ్రీచూర్ణములు ధరించుటవలన ఫలిత
మేమి? ఆనతీయండి స్వామి?

నాకుమాత్రము తెలియునా? అడిగేవానికి చెప్పేవాడు లో
కువయన్నట్లు ప్రశ్నించితిని గాని మీయందరికంటె గొప్పవాడనా?
నుమేగాదు మనసంఘమే ఆస్థితిలోయున్నది. మనల పీడించుకొని
తిరుగు గురువులు మతవిషయములు యేనాడైనను జెప్పియుంటె
గదా?

పెరు:- అయ్యో! అపరాధిని! దాసిగాడివిన్నపము చిత్తగిం
చండి, నేను అమాయకుడను. నేను మీవలె శాస్త్రగ్రంథము చద
వలేదు. మూఢభక్తి తప్ప నావద్దజ్ఞానములేదు. మీప్రశ్నలకు జ
వాబుచెప్పజాలను మతమునందాశక్తి కలవాడ నగుటచేతమతచిహ్నము
లైన కట్టు బొట్టు జుట్టు మానజాలకున్నాను. క్షమించండి. మీరు
పెద్దపెద్ద చదువులుచదివి శాస్త్రములు మతగ్రంథములు చూచిన
వారుగదా. మతమునకు విరుద్ధముగ కొండశిఖలు, కోరమీసాలు,
బట్టక్రాపులు, ప్రెంచికటింగులు, సిలాయిబొట్టులు ధరించి ప్రవర్తిం
చుట బాడియగునా? మీరువైష్ణవులో మతాంతరులో గుర్తుపట్ట
సాధ్యముగాకున్నది. కంచుకాగడ బెట్టి వెదకినను మతచిహ్నములు
కన్పడకనైనను గానబడవు. మాబోంట్లను పెద్దలనుగురువులను హే
ళనచేస్తారు. వైష్ణవసాంప్రదాయ లక్షణమా? స్వాములారా?

తి:- నవనాగరికతకు తగినట్లు వేషభాషలు మార్చుకోవలెను.

చక్రి:- తిరుపృణ్యాళ్వారుగారు! మతమంటెనేమో? మతధర్మములనగా నేమో తెలియని స్థితికి తీసుకవచ్చారుగురువులని శలవిచ్చుచున్నారు. గురువులుమనలో అక్కడక్కడ కొందరిని పంచసంస్కారులుగను, ద్వయాదికారి సంబంధులుగను, శరణాగత పరులుగను సాయించియున్నారు. వారికిగూడ తెలియదా?

తిరు:- వారికిగూడి దెలియదా? యనినన్ను ప్రశ్నించనేల. మీరు స్వయముగా వారిని ప్రశ్నించండి. ఈక్రిందిజవాబులు చెప్పెదురు. పంచసంస్కారమనగా చక్రాంకితములు వేయుట. ద్వయమనగా మూడువస్తువులు. ద్వయాధికారి సంబంధులనగా అనుష్టానములు చేయువారు. శరణాగత పరులనగా శరణాగతగోష్టిలో చేరకార, మకార, నుకార, జకారములు అనుష్టానములు చేయువారని అర్థముచెప్పుదురు.

చక్రి:- గురువుగారుగూడ యిట్లేచెప్పెదరా?

తిరు:- గురువుగారు యీమాత్రముగూడ చెప్పరు. అడిగినవారిని మీరు యేగ్రంథములు పఠించినారు యేశాస్త్రములు వల్లించినారు ప్రశ్నలువేయుట కెంతటివారు. దిగితేనేగాని లోతు, తినేనేగాని రుచి తెలియదు. పోపొండి, ధర్మములో ప్రవేశించండి అప్పుడు అంతయు మీకేతెలుస్తుందని చిరాకుచూపుదురు.

మా:- మనము మూఢులపాలెనుండుట కంటె యొకగురువు నాశ్రయించినగాని మతధర్మములు గోచరములు గావు. మత మభివృద్ధి జెందనేరదు. యిహపరములు ప్రాప్తములు గావు.

తిరు:- అపరాధిని! శిష్యులక్షేమంగోరి సత్యధర్మములు బోధించి మతాభివృద్ధిజేసి యిహపరములకు మార్గముచూపించి తరింపజేయు గురువులు నేడు గలరా? స్వామీ?

మా:- గురువు నాశ్రయించమంటి నిరసముగ పలుకుచున్నారు. లోకమున ఉత్తమగురువులు లేరనియా మీయభిప్రాయము

తిరు:- అయ్యా! దాసిగాడి విన్నపమాలకించండి నేను గురు ద్రోహినిగాను నిరసనముగ మాట్లాడుటలేదు. యదార్థమునే మనవి చేసుకొనుచున్నాను. చిత్తగించండి పూర్వము గురువులు సర్వకాల సర్వావస్థలయందును శిష్యులక్షేమం గోరి సర్వధర్మము లుపదేశించి సత్సాంప్రదాయకులుగ నొనర్చి తనంతటివారిగా తయారుజేసి నిరంతరము శిష్య శ్రేయోభిలాషులై మెలంగెడువారు.

మా:- యిప్పటిగురువులు? శిష్య శ్రేయోభిలాషులుగారా?

తిరు:- చిత్తచిత్తం. ఆలావిన్నపముచేయండి, ప్రస్తుతగురువులు ఎప్పుడు యింట్లోయిబ్బందిగాయుంటె అప్పుడే పిల్లలను అమ్మగారిని ప్రోత్సాహముచేయుటకు పురుషాకారిగారిని వెంటనిడుకొని శిష్యుల యిండ్లకరిగి మద్యమాంసాదులు మత్తుగామెక్కుచు సంతుష్టిగా పాపా ... వారికి మతధర్మములుగాని జ్ఞానోపదేశముగాని నివ్వకలోకాభి రామాయణముతో వారములు పక్షములు కాలక్షేపముగావించి శిష్యు లిచ్చినమట్టుకు అందుకుని స్వగృహమునకేగి శిష్యులిచ్చిన విత్తములో ... కుటుంబమునకు తక్కువది పేకాటలకు, మద్యపానమునకు వినో దముల క్రిందకాజేసి మరలా శిష్యాత్రికు బయిలుదేరి శిష్యుల పీడిం చుచున్నారు!

మా:- అట్లైన సద్గురువులులేరని యామీయభిప్రాయము. ... నామధారి వైష్ణవమతగురువులేనా?

తిరు:- సాధనచతుష్టి సంపత్తిగలవారు. సత్యాసత్యమును గ్ర హించినవారు సదా శిష్యక్షేమములు గోరువారెక్కడనో నివురుగ ప్పిన నిప్పుచందమున నుందురు. అట్టివారులభించిన మనమంతా వారికి ... లక్ష్యించవలసినదే. అట్టివారికి త్రికరణశుద్ధిగగురుశుశ్రూష ... వారికృపకు పాత్రులమై ధర్మము దరితరించవలసినదే అట్టి ... ప్రయత్నించండి. రెండుభానుండస్తాద్రిన్ గ్రుంకుచు ... మన నిజనివాసంబులకరుగుదము. (సశేషము.)

# 'సర్వధర్మాన్పరిత్యజ్య.....'

'చ క్ర ధా రి

(శరీరంలోని ఒకభాగంపైనైనా శరీరంఅంతటికీ ముప్పువస్తుంది. అలాగే ఒక జాతిలోని కొన్నిశాఖలుచేసే నిషిద్ధానుష్ఠానాలవల్ల ఆ జాతికంతకూ కళంకం కలుగుతుంది. మాయావాదుల మాటల మత్తులోపడివున్న చాత్తాద శ్రీవైష్ణవ సోదరుల్ని నిద్రనుంచి లేపటాని కేకథానిక రూపములోవున్న యీవిమర్శన వ్రాయబడింది.)

హేటుతీసి మీదబల్లమీద పెట్టి రైనుకోటు (Rain coat) విప్పుతూ అన్నాను 'నేనిక్కడ కూర్చోవచ్చునా' అని నేనెక్కిన తూర్పుబండిలో నాకంటే ముందుగా ఎక్కిన అయ్యగారితో - అయ్యగారే అనుకుంటాను, కాకపోతే ముఖంమీదా, భుజాలమీదా, బొజ్జమీదా, వెడల్పుగా స్పష్టంగా తీర్చిదిద్దిన వూర్ధ్వపుండ్రాలెందు కుంటాయి!——.

ఇష్టం లేకపోయినా, తనలాగే టిక్కట్టుకొనుక్కున్న నేనేమి వేచీపెడతానో అనే భయంచేత కుర్చోఅన్నట్టు తలవూపి, అబ్బాయీ మీరేవర్ణస్థులు అని ప్రశ్నించాడు.

'వైష్ణవులమండీ' అన్నాను. అతనిలోని గురుత్వమనే యింజనుస్పీడుగా పనిచెయ్యడం ప్రారంభించింది.

'మీ మాటకాదుగాని, మనవాళ్లు స్వరూపధారణ వేష భాషలు మానటంవల్ల బొత్తిగా ఆనవాలు పట్టడానికి వీలులేకపోతూ వుంది. జాతికి తలవంపులుగావుంది'. 'నేనలా అనుకోను. ఏమంటారా, బాహ్యాంతర శుద్ధిఅవసరమనిన్నీ కేవల వైష్ణవ వేషధారణ రాక్షస ప్రకృతి అనిన్నీ. శ్రీ వైష్ణవ సమయూనానిష్కర్షతో సాయిం

గారు. కేవలం వార్తలో కూడ భక్తికిని వేషధారణ ప్రయోజనకారి కాదనిపిస్తుంది. మరోమాట ప్రతిజాతిలోను కొందరు, వారి వేష భూషలు అవసరాన్ని బట్టి విడిచినవాళ్లున్నారు. అంతమాత్రం చేత ఆగ్రజాతులకేమిన్నీ గౌరవలోపం రాలేదు. మన జాతి హీనస్థితికి వచ్చిందంటే మనోబలం, ఇంద్రియ నిగ్రహం లేకుండా శ్రీరంగనీతులు చెప్పే దొమ్మరిగుడిసెలలో దూరే కొందరు మతాధికారులవల్లనే అని నా అభిప్రాయం'. అన్నాను ఆయనకు రోషంవచ్చింది. 'ఆచార్యుల తప్పేముంది' అని గద్దించాడు.

తప్పల్లా వాళ్లలోనేవుంది. ఆహారనియతి సహవాసనియతి తను వర్తననియతివారు పాటించలేదు సరికదా అమాయకులను మోసంచేసి శిష్యులుగా చేర్చుకొని వారిచేత కైంకర్యాల పేరుతో చిత్తచాంచల్యం గుహ్యచాపల్యాం తీర్చుకుంటున్నారు. రామానుజులు నిషేధించినా ప్రాకృతుల యిండ్లలో పితృకార్యాలు 'పెరుమాళ్ళు పూజ' పేరుతోచేసి వారు వండిన పదార్థాలను స్వీకరించడం కాకుండా నిషిద్ధవస్తులను సేవిస్తున్నారు. పరీక్షించకుండా అనర్హుల్నీ అజ్ఞానుల్నీ శిష్యులుగా చేర్చుకొని వారికి పంచ సంస్కారాల్ని ప్రసాదిస్తూ అ పవిత్ర సమయాల్లో అభక్ష్య భక్షణము అపానపానము చేయడమే కాకుండా 'ద్వయము' 'మిథున కైంకర్యము' 'మిథున శేషము' అనే పవిత్రమైన పదాలకు విపరీతార్థములు చెప్తూతూ నీచాతినీచకార్యాలు చేస్తున్నారు' అన్నాను.

వ్యవహారం శ్రుతిమించి రాగాన్నపడింది. ఈ తెలివితేటలకు గురుపరిభవం, మంత్రపరిభవంకూడాను! ఇది ఇంగ్లీషు చదువుకొన్న పొగరుబోతు తనం' అన్నాడాయన.

నాకు వళ్ళుమండింది. గురుపరిభవమంటే ఏమిటో మీకు తెలియకాలేదు. మీకు పుస్తకాలపేర్లు నేర్చుకోవడమేగాని లోనున్న సంగ్రహం కదా! వినండి, శ్రీవచన భూషణంలో

గురుపరిభవమంటే తెలిసికొనిన ప్రకారము నడుచుకోకపోవడమున్నీ, మంత్రపరిభవమంటే అర్థాన్ని మరచిపోవడమున్నూ అని చెప్ప బడ్డాయి. మతగ్రంథాలనుండిన్నీ సదాచార్యుల వద్దనుండిన్నీ తెలిసికొన్న ప్రకారం నడచుకోకపోవడంవల్ల మీలాంటివాళ్లే గురుపరిభవం చేస్తున్నారు. ఇక మంత్రపరిభవం. ద్వయశబ్దానికి వైష్ణవార్థం పిరాట్టి పెరుమాళ్లు అని విస్మరించి అభక్ష్యభక్షణానికి పనికివచ్చే రెండువస్తువులని విపరీతార్థం చెప్పుతున్న మీరు మంత్రపరిభవం చేస్తున్నారా తక్కినవాళ్లు చేస్తున్నారా? 43 వవార్తలో 'ఆశ్రయింపవలసిన మిధునము. (పెరుమాళ్లు పిరాట్టి) శేషత్వమునకు విషయము మిథునము. కైంకర్యమునకు విషయమైనట్టిదియు మిధునమే అని చెప్ప బడింది. మిధునకైంకర్యమునకు స్వామికిని దేవికిని చేసినసేవ అని అర్థంచెప్పి ఇళయపెరుమాళ్లు మిధునకైంకర్యము చేసెనని చెప్పియుండగా, మీరుచెప్పేనీచార్థానికి చోటెక్కడవుంది? మిధున శేషత్వమునకు స్వరూపమని ద్వయంలో అర్థం చెప్పియుండగా మీరు శిష్యులకుచెప్పే అర్థానికి ఆధారమేముంది- గురూజీ గురుపరిభవమంత్ర పరిభవాలకు అర్థం చిత్తగించారా? ఇంగ్లీషు చదువుకున్నంత మాత్రాన మతజ్ఞానం వుండదనుకొని మాలాంటివాళ్లను దబాయించబోవడం కేవలం అన్యాయం. మీరుచేసే నిషిద్ధానుష్ఠానాలకు ఆధారం ఎక్కడుందో నాకు బోధపడలేదు' అన్నాను.

పాపం అయ్యగారు కొంచెం చకితుడయ్యాడు.

'మీరుచెప్పిన ఆహారనియతి సహవాసనియతి అనువర్తనియతిన్నీ ప్రథమపడిలోని వాళ్లకుగాని చరమపడిలోనున్న మాకు వర్తించవు. మాకు విధినిషేధంలేదు' అని దబాయించబోయినాడు. 'చరమపడి లోనివారికి వర్తించవని ఏగ్రంధములోవుంది?' అన్నాను.

సర్వధర్మాన్పరిత్యజ్య......' చరమశ్లోకమే మాకు ప్రమాణం,

ఆవిషయం అలావుంచడి. ప్రథమపదిలోవున్న మీపిల్లకు
గాని మీశిష్యులకుగాని ఆహారనియతి మొ। విధించారా? శరణా
గతులయ్యేవరకు వారికి నిషిద్ధానుష్ఠానం కూడదని ఎప్పుడైనా
చెప్పేరా? 'ఆర్తియున్నా, అనువర్తన నియతియున్నా, ఆహార
నియతియున్నా సదాచార్యుడివల్ల వృద్ధిపొందుతవి' అని శ్రీ వచన
భూషణమందు సాయించియుండగా మీరు చేస్తూవున్న పనేమిటి?
స్వామీ! మీరు కేవలం దబాయించాలని చూస్తున్నారేకాని, మీ
మాటలకు మీపనులకు అన్వయం కుదరడంలేదు. మీకు విధినిషే
ధ లేదని చెప్పుతున్నారు. బ్రహ్మసూత్రాలలో స్తుతిమాత్రాధికర
ణంలో 21 సూత్రం చిత్తగించండి 'స్తుతిమాత్రముపాదానాదితిచేన్నా
పూర్వత్వాత్' ఉపాదానాత్ జ్ఞానులుకూడ, సంధ్యాముపాసీత అనే
విధి స్వీకరించడంవల్ల! స్తుతిమాత్రం, స్వేచ్ఛాచరణము స్తుతిమాత్రమే
కాదు. ఇతిచేత్ = అనేయెడలన=సరికాదు. అపూర్వత్వాత్=
విధియని. నరమాత్మవలె విధిలేనివారు కారు అని చెప్ప
బడింది. గురువు చరమపడి లోనివాడు, అతనికి నియమం లేదం
టున్నారు. గురువునుగూర్చి శిలక్షణమోక్షాధికారి నిర్ణయంలో
చెప్పబడిన విషయం గమని-చండి 'పూర్వాచారమున కనుగుణ
ముగ నడవశక్తతో ఆహారనియతి, సహవాసనియతి, అను వర్తనని
యతులు గలవాడై, డంబము అసూయ మొదలైనవి లేనివాడై,
భగవ శ్రవణము ఆ.గనాలి గనము మొదలగు క్షుద్రవిషయములం
దాసక్తిలేనివాడు...' అని చెప్పి, 'ఖ్యాతికిగాను, స్వలాభమునకుగాను,
ప్రవర్తనమునకుగాను తలగొరిగించుకొని వైష్ణవులకుండవలసిన నామ
ములు ధరించుకొని, మామూలు ప్రకారము నిషిద్ధానుష్ఠానప
రబద్ధ నసారులై తిరుగుచు అహంకార రహితులైయుండక,
సర్వదా విలక్షణులమైన వైష్ణవులమని యహంకారపడి వర్తించుచు,
సామాన్య విశేషశాస్త్రములగు రెండింటిని అతిక్రమించి ప్రవర్తించు

నట్టియు భయభట్టులను ఆశ్రయింపవలసినదని ఎవరైనా చెప్పినారా? అని శ్రీ ఎరుంచి అప్పాగారు ప్రశ్నిస్తున్నారు. ఇంకా వినండి. బ్రహ్మసూత్రాలలో సర్వాన్నను మత్యధి కరణంలో శ్రీరామానుజులు శంకరులు మధ్వాచార్యులు, ఏకగ్రీవంగా 'సర్వాన్నానుమతిశ్చప్రాణాత్యయే తద్దర్శనాత్' అనే సూత్రానికిచేసిన వాఖ్య చిత్తగించండి. ప్రాణాత్యయే ప్రాణావసానసమయమందు, సర్వాన్నానుమతిశ్చ=సర్వాన్నభక్షణకు అనుమతియివ్వబడింది; తద్దర్శనాత్=అట్లే శ్రుతియున్నది. ఈవిషయంలో ఒక ధర్మసూక్తం కనిపిస్తుంది. ఛాందోగ్యోప నిషత్తులో చక్రాయణముని దేశాటనంచేస్తూ ఆకలిచేత బాధపడి మరొకడు భుజిస్తూవున్న అలచందల నర్థించి వాటితో తన క్షుద్బాధతీర్చుకున్నాడు. దాతజలమివ్వబోతే అపానపానము చెయ్యజాలనన్నాడు. ఇక్కడి అభక్ష్య భక్షణ ప్రాణం రక్షించుకోవడానికి మాత్రమే అనే ధర్మసూక్తాన్ని గ్రహించాలి. చాందోగ్య శ్రుతిలో ఆహారశుద్ధౌ సత్వశుద్ధిః అన్నవిషయాన్ని మనం విస్మరించకూడదు. అన్నాను పాపం గురూజీడీలా అయిపోయాడు. "చరమశ్లోకంలో వున్న సర్వశబ్దాన్ని ఎలాసమర్థిస్తారు!" అని ప్రశ్నించాడు.

"స్వామీజీ, మనం సమర్థించవలసినదీ ఏమీలేదు పూర్వాచార్యులేస్వరం నిర్వచించి వుంచారు. అహంకారం విడిచిపెట్టి వినవలె ననే కుతూహలం చూపిస్తేచాలు. వారివాక్యాలు సముద్రఘోషవలె వినబడతాయి. శ్రీ పిళ్ళైలోకాజీయరుముముక్షుప్పడి చరమశ్లోకంలో 22, 23, 24, 25, 26 సూత్రాలలో చెప్పిన విషయాన్ని మనవాళ్ళ మహామునుల వాఖ్యానలతో చిత్తగించండి. "సర్వధర్మాన్ని పరిత్యజ్య" అని చెప్పడంచేత కొందరు అధర్మాలు పరివేసిస్తవి అన్నారు (22) అదికూడదు. (ఎందుచేత?) అధర్మాన్ని చెయ్యమని చెప్పక పోవడంచేత (23) "విలక్షణ మోక్షాధికారి నిర్ణయములో"............ స్వరూపాయ విరోధములను అనేకదోషములు సంభవించుటజేసి, నివృత్తి

ధర్మరూపములకంటె వేఱయినగు ప్రవృత్తి రూపములే త్యజింపవలసినవి గాను 'సర్వధర్మాన్' అనుట చెప్పబడినవని తెలియంగునది. వట్లు లక్షము చేసికొనినచో సాకల్యమునకు సంకోచము భాకుండునట్లు అన్నిటిని విడనాడితిమేని. ధర్మశబ్దము, అవతార రహస్యమును, పురుషోత్తమవిద్యను, దివ్యదేశవాసమును, తిరునామ సంకీర్తనమును దీ రాధమును మాలాకారత్వమును, యీమొదలగు వాటినన్నింటిని చెపుటంజేసి వీటినన్నింటిని నిశ్శేషము గాత్యజింపమసి వచ్చును కదా! కాబట్టి శబ్దశక్తి ప్రధానముకాదు. నివృత్తిరూప ధర్మముల నున్నా త్యజింపవలెనని చెప్పినట్లయిన "ఆనృశంస్యం పరోధర్మః" అని చెప్పియున్నట్టి లోకహితముకై పాటుపడుటను విడచి, శ్రుతి స్మృతి విహితములను పితృమాతృ గురుద్రోహంబులను, సాధుబాధను, ఆత్మహత్య, సురాపాన సక్రంస్తేయ గుర్వంగనా గమనాదు నాదులనున్నా చేర్చుచు పాపిష్ఠులై రావణ హిరణ్య కంసాదుల వలెనే ప్రపన్నులున్నా నిషిద్ధానుష్ఠాన పరులై సంచరింప వలసినవచ్చును. ఇట్లు స్వరూపాను రూపములగు గుణానుభవ కైంకర్యములను, ఆత్మగుణములగు శమదమాదులనున్నా విడిచిపెట్టి, నిషిద్ధంబులగు వాటినాచరించుచున్నయెడల "సర్వ" ధర్మసబ్దముల సంకోచము దీరును కాబోలు! అని పరిహసించుచు 'అయితే సంకోజము తీరుననుకొని వాస్తవము. మ అట్లు ప్రవర్తించకూడదు'! అని శ్రీ ఎరుంబి అప్పారావుగారు వాయించుచున్నారు.

శ్రీ పిళ్లైలోకాచార్యుల 118 వ వార్తలో యీమయాన్నే సిద్ధీకరించారు. గురీజీ, తమలాంటి పెద్దలు జ్ఞానముండిన్నీ విషయ ప్రవణులై ఆస్తికనాస్తికులవలె సంచరించడం భావ్యంకాదు. పూర్వాచార్యుల బోధనల్ని పెడచెవినిబెట్టి మీ స్వరూపమున్నా శిష్యుల స్వరూపమున్నా నాశనంచేసి జాతికి కళంకం తేవడం శోచనీయం.

తమరు జాగ్రత్తగా ఆలోచించండి. మనం సతులయెడల భర్తృధర్మం విడిచిపెట్టడంలేదు శిష్యులయెడల అధికారం మానడంలేదు. అధికారులయెడల సేవకావృత్తి విడిచిపెట్టలేదు. సర్వధర్మ పరిత్యాగులం అని చెప్పినమాత్రంచేత లాభములేదు. అహంకార మమకార దూషితమైన అధికారాన్ని విడిచిపెట్టాలి. మంచి శిష్యులను తయారుచేసి అధఃపాతాళానికి అణగదొక్కబడిన జాతిని ఉచ్ఛస్థితిలోనికి తీసుకొనిరావాలి.' అన్నాను.

పాపం ఆయన ఏమిచెబుతాడు? తీగకదిపితే డొంకంతా కదిలింది!

మేము నలుగురం ఆలోచించి మీరుచెప్పిన విషయాల్ని ఖండించి వ్యాసం వ్రాసి పత్రికలో ప్రచురిస్తాం అన్నాడు.

'స్వామీ, దాసుడు తెలివితక్కువవాడు. మతగ్రంథాలను అర్థంచేసుకొని ధర్మసూత్రాల్ని గ్రహించలేని జడుడు. దాసుడు చెప్పేవి ఏమున్నాయి. అంతా పూర్వాచార్యులు చెప్పిన విషయాల్నే దాసుడు మనవిచేశాడు. తమ సత్తువ పూర్వాచార విరచిత గ్రంథాలమీద చూపించండి శ్రీ పిళ్లలోకాచార్యులు, రామానుజులు, ఎరుంబిఅప్పా, మనవాళ్ల మహామునులు మొదలైన వారిమీదచూపించండి. దాసుడతమఆగ్రహానికి నిలబడగలడా!' అని అతివినయంతో విన్నవించేను. అంతే! అయరి న మనాతో మాట్లాడ లేదు. విమర్శనవ్యాసంకూడా పత్రికలలోపడలేదు — అమ్మయ్యబ్రతికాను!

* * *

'జ్ఞానమచు మిట్టానమిప్పై నన్నాకవేయుడయనాన కురునైయ డెండక్కాల్ మానిలత్తిర్ తేనార్ కమల తిరుమామకళ్ కొళునన్ తానే వైకుంఠం తరుం.'

'మున్నోర్ మొడింద ముత్తైతప్పామల్ క్కేట్టు పిన్నోర్ందు శామద నైప్పేళాతే తన్నెంజిల్ తో...నతే శొల్లియితు శుత్త వుపదేశ వార్తె మెన్బర్ మూర్కరావార్'

శ్లో॥ గురవ్ బహవస్సంతి। శిష్య విత్తాపహారకాః।
తమేకం దుర్లభం మన్యే। శిష్యహృత్తాపహారకం॥

---

# గమనిక.

---

నమోనా పత్రికలు కావలయునని అనేకులు వ్రాయుచున్నా రు. తపాలాచార్జి నిమిత్తం అర్ధణా తపాలబిళ్లలు పంపవలెను. లేనిచో నమోనా పత్రికలు బంపజాలము.

---

ఉచితము !                                   ఉచితము !!

# సుదర్శనం ప్రాతసంచికలు

పోష్టు ఖర్చుక్రింద 0—?—0 పంపే వైష్ణవులకు సుదర్శనం ప్రాతసంచికలు ఉచితముగా పంపుతాము.

ఇందులో వైష్ణవమత సామాజిక దురాచారాలమీద వ్రాసిన ఘాటైన విమర్శనలు, గీతకలు, కథలువున్నాయి. ప్రతి వైష్ణవుడు తప్పక చదవాలి.

---



# వినండి! వినండి!!



1938 సం॥ మే నెలనుండి 1939 ఏప్రిల్ వరకు వెలువడిన సంచికలన్నియు మాపాతచందాదారులకు పంపినాము. కావున వారు 1939 జూన్ నుండి మరల చందాదారులుగ ప్రవేశింపవలసియుండును. వారిదివరలోవలెనె వారిచందాధనమును పంపి మమ్ములను ప్రోత్సహించవలెనని కోరుచున్నాము. 1939 జూన్ నెలనుండి 1940 మే నెలోగా చేరుచందాదారులందరు ఈలోగా ప్రచురింపబడు సంచికలన్నియు తీసుకొనవలసియుండును. ఈపత్రిక ప్రచారముకొరకే యుద్దేశింపబడినది గావున దీనిఅభివృద్ధిచందాదారుల అభిమానములోనే కూడుకొనియున్నదని మనవిచేయుచున్నాము.

దసరాలోగా చందాదారులగ చేరువారికి దసరాకు మేము వెలువరించబోవు హిందూమతౌన్నత్యమను 40 పేజీల గ్రంథము బహుమతిగా యొసంగెదము. మా పత్రికా పోషకవర్గమందు చేరువారికి "బ్రహ్మసూత్రములు (త్రిభాష్యలఘుటీక) 300 పేజీల గ్రంథము బహుమానముగా పంపెదము. వారియొక్క ఫోటో సంవత్సరసంచికలో ప్రచురింతుము.

అభిమానులుగా చేరువారు పోస్టుకర్చు పంపినచో ఆగ్రంథమును పంపగలము.

విద్యాధికులు, ఉద్యోగులు, మతాభిమానులు, జాత్యుత్సాకులు, మాపోషకవర్గమందుచేరి మమ్ములను ప్రోత్సహింతురుగాక!

# సుదర్శనం.

సంపుటము | ఆగస్టు, 1939. | సంచిక 2.

## సుదర్శనం

యతిరాజం శ్రీనివాసం,
మచిలీపట్టణం.

సుదర్శనం అనగా, విజయనగరంలో ప్రత్యేకంగా చాత్తాద శ్రీవైష్ణవుల శ్రేయస్సు కొరకు, ప్రచురింపబడుచున్న మాస పత్రిక. ...తేగాని, దురాచారులను సంహరించు విష్ణుచక్రముకాదు. తెలియక దురాచారములలో మెలగుచున్న భాగవత శ్రేణిని బ్రతిమలాడి మార్చెడి శాంతచక్రము. కాబట్టి ఎవ్వరును, ఈ పత్రికకు సభ్యులగుటకు జంకవద్దు. చదువురాదని యూరకొనరాదు. తమ బాలురచేనైన చదివించుకొనవలయును. మనము మతసంగతులు తెలిసికొనుట యవసరముగదా! కులగౌరవ విషయములను అందరును వ్రాయవచ్చును. ఈ పత్రిక నెలకొకటి తమ పాదములదగ్గరకు వచ్చును. ఇందుకు పోస్టుఖర్చులు సంవత్సరమునకు 6 అణాలు అగుచుండ, బీదవారి నాశించినది 4 అణాలు మాత్రమే. ధనవంతులు స్వజాతి పత్రికను ప్రోత్సహింప సంపూర్ణ సహాయముచేయుట పుణ్యము, ధార్మికత్వము

పునర్జన్మ సుఖావలంభనకు గారణము. మన పత్రికకు యింతవరకు తగు సహాయము లేనందున బహు విచారముతో నేనిటు వ్రాయవలసి వచ్చెను.

దురాచారములనగా:—సుఖప్రదములైన శారీరక మానసిక ధ్యాత్మిక శక్తులను చేరనివ్వక యున్న శక్తులను పారదోలు అగౌరవ పనులను దురాచారములందురు. ఆ దురాచారములెవ్వియన, (1) సురార్పణ (2) పరకులభోక్తత్వము (3) బలి యను నైచ్యత్రయము

1. సురార్పణ యనగా:—సురను (కల్లు సారాయములను) కులకర్మలందు దైవార్పితము సేయుట. సుర, బలత్రయ వినాశము నరించునది గాన, దీనిని పంచమహా పాతకములలో నొకటనిరి. దీని త్రాగుడు భ్రాంతిగలవారలందరు గృహకర్మలన్నింట పూజాపునస్కా ములందర్పించుచున్నారు. అంతేగాక తాము పురోహితముచేయు కులములన్నింట, యిది సదాచారమని భోధించిరి. అమాయకులు మోసపోయిరి. అటు సురార్పణ చేయువారు, త్రాగుచు, తందనాలా డుచు, క్రిందపడుచు, దెబ్బలుతినుచు, మంచిచెడ్డలులేక అందరిని దూ షించుచు, జబ్బుపడుచు, తిండికి మాడుచు కాలక్షేపము చేయుచు న్నారు. కులకర్మలకు గాని, నిత్యసేవలకు గాని డబ్బులేనప్పుడు, య న్నదమ్ముటయో, తాకట్టు పెట్టుటయో, దొంగిలించుటయో, మో గించుటయో, యితరులకొట్టుటయను వృత్తి నలంకరించుటయో జరు గుచున్నది. మోరు శాలలందు, గొప్పతనమునకు అమ్మకులమెదు లావుబొట్లతో, వర్ణక్రమము అర్థము తెలియని తనియల హెచ్చుతగ్గులకు తగవులాడుకొని తన్నుకొనుచున్నారు. స్వేచ్ఛావిహారమునకు, మన మతముగాని కులమన దగదనుచున్నారు, ఈ త్రాగుడు మొంత శా సికమోగాని, 70 ఏండ్ల పౌరోహితులు వ్యభిచరించుచు, ద్వితీయ వివా హములకు వెదకుచున్నారు. వీరికిట్టి ప్రయత్నములలో కొందరు సహా యపడుచున్నారు. ఈ దురభ్యాసములు ఉన్నవన్నీ యిండ్లకు పోవునో

వారి ద్వేషముతో పరామరిక చేయగోరుదురు. ఎందరో తమగొప్ప
హస్తులను పోగొట్టుకొనుచున్నారు. తదితరకులములలో పురోహితు
తమయాస్థిని వృద్ధిచేయుచున్నారను సంగతిని గమనించకున్నారు.
ఘోష్ఠి సల్పునప్పుడు త్రాగుట యితరులు చూచుట సిగ్గుగానెం
సంబంధులను తప్ప, స్వకులనైనను చూడనివ్వరు. స్వకులమందలి
మాదీయులకే యాచారము బహుకష్టముగా యున్నది.

౨. పరకులభోక్తృత్వమనగా:—తదితర కులములందలి వైష్ణవమ
యిండ్లలో పౌరోహితము చేయునప్పుడు, వారిపంక్తిని వారివం
ములను భుజించుట(భోక్తగాయుండుట పరకులభోక్తృత్వమని పేరు.)
పురోహితుడు భోక్తగాయుండి, తనపంక్తిని పవిత్రముసేయు
న్నాడను మహావిషయము నీచముగా పరిగణింపబడెను. పురోహి
గాడుప్పరి స్వాములయిండ్లతింటున్నాడని మంగలివారును, మంగలి
ముల యింట భోక్తగా యుంటున్నాడని చాకలివారును, వారింట
చున్నారని కాపువారును, అధములింట భుజించుచున్నాడని వెలమ
కుల పురోహితుని అసహ్యించుకొనుచు, వారింటపంక్తిని సాపాటు
యవద్దని యాజ్ఞయొసంగుచున్నారు. ఎట్టి కష్టమో, ఎంతయగౌరవ
గమనించక, ఒకరికి తెలియకుండ మరొకరి యింటికి కుక్షింభరత్వ
మాత్రమునకు భోక్తగాయుంటున్నాడు. ఇటుల పౌరోహిత్యలాభము
పోగొట్టుకొనుచున్నారు. తదితర పౌరోహితులు మెంత ధనవంతులు
యున్నారో, వీరెంత బీదదశలో యున్నారో చూడుడు, పూటతిండి
తనుపగడచునా! తమతో వ్యభిచరించవచ్చుగాని, యితరులతో
న్యాయముచూపు కాలమున పౌరోహితుడెంత జాగ్రత్తగామెల
యునో తెలియదా! మాతో భోజనసంబంధం గలవారలు, వివా
సంబంధ మొందుచే పొందరాదనుచున్నారు. నిజమేయని, తది
కులములలో పనికి రానివారితో సంబంధ మొందుచున్నారు. ఛీ
స్వభావులైన యుండిన-చో అంతటితో యీ అంతర్జాతీయ వివా

హములాగెడివి. అంతటితో ఆగక పడపుస్త్రీలకు సంతానము బడయుటయు, యా సంతానమును ఏ ద్వితీయ వివాహకుడో, బీదవో, వృద్ధుడో, సంకరుడో, నవీనుడో, వివాహమాడుటయు, అందుకు కులజులు సహాయ మొనరించుటయు, వారే చేసిరి నాకేమని, మరొకరు సులభముగా లభించినదానిని అతి నిర్లక్ష్యముగా, నిశ్చింతగా గృహిణిగా నేర్పరచుకొనుటయు, పార్టీలుగల్గుటయు, ఒకరినొకరు వెక్కిరించుకొనుటయు, వినువారికెంత నీచముగానో గాన్పించుటయు, జరుగుచున్నది. ఉన్నతకులములయందలి యధికులతో తులతూగగల్గిన పండితులు, భక్తులు, యుద్యోగీయులు, ధనవంతులు మనకులమందును యున్నారు. వీరికిని పురోహితవర్గమునకును సంపూర్ణ బంధుత్వములున్నవి. అందుచే గౌరవార్థము ధర్మవిషయములు పురోహితులకు చెప్పినచో, క్రొగుబోతుతనము, ప్రతియింట తినుట మతాచారమను మనకులమున యేదిచేసినను, తప్పనదగునా యని జబాబిచ్చుచున్నారు. తిట్టుచున్నారు. మరనేకవిధముల హింసింప జూచుచున్నారు. అందుచేతనే ఎవరిగతివారు చూచుకొనుచున్నారు. నిర్భయులు కొందరు కొంతకాలము సత్ప్రచారము సల్పివేసారు సమయమునకు సుదర్శనము వెలువడెను. ఇన్ని యాందోళనలకునూ దురాచారములే కారణములుగదా!

4. బలియనగా:—పుట్టుకలందును, వివాహములందును, చావులందును. వ్రతములందును, రోగములందును శుభత్వముకొరకు, తుచ్ఛదేవతులకు జంతువులను, పక్షులను నరకుట బలి యనంబడును. పూర్వము నరబలికూడ యుండెడిది. బలి యిచ్చుటవలన ఏమియు లాభములేదనియు, ఎవరి ఖర్మ వారనుభవించితీరవలయుననియు, ఇట్టి హింసలు కొసరి యప్రాప్తముల కొని తెచ్చుకొనుటయు యను సత్యము తెలసికొని ఒ[illegible] జంతులనేకులు బలియిచ్చుట మానిరి. భక్తులు, అమాయకులకు మోక్షమొసంగ [illegible]ర్పడిన ప్రాణములు యిట్టి సత్యమునే

శోభించనందున యింకనూ యీ పిచ్చపనులు పవిత్రముగా జరిపించు చున్నారు.

ప్రస్తుత ముఖ్యకర్తవ్యము:—కులమంతటను సమానాచార ప్రసంగించుటయే విధి. పై వివరించిన దురాచార త్రయమును అన్ని శాఖల మానుటయు, అందరికిని యొకగురువే యుండుటయు, ఆ వివాహముల సంతానమును సర్వులు వివాహమాడకుండుటయు, సర్వ ఈశ్వరుతిరువారాధనపరులవుటయు, అందరును ఒకే పూజావిధాన అనుసరించుటయు, జరిగినచో సంఘీభావమేర్పడును. సంఘీభావము లేనందున మనబీదబాలురకు పాఠశాలలందు అర్ధజీతపు హక్కు సంపాదించలేకపోతిమి. ఎన్నిసార్లు సంఘములేర్పరిచిననూ నిలువలేదు.

సుదర్శన చక్ర బొమ్మను గుమ్మమునకు తగిలించినకాదు, దండమును అంటించుకొన్న లాభంలేదు, వెదురు పుల్లలతో యీ స్వరూపమును కులకర్మలందు యుపయోగించుట అనవసరము, ఈ శాంతి సుదర్శనమునకు సభ్యులగుటయు, మత మర్మముల పత్రికయందు చేరుపుటయు, ముఖ్యకర్తవ్యము.

నీతియే సుఖము, త్రాగుడు, వ్యభిచారము, బలియను నైత్యకార్యము దుఃఖము, ధర్మమే గౌరవము, లోభత్వమే అగౌరవము, సంఘీభావమే బలము, బాధమె బలహీనము, దైవధ్యానతుల్యమైన దైవహాంశయే దివ్యభోగము, మోనవేషభాషలు నిజభోగాటంకములు అను సత్యమును వెల్లడించు యీ సుదర్శనమును సర్వులు స్వీకరించెదరుగాక:—

---

# "దివ్యతార"

మధునాపంతుల వేంకట సూర్యనారాయణమూర్తి,
[ఆంధ్రిసుటీర్.]

అదిగిదిగో రోచస్సులావరించాయి
కర్షకులెల్లరు హర్షమ్ముతో తమ
హాలములగైకొని పొలముల కేగారు
కోయిలలు గొంతెత్తి హాయిగాపాడేయి.

తెలుగువారలెల్లరు కలకలలాడుచు
విశ్వదాతయశమ్ము వినుతించుకొనుచుండ్రి
తెలుగుజెండాలతో "దివ్యతార"ను గూర్చి
గీతాలు, పద్యాలు కీర్తించుచున్నారు.

భాగ్యదర్శనాయాత సమ్మోదము
వారియంగలేని నిర్భాగ్యుడనై నేను
అట్టి నివ్వెఅగంది కట్టెదుట చూచాను
చూచాను చూచాను చూడగానంతట
సమ్మోదభాష్మముల్ జలజలపురిశాయి.

అంతలో నామూర్తి ఆనందతేజస్సు
నావరించుచు నిట్టి ఆంధ్రిసనిబాసి
అంబరవీధిలో నైక్యమానొక దివ్య
తారను నేను కన్నార వీక్షించాను.

ఆదివ్యతారయే ఆకాశవీధిలో
మిలమిలానిశలందు మెరసిపోతోంది
భారతీయులు మీరు తేరిపారగచూచి
హృదయపూర్వకముగా నర్పింపరారండి".

# ఎక్కడనున్నాము?

[సోదరులు శ్రీమాన్ న. వెంకటరమణయ్యగారు లోగడ అరవజిల్లాలలో సంవత్సరములపాటు చాత్తాద శ్రీవైష్ణవసంఘములు స్థాపించియు, కాన్ఫరెన్సులు జరిపించియు, "చాత్తాదశ్రీవైష్ణవర్" అను తమిళపత్రికా రాజమును ప్రచురించియు మనసంఘజాలయొక్క ప్రేమాతిశయములను కృతజ్ఞతను చూరగొన్నారు. 1931 సం॥లో గవర్నమెంటువారు సెన్సెసుతీసుకున్న రోజులలో వీరున్నూ వీరి అనుచరులున్నూ చాత్తాదశ్రీవైష్ణవపదమునేగాని సాతానిపదమును మనసంఘజాల వాడరాదని అందోళనలేవతీసి కొంతవరకు కృతకృత్యులైనారు. మేముకోరగా తమ అనుభవమును తెలుపుతూ లేఖవ్రాశారు. ఆలేఖలోని భాగము "ఎక్కడనున్నాము?" అనే శీర్షికక్రింద ప్రచురిస్తున్నాము. చాత్తాదశ్రీవైష్ణవ సంఘము యొక్క గౌరవాన్ని కాంక్షించే పెద్దలంతా ఇదిచదివి భావికార్యక్రమం నిర్ణయించుకోవాలి. — సంపాదకుడు.]

మున్ముందు మనజాతి నామధేయమును "సాతాని" యని గవర్నమెంటు రికార్డులలో వాడుటను మాన్పించవలసి యున్నది. 1931 సంవత్సరములో సెన్ససు లెక్క యెత్తుసంధిలో మద్రాసునందును అరవజిల్లాలయందుండియు మనవారందరిని మహజర్ల మూలము సభాతీర్మానముల మూలమునను మనజాతిని "చాత్తాద శ్రీవైష్ణవ" లని సన్సెసురిపోర్టు మున్నగువాటిలో పేర్కొనవలెనని సర్కారువారికి తెలుపుడని మనవారందఱికి మద్రాసునుండి కరపత్రములు పంపించితిమి. ఆకరపత్రములను మద్రాసునందచ్చువేయించి పంపుటకు ఖర్చులకు ప్రథమ డొనేషను రూ 10—0—0 లను అప్పుడు సర్కారునందుండి నేను, యచ్చటి మునిసిపలు కౌన్సిలరై యుండిన మన సోదరులు శ్రీ గోపాలకృష్ణయ్యవారి వద్దనుండి తీసి పంపించితిమి. అప్పుడు ఈప్రాంతములలో నల్లే సర్కారువారికి వ్రాసుకొంటిమి. అందుపై సర్కారువారు "మీారేమని ఆయాచోట్లలో లెఖ్ఖ వ్రాయువారికి చెప్పెదరో అట్లేవ్రాయమని ఆర్డర్లు పంపించియున్నా

మని జవాబిచ్చిరి. అందుపై సాధ్యమైనంత మనవారందఱికి నోటీసులు పంపించి ఆందోళనము చేసితిమి. దానిఫలితముగ సెన్సెసు రిపోర్టులలో చాత్తాద శ్రీవైష్ణవులని గుర్తించినట్లు సర్కారువారు తెలిపిరి. కాని ఆపేరుకు చేరినట్లు 'సాతాని' యని బ్రాకెట్టుల మధ్యనచ్చువేసిరి. పిమ్మట కాన్ఫరెన్సులలో నీతీర్మానములజేసి వత్తిడిజేసితిమిగాని నిరంతర కృషిజరుగకపోయెను. మదాసు మంత్రివర్గములో నొకరైన శ్రీ॥ శ్రీ॥ పానుగంటిరామాయణం గారుండినప్పుడు వారితో మద్రాసులో S. I. R. ఫెడరేషను సభాసందర్భములో ఒకతూరి మన నామధేయ విషయమై ప్రస్తావించియుంటిని. వారాలోచించెదమనిరి. కాని పిమ్మట మనవారు కృషిచేయలేకపోయిరి. పోయితిమి. ఆసందర్భమున కంసాలలను పేరును విశ్వబ్రాహ్మణులని మార్చవలెనని ఆసంఘజులు కృషిచేసిరి. శ్రీ॥ శ్రీ॥ గానాల రామమూర్తి మున్నగువారి పరిశ్రమవల్ల వారి కోర్కె సిద్ధించినది. మనవారును ప్రయత్నమును విడువక చేసిన ఫలము చేకూరగలదు. ఇప్పటి మంత్రివర్గము మనకోరికను నెరవేర్పగలదను నమ్మికగలదు. ప్రధానామాత్యులు శ్రీవైష్ణవ సంఘజులు. అన్నిసంఘములను సమానమునకు తేవలయుననువారు కూడ కాని యీసందర్భములో మీరు పత్రికతో మనవారికి పంపించియున్న విజ్ఞాపనపత్రము 'ఎన్నాళ్లీనిద్ర' యన్నది సమయసంజీవినిగ నున్నది నాదేహా అసౌఖ్యత కొంత నిమ్మళించినతోడనే ముందువారము సేలం పానుకుజని మనవారి సభను జరిపి తీర్మానించి ప్రభుత్వమునకు వ్రాసెదను. ఇట్లే మరికొన్నిచోట్లలోను జేయునట్లుచేసెద.

మన సంప్రదాయ గ్రంథములగు తమిళ గ్రంథములలో 'చాత్తిన మునిగళ్' 'చాత్తాద మునిగళ్' 'చాత్తిన శ్రీవైష్ణవర్' 'చాత్తాద శ్రీవైష్ణవర్' అని వాడియున్నారు. గాకను బ్రాహ్మణ గోష్ఠిలోనే చాత్తాదశ్రీవైష్ణవులు చేరినవారనుటకు కొన్నిప్రమాణము లున్నవి. [illegible] వర్ణించి వ్రాసియుండిరి.

క్షుమ మనవారిలో భిన్నాభిప్రాయములు బయలుదేరినవి. అయినను మనారెవరును 'సాతాని' యనుటను మాత్రమొప్పుకోరు. కావున చాత్తాద శ్రీవైష్ణవులను పేరునకు ఆందోళన చేయవలెను. అట్లే ముదముగాక!

"Castes & Tribes of Southern India" అను గ్రంథములో మనవారినిబట్టి దీర్ఘముగ చర్చించి వ్రాసియున్నారు. అరవ పుస్తకములలోను మరికొన్ని పుస్తకములలోను సాతానియనియు క్లాసనియు గ్రామమున బహిష్ప్రదేశమున నివసింపవలసిన వారనియు దూషించి వ్రాసియున్నారు. వాటిని ఖండించి పత్రికలలో మేము కొందర మప్పుడప్పుడు వ్రాసియున్నాము. మను చేయవలసినపని మెండుగానున్నది.

న. వేంకట రమణయ్య,
"చాత్తాద శ్రీవైష్ణవర్" పత్రికా సంపాదకుడు,
సే ల ం.

---

ఉచితము! ఉ చి త ము !!

# సు ద ర్శ న ం ప్రా త సం చి క లు

పోష్టు ఖర్చుక్రింద 0—2—0 పంపే వైష్ణవులకు సుదర్శనం ప్రాతసంచికలు ఉచితముగా పంపుతాము.

ఇందులో వైష్ణవమత సామాజిక దురాచారాలమీద వ్రాసిన ఘాటైన విమర్శనలు, గీతికలు, కథలువున్నాయి. ప్రతి వైష్ణవుడు తప్పక చదవాలి.

## శ్రీకృష్ణ తిలక్ ప్రచారమండలివారి

# సవాల్ ప్రకటన?

### ? గీతారహస్యములోని రహస్యములు. ?

మెతిరాజం వెంకటకృష్ణదాసు.

మహాశయులారా!

మాహేలాపురమున క్రిష్ణానంద ప్రెస్‌లో అచ్చొత్తింపబడి శ్రీకృష్ణ తిలక్ పరిచారమండలి వారిచే ప్రకటితమైన పత్రిక నాహస్తగతమై కొలదికాలమైనది. యీమండలి మాహేలాపురమందెప్పుడు స్థాపించబడెనో, దాని కార్యక్రమాద్యక్షులగు వారి నామాక్షరము లెవ్వియో నాకేగాక అనేకుల కింతవరకును తెల్లముగాలేదు. శ్రీవారి ప్రకటనలోని ముఖ్యాంశముల నింను బొందుపరచి గీతారహస్యములోని కొన్ని రహస్యముల నీ దిగువ వివరింపుచుంటిని బుద్ధిమంతు లెల్లరును సావధాన చిత్తులరై పరికించగలరు.

మోసపోకుడు విన్నన్న చెప్పినదల్లా వేదమనుకొనకుడు హిందూ మతమునకు పరమోత్కృష్టమైన గ్రంథములకు తప్పుడర్థములు చెప్పే భాషకారులమనియు, గీతోపన్యాసకులమనియు చెప్పుకొనుచు ప్రజల మోసగింపుచున్నారు. లోకోపకారమైన సిద్ధాంతముల (ద్వైతాద్వైత విశిష్టాద్వైత) కనుకూలించు యిన్ని అర్థములెట్లువచ్చునో కొంచమూహించండి. వివేకముతో ఆలోచించండి తప్పుడర్థములు చెప్పకపోతే యెట్లు సమకూర్చుకొనవచ్చును. యీతప్పుడర్థములన్నిటిని లోకమాన్య తిలకుమహాశయుడు తన గీతారహస్యములో (గీతారహస్యమను గ్రంథములో వివరించియున్నాడు. అందువల్లనే తిలకన్నను తిలకుగారి భాష్యమన్నను యీ గీతోపన్యాసకుల కింత తొందర

యుత గాబరాగా చేతగానివాళ్లు దూషణవల్లగాక మరియెట్లు సమ స్తుత్తొనగల్గుదురు. సవాల్ యేగీతోపన్యాసకుడైనను సరే తిలకు వలె యిట్లా యిట్లాతప్పు యిట్లా యిట్లా తమ భాష్యములు రైటని వ్రాయనండి. భాష్యకారుల నడువగలసినదేగాని. మాచేతగాదనెడు వారు చెప్పుతారు. అంతకంటె యేమిచేస్తారు. తమ మతమున కనువచ్చిన అర్థమును చెప్పుటేగాని శ్లోకములోనున్న అర్థము చెప్పరు, మరీ మాట్లాడితే మేము భాష్యకారులము అంత మాత్రము స్వతంత్రము ఉండవద్దా అంటారు కాబోలు నని వ్రాసిరి ఇదియే శ్రీకృష్ణతిలక్ ప్రచారమండలివారి ప్రకటనలోని ముఖ్యాం శములు.

వీరు ప్రకటించిన విషయములను బరికింప యధేచ్ఛముగను పక్షపాతముగను భాష్యకర్తలగువారి లోపములనెంచినట్లు తెల్లమైన దాని తమ గీతారహస్యములోని రహస్యములను బాగుగ బరికించి చూ కనుపించదు. వలనన శ్రీ తిలకుగారు శంకరస్వాముల అద్వైత మతము నంగీకరించి సన్యాసమును మాత్రము త్రోసి రాజనిరిగాని అద్వైతమతమును దిరస్కరించి తామొక న్యాయమతమును స్థాపించ లేదుగదా యీ వుభయులకును గల భేదమింతియేగదా తరువాత.

శ్రీ తిలకుగారు తమ గీతారహస్యమున 250, 251వ పేజీల యందు ఉత్తరవేదాంత గ్రంథములయందు చెప్పబడిన పంచీకరణము ప్రాచీనములగు నుపనిషత్తులందు లేదనియు, తన్మాత్రలగు పంచమహా భూతంబుల నేనింటిని ఒప్పక ఛాందోగ్యోప నిషత్తులో తేజస్సు, జలము, అన్న (పృథ్వి)అను నీమూడు తత్వములనేకొని, ఈమాట ప్రకార మిశ్రమణముచే (అనగా త్రివృత్కరణముచే) బిదప వివిధ పదార్థములు నిర్మితమైనవని చెప్పబడిన యదని, 251వ పేజీలో శ్వేత కేతువునకు తన తండ్రి యిట్లే తెలిపెననియు, ఈవిషయములు ఛాందోగ్యోపనిషత్తు నందేడవఅధ్యాయమున కలదని తెలిపిరి తరువాత

"అజామేకాంలోహిత శుక్లకృష్ణాం బహ్వీః ప్రజాః సృజమానాం సరూపాః" అను ఉపనిషద్వాక్యమునకు 'ఎరుపురంగుగలదియు, (అనగా తేజోరూపమైనదియు) తెల్లనైనదియు (అనగా జలరూపమైనదియు) నీలరూపము (అనగా పృథ్వీరూపము) గలదియు, మూడురంగులు (అనగా మూడుతత్వములు) గలదియునైన, యజ (అనగా ఆడుమేక) యుత్పన్నమైనది. అందుండి వివిధసృష్టి జరిగెను అని శ్వేతాశ్వతరమున చెప్పబడెననుచు 252వ పేజీయందు 6వ పంక్తిలో శ్వేతాశ్వతరము త్రివృత్కరణమునకు వ్యతిరేకమగు పంచీకరణమును బోధించు గ్రంథములలో నొకటిగా కనుపరచిరి. ఇదేటి న్యాయమో తరువాత మూలములగు మహాభూతము లయిదింటిని అంగీకరింపక పదార్థముయొక్క యుత్పత్త్యవస్థలనుజేయు ఛాందోగ్యోపనిషత్తునందును నీమార్గమే కలదనియే వేదాంత సూత్రములలో చెప్పబడెననియు, కావుననే పంచీకరణము బాదరాయణాచార్యులుపయోగించరనియు, వ్రాసిరి. పిమ్మట తైత్తిరీయమునందును శ్వేతాశ్వతరమునందును, వేదాంత సూత్రములందును గర్భోపనిషత్తునందును తుదకు గీతలయందును మూడింటికి మారుగ పంచమహాభూతములు చెప్పబడినవనియు వ్రాసిరి. మరియు త్రివృత్కరణము మిగుల ప్రాచీనమనియు, అయినను మూడింటికి బదులుగ నేనింటిని అంగీకరించిన పిదప త్రివృత్కరణము యొక్క పద్ధతి ననుసరించియే పంచీకరణము వెలువడినదనియు, ఇట్లు కావున త్రివృత్కరణము వెనుకబడినదని స్పష్టముగా కాన్పించుచున్నదని వ్రాసిరి. పరికింపుడు.

పంచీకరణము శ్రీ వేదవ్యాసు (బాదరాయణాచార్యు) లుపయోగింపగని ఒకమారును, శ్రీకృష్ణవచోమృతమును, శ్రీ వేదవ్యాసనుపయో విరచితమును అగు శ్రీ మద్భగవద్గీతయందు పంచీకరణము

...గాని మరియొక మారును వ్రాసియున్న వ్రాతలలో నొకదాని కొకటి సంబంధమేమైన కలదా? చదువరులే గ్రహించగలరు.

తరువాత ఈ మహాశయులు వ్రాసిన త్రివృత్కరణము ...నమగునేని అట్లే భూమియందు ప్రథమమున మూడురంగులు ... ఆడుమేక యెచ్చటజనించెనో, ఆ ఆడుమేకయందు మానవాదు ...యేతావున జనించెనో, లేక ఆనాడు మేకయే పరబ్రహ్మ ...పమని వీరి ఉద్దేశమో నేదియు స్పష్టముగా తెలుపజాలక ...చితముగా జారవిడుచుట వీరి మతసంస్కరణమా.

ఆడుమేకయందుండి అనేక ప్రజాసృష్టి జరిగెనని వ్రాసిరిగదా? ...నకు నిదర్శనము వీరి గీతారహస్యమేనా మరి యేశాస్త్రములై ...ను కలవా? మూడురంగులుగల ఆడుమేకయందుండి ఇక్కాలమున ...డ వివిధసృష్టి యేలజరుగకుండునో? మరియు నీతిలకు మహాశ ...యులు మెరుపురంగుకలది (అనగా తేజోరూపమనియు తెల్లనై నది ...అనగా జలరూపమనియు) నీలారూపము (అనగా పృథ్వీరూపమనియు వ్రాసిరిగదా? యోచింపుడు క్షీరము తెల్లనై యుండునుగాని నీరము ...నైయుండునా? ఆకసమునందలి వర్ణము నీలముగనుండును గాని ...థ్వీ నీలముగానుండునా? సూర్యచంద్రాదుల యందుండునది ...సనంబడును గదా ఆతేజస్సు మెరుపుగానుండునా? మరియు ...మేకాం' అను ఉపనిషద్వాక్యమునకు తేజస్సు, జలము, పృథ్వీ ...ను నీమూడును ప్రథమమున కలిగియున్నట్లు వ్రాసిరికదా? పంచ ...భూతములలో ఆకాశము, వాయువు, అను నీరెండును లేకనే ...స్సు, జలము, పృథ్వీ, అను నీమూడును ప్రథమమున కలిగియుం ...ని తెలుపుటకు దృష్టాంతరము వీరి గీతారహస్యమేనా మరి యే ...శాస్త్రములైనను కలవా? తేజస్సు జలము, పృథ్వీ, అను నీమూడింట ...వాతనే వాయువు, ఆకాశము, అను నీరెండును కలిగెనని వీరు వ్రాసినది యదార్థమనియు, ఆడుమేకయందుండి జరిగినదని వీరు

వ్రాసిన సృష్టిక్రమము సరియైనదనియు, సైన్సు శాస్త్రమునుగాని, ప్రత్యక్షానుభవమును గాని, శారీరశాస్త్రమునుగాని, విజ్ఞానశాస్త్రమునుగాని అనుసరించియున్నదని ఇక్కాలమున గూడ నవనాగరికా ప్రపంచమేగాక విద్వాంసులు గూడ నంగీకరింతురా? జనసామాన్యము నకు సహా తెలియు వర్ణము (రంగు)లయొక్క భేదాభేదములు సయి తము తెలియని 'మహాశయులు వేదాంత సూత్రముల నెట్లు గ్రహించిరో పాఠక మహాశయులే గ్రహించగలరు. యథేచ్ఛముగా దూషించు యేగీతోపన్యాసకుడైనను సరే యని సవాల్ జేసి యితరుల వ్రాతలందు తప్పుటర్థములను గ్రహించు సమర్థులకు 'అజామేకాం' అను ఉపనిషద్వాక్యమునకు వ్రాయబడియున్న అర్థము విశేషార్థముగా దోచెనా? వీరి అనుచరులే తెలుపగలరు.

గీతారహస్యమను పేరుతో 1188 పుటలుగల పెద్దగ్రంథము జూచి ఆనందపరవశులై యేపండితుడైనను సరే గీతారహస్యమునందు తప్పులను గనపరచవచ్చునని అభిమానోద్రేకముతో సవాల్ చేసి శ్రీతిలకుగారి సామర్థ్యమును బహిరంగపరచుచున్న శ్రీకృష్ణ తిలక్ ప్రచారమండలివారి సామర్థ్యము మిక్కిలి కొనియాడ తగినది. యీ గీతారహస్యమునందిట్టి రహస్యము లనేకములు కలవుగాని చదువరులు విసుపుజెందుదురని యింతట విరమించడమైనది.

---

# గమనిక.

నమోనాపత్రికలు కావలయునని అనేకులు వ్రాయుచున్నారు. తపాలాచార్జి నిమిత్తం అర్ధణా తపాలబిళ్లలు పంపవలెను. లేనిచో నమోనాపత్రికలు పంపబడాలమ్ము.

# రాశీపురం తాలూకా చాత్తాద శ్రీవైష్ణవ మహాసభ

---

సేలం జిల్లా రాశీపురమునందు 10-8-39 తేది. సాయంకాలము గంటలకు తిరువేంకటవిలాస పాఠశాలావరణమునందు ఈ తాలూకాలోని చాత్తాద శ్రీవైష్ణవ సంఘజుల మహాసభ యొకటి జరిగెను. ప్రథమమున దేవతా ప్రార్థనము జరిగిన వెనుక సభవారి కోరికపై శ్రీమాన్ ఆ రామస్వామయ్యగారు సభాధ్యక్షతను వహించి, తాలూకా, జిల్లా సభల ఆవశ్యకతను నొక్కి వక్కాణించి, మనకులాభివృద్ధిని గూర్చి చక్కగ నుపన్యసించిరి. ఆ వెనుక "జాత్యుద్ధరణము" అను విషయమునుబట్టి శ్రీ సేలము, న. వెంకటరమణయ్యగారు ఒక దీర్ఘోపన్యాసమునిచ్చి, పదునైదు వత్సరములకిందట యేర్పరుపబడిన ఈ తాలూకా సమాజము ఈ మధ్య గాఢనిద్రయందు మగ్నమైయుండినదనియు, దానిని మరల లేవనెత్తి జరుపుటకు మనవారియందు నూతనోత్తేజమును పురికొలుపవలయుననియు, మనజాతినామమును 'చాత్తాద శ్రీవైష్ణవులనుటకు మారుగ అర్థములేని వ్యాకరణ దోష యుక్తమగు సాత్తాని' యను నామముతో సర్కారువారును, ఇతర సంఘజులు కొందఱును వ్రాయుట తగని పనియనియు, ప్రథమమున దోషభూయిష్టమగునదియు, అనర్థ దాయకమైనదియు, వ్యాకరణ విరుద్ధమైనదియునైన పదమును వాడుటను తీవ్రముగ విమర్శింప వలసియున్నదనియు నుపన్యసించిరి. అందుమీాద, శ్రీ. ఆ. భాష్యకార్లయ్యగారిచేత ప్రతిపాదింపఁబడి శ్రీ R. నారాయణయ్యగారిచేత ఆమోదింపఁబడి ఈ క్రిందు కనబరచిన తీర్మానమేకగ్రీవముగ తీర్మానింపబడెను. ఈ తీర్మానమును ప్రభుత్వమునకును, పత్రికలకును పంపుటకు సభాధ్యక్షులకు

హక్కిచ్చుచు తీర్మానము నెగ్గింపబడెను. పిదప వందనములతో సభ చాలింపబడియె.

## తీర్మానము.

సేలంజిల్లా రాశీపురం తాలూకా వాస్తవ్యులగు చాత్తాద శ్రీ వైష్ణవులు తమ జాతినామము, సాతాని కాదనియు, తమ విరోధులు "చాత్తాద శ్రీవైష్ణవు"లని పిలువక, సాతానులని దూషణ నామముతో వ్యవహరించు చున్నారనియు, ప్రభుత్వమువారికి స్పష్టముగా విన్నవించుచు, వ్యాకరణ యుక్తమైన శబ్దము 'చాత్తాద' కాని సాతాని కాదనియు స్పష్టపరచి, ప్రభుత్వము వారిటుపైని వారి రికార్డులందు సాతాని పదమును వాడక "చాత్తాద శ్రీ వైష్ణవ" శబ్దమునే వాడవలసినదని కోరుచు ప్రభుత్వ రికార్డులలోనున్న సాతానిపదమును రద్దుపఱచి "చాత్తాద శ్రీవైష్ణవ" శబ్దమున ఉపయోగింపవలెనని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

ఎ. రామస్వామయ్య
అధ్యక్షుడు.



# చాత్తాద శ్రీ వైష్ణవుల విలక్షణములు.

"సిద్ధం సత్సంప్రదాయె" ఇత్యాది తావున చెప్పియున్నట్టి చార్య లక్షణసంపన్నులగు పరమవిలక్షణులతోగల సంబంధమే హేతువై మనలను దరిచేర్చును.

వేదములు మొదలు శిల్పశాస్త్రమువరకు శాస్త్రములన్నియు న్యముగ వైదిక కర్మప్రతిపాదకములని చెప్పబడును. ఆవేదా నే బ్రహ్మాదిదేవతలును దక్షాదిప్రజాపతులును, వశిష్టాది బ్రహ్మ షులును, జనకాది రాజఋషులును స్వాయంభువాది మనువులును పకారముగస్మృతి. పురాణాగమాదిశాస్త్రములచే విశదీకరించిరి. వైదికధర్మమునకు చేరియుండుటచే వైదిక శాస్త్రములని చెప్ప ను. దీనికన్నిటికిని మూలము. అనాదియై, నిత్యమై, సత్యమై డెడు వేదమే జీవస్వరూప పరస్వరూప ప్రకృతి స్వరూపములు టిని ప్రకాశింపచేయుటయే దీనిప్రయోజనము సచ్చిదానంద స్వ మై సమానధికరహితమై నిరపేక్షుముగానుండుటచేబ్రహ్మమునకు పంచమునందు ప్రయోజనములేదు బడస్వరూపమగుటచే ప్రకృ లేదు. ప్రకృతివశ్యుడై, దుఃఖాకులుడై సాపేక్షుడై యుండెడి కే ప్రయోజనముకలదు. అదియెట్లన ప్రకృతి సంబంధమువలన పాతకోపపాతకాదులు చేయతగదనినిషేధించుటచేతను ఐహికా ష్మిక ఫలమోక్షములకు హేతువులకు కర్మాదులను విధించుటచేత వేదములు త్రైగుణ్యవిషయములైనవి. కర్మాదులయందును, దులయందు స్వర్గాదికర్త యగు శ్రీయః పతియే పరబ్రహ్మమని పాదింపబడియున్నది. ఆబ్రహ్మ సగుణుడనియు నిర్గుణుడనియు, న్నిములయందు వర్ణి పబడినవి. స్మృతీతిహాస పురాణాదులయం శ్రీమన్నారాయణ మంత్రపూజాది శేషముతోబాటు ఇతరదేవతల

మంత్రపూజావిశేషములును చెప్పబడుటకు కారణమేమన యాజ్ఞ వల్క్యాదులు వేదార్థమును తెలిసికొని దేవ దాన మానవుల యపేక్షిత ములను తెలిసికొని యధికారానుగుణముగ పరమవైదిక మిశ్రమ శైవ పూజాదులను స్మృతీతిహాస పురాణములయందు విధించియున్నారు. వేదమున కర్మకాండ జ్ఞానకాండములు రెంటియందు నైహికా ముష్మిక మోక్షఫలసాధనములు విధింపబడెను. పూర్వకాండమునందు తామసవాక్యములచే ఫలకాముల రుద్ర దుర్గా గణపత్యాదుకాదుల లాంఛన మంత్రపూజలు విధింపబడినది. రాజసవాక్యములచే నాము ష్మిక ఫలకాములకు చతుర్ముఖ సురేంద్ర సూర్యాగ్నుల లాంఛన మంత్రపూజలు విధింపబడినవి. జ్ఞానకాండలోని సాత్విక వాక్యములచే ముముక్షువులకు శ్రీమన్నారాయణుని లాంఛన పూజామంత్రముల విధింపబడెను. తమోవైదికమార్గమున దుర్గా గణపతులును రాజస వైదికమున చతుర్ముఖ సూర్యాగ్నులును సాత్వికవైదికమున శ్రీమ న్నారాయణుని పంచపూజాదులును విధింపబడెను. ఇది మిశ్రమవై దికమని చెప్పబడును. పరమవైదికులగు వైష్ణవులకు ఫలము పరమ పదము. వైదికులకుఫలము స్వర్గాదిబ్రహ్మలోక పర్యంతమగు నాష్మి కములు మిశ్రమవైదికులకు ఫలము ఐహికాముష్మికములు. మోక్ష ను క్రమముగా నగును. సకలఫలసాధనములను ప్రతిపాదించుటచేత వేదము ప్రబలప్రమాణమైనది. ఈసాత్విక ధర్మలాంఛనముల నీ మూలయందు దూషించెడి మిశ్రమ వైదిక శైవ శాక్తేయ మూ మాచీకోరవి ప్రమాణవాక్యకల్పనాదురీణుల గతియేమనిన యుక్తము కాని యుక్తులతోడను, కల్పన పిట్టకథలతోడను పరమరహస్యముల బలముగా మూలమూలయందు అమాయికులువద్దనూ, అమాయిక స్త్రీలవద్దను వాదించుచు దయాదాక్షిణ్యముగల శ్రీ అయ్యగారిల బయలుపరచినవార్కి రౌరవాదినరకమని భయపెట్టి నిషిద్ధాచార హంకార మమకారములతో మరియెంత ప్రబలముగా వల్లమం

…చరించి నశించడమే భగవన్నిగ్రహపాత్రులై చనుటయేగతి. సత్వ రజస్తమోగుణములు పరస్పరవిరుద్ధములు కావున ఒకగుణముకలవారు వేరొక గుణము కలవారిని దూషించుకొనుటయె స్వభావముగాన ఆ యాశ్చర్యముకాదు. నిగమాగమాదులందలి విశేషగుణముగల వస్తువులను గ్రహించుటయే సత్పురుషలక్షణము. శ్లో॥ శ్రుతిః స్మృతి మమైవాజ్ఞా యస్తాముల్లఘ్య వర్తతే ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ మద్భక్తోపినవైష్ణః॥ తా॥ శ్రుతిస్మృతులు నాయాజ్ఞచే కలిగినవనియు వానిమీరి వర్తించువారు నాయాజ్ఞను ఛేదించినవారనియు, నాకు ద్రోహియనియు నాయందు భక్తిగలవాడైనను వాడు వైష్ణవుడు కాజాలడనియు భగవంతునిచే చెప్పబడి శ్లో॥ యథాహివల్లభోరాజ్ఞ నదీంరాజ్ఞా ప్రివర్తితామ్, లోకోపయోగినీం రమ్యాం బహుసస్యవిధ వర్ధినీం॥ లఙ్ఘయశూలమారోహే దనపేక్షోపితాం ప్రతి ఏవం విలఙ్ఘ యన్ మర్త్యోమర్యాదాం వేదవినిర్మితాం॥ ప్రియోపినప్రియో సామే మదాజ్ఞా వ్యతివర్తనాత్ ఉపాయత్వ గ్రహంతత్రవర్జయేన్మనసాసుధీః॥ తా॥ ఒకరాజునకు మిక్కిలి అంతరంగుడై తనయధీనమగు దేహాయా సాదులు గలవాడగునో కడులోకమునకు ఉపయోగముగను అనేకుల పాలకముగను ఆరాజుచే తన దేశమందు ప్రివర్తింపజేయబడిన నదీ ప్రవాహమును తనకు ప్రయోజనకారి కాదను హేతువుచేత తెగగొట్టి నచోనేని ఆరాజు వీనిశిరచ్ఛేదనము ఎట్లుచేయించునో అట్లే యేమను ష్యుడు వేదనిర్మితమైన మర్యాదలను చెరచునో వాడు నాకు ప్రియు డైనను నాయాజ్ఞనుమీరి నడిచెనేని నాకు అప్రియుడేఅనియు, బుద్ధి మంతుడు ఈవిషయమందలి ఉపాయత్వబుద్ధిని మాత్రిము విడువవలె ననియు చెప్పబడెను.

శ్రీ భగవద్వాక్యము ప్రిపన్నానుష్ఠాన భాస్కరము.

శ్లో॥ అవిప్లవాయ ధర్మాణాం పాలనాయకులస్యచ। సంగ్రహా యచలోకానాం మర్యాదా స్థాపనాయచ॥ ప్రియాయి మమవిష్ణోశ్చ,

దేవదేవస్య శార్జ్గిణః। మనీషీ వైదికాచారం, మనసాపినలంఘయేత్॥ తా॥ ధర్మములు చెడకుండుటకును, కులములను పరిపాలించుకొరకును నాయొక్కయు శ్రీ భగవంతునియొక్కయు ప్రియముకొఱకును బుద్ధిమంతుడగువాడు వేదోక్తానుష్ఠానమును మనస్సుచేనైనను మీరి నడువకూడదని పిరాట్టివాక్యము.

శ్లో॥ చతుర్ణామపివర్ణానా, మాచారోధర్మపాలకః। ఆచారభ్రిష్టదేహానాం, భవేద్ధర్మః పరాఙ్ముఖః॥ తా॥ చతుర్వర్ణములకు ఆచారమనునది ధర్మమును కాపాడుచున్నది. ఆచారభ్రిష్టులగువారిని చూచి ధర్మము మరలిపోవుచున్నది.

భారతమున అను శాసనిక పర్వమునందు॥

శ్లో॥ ఆచారాల్లభతే। హ్యాయుర్గాచారాల్లభతే శ్రియః। ఆచారాత్కీర్తి మాప్నోతి పురుషః। ప్రేత్యచేహచ। దురాచారోహి పురుషో। నేహాయుర్విందతే మహత్। త్రాసయంతిచ భూతాని తథా పరిభవంతిచ॥ తస్మాత్కుర్యాదిహాచారం। యదిచ్ఛేద్భూతిమాత్మనః అపిపాప శరీరస్య ఆచారోహంత్యలక్షణం॥ ఆచార లక్షణోధర్మస్సంతశ్చాచార లక్షణాః। సాధూనాంచయ థావృత్తమేతదాచారలక్షణః

తా॥ పురుషుడు ఆచారముచే ఆయుస్సును సంపాదించుకొనుచున్నాడు ఐశ్వర్యమును పొందుచున్నాడు, దేహవియోగానంతరము కీర్తిని పొందుచున్నాడు, ఆచారభ్రష్టుడు దీర్ఘాయువును పొందనేరడు వానిని పిశాచములు భయపఱచును అవమానపరచును కావున తనకైశ్వర్యము కోరువాడు ఈ భూమియందు ఆచారమును అవలంబింపవలయు పాపదేహముగల వానికి ఆచారము అవలక్షణములను పోగొట్టుచున్నది ధర్మమునకు ఆచారమే లక్షణముగనున్నది సత్పురుషులగు వారలు ఆచారమే లక్షణముగా గలిగియున్నారు సాధువులెట్లాగున నడుచుచున్నారో ఆచారలక్షణము అలాగేయున్నది.

చాత్తాద శ్రీవైష్ణవ స్వాములారా అనాఆచారముగల వారు ఆచార్యులా దేవరవార్లై అనతీయుడు.

శ్రీమన్నారాయుని దివ్యమహిమచే చేతనరక్షణార్థమై అవత రించి వారిని తరింపచేయు స్వాములు సాంప్రదాయకమైన ఆచారము విడిచి దుష్టవర్తనగల వేషదారుల మోసములను పరిశీలించి సత్వ ర్తన గలిగియుండురుగాక. సాంప్రదాయక ద్రావిడ గ్రంధములు గూడయు యీదుష్టా చారములను వివరించి శతదూష్యములుగా ఖండించియున్నవి. యీదుష్టులు మరుగుపర్చినవి ముందుముందుకు విస్తరముగా తెలియపర్చెదను.

గీ॥ పాపవర్తనుండు బ్రాహ్మణుడయ్యును నిజముశూద్రుని కంటె నీచతముడు। సత్యశౌచధర్మశాలి।శూద్రుండయ్యు సతము సద్విజుడేయనిరి మునులు॥

కం॥ రక్తాశనముంగోరక భుక్తికి ధాన్యములగొంచు। బొందుగ సన్మానక్తినినుండు మిదియె, సద్భక్తులు బోధించు దివ్యపాఠము॥

పరాసరస్మృతి॥ ౧౧వ అధ్యా॥

మద్యమాంసరతం నిత్యం నీచకర్మ ప్రవర్తకం తంశూద్రం విజానీయే ద్విప్రశ్నపాకమి వదూరతః॥

తా॥ మద్యమాంస సేవన యందాసక్తి కలిగి సదానీచ కార్యములు చేయుచుండు నీచుని చెండాలుని వకే బ్రాహ్మణుడు (వైష్ణవుడు) త్యజించవలెను.

గీ॥ వినుమాంసము గోరునతడు దనుజుడచూపే॥

శ్లో॥ స్మరణాత్కీర్త దేవప్రాప్తిః। పరమాంగతిం॥ శ్రీయప్పతి పూజకు భూతదయ మొదలగు సద్గుణములు ప్రధానాంగములు అట్టి సద్గుణములు ప్రధానాంగములు అట్టి సద్గుణములు లేక యెంతపూజ చేసినను అది అసురపూజ యనబడును. అది పరమార్థ సాధనము కాదూరము॥

దుర్జనస్యాపి శిష్టత్వం పరోపద్రవకారణం॥

అనగా దుర్జనులని యమనిష్టలు పరోపద్రవకారములుగా నుండుననుట.

శ్లో॥ దుర్జనస్య విశిష్టత్వం పరోపద్రవకారణ వ్యాఘ్రస్యచోప వాసేన పారణం పశుమారణం॥

తా॥ అనగా దుర్జనులు శిష్టాచారములు సేయ బూనుట పర మహింసకు కారణము॥ యెట్లనగా పులి ఏకాదశివ్రితముచేసి ఉపవాస ముండెనేని ద్వాదశినాడు దానిపాలణ అనేక పశువులను జంపుటచేతనే యగునుగదా కావున దుర్గుణమునుండి యేకార్యము లాచరించినను ఇతరులకు హానిగానే యుండును. ఉష్ణోదహోపిచాంగారశ్శీపః కృష్ణ యపెకరం. అనగా బొగ్గు వేడిగానుండెనేని ముట్టిన వారిని కాల్చును ఆరియుండెనేని మశితగిలి. నలుపుచేయును. కావున. సుగుణము కలుగుటకై ప్రియత్నింగవలెను

శ్లో॥ గుణేషుక్రియతాం యత్నం। కిమాటోపైః ప్రియోజనం విక్రీయంతేన ఘంటాభిః। గావః క్షీరవివర్జితాః॥ అనగా గుణములకై యత్నముచేయవలెను. ఆ టోపములతో బ్రియోజనములేదు క్షీర వంతములైన గోవులు లాభము కలుగించునేకాని క్షీరములేని (గొడ్డు) ఆవులు ఘంటలచే నలంకరింప బడిననైనను లాభము లేకా లవుగదా।

సతీ పురుష స్వాములారా శ్రియః పతికి శ్రీ ఆళ్వారాదులకు శ్రీ ద్రావిడ ప్రిభందములకును యిదివరకు కొందరు కలుగచేసిన ఆ ప్రితిష్టను చింతిల్లి పచ్చాత్తాపముతో శ్రియః పతి ప్రార్థన సల్పు దురుగాక.

సాత్విక చాత్తాద శ్రీవైష్ణవ దాసుడు,
చేపూరు వెంకటచలం పురపు చిరంజీవులు దాసుడు.

# సాతానులా, ?
# చాత్తాద (శ్రీ) వైష్ణవులా?

సాతాని అని పిలిచేవాడు అజ్ఞాని అయినా కావాలి లేదా ఈర్ష్యాళువైనా కావాలి!

చాత్తాద శ్రీవైష్ణవరక్తం ప్రవహిస్తూవున్న ప్రతివాడూ ఎవ తగిన సమాధానం వారికి చెప్పుతాడు.

ప్రభుత్వం వారి రికార్డులలో అజ్ఞానమూలకంగా వాడ బడిన సాతానిపదాన్ని రద్దుచేయించడానికి అన్నివిధాలా ప్రయత్నిస్తాడు.

అందర్నీ ఎలాపిలుస్తే నన్నూ అలాగేపిలుస్తారని మూకీభావం దాల్చినవాడి గురించి మనం ఏమనుకోవాలి?

చాత్తాద శ్రీవైష్ణవులని వ్యవహరింపబడడం మన జన్మహక్కు! మన జన్మహక్కును పొందడానికి మనం తీర్మానాల మూలం గానూ మహజర్లమూలంగానూ కార్యరంగంలోనికి దిగాలి.

మౌనంగా కూర్చోవడం చేతగానివారిపని.

సాతాని అనిపిలిస్తే ఏచాత్తాద శ్రీవైష్ణవుడు సహించగలుగు తాడు?

నేడే కంకణం కట్టండి! కార్యరంగంలోనికిదిగండి మనం సాతా నులమో చాత్తాద శ్రీవైష్ణవులమో వేగిరంగా తేలిపోవాలి!

బహుపరాక్ !

---

షరా:— సేలం, రాశీపురం విజయనగరం, విశాఖపట్నం, బెజవాడ, కుంబారగేరి గ్రామములలో మాత్రమే సభలజరిపి తీర్మా నములు పంపినట్లు తెలియుచున్నది. ప్రతిపల్లెయందును పట్టణమందు ను అభివృద్ధిచేయక సభలు జరుపగోరెదము.

# యదార్థము.

సీ॥ కాబోలు వీరిలగౌరవపాత్రులౌ చాత్తాదవైష్ణవ సమితివారు
కాబోలు వీరిలగౌరవ రామానుజాచార్య ప్రియశిష్యులయినవారు
కాబోలు విరిల గాయక శేఖరులని పేరుకెక్కిన యాదివారు
కాబోలు వీరిల పాపుల సరకకూపము బారినుండి గాపాడువారు
గీ॥ సకలవిద్యల మిన్నయౌ సౌమ్యజాతి నేడు చీకాకులో నిల్వనీడలే
నాదరణకొరకై కడునడలుచుండె కాలమే వీరినీరీతి కడకుదోచె!
గీ॥ విద్య ధనములున్న నధిక విలువగలదు
వీటిలో నొక్కటేయున్న విలువకొలది
రెండులేని సంఘస్థితి రేవడిగతి
మనకులస్థానమెద్దియౌ మాన్యులార!
గీ॥ రాజకీయ చైతన్యమౌ రగులలేదు
సాంఘికాచార నడతలౌ సరిగలేవు
విత్తమౌ వీరిదరిజేర వెనుకనాడె
క్షేత్రిసౌభాగ్యమంది కసరయసున్న
ఇట్టిదురవస్థపాలైన గట్టిజాతి
పూని రక్షింపబుట్టిన ప్రోక్తలెవరొ?
గీ॥ వార్తలచ్చున ప్రకటించు పత్రికొకటి
కడకు కష్టముల్ వెలిబుచ్చ నడపుచుండి
విజయనగర నివాసులు విదయులైరి.
వారికర్పింతునా ధన్యవాదశతము.
ఉ॥ భద్రగిరింటిపేరు ఘనభవ్యునినామము దేవునామమే
భద్రగిరీనివాసుని ధభాగ్యకులీనులు బోనులోపలన్
రంధ్రము గానకుండెలుక రాజము చందమునున్న వేళ నీ
చంద్రసమానుడాదరము చక్కగజూపె సుదర్శనంబుతో!

తిరుపతి భావనారాయణ, రేపల్లె.

శ్రీమతే శఠగోపాయనమః

# ఒక లేఖలోని కొంతభాగము

శ్రీమన్నారాయణులును, నిత్యసూరివర్గమందలి ముఖ్యులుగొం
టూ, శ్రీమదాళ్వారులుగ నవతరించి, వేదశాస్త్రములందలి జ్ఞాన
ములుదీసి ద్రావిడవేదములుగ (దివ్యప్రబంధములు) సకలజనులు
చుంచునట్లు జ్ఞానభక్తి ప్రపత్తుల సూక్ష్మముగ గ్రహించ తగకృప
న్నారు. కొంతకాలమగుసరికి యందలి ముఖ్యభాగములుకొన్ని
ములై పోగా యవి గురుపరంపరను యీ లీలావిభూతిని ప్రధమా
ర్యులగు శ్రీమన్నాధమునులు మరల శ్రీమదాళ్వారుల ప్రత్యక్షము
గొని జీర్ణింపబడిన యీ ద్రావిడ శృతుల బునరుద్ధారణము గావిం
తదుపరి ప్రభావశీరులగు శ్రీయాలవందార్లుభయవేద వేదాంత
ల ననుసరించి గొన్నిగ్రంధములజేసియుంచి ఈ మతమును సిద్ధాంత
చియుంచిరి. పిమ్మట వీనిని యాధారపరచుకొని యధికవిద్యాబుద్ధి
గాసాది విశేషములుగల శ్రీమద్భగవద్రామానుజులు[ప్రపన్నులై]
దండ సన్యాశియై మీాది ద్రావిడ శృతితుతల గ్రహించి క్షుద్రమ
ముల నిరసించి శ్రీవిశిష్టాద్వైతమతమును నుద్ధరింపబూని శ్రీవ్యాస
సూత్రములకు శ్రీభాష్యమనుపేర వ్యాఖ్యను మరికొన్ని యితరగ్రంధ
ములను రచించి యీ మతోద్ధారణమును గావించిరి. వీరట్లు
సిద్ధాంతపరచిన మతము ననుసరించువారలు ముక్తినొందుటకు ప్రతివి
షయములో త్రికరణము లేకీభవింపజేసుకొని, నడువవలయునని యీ
చిచ్చిరి. శ్రీమదాళ్వారుల శ్రీసూక్తుబట్టియే తామీామతకట్టు బాట్లు
చేసినట్టు దెలుపుచున్నారు. మీాదిత్రిదండములన త్రికరణములనియే
భావము. ఈ మతగ్రంధములబట్టి (1) ప్రధముపడి (2) చరముపడి
యని వైష్ణవులు ద్వివిధ కక్షలుగనుండుట న్యాయమే. ప్రధమపడియ
వ సాంసారికులుగనుండి భగవద్భక్తిని నియామక కాలముల నాచరిం

చువారలు, చరమపడియన సర్వధర్మపరిత్యాగులై సర్వకాలముల భగవద్భాగవతాచార్యుల నారాధించువారలు, ఈ రెండు కక్షలవారు నూయకృత్యములు నాచరింప వీలులేదని చెప్పబడియుండ, యిటీవల గొందరు చాపల్య పీడితులై కర్మశాస్త్రములబట్టియు వేదములందలి కర్మకాండనుబట్టియు విధించబడియున్న మధుమాంసభక్షణము మొ॥లగు గొన్నియకృత్యములీ విశిష్టాద్వైత మతమందున్నట్లు యనేకుల నమ్మింపజేసి వివిధలాభములొందు చున్నామని భ్రమించుచున్నారు. యట్టివారలధోగతి పాలగుట కేమివింత ? ద్రావిడ శ్రుతిస్మృత్యాదుల యుపనిషత్తులు జెప్పినయట్టి భక్షణాదులు కేవల నరకహేతువులని యే జాటిచెప్పబడియున్నది. 2000 ల సం॥రములక్రితమీ మతమునకు పరమాచార్యులై యుండిన శ్రీమద్భగవచ్ఛఠగోపమునీంద్రులచే కృపచే నొసంగబడియున్న పరమప్రియకరమగు సామవేదసారంబనంబరగుచున్న తిరువాయి మొళిలోని పదిమంత్రములీ భక్షణాదుల నిషేధమును గూర్చి వివరించి జెప్పచున్నవి. ఆళ్వారులందరిట్లు యానతిచ్చియుండుటయేగాక పూర్వాచార్యులునూ యీ విషయమునుగూర్చి యట్లనే నిషేధించియుండుట యెల్లరకుందేట దెల్లమై యున్నది. మరికొంతకాలమునకు బుధుడని జెప్పబడు గౌతమ శాక్యమునియు, శ్రీశంకరరామానుజ మధ్వాచార్యులను త్రివిధ భాష్యకారులునూ చెప్పియుండుట దెల్లమియేగదా? రమారమి 2000 ల సం॥రములక్రిందట భుజబల పరాక్రమాది గుణగణ విభవ ప్రాముఖ్యులగు శ్రీమత్తిరుమంగయాళ్వారులును, ,కత్తివేన్ కలై కళయంబులన్ కరుదుంకరుత్తు శేతిరుత్తినేన్ మనత్తై యిత్యాదిగా జెప్పబడిన పెరియ తిరుమొజిలోని యొకస్మృతివ్యాకము ‹ అహింసాపరమోధర్మః ’ యను విషయమునే యానతిచ్చియున్నారు. ఆనృశంస్యః పరో ధర్మస్త్వత్త ఏవమయాశ్రుతః, యని శ్రీ చక్రవర్తి తిరుమఘునారు శ్రీరాముల వారొకప్పుడు శ్రీసీతాధిరాట్టితో యానతిచ్చియుండినట్లు వాల్మీక మహాముని శ్రీమద్రామాయణమున రచించి

యున్నారు. యిట్లహింసాధర్మమిూ హిందూమతమున యుపనిషత్తుల కాలమునుండి సనాతనముగా సిద్ధాంతమైయుండి శ్రీమదాళ్వారులచే విశదముగా వాకృత్సబడియుండ యిటీవల చిరకాలమైన తరువాత బుద్ధునివలన యహింసాధర్మము వచ్చినదనుట సమంజసముకాదు. "హింసంచదూషయత్యేవంపాందురిత్యచ్యతేబుధైః" యనిమేరు తంత్రమున జెప్పినయట్లు హిందువన యహింసాపరుడని యర్థము. కర్మశాస్త్రములవల్ల ననుసరించియున్న జాతిదుష్ట పదార్థములలోజేరి నికృష్టతగ నుండుచున్న యీ అభక్ష భక్షణము, భక్తులుగను, ప్రపన్నులుగ నున్న వైష్ణవులకు కేవలనింద్యములనుటయే యీ మతసిద్ధాంతము నొక్కిజెప్పుచున్నది. గాన దుష్టులతోను, దుష్టపదార్థములతోను సంబంధపడక మెలంగుటయే ఈ మతధర్మమని యస్మదాదుల యీ దేశమునకు విన్నవించుచున్నాను-తిరువళ్ళమునకు తేగోరుచుచున్నాను.

పువ్వుల అప్పలనరసయ్య,
ఆడ్రా

---

**N. B.** బ్రహ్మ సూత్రిములు [త్రిభాష్యలఘుటీకా తాత్పర్యసహితము] 338 పేజీలలో తయారయినది. పోషకులకు పోష్టుఖర్చులుమేమేభరించి పంపించుచున్నాము. అభిమానులు పోష్టుఖర్చునిమిత్తం 0—3—0 ష్టాంపుల పంపినచో వారికి పంపగలము: వేదాంతమందభిరుచిగల వారందరు త్వరపడవలెనని కోరుచున్నాము.

# సుదర్శనం.

సంపుటము } 1939 అక్టోబరు, 20 తేదీ. { సంచిక 3.

## శుభస్య శీఘ్రం!

1. లోగడ తమిళదేశంలో చాత్తాద శ్రీవైష్ణవ మహాసభలు జరిగేయి. వాటిఫలితంగా అక్కడవుండే సోదరులలో మంచి ప్రోత్సాహం కలిగింది.

2. ఆంధ్రదేశం ఉత్సాహానికీ ఉద్రేకానికీ పుట్టినిల్లు.

3. ఈ సంవత్సరం డిశంబరులో అఖిలభారత చాత్తాద శ్రీవైష్ణవ మహాసభ ఆంధ్రదేశంలో జరగాలి.

4. ప్రతీగ్రామంలోను పట్నంలోనూ చిన్నసంఘాలుగా ఏర్పడి ఈవిషయమై చర్చించాలి.

5. పెద్దలందరూ వారి పలుకుబడిని వినియోగించాలి.

6. యువకులందరూ పట్టుదలతో ఆవిషయమై ప్రచారం చెయ్యాలి.

7. పెద్దలూ యువకులూ చేతులు కలిపి పనిచేసినప్పుడే మన ధ్యేయాలు నెరవేరుతాయి.

8. జాత్యభిమానము, మతాభిమానమూ, పత్రికాల్లుమాటల లోగాక కార్యరూపేణపరిణమించాలి.

9. ఈ విషయమై శ్రీమాన్ నల్లగల్ల వెంకటనరసయ్య(మో దేవి) గారితో సంప్రదించమని చాత్తాద శ్రీ వైష్ణవసోదరుల్ని కోరుతున్నాము.

---

## మన కర్తవ్యము.

(న. వేంకటరమణయ్య.)

సేలము.

చాత్తాద శ్రీవైష్ణవ సోదర సోదరీమణులారా!

మన సంఘము పూర్వమునందుండిన యౌన్నత్యమున్ను, ... మునందితర సంఘములమధ్య నందుచుండిన గౌరవ మర్యాదల నున్ను ఇప్పుడు మనసంఘము జెందియున్న హీనతనున్ను, మన సంఘ మితర కులస్థులచేత దూషింపబడుచున్న దీనతనున్ను యెంచి చూచిన యెవ రికి డెందము గుందకుండును? నేటికి దేశమునందలి ప్రతి యొక్క సంఘమును స్వీయ సంఘౌన్నత్యమునకు పలువిధముల పనిబూని ... ము నందుచున్నది. ఇట్టి సందర్భములో మనవారున్ను ఊరుకోక నిద్రనుండి లేచి, లోకమునందు జరుగుచున్న మహా ప్రళయము గుర్తించి, అందుకు తగినట్లు మన సంఘమును పునర్నిర్మాణము గావించుటకు ప్రయత్నించక పోయిన, యీ మహా ప్రళయములో మన సంఘ మధఃపతనము నంధవలసివచ్చును. మన వారినా ... యున్న నిరాశ్య జనితాంధకారమును పారద్రోలుటకనియే మన "సుద ర్శనము" పత్రిక తన సహస్రకిరణములతో విజయనగరము నందు ... యుదయమై విజయము జేసియున్నది. ఈ వరకే పత్రికజూచ్చిన ప్రతి ... యింటను మనవారియందు నూతనోత్తేజమునుగలిగించి, మనయ...

ంధకారమును పటాపంచలై పాఱునట్లుజేయుచున్నది. గాన దేశమందలి మనవారున్న ప్రతియింటను దప్పక సుదర్శనము జొరపడవలయున్నది. అక్షరాస్యులగు మన వారియందు జాత్యభిమానమును మతాభిమానమును పునరుద్ధారణమగును. గావున మన వారందఱును ముగ యువకులందఱును ఈ సత్యమును గుర్తించి దేశమునందలి ము జదువనేర్చిన మన వారందఱి కుటుంబములకును మన పత్రిక ట్లు పనిజేయవలెను.

మన జాత్యుద్ధరణమునకు మనము జేయవలసినపనుల్లు మెండుగ న్నవి. ముఖ్యముగమన జాతినామమునుబట్టి యోచింతము. మన మునుయొక్క పూర్వచరిత్రినుబట్టి విచారించి దెసుకొనవలయునన్న త్యేక చరిత్రిగ్రంథము గానరాదు. దీనికి మన పూర్వులు ఏల ప్రా ములగు హైందవులందరుగూడ ప్రత్యేకముగ చారిత్రక గ్రంథావశ్యక ను గుర్తించి చరిత్రలు వ్రాయలేక పోయినదియే కారణము. గావున శ్రీవైష్ణవ సంప్రదాయ గ్రంథములే మనకు శరణ్యములగుచున్నవి. ర్వాచార్యులు రచించిన గ్రంథ బాహుళ్యములో నచ్చటచ్చట అవ రమునకుదగినట్లు మనసంఘమునుబట్టి ప్రస్తావనలు జేయబడీచున్నవి. వాటిని పరిశోధించి చూచిన మనవారు శ్రీవైష్ణవ మతాచారమునందును, ఏతన్మత ప్రచారమునందును, గొప్పదేవాలయములయందును ముఖ్యస్థానముల నంది గౌరవ మర్యాదల నందుచుండినట్లు విశదమగున్నది. గాకను నేతద్గ్రంథములలో మన జాతినామమును చాత్తాద శ్రీవైష్ణవులనియే పేర్కొనబడియున్నది. చాత్తిన మొదలిగళ్, చాత్తాద మొదలిగళ్; చాత్తిన శ్రీవైష్ణవర్ గళ్, చాత్తాదశ్రీవైష్ణవర్ గళ్ యే, పూర్వగ్రంథములలో బ్రాహ్మణ శ్రీవైష్ణవులను, మనలను ముగ గుర్తించుచు వచ్చియున్నారు. ఇట్లుండ 'చాత్తాద' అను మును ఆంధ్రములోకిద్దే బూనిన కొందరు 'చాత్తాద' యను దూప చి చాత్తాన శ్రీవైష్ణవులు, చాత్తాని శ్రీవైష్ణవులు అని ఇరు

1921 సంవత్సరమున ప్రభుత్వము సెన్సెసు లెక్కవ్రాయ న సందర్భములో మద్రాసు పరగణాయం దనేకచోట్లయం మనవారు మన ఛాతికనామమును సెన్సెసు రిపోర్టు మున్నగు లో 'సాతాని' యని వ్రాయక 'చాత్తాద శ్రీవైష్ణవు'లనియే వలయునని ప్రభుత్వమునకు అర్జీలు పెట్టుకొని యాందోళ చేసిరి. దాని ఫలితముగ సెన్సెసు రిపోర్టులయందు చాత్తాద వులని గుర్తించిరిగాని అందు వెంబడి సాతాని యను శబ్దమును ఉదహరించిరి. ఈమధ్య మనవారు నిరంతరముగ ఆందోళనము కపోయినందున ఇంకను ప్రభుత్వ రికార్డులలో సాతాని యని చుటకు సాహసించెదరు. గాన దేశమునందలి మనవారు అచ్చ ట్లు సభలు చేసి తీర్మానములద్వారా ప్రభుత్వమువారికి మన ని ప్రభుత్వ రికార్డులన్నింటి యందును సాతాని యను శబ్దమును గించి చాత్తాద శ్రీవైష్ణవులనియే వాడవలయునని విన్నవించు యాందోళనమును చేయవలయును.

ఆయాస్థలములలో మనవారు విడివిడిగ సభలుజేసి యాందోళ ము చేయుటతో ఊరుకొనక, యావద్దేశమునకును మనవారికి ప్రాతి ధ్యమువహించిన సాంఘిక మహాసభలను All India Chattada Vaishnava's Conferences) సమావేశపరచి, పలువిషయము చర్చించి తీర్మానములు జేసియు, ప్రచారమొనర్చియు, మనవారి ము సాంఘిక మతాభిమానులను పురికొలపి, ప్రభుత్వమును మన ర్కెల నొప్పుకొనునట్లు వొత్తిడిచేయవలసియున్నది. గడచిన 1922, 24, 26 సంవత్సరములలో క్రమేణ శ్రీ పెరుంబూదూరు, చెన్నై, హార్, తిరుప్పూరు అను నాలుగు స్థలములయందు అఖిలచాత్తాద శ్రీవైష్ణవ మహాసభలు (Conferences) నాలుగుమారులు నడచి ఆ సందర్భములో నలుగడల నివసించుచుండిన విద్యాధికులును, శ్రీమంతులును, సాంఘిక సేవకులునగు స్వజాతి సోదరసోదరీమ

ణులు మహాసభలమూలమున నొక్కచోట సమావేశమై పరస్పర మైత్రియు, నుత్సాహమును, విజ్ఞానమును బొంది, సాంఘికోన్నత్య మునకు వలయు విషయములను చర్చించి తీర్మానములుచేసి ప... యుట కవకాశము గలిగెను. అప్పుడు దేశములో మనవారియం... చక్కని ప్రబోధము గలుగసాగెను. అయినను కారణాంతరము... పిమ్మట మహాసభలు సమావేశముగాక నిలచిపోయినందున ... యాందోళనము గూడ సన్నగిల్లెను. గాన మనవారియందు ... ఉత్సాహమును లేవదీయుటకు సాంఘిక మహాసభలను సమావే... చుటకు పనిజేయవలెను. మద్రాసులో విద్యావంతులును, ధనవం... లును, అనుభవపరులును నగు మనవారు పెక్కుమంది యున్నా... గాన వారీవిషయమునకు యందొచ్చి పనిజేసిన బాగుండును. ... ను విజయనగరమునందలి చా॥ శ్రీ॥ వై. యువజన సమితివారే ... పనికిబూని నశీఘ్రములో "అయిదవ అఖిల చాత్తాద వైష్ణవ మ... సభను" ఎచ్చటనైన సమావేశబరచుటకు ప్రయత్నించవలె... కోరుచున్నాను. సభా నిర్వాహకమునకగు ఖర్చులకు మనవారియం... విరాళముల మూలమునను, సభల టిక్కెట్లమూలమునను వసూ... జేసుకొనవచ్చును. గత పదుమూడు వత్సరములకు పూర్వమునకన్న... ఇప్పుడు మనలో విద్యాధికులును, ఉత్సాహ శీలురునగు యువక... పెక్కుమందిగలరు. మహా సభల గూర్చుటకు ప్రయత్నించిన వీరి... కి తోడ్పాటును గలుగవచ్చును. మహా సభలద్వారా జాత్యు... మునకు వలయు సాధనముల నారసి పనిజేయుటకు సాధనముగలుగ... విజయనగరము సమితివారికి ప్రచార సాధకముగ నీ 'సుదర్శనం' ... కయు నుండుట మరియింత విశేషమగును. గాన ప్రప్రథమమున ... మునందు నలుదిసల నివసించు విద్యావంతులైన మనవారి చిరునామా... లను క్రోడీకరించి వారలతో నుత్తర ప్రత్యుత్తరములజరిపి, వారం... రికి 'సుదర్శనము' నందజేసి, వారి సాయము నార్జించవలె. వలయు...

ప్రశ్నములలో ఆంధ్రము, అరవము, ఆంగ్లేయము అను మూడు భాష
లను వ్యాసములు ప్రకటించి పనిజేయవలెను. అట్టి యవశ్య మేర్ప
డినెడల వలయునేని దాసుడు అరవభాషలో ప్రకటించు విషయ
ము సాయమొసర్చ సంసిద్ధుడను. మహా సభను నడపుటకు సమితి
లు సమ్మతించినయెడల ఆయా చోట్లయందున్న నాబోటువారు
ను సాధనముల నందించి పనిజేయగలరు. తక్కిన విషయములకు
వేరొక వ్యాసమున వివరించెదను, మహా సభలను జరుపుటావశ్యక
మెరుచు మన సోదరులు యీ పత్రికా ముఖమున తమ తమ అభి
ప్రాయముల దెలుప ప్రార్థితులు.

---

# చాత్తాద శ్రీవైష్ణవ యదార్థ ధర్మం.

(చేపూరు చిరంజీవులు దాసుడు.)
విజయనగరం.

## సు ద ర్శ న ం.

శ్లో॥ భగవత్సర్వ విజయుల సహస్రార పరాజితం। శరణం
త్వాంప్రపన్నోస్మిశీఘ్రకర శ్రీసుదర్శన। సుదర్శనమహాజ్వాలకో
టి సూర్యసమప్రభ। అజ్ఞానాన్ధస్యమే దేవవిష్ణోర్మార్గంప్రదర్శయ

గీ॥ చదువుకున్నందు కెపుడును శాంతదృష్టి
గలిగి ధర్మములొరులకు గఱిపివారి
మంచిత్రోవలయందున మసలుటకును
పరగ ప్రోత్సాహపెట్టుట బాగుకాదె.

ఈ విషయము మీకెందుకు భోధకురాలేదో యూహింపజాల
కున్నాను. శాంతశాంతమవలంభించినే చెప్పెడు విషయమును నించుక
యోచించినపక్షమున మీకే తెలియును,

గీ॥ పాపజీవంబుచేతను పాపులెల్ల
పొట్టకూటికి హీనులై పొందుగాను
జీవనము చేయుచుండెదు చిత్రమైన
కాలమాసన్నమగుచుండె స్వామివినుము.

శ్లో॥ ఋషింఋషా మహేకృష్ణ తృష్ణాతత్వమి వోధితం। సహస్ర
శాఖాం యోదాక్షీద్రావిడం బ్రహ్మసంహితాం॥

టీకా॥ యః ఎవరు సహస్రశాఖాం వెయ్యిశాఖలు గలిగినటువంటి
ద్రావిడం ద్రవిడ సంబంధమైనటువంటి బ్రహ్మసంహితాం
వేదములను అద్రాక్షీతతుచేశిరో కృష్ణతృష్ణా తత్వమివో
దితం శ్రీకృష్ణమూర్తివారియందుండెడి ఆశవలెనె వుద్భవిం
చిన వంఋషిం అట్టిఋషీశ్వరులను జుహామహే సేవించు
చున్నాను.

శ్లో॥ క్రూరేకలిగియుగే ప్రాప్తే నాస్తికైః కలుకృషీకృపే
విష్ణోవంశాంశ సంభూతో వేదవేదార్థతత్వవితీః

టీకా॥ క్రూరేకలియుగేప్రాప్తే క్రూరమైన కలియుగము సంభ
వించినదై యుండగా నాస్తికైః కలుషీకృపే నాస్తికులచేతను
కలుషముగాచేయబడగా వేదవేదార్థ తత్వవితీ వేదముల
యొక్కయు వేదార్థముయొక్కయు వాస్తవమును తెలిసిన
వారై విష్ణోరంశాంశసంభూతః విష్ణుమూర్తి వారియొక్క
భాగములో వకభాగముచేత అవతరించినవారును

శ్లో॥ స్తోత్రంవేదమయఃకర్తు ద్రావిడ్యాపిచభాషయా। బనిష్యాపి
సతాం శ్రేష్ఠో లోకానాంహిత కామ్యయా॥

టీకా॥ లోకానాం జనులకు హితకామ్యయా వాతముచేయుకోరె
చేత ద్రావిడ్యాపిచ భాషయా ద్రవిడసంబంధమైన భాష
ను స్తోత్రం స్తోత్రమును కరుం చేసెడి కొరకు సతాం శ్రేష్ఠ

సత్పురుషులలో శ్రేష్ఠుఁడు జనిష్యతి ఉద్భవించగలఁడు॥

శ్లో॥ అద్వైతవ్యం ద్విజశ్రేష్ఠైః వేదమూలమిదం కృతం
శ్రీభిశ్శూద్రాద్భిశ్చైవ పేపాం ముక్తిః కరేస్థితా॥

తా॥ అనగాద్విజులతో, శ్రేష్ఠులైన శ్రీమహాభాగతులచేతను అధ్యయనము చేయతగినదియు, వేదరూపముగా చెయ్య-బడ్డ-ఇది స్త్రీలచేతను, శూద్రులచేతను, అధ్యయనం చేయబడవచ్చును, వార్లకు ముక్తిహస్తగతమౌను, సర్వాధికారమైన, ద్రావిడవేదము, సర్వము ముముక్షుజనైకసేవ్యంబగుటచే మిక్కిలి గుణముగలది, అట్టిదనియనుసంధానముచేత-నారపదవాచ్యమగు చేతనాచేతనబూల మీశ్వరునకు శరీరభూషమని తోఁచి, భ్రాంతిజనకములైన రాగద్వేషములణిగి ముక్తికలుగును. సర్వదోషవివర్జితమును శ్రీవైష్ణవమతమున కలికాలమున కొందరివలన కొన్ని దురాచారములు ప్రబలుటకు కారణమిట్లాచార్య సూక్తిముక్తావళిలో చెప్పబడినది.

తిరుక్కోట్టియూరు మూరినంబిగారివద్దకు శ్రీ వుడయవర్లు 18 సార్లు తిరిగి మంత్రరాజము నుపదేశింపబడి గోపరమెక్కి విరజిల్లి బద్ధజీవుల రక్షించిరి. దీనదయాపర వాత్సల్య ధర్మమూర్తి రామానుజాచార్యులువారు, నిషిద్ధానుష్టాములుకు-చోటిచ్చిరన్న; దుష్టపాషండనీతులు సదాచార సత్పురుషులు అంగీకరించరు. ఆచార్య సూక్తిముక్తావళిలో ముందుకు కలిదోషములును, భ్రమపెట్టి యమపురి బర్తి పంపుకొనుట శ్రీరంగ డాజ్ఞచే దేవతలుకల్పించినట్టువైష్ణవధర్మశాస్త్రములన్నియూ ఘోషించిచెప్పుచున్నవి.

187 పుట ఆచార్య సూక్తి ముక్తావళి క్రిమింతజన్మ నిమిత్తము

సీ॥ ధరణి యందఖిలచేతనులు శ్రీయతిరాజ నాశ్రయించికృతార్థు
లై శరీరములు మానినప్పుడు, మోక్షమొందుచునుండ యమపురి
పాడైన హావిరరించి పురుహూత ముఖదేవమునివరు లందఱు
చనుదెంచి శ్రీరంగశాయిచరణ సరసిజంబులగాంచి, సాగి
మ్రొక్కెడి నిజరత్నకోటీర నీరాజనములు.

తే॥ సలిపివేయు విధంబుల సన్నుతింప సుప్రసన్న కృపాదృష్టి
జూచి వారినిట్లు స్వాగతమడిగె రంగేశుడనుచు, వాది
భీకరగురుడన్త మోదమలర॥24

సీ॥ భావుకమానీకు బంకేరుహాసన కౌశలమానీకు గాలకంఠ
నేమమానీకు సుత్రామ యీ సురలకు హర్షమా మీకు
మహర్షులార యని శౌరికుశలవ్రశ్న లడిగివచ్చిన పని
దెల్పుడీయన బ్రహ్మతెల్పె నిట్లు నిత్యమనాదియునీవిభూ
యుగంబునందు భోగవిభూతి యస్మదాది.

తే॥ దేవతలకైన సనకాది దివ్యయోగ సిద్ధులకునైన నిట్లని
చెప్పనలవిగానిదని పల్కె భారతీ కాంతుడనుచు వాదిభీక
రగురుడని మోదమలర॥

వ. మఱియును.

సీ॥ భవదీయ మాయాప్రబద్ధ చతుర్దశ భువనాద్యలీలావి భూ
తియందు వసుధలోనందఱు వైష్ణవలక్షణ లక్షితులై మోక్షలక్ష్మి
కయిరి భూమికి వైకుంఠ పురికి భేదముగాన మీవింతయే
మొకో మెఱుగ మీశ! యముడు నిర్వ్యాపారుడై యుండె
జనులకు గలుషమేమియులేని కతననారి ॥

హారమనోహర దివ్యవిహార నీదుకీర్తిశ యిక మీదనెల్లు
ల్లు ననుచు బీరితివాకుచ్చె వేల్పుల పెద్దయనుచు వాది
భీకరగురుడనే మోదమలర॥

అతనత్తిమ్మిచూలిపల్కు లాలించి రమణీయ గుణస్తోమాభి
రాముండగు శ్రీరంగధాముండు తనతో నిట్లని తలంచె॥

రాజు పుత్రునియందు రాజ్యభారంబుంచి స్త్రీలోలుడై విహ
రించు కరణి నస్మద్విభూతియు గాధికారము లక్షణార్య
మహాయోగి యందునునిచి శ్రీభూమినీళాది నీమాతినీరత్న
విలసనపరుడనై వేడ్క నుండనిదె సమయంబనియెంచి లక్ష్మ
ణముని కొల్లగొనకెచ్చె వైకుంఠపురము॥

క్రీడపాడాయెనే హాద్ధు స్త్రీలగూడు కాముకుల కేలనిల్చును
గలిమియిక జాలు స్త్రీసంగమనియెనా శౌరి యనుచు
వాదిభీకరగురుడనె మోదమలర॥

ముందు హిరణ్యాక్ష ముఖ్యదైత్యులభంగిదామసప్రకృతిని
దానవాంశగాలాభుంగిమికంఠు జోళభూపాలుని గూచియు
మాచియు గొటలి యనెడు వనితలబుట్టించి వా
రివల్లను శైవశాక్తాదిమతవృద్ధి సల్పి మఱియు గలనైనదల
చినన గలుషావహములగు ఖలమతంబులు కొన్నిగలుగచేసి॥

వేట్క దనలీల కీర్తి వృద్ధైయొదవసంతసించెను శ్రీరంగ శౌరియంప
ననివీడ్కొని బ్రహ్మాదు లరిగిరనుచు వాదిభీకరగుడనే
మోదమలర॥ (సశేషం)

---

శ్రీ మతే రామానుజాయనమః

# శ్రీ వైష్ణవ మతము-ప్రస్తుతస్థితి,

హిందూమతమునకు ముఖ్యముగా పట్టుకొమ్మలైయున్న శ్రీ
తములలో శ్రీ విశిష్టాద్వైత మతము అగ్రస్థాన మలంకరించిన దీ
దూరదృష్టిగల సత్య విమర్శకు లెవ్వరు కాదనజాలరు. శ్రీవైష్ణ
మతమున జీవులు స్మరించి తరించుటకు అత్యంత సులభోపాయమై
అనేక మార్గములుండుటచే నది అన్నిటికన్న యగ్రస్థాన మాక్రమిం
నలరారుటచే రాజాది రాజులచేతను జగద్విఖ్యాతిగాంచిన మత ప్ర
క్తలచేతను అమిత మేధావంతులగు పండిత కవులచేతను గౌరవాన్వి
తులకు పాత్రితమై విలసిల్లుటయే గాక నేటికికూడ గౌరవ పా
పత్యములకు హిందూమతేతరుల వాక్కులలోకూడ తాండవమా
చున్నదనిన మావాక్య మేంతమాత్రము సత్యేతరము కాజాలదు.
అట్టి ఘనమైన శ్రీవైష్ణవ మతము వర్తమాన కాలంబున అన్నిమత
ములకన్న హీనపతనము నొందుచుండుట కడుంగడు విచారకరము.
ఇది యింత హైన్యస్థితికి వచ్చుటకు ముఖ్యకారణము రాజాదరణము
లేకపోవుటయేగాక పెద్దల మనుకొనువారి అహంకార మమకారములే
కొంత ముఖ్యకారణమనుటకు సంశయములేదు. ఒకవైపున శి
శిష్యులు తురక మంత్రములకు గురులై మ్లేచ్ఛాచారములతో తాం
డవమాడుచుండ ఆకాశము నాపుచుండినని బ్రమపడు శిష్యులు
వత్తుగాయింటనుగూర్చుని క్రియారహితమైనవృదావాగాడంభరము
పల్కుటకంటె శోచనీయమగు విషయమింకొకటుండజాలదు. ఒక
వైపున అద్వైతులు మరియొక వైపున ద్వైతులు ఒక వైష్ణ
వులు తమతమ మతముల అభివృద్ధికై అయా ప్రదేశములలో

ష్టలు గావించుచు మతప్రిచారములు సల్పి తమతమ మతములు
తరయో అభివృద్ధి నొందించుచుండ శ్రీవైష్ణవ మతమున పెద్దలు
ప్తరులనగు పండితులు వుండియు ఉన్న శిష్యకోటినైనా నరికట్టి
ధ్ధరించక ఇంటను కూర్చుని తమతమ ప్రిగల్భములతో కాల
ము వ్యధాపుచ్చుట శోచనీయము. ఈలాగుననే మరికొంతకాలము
సీనులై నూరకుండిన కొలది రోజులలో శ్రీవైష్ణ మతము నామ
రహితమగు ననుట కెట్టిసందేహముండదు. నాకు చిరకాల
త్రులును గురుతుల్యులును శ్రీవైష్ణవ మతాభిమానులు నగు
హరాజశ్రీ వెలగల సుబ్బారెడ్డిగారీ విషయమై పూర్వాచార్యులను
ష్ణవ పండితులను యెందరినో హెచ్చరించుచుండినను యెవరి
ను వారే నన్ను ముట్టుకోకు నామాలకాకి యనునట్లు ఉదా
నులై నూరకుండుటయేగాక తమతమ శిష్యులనైనా చక్కబెట్టు
జాలకపోవుట శోచనీయము. కాబట్టి యికనైనను త్వరలో
గ్గాని పండితులగు వారలు వైష్ణవ మతస్తులందరికి వర్తించునట్లు
హవ్వాపాయా ప్రాంతములలో సమావేశములు జరిపి సదరు విష
ములు సుదర్శనం మొదలగు స్వమత పత్రికలలో ప్రకటింపించి
ప్రిబోధము గావించి పూర్వపు ఔన్నత్యమును ప్రకాశింపజేయు
త్రమము. ఇట్టి బాధ్యత శ్రీవైష్ణవ మతమునగల పండితుల
దను గురువులమీదను యున్నది గాన వారాపని త్వరగా ప్రారం
చుట శ్రేయస్కరము. ఇందుకు సుదర్శనం మొదలగు స్వమత
త్రికలుకూడ కొంత ప్రియత్నించుట ముఖ్యావశ్యకము. గావున
ప్యమైనంత త్వరలో వైష్ణవ మతమునగల పండితులు, కవులు,
ఆచార్య పీఠస్థులు అభిమానులు మొదలగు వారెల్లరు దీర్ఘముగా
లోచించి సభలు గావించి తగిన యేర్పాటులు గావింతురను గట్టి
నమ్మకముతో పదేపదే మనవిచేయుచున్నాడను. ఇట్టి సద్బుద్ధి

వారికి త్వరలో కలుగజేయ జగద్గురువులగు శ్రీ మదాశ్రీమానుజు వారిని సిరాకార నిరంజనుడైన పరాత్పరుడగు శ్రీ వేణుగోపాలు బ్రహ్మమూర్తిని సదా నా మానసంబున స్మరించుచుంటిని.

ఉనిడా వెంకటా

---

శ్రీ వైష్ణవ స్వాములకు

# సద్విజ్ఞాపనము.

మహాశయులారా! మదీయ మతోద్ధారకులారా! దాసు దాసాను దాసుడను అకించనుడను నగు మదీయ హృదయంబు సంశయాస్పదములై పీడించుచున్న యీదిగువ విషయము అడియేన్ దాసునిపై పరిపూర్ణ కటాక్షముంచి దేవరవారలు కృప యదాసుడు సద్విజ్ఞాపనము చేయుచున్నాను. అవి యేవియనగా.

(1) శ్రీ వైష్ణవ మతమునకు నీతి ప్రధానమా జాతిప్ర నమా.

(2) శ్రీ వైష్ణవ నామము ప్రత్యేకముగా నొక జాతి జెందినదా లేక ఆమతము అవలంభించిన అందరికీ వర్తించునా.

(3) శ్రీ వైష్ణవ మతమున పంచ సమస్కారాదులైన వారలు అందరూ వకే పంక్తిని భోజన పానాదులు చేయవచ్చు లేక చూపుదోషాదులేమైనా యుండునా.

(4) శ్రీ వైష్ణవ మతమునకు బాహ్యమునకు గల ము చిహ్నములెవ్వి యెట్లుండిన వైష్ణవ మతస్థుడని ఎదుటవారు గుర్తి గలరు ఆచిహ్నము లెప్పటినుండి యేయే పెద్ద లాచరించిరి.

(5) శ్రీవైష్ణవ మతమున తప్తచక్రాంకిత దారులై తిరుమం
...స్తాను సంధానులై యుండియు మ్లేచ్ఛసంపర్కమున మ్లేచ్ఛా
...లై మ్లేచ్ఛాది మంత్రములు పఠింప వచ్చునా.—

(6) తిరుమంత్ర మనగా అష్టాక్షరి ద్వయము చరమశ్లోకము
...నా లేక తిరుమంత్రానికి వేరు పంతాకలదా యేది కలపితే తిరు
...మగును. యేయే అనుష్ఠానములకు యేయే నామములలో
...దురు.

యీ పైవిషయముల ఆరింటికి సరియైన సమాధానము తిరిగి
...దర్శనం పత్రిక ద్వారా తెలుపగలందులకు కోరుచున్న శ్రీవైష్ణ
...భిమాని.

యన్. ఆర్. వి. శోభనాద్రిదాసు,

మన్నృధాపురి తారకాసురపురం తా॥



# వైష్ణవ మతగురువు వైరాగ్యము

బూసి శేషాచలం.

( అమ్మగారి బాధపడలేక అయ్యగారి కిష్టంలేకపోయినా వృద్ధ
షాకారిగారు అమ్మగారినీ అయ్యగారినీ శిష్యయాత్రకు బయలుదే
స్తారు. వానపల్లిలోవున్న మతాభిమాని మాన్యూరు నంబిగారు వాటి
ఆహ్వానిస్తారు. )

* * *

( ఆధునికాచార్యుల మతం ప్రకారం శరణాగతపరులు కా
వారంతా అన్యులే. తిరుమంత్రార్థపరులూ ద్వయాధికారులు కూడా
అన్యులే! శరణాగతపరులుకాని ఆళ్వారాదులూ శ్రీ రామానుజులూ
అంతా అన్యులే అవుతారుకాబోలు పాపం! వారికి తరుణోపాయ
మేదీ! దీనిని మతం అంటారో, చాదస్తం అంటారో, అవితెలి
అంటారో కదా ? ? ? సం॥ )

* * *

ప్రవేశం అయ్యగారు - మతాభిమాని మాన్యూరి నంబి -
నంబిగారి అరుగుమీద.

అయ్య:— మాన్యూర్నంబిగారు, నంటపాత్రలు సామగ్రి
యిప్పించినచో అమ్మగారు వంటచేస్తుంది. ఒక గదికూడా వదిలి
కించండి.

మా:— అయ్యా! అమ్మగారంటే? వంటజేయడము. బాగా ...చ్చారు. ఉదయము యెప్పుడు సాపాటుచేసి బయలుదేరినారో? ...కడచి వచ్చారు. చాలా డస్సియున్నారు. అమ్మగారిని విశ్రాంతించు. వంట మాఅవిడ చేస్తుంది. ఆవిడచాలా తెలివికలది. ...గా పనిచేస్తుంది. ఆచారమునకు లోటుండదు. పదార్థములు ...ములుగ తయారుచేస్తుంది. తొందరగా అయిదు నిమిషాలలో ...రుచేయగలదు. మనము కుశలప్రశ్నలు పూర్తిచేయునంతలో ...రుచేసి పిలుస్తుంది. దేవరవారు ఆరాధనచేసుకొని సాపాడి ...లకు వచ్చినతర్వాత మేమెల్ల శేషము భుజింతము. మీకేవిధ ... అభ్యంతరము జరుగదు.

అయ్య:— ఆచారములకు అభ్యంతరము వస్తుందనిగాదు. ...ర్యులమగుటచేత పురుషాకారిగారు శరణాగత వైభవములెరిన ...నిష్ఠపరులగుటచేతను స్వయంపాకము చేసుకొనవలసినదేగాని ...రు తయారుచేసిన భక్ష్యములు భుజించరాదు.

మా:—అటులైనచో మీకందరకన్ని పొయ్యిలుకావలయునా?

అయ్య:—అక్కరలేదు. అమ్మగారు వంటచేసిన మాకందరకు ...వచ్చును.

మా:— అయ్యా! మేము తయారుచేసిన వంటకములు ...రేల భుజించరాదో మీకేమైన కారణములు చెప్పగలరా?

అయ్య! చెప్పలేకేమి? అన్యశేషముగతికి దూరమని శాస్త్ర...ములు ఘోషించుచున్నవి. మీరుచదివి గాని, వినిగాని యుండలేదా?

...సి అన్యశేషముగతికి నాటంకమనుచు
శాస్త్రములు జెప్పుచుండెను చదువలేదే

పరముజెందంగగోరిగా పడెడుబాధ
సద్గలికి భిన్నమాకిర్రియ సలుపనగునే॥

అష్టకష్టములనుభవించి ఆచార్యులవారి కృపకు అర్హులై మోక్షమార్జించుకొని అనుభవించక చెడుట బాడియగునా?

మా:— తే॥ గీ॥ అనన్యశేషముగలికి నాటంకమంచు
రన్యశేషముగతి కెట్టులర్హులగులు
అన్యులనగ నెవరవనియందు జనుల
నన్యులని స్వజాతీయుల ననగతగునే।

వ. ఇతరదేశస్థులు యితరమతస్థులు అన్యులగుదురుగాని స్వమతస్థ జాతీయులమై మే మెట్లున్యులగుదుము గురువర్యా?

అయ్య:— అన్యులను పదమున కర్థము స్వమతస్థులు కాని గాదు. ధర్మముతీరని వారని యర్థము.

మా:—ధాత్రినిగల వారందురు ధర్మంబుదీరని వాక్య ణింతురా?

అయ్య:—ప్రపంచమునగల ప్రజల ప్రస్తావన మనకేల? స్వమతస్థుల గూర్చియే చర్చింతము.

మా:— సత్సాంప్రదాయ కుటుంబమునందు జన్మించి మత సిద్ధాంత రీత్యాధర్మములు భక్తిశ్రద్ధలతో ఆచరించు వైష్ణవుని జనియించిన బిడ్డ వైష్ణవుండుగాడా? అట్టివాని నన్యునిగా లెక్కించ బాడియగునా?

అయ్య:— జన్మచేత నెవరును గొప్పవారు కాజాలరు. ధర్మముచేత గొప్పవారలగుచున్నారు. గొప్పవిప్రుండైనను ద్వయాధికారి గానిచో చండాలుని కంటె తేలికయనియు, అట్టివాని యింట వస్తువైనను చవిచూడరాదనియు శాస్త్రంబులుఘోషిల్లుచున్నవి. శాస్త్రములను గొట్టివేయవచ్చునా?

మా.— అపరాధిని ! శాస్త్రమును గొట్టివేయవచ్చునని ...కాదు విన్నపముగా వించుకొనజాలదు.

...ధరణి మాదిగైన ధర్మంబుదీరెనా ?
భాగవతుడని భువి పలుకుచుండు
అట్టివానియింట నశనంబు భక్షించ
పాపమెల్ల పోయి పరముజెందు !

ఎవడు ద్వయాధికారిగాడో అట్టివాడు బ్రాహ్మణుడైనను ...లునికంటె నీచుడనియు, చండాలుడు ద్వయాధికారియైనేని ...భాగవతోత్తముడనియు అట్టివానియింట సాపాడి వానికి శుశ్రూ...జేసిన పాపములు హరించి స్వర్గముప్రాప్తించునని శాస్త్రములు ...నుచున్నయవి మీా మతభిప్రాయముమేమి ?

అయ్య:— శాస్త్రములను కొట్టివేయరాదు. అంగీక...వలసినదే.

మా:— అటులైనచో !. దేవరవారు చిత్తగించుడి.

... పంచసంస్కారమిల క్రమపద్ధతిగను
జెంది శ్రీపాద తీర్థంబు స్వీకరించి
మంత్రద్వయమును బడసి ద్వయార్థగోష్టిల
ఆచరించెడు వారెట్టు లన్యులగును ॥

ద్వయాధికారి సంబంధులనుగూడ అన్యులనుచున్నారది మత...యు సమ్మతమా ?

అయ:— ద్వయాధికారులైనంతమాత్రమున లాభములేదు. ...గతలుగావలెను.

మా:— శరణాగతలుకానివారింట సాపాడరాదనుచున్నారు. ...మో చెప్పగలలా ?

అయ్య:—నష్టమా ? చెప్పలేకేమి ? వినుము.

తే॥ గీ॥ తనదుబంధువులింపైన తళియ గుడుప
అన్య శేషమున పాపమంకురించి.
ఘోరనరకంబులోపలగూలిపోయి.
మరల జన్మంబులేకను మగ్గిపోవు॥

భక్తప్రపత్తి శ్రద్ధలతో తానార్జించిన మోక్షమంతయు అన్య శేషంబున యంతరించి స్వర్గమునకు దూరుడై నరకప్రాప్తుడై మరల జన్మలేకపోవును

మా !—అయ్య:— దేవరవారు శలవిచ్చిన ధర్మమే శాస్త్ర మెందుగలదు. దానికి ఆధారమైన ప్రమాణముగలదా ?

అయ్య ! బిడ్డలకు ధర్మములు బోధించు మీరలే యీ రీతి వచియింప నేమనదగును-ఆకటిబాధ తీర్చుకొను నిమిత్తం తిను పదార్థము మోక్షమును పాడుచేస్తుంది ? మీ జవాబు యెంతసమంజసము నున్నదండి ? అయితే మద్యంగ్రోలవచ్చును గదండి?

అయ్య:— మధ్యము మొదలగునవి ద్రవపదార్థములు వాటి కాచారములేదు.

మా:—

తే॥ గీ॥ అశనమును దిన అన్య శేషము మగును
కల్లువల్లను కష్టంబు కలుగబోదు
అన్నమందున నన్య శేషంబదెట్లు
కల్లులో లేకపోయెనే కానరయ్య॥
మీ యాచారములెంత విపరీతముగ నున్నవండి గురువుగారు!

తే॥ గీ॥ అన్యజాతులవద్ద నాచారమిడచి
పిండివంటలు తిందురు ప్రియముతోడ

పచ్చడులు మెక్కినేమియు బాగుచెడదు
అన్నమన్యంబు యయ్యేనో అయ్యలారా॥

అయ్యా! గురువుగారూ! మరియొకమనవి. యీ క్రిందప్రశ్న
మీ జవాబేమి?

కూపంక్తిసాపాటు సలుపరాదందురు సల్పిననేమగు సరుసులారా?
శరణాగతులమంచు సరసకురానివ్వరు చెంతకురానేమి చేటుకలుగు?
ఆహారవస్తువులంటుకోనివ్వరు. అంటుకొనినేమి యంతరించు.
వికరములనైన పట్టుకోనివ్వరు. పట్టుకొనిననేమి పరువు తగ్గు॥

మజ్జిగిచ్చిన మా శూద్రిమగువకన్న
కల్లుపోసెడు యీడిగ కాంతకన్న
ఫలములొసగు మహమ్మదపడతికన్న
అన్యమయ్యెన మనజాతి యార్యులారా?

గురువుగారూ! మీ యాచార వ్యవహారము లెట్లున్నవనిన
చెప్పెదవినుడు.

గొంగళిలో కూడు కుదురుగదినుచుండి
యిదిగో వెంట్రుకంచు నెంచనేల
ఇంతకంటె వెఱ్ఱి ఈభువి నవరయ్యా
ఎలుగురును వినిమిము నవ్వరున్నే॥

అయ్యా:— దేవరవారు యీ రీతిని మొండిపట్టు పట్టి కుందే
మూడే కాళ్లని వాదించుట భావ్యముకాదు. విశాలహృదయ
యోచించినచో మీ వాదన మంతయు అసమంజసముగ
మీకే దోచకమానదు.

అయ్యా:— ఔను! మా వాదనమంతయు కుందేటికి మూడే
వాదము మీ వాదనమంతయు మంచివాదన చాలాబాగుంది.

ఆహా దైవమా కాలమహిమ! కాలవైపరీత్యమునుబట్టి మానవుల హృదయములు మారుచుండును (నిట్టూర్పువిడిచి) గురువుల గోడు యీస్థితికివచ్చినది-మార్యాణ్ణంబిగారు. దాసిగాడితో వాదోపవాదములేల? కడుపులో మాడిపోతుంది ప్రాణాలుమీది కొస్తున్నవి. ఎలుకకు ప్రాణపోకడ పిల్లికి చెరలాటమన్నట్లుంది. మీ వికటపక్షాల వితండ వాదమున్నూ, యివ్వేదలచుకొన్నచో వంటపాత్రలు సామగ్రి యిప్పించండి లేదా? మరియొకగ్రామము వెడదాను. అన్నముకొఱకు కపన్నులమై అర్థించిరాలేదు. మీ గృహములకు దెలియునా? గురువులయెడ నిరసనము చూపరాదు.

మా!— నిజమాడిన నిష్ఠురము న్యాయసమ్మతమైన విషయములు ప్రశ్నించుట తప్పా? గురువులగు మీకంత గోపమేల స్వామి!

అయ్య:— కోపమా? ఎవరిమీదని మా కోపము? కోపపడుట కెంతవారలు నాయనా?

మా:— అయ్యగార్కి పూర్తిగా ఆగ్రహమువచ్చినది. కో మాట్లాడిన మర్యాద దక్కదు. తిరువారాధన ఆయన తయారు లాభములేదు. ఓసేవ్, మాట్లాడవే? నిన్నే? వినబడడములేదా డాం త్వరగారా!

(సశేషము.)

---

# గమనిక.

నమోనాపత్రికలు కావలయునని అనేకులు వ్రాయుచున్నారు. తపాలాచార్జి నిమిత్తం అర్ధణా తపాలబిళ్లలు పంపవలెను. లేనిచో నమోనాపత్రికలు పంపజాలము.

# చాత్తాద శ్రీవైష్ణవ మహాసభ.

## సేలము

11-8-39 తేది సాయంకాలము 5 గంటలకు సేలము సెవ్వా
పేట చా॥ శ్రీ॥ వైష్ణవ భజన మతాలయమునందు సేలమునగర
ర్యులగు చాత్తాద శ్రీవైష్ణవుల మహాసభ యొకటి జరుగెను.
మమున దేవతా ప్రార్థనము జరిగిన వెంటనే సభవారి కోరికపై
జి. గోపాలయ్యగారు సభాధ్యక్షతను వహించి మన కులాభివృద్ధికి
సభలు మిక్కిలి యవశ్యకమని నొక్కి వక్కాణించిరి. అందుపై
యములనుబట్టి శ్రీయుతులగు. న. వేంకటరమణయ్యగారు,
నరసిహ్మయ్యగారు, రామానుజయ్యగారి మున్నగువారలుపన్య
. అటువెనుక క్రిందుకనబరచిన తీర్మానములు చేయబడిన తరు
శ్రీ. జి నరసిహ్మయ్యగారి వందన సమర్పణతో సభముగెసెను.

## తీర్మానములు.

1. మనజాతి నామము చాత్తాద శ్రీవైష్ణవులనుటయే గాని
ని కాదని ప్రభుత్వమునకు విన్నవించుచు, మనకు విరోధులగు
అర్థహీతమును, దూషణప్రదమునగు 'సాతాని' యను నామ
జెప్పుటకు తగదనియు, గాన ప్రభుత్వమువారు తమరికార్డుల
సాతాని యను శబ్దమును రద్దుచేసి అందుకు బదులు చాత్తాద
ష్ణవులనియే అన్నిరికార్డులయందును గుర్తించవలెనని యీ నగర
లగు చా॥ శ్రీ॥ వై॥ మహాసభవారు మదాసు ప్రభుత్వమును
టకు తీర్మానించెదరు.

2. పై. తీర్మానమును ప్రభుత్వమునకును పత్రికలకును పంపిం
మరియొక తీర్మానము గావింపబడె.

---

# మ న వి.

---

## సుదర్శనం పత్రికా పాఠకులకు.

శ్రీవారణముల్తైన కొన్ని కారణములవలన సెప్టెంబరు సంచికను ప్రచురించలేకపోయితిమి. ఆసంచికకు బదులు శ్రీవచనభూషణ. ప్రథమ ప్రకరణం-అను అనుబంధమును వచ్చేసంచికతో పాఠకులకు అందజేసెదమని మనవి చేయుచున్నాము.

మేము చందాదారులు కానివారికికూడ చాలమందికి చందాదారులుగా చేరుదురనే వుద్దేశంతో పత్రికలు పంపుచున్నాము. చాలమంది వారి విరాళములను గాని చందాలనుగాని పంపలేదని తెలుపుటకు విచారించుచున్నాము. భాగవతులందరును చందాదారులుగ చేరియు, తమ బంధువులనుచేర్పించియు సుదర్శనము నభివృద్ధికి తెచ్చెదరని కోరుచున్నాము.

మతసామాజిక విషయములనుగూర్చి కుపముగ వ్రాసి తమ యభిప్రాయములను సుదర్శనంద్వారా భాగవతలోకమునకు నివేదింపవలెనని కోరుచున్నాము.

---

—: కృతజ్ఞత. :—

ఈనెలలో శ్రీమాన్ టి. వెంకటేశ్వర్లుగారు. (విన్నప్ప పేట) దయతో సుదర్శనమునకు రు 2-0-0 విరాళమును పంపించినందులకును

శ్రీమాన్ బుక్కపట్న రామానుజయ్యగారు (ఆంధ్రపత్రిక ఆఫీసు మద్రాసు) అభిమానులుగ చేసినందుకును వారికి మాకృతజ్ఞత

సుదర్శనం

1 సంపుటము | నవంబరు, 1939. | సంచిక 5

# సుదర్శన పత్రికాస్తుతి.

శ్రీమతే రామానుజాయ నమః.

---

సీ॥ దుర్వాసు గర్వంబు దునుమాడి యంబరీ
షుని ప్రేమజూడ్కుల జూచెనెద్ది
గజరాజు మొసలిచే గష్టపరంపర
నొందుచో రక్షించె నుర్వినెద్ది
సభలోన దుర్వాక్య సంభాషణము జేయు
శిశుపాలు ఖండన జేసెనెద్ది
దైత్యులు శిష్టుల ధర్మంబు దప్పి బా
ధించుచో వరుస భేదించెనెద్ది
గీ॥ అదె సుదర్శనపత్రికాఖ్యనుజెలంగె
వైష్ణవాచార పద్ధతి వదలి దుష్ట
సాంప్రదాయంబుధిని మునుగు స్వాములకును
బుద్ధిజెప్ప సుదర్శనమును దలంతు.

గీ॥ అనుకొనగరాని దౌష్ట్యంపు బనులబూని
వేషభాషాది రూపుల వేగజూపి
పైకిమాత్రము దమగుట్టు బయలుపడక
నుండువిధమున జరియించు నుర్విజనుల
కతడు గురువౌచు శిష్య విత్తాపహారి
దానగును గాసి శిష్యహృత్తాపహారి
గాడు సిక్కంబు వీడెపో కపటగురువు
గోముఖవ్యాఘ్రమును బోలు గురువితండు
పరమ దౌర్భాగ్యులో యిట్టి గురువులకును
బుద్ధిజెప్పు సుదర్శనమును దలంతు

గీ॥ దారాసుతాది పోషణ దవిలిమిగుల
వ్యసన ద్వయంబుచేతను బాధనొంది
గెలువజాలక నింద్రియంబులను గుక్క
లాగబడురీతి స్వయముగా లాగబడుచు
అతడు భావ్యప్రబంధాది యఖిల స్వమత
విషయముల కర్ణ భేదంబు వినెడివారి
చెవుల పండువౌనట్లుగ జెప్పియధిక
భ్రాంతిబడజేసి పాపులో పగిదిజేయు
కపటగురువుల సంఖ్యకు గర్వముడిపి
బుద్ధిజెప్పు సుదర్శనమును దలంతు.

గీ॥ నిప్పుదగిలిన గృహముకు నీడుబోయి
ప్రాంతములనుండు గృహములు బాగుపడును
తద్విధము దానుజెడిపోయి తదితరులను
తనదురాచార సంపత్తి ననవరతము
జేయజాలుటలో యప్పుడే జేటురాదు

త్రాజెడినకోతి వనమెల్ల ధ్వంసమటుల
జేయునోయట్లె దుష్టులు జెరచుచుందు
పొట్టకూటికి నన్యుల బొట్టమాడ్చు
మోసగురువుల పాపపు యాసలణచి
బుద్ధిజెప్పు సుదర్శనమును దలంతు.

సీ॥ సత్యభూతదయాది సద్గుణంబులులేక
చపలులా వైష్ణవస్వాములార
వైరిషడ్వర్గంబు వదలించుకోలేక
బద్ధులా వైష్ణవ స్వాములార
ఆచార్య సూక్తుల నాచరించకధర
భ్రష్టులా వైష్ణవస్వాములార
యతిరాజు బోధించె మతికళంకోప,
దేశములని బల్కెడి స్వాములార

గీ॥ జీవహింసాదికార్యముల్ సేయుచుండ
పెద్దలదికూడదనిచెప్ప పెద్దలైన
వారలే వాడిరిదియను వ్యర్థులార
సదుపదేశము లిడిమీకు సత్వరమున
బుద్ధిజెప్పు సుదర్శనముచు దలంతు.

ఇట్లు
బాలకవి. కాండూరి తిరువేంగళాచార్యులు.
మోటమఱ్ఱి నైజాం



# చాత్తాద శ్రీవైష్ణవ యదార్థ ధర్మం.

(గత సంచిక తరువాయి.)

ఇంతేగాక వైష్ణవ ధర్మశాస్త్రములన్నియు. అసురతమో గుణాచరణ తగనిదని నిషేధించు చున్నవి.

ముముక్షు జనకల్పకము శివ పద్యం.

మూ॥ భ్రిమచేత విప్రింభముచేత నలసతచేతంబ్రిమోదంబుచేతనైన। భావ దుష్టప్రోక్త బౌద్ధపాశుపతాది వేదబాహ్యకు దృష్టివిమతకృతుల। నాసుర ప్రకృతి మోహనకల్పితములని తాత్వికులందు నాదరముమాని। శ్రుతినిత్యమునఁబౌరుషోక్తియునని తత్వహిత పురుషార్థంబు లెఱుగుచోటఁ। దదుపబృంహణ రూపప్రిధానభార తాదిస్వాత్విక సత్పురాణాది పాంచ రాత్రనిశ్చితవేదాంతసూత్ర సమ్మతార్థ మెఱిగింతురని లక్ష్మణార్యులనిరి॥ 3

తా॥ భ్రిమచేతను సంవాదముచేతను నొక కృషిఁచేసి వేసటపడి విడుచుటచేతను ప్రిమాదవశముచేతను మనసు చలింపఁచేసిన బౌద్ధపాశుపతకపిల మాయా వాదితమతములను వేదాంతార్థములనెఱుంగనీక వేదబాహ్యార్థముల నిశ్చయించి కృతులఁచేసి యుండునని యును అవి రాక్షస ప్రికృతులకు రాజసతా మసాది మోహములు పుట్టునట్లు శ్రియఃపతి యాజ్ఞవలనంచేయించిన వనియును తత్వజ్ఞులైన పెద్దలయందలి విశ్వాసములు విడచి వేదము నిత్యము ఒకచేతఁబలికించబడక తానే పలుకుచున్నదనియును ఆత్మకు హితమైన తత్వముఁదెలియవలసిన పెద్దలా వేదాంతార్థముఁలి వరిఁచెశి శ్రీమదారిమాయణమును శ్రీమహాభారతమును, శ్రీపాంచరాత్రిమును నిందుల నిశ్చయించిన వేదాంతరహస్యార్థమును నెఱిగింతురని లక్ష్మణార్యు లానతిచ్చిరి॥

(తామసరాజసములుగల రాక్షసప్రిభృతులకు, భ్రమకలుగజేసిన వేదబాహ్యార్థములును వారిసహవాసములును, కారాదని యానతిచ్చి యా వేదాంతార్థ మెఱుఁగునటిది మీదనానతిచ్చుచున్నారు.)

వామాచార పరులైన వైష్ణవ వేషదారి స్వాములారా శ్రీమన్నారాయణుని భజించు సాత్విక పరమభక్తులకును ద్రా ...సంబంధ ధర్మశాస్త్రములన్నిటికిని మీ నీచదుష్ట అనుష్టానము ...ప్రతిష్టను లోకములో కలుగచేసితిరి:

...తురు పేర్వులు నేలదొర్లుటే నీతిశాస్త్రమునగలదయ్యా।
...దూసి నరికెడువారలు బలు కరుణలేని రాక్షసులు సత్యముగా।

చ॥ యుక్తా యుక్తములెరుగు జన్మమిది యొకటే
మానవజన్మముగా భక్తి యనగ గొర్రెల
పొట్టేళ్లను బర్రెల తలలను నరుకుటయా॥

మీ అవివేకముతోనిండిన సంభాషణ పండితసభలలో పనికిరా... పాపపుణ్యములెరుగని అమాయకులగు స్త్రీపురుషులవద్దనే ప్రబ... ...గాచారములతో మేము శరణాగతి పరులము మాకు విధినిషేదము ...లేవు. ఇల్లె, పరమపదముకు పంపగలము మేమెల్లగలమని వచించు ...న్నారా. దుష్టశరణాగతి ఆహారాదులలోనే కదా మీకు విధినిషేద ...ములేవు తక్కిన బద్ధసంసారులవలె పిల్లలను వ్యర్థులైనను గనుట ...లకు పిల్లలకు విధిప్రకారం శుభ్రమయిన బట్టలుకట్టించుట మీ ...ములు మప్పుట మీరు చిన్నపెద్దలలోకి వెళ్లినప్పుడు అన్నినియ ...ములుగల వేషబాషలతో వర్తించుటయులేదా. పరమభక్తులుకదా ...నా. స్వామి ఈ రోజ్ను సాపాటు యేమిటని అడిగిన కర్తా ...య భూషణకాయ పర్వామాదు పులిహోర దద్ధోజనం చిట్టి ... యిటువంటి అనుచితం మాటలతో వార్ని సంతోషపెట్టడం చిన్న ...బరులలోనికి వెళ్ళేటప్పుడు నాయనలారా మేష్టరుగారడిగితేశా ...కారమనే చెప్పండీ అని అబద్ధములు నేర్పడం. అందాకవచ్చె ... మీకు ప్రపంచజ్ఞానంకలదు మీరే యోచించుకోండి.

గీ॥ జీవహింసను జేయింప చింతలేక
పెద్దవంచును కులములో బుద్ధిలేక
పాపకార్యంబు పాల్జేసి వండువంటి
కులమువారిని నరకాన గూల్చుచుండె.

వ॥ నీవేకదాయీ పాపకార్యమునకు మూలముదుర
వగాహమగుమోహ ప్రవాహములో బడద్రోసి
జీవహింసాపరులనుగాజేసి నీకు విధేయుల
యిన వారినందరిని నధోగతి పాలుజేసెదవు.

వ. హీనమైన జీవరాసులిట్లు గోలపెట్టుచున్నవి.

ఉ॥ పప్పులకోట్లు ధాన్యముల పారము లాజఘృతాదు లెంతో
నుప్పలు గుప్పలుప్పతిల గోధుమ తండుల మాషర్బురుల్
జొప్పడు చుండగా మనుబచోరులు మమ్మ్మహరించి చంపి
లొప్పుల కుప్పలట్టుల యో పరమేశ్వర మెక్కు టేలకో

వ. వైష్ణవ ఆచారి యనగా జీహింసకడన్న మాటేకదా
లోకానికి

సీ॥ అఖిలరాక్షస శిక్షణార్థమై కలశాబ్ధిమును మునుగృత
యుగమ్మున జనించి ప్రేతరావణునింటఖ్యాతి వృద్ధులు
గాంచి తద్వంశ నిర్మూలతను నొనర్చి సకలయాదవకోటి
సంహారణార్థ మైద్వాపరమ్మునబలు బాధిపుగాంచి
కలియుగమ్మున సకలగృహస్థులనొంచి శ్రీవైష్ణవా
ఖ్యాప్రసిద్ధిబొంది నట్టివరగుణాత్మంబుం గొల్చునట్టి వారి
గూర్చినే సేపంశతి గూర్ణ వినుమ మద్యసేవన మెప్పుడు
మానిమనుమ మానదగునోయి తగదోయిమద్యపాయి.

చిన్నతనంనుంచి వుగ్గు పాలలోకలిపి అలవాటయియున్న స్వాము
...యిన్నాళ్లనుండిరో ॰ ఎంత చెప్పినా లోలోన వితండమూర్ఖ వాదన.
...నేకాక అహంకార మమకారములతో వారి వారి అనుచరులతో
...జీవహింసలు అధిక ద్రవ్యవస్తువులతో, పెద్ద పెద్ద గోష్ఠులు అం
...వారి వారి ప్రతాపములు లేగాని వివేకములేదు పరిశీలనలేదు
...ర్ఖులకు పరిశీలన జ్ఞానముం యెన్నటికి కలుగునని నమ్మకంలేదు.
...మకరము ఖాంతరస్థమగు మానికముంబెకలింప వచ్చుఁబా
యకచలదూర్మికా నికరమైన మహోదధి దాటవచ్చు మః
స్తకమున బూవుదండవలె సర్పమునైన భరింపవచ్చు మ
చ్ఛిక ఘటియింప మూర్ఖజన చిత్తము ద్రిప్పనసాధ్యమేరికిన్.
శ్రీవైష్ణ ధర్మములు దైవచింతగల ఉత్తమ మానవులకొర
...తెలియపర్చుటయు, వామాచార వేషదారుల మోసములో పడ
...టకును ముందు ముందుక్క వామాచారులు మరుగు పర్చిన శ్రీ
...భూషణ వగైరా సాపరిదాయకములు వ్రాయబడును.
స్వాతిక చాత్తాద శ్రీవైష్ణవదాసుడు.
...రు వెంకటచలం వురపు చిరంజీవులు దాసుడు విజయనగరం.

---

## ఒ క స వ ర ణ

"సుదర్శనము" అక్టోబరు సంచికలో మనకర్తవ్యమను శీర్షికగల వ్యాసము
...పేజీ ఆకరు పంక్తులలో అర్థముకానట్లుకొన్ని అచ్చుతప్పులు పడినందుచేత
...ందు కనుబరచినట్లు ఆ వాక్యముల సవరణజేసి చదువుకొనవలెనని పాఠకులకు
...చేయుచున్నాను. "ఇట్లుండ "చాత్తాద" అనుశబ్దమును ఆంధ్రములోనికిదే
...కొందరు "చాత్తాద" అను అరవపదమునకు ఆంధ్రములో "చాత్తని
...రూపమునిచ్చి చాత్తని శ్రీవైష్ణవులని మనలనున్నూ, చాత్తిన శ్రీవైష్ణవులని
...స్మాతులలనున్నూ బిలిపజొచ్చిరి. ఈ నిజము తెలియగనివారు "చాత్తని" వార
...లో తకారమునకు దీర్ఘమునిప్పించి చాతాని వారని బిలువ నుంకించిరి.
...తాని పదము పలువుర నోటబడి 'సాతాని' యని రూపమెత్తెను."

(న. వేంకటరమణయ్య, సేలము.)

# పిన్నలు - పెద్దలు

(సత్యార్థి.)

"చిన్నవారెవరో "సుదర్శనం" పత్రికను నడుపుతున్నారు. "సుదర్శనం" నడత బాగుండుటలేదు. అదినాకిక ప. పవర్ధ"ని కొందరు భాగవతాగ్రగణ్యు లన్నారని తెలిసినది. అప్పటినుండి మాలో కలిగిన తపనకు మేరలేదు. ఈవిషయంచూస్తే మా రామం చేసినపని గుర్తొస్తుంది.

మాయింట్లో యొకవాచీ ఉంది. అదిగాఢనిద్రలో వుండి అంటేఆగిపోయి చాలకాల మయిందన్నమాట. మారామం దాన్ని విప్పి యేమోచేశాడు. మరణించినవాడు బ్రతికినట్లు అది టిక్ టిక్ మంటూ తిరగడం ప్రారంభించింది. వర్ణించడం కష్టము గాని మావాని సంతోషం ఇంతా అంతాగాదు. గంతులేశాడు. అడిగినవారికి అడగనివారికి చెప్పేశాడు. చూచినవారికి చూడనివారికి స్వయంగా చూపించి "భేష్" నిపించుకున్నాడు. ఎందుచేతనోగాని దానిలో నున్న లోపం యెవరూచెప్పలేదు. అదిగంటకు అరగంటత్వరగా పొయ్యేది. "పిల్లవాడు యేదోచేసాడులే" అని నేనూ యూరకున్నాను. మావాడు టైముప్రకారం పనులుచేయడం మొదలుపెట్టాడు. వాళ్ళమ్మను బడికిటైమైంది అన్నముపెట్టమని తొందరచేశాడు. స్వయంగా నడిపిన వాచీనే చూచి బడికివెళ్ళాడు. నిజంగా యీ ఉత్సాహాన్ని ఆపేవారికి పాపం తప్పదు. ఆరోజుగడచింది. మరనాడు అలారమ్ పెట్టుకొని లేచి సూర్యోదయం కాగానే "అమ్మా తొమ్మిదయిందే, ఇంకా అన్నం పెట్టకపోతే ఎట్లాగే?" అని యేడవడం మొదలుపెట్టాడు. తల్లి పాపం పిల్లాడేడుస్తున్నాడని త్వరగా వంట చేసి వానికిపెట్టి పంపింది. వాడు బడికిపోగానే నేను భోజనానికి లేవడం అలవాటు. కాని నాటైముప్రకారం నేను పేపరుచూచుకొంటూ

కున్నాను. మా ఆవిడకు పైనుంచే యేంటో తెలియదు. నన్ను
నానికి లెమ్మని త్వరపెడితే నే నరుస్తానని భయం. అరగంట
సింది. ధైర్యంగావచ్చి" "యేమండీ! అన్నములవీచల్లారిపోతు
య్, భోజనానికి లేస్తారా"? అంది. నావళ్లు చుర్రుమంది. గభాల్న
"నీమొఖం-యింకా తొమ్మిది కాలేదు, అప్పుడే వంటచేయడం-
చల్లారడం అయిందీ?" అన్నాను. "అబ్బాయి, అప్పుడే తొమ్మి
దన్నాడే" అని మెల్లగాఅంది. "వాడి మొఖం-నీమొఖం వాడేదో
ప్పుడని నీపూ యేడవాలీ? పసివాడు యేదోచేశాడని ఊరకున్నా
కపోతె ఆవాచీని నేలకేసి కొట్టాలనిపిస్తుంది" అన్నాను. అందు
"వాచీ యేమిచేసిందండీ? అన్ని వాచీలలాగ ఇదికూడా టిక్ టిక్
నే ఉందే" అని భయంతో అంది. "టిక్ టిక్ మంటే వరా?
పడవద్దూ?" అవగానే «అట్లానడిచేటట్లు మీరు చేయకూ
" అని చేతులుతిప్పుచూ ఒకరకం కంఠంతో మా అవిడనేట
నాగుండె 'ధన్' మంది. ఆలోచనలన్నీ రివ్వుమని మెగిరాయి.
ప్పు నీదే అన్నాయి. నేను తటస్థంగా యుండుటచేతనే యింత
జరిగిందని తెలిపాయి. ఒకరియందలి లోపం అందరికీ ముప్పు
నని బాగుగ తెలిసినది. అబ్బాయిరాగానే ఆ వాచీ స్లో-ఫా
తప్పుచెప్పి నేను కొంచెం చేయిచేసుకుండేటప్పటికి అది సరిగాపో
వచ్చింది. ఇప్పటికీ, ఆవాచీయే నాకుమంచిపైము చూపుతూంది.

మా రామం చేసిన పనికి వానిని చీవాట్లుపెట్టి ఆవాచీని అవ
పారవేస్తే వానికెంత మనసు నొప్పెట్టియుండేదో. అట్లే పెద్దలు
"సుదర్శనం"ను నిరశించారంటే మాకెంత తపనగావుంది. తెలి
అడుగుతాగాని మా "సుదర్శనం" చేసిన తప్పేమిటండీ?

దీనికి జవాబు లేకపోతే చాత్తాద శ్రీవైష్ణవజాతికిని పైయూ
న్న మాటను గలిగే అమర్యాదకు, తటస్థముగాయున్న
వారకు లనవచ్చును, వారే జవాబుచెప్పాలి.

# విన్నపంబిదే వైష్ణవ వీరులారా!

తిరుపతి భావనారాయణ, గుంటూరు.

శ్రీమద్వేద మార్గాచార విశిష్టాద్వైతమత పరమభాగవతోత్తములైన చాత్తాద శ్రీవైష్ణవ సోదర సోదరీమణులారా! మనః పూర్వక వందనంబులు. మదీయఆర్తనాద మాలకింపుడు.

ప్రస్తుతం మనలను పీడించుచున్న దురాచార పిశాచగ్రహంబును వదలింప నిశ్చలమనస్కులరై, చీకటింటిలో కడకంటిపై మూల్గుచున్న మన మతమునకు విజ్ఞానకాంతులు ప్రజ్వరిలజేయు నిష్కల్మషహృదయులై, హైందవకుల మాతలకన్న చాత్తాద శ్రీవైష్ణవ సంఘమాత కోహినూరుమణియట్లు ప్రకాశింపజేయ యువతీయువకులుద్రేకులై, యుత్సాహులై, యుత్తేజులై పనిజేసి సఫలమనోరథులగుట ముఖ్యకర్తవ్యంబు.

చాత్తాద శ్రీవైష్ణవులు శ్రీ రామానుజాచార్యునికి పూర్వమే యుండిరి. వీ రప్పుడు గూడ వైష్ణవ సంప్రదాయులే. శ్రీ యామునాచార్య ప్రథమశిష్యుడగు శ్రీ మహాపూర్ణాచార్యులను పెరియనంబిగారివద్ద శ్రీ రామానుజాచార్యులు పంచసంస్కారమును బొంది విశిష్టాద్వైత సిద్ధాంతము నుపదేశము బొందిరి. నాటినుండి చాత్తాద శ్రీవైష్ణవులకు శ్రీ రామానుజాచార్యుల కన్యోన్యప్రీతి గలిగి శ్రీ రామానుజాచార్యుని ప్రతిభ, విజ్ఞానము గ్రహించి వీరు మతాంతరులచే వారి కేవిధమగు ప్రమాదంబు తటస్థించకుండునట్లుగాపాడిరి.

అప్పుడు చాత్తాద శ్రీ వైష్ణవులు భగవద్భక్తుల పీడకు భగవంతునియందు దృఢ భక్తిశ్రద్ధలుంచి దురాచారాది దుష్టకార్య

...లై అహింసావ్రతులై, వివాహాది శుభాశుభ సకలకర్మలు ...దారాధనరూపముగ భగవద్భాగవతుల సన్నిధిని జరుపుకొనుచు ...మ గీతాగానములచే పామరులకు భక్తిప్రబోధంబు ...చుచు జీవనయాత్ర గడపుచు సతతంబు భగవదారాధన ధ్యాన ...లై యుండిరి. శ్రీమద్రామానుజునిచే పంచసంస్కారము నొందిన ...దులకు మంత్రార్థముల విశదీకరించి విజ్ఞానప్రబోధంబు ...చి మతవ్యాప్తి జేయు ప్రతినిధులుగను, విశిష్టాద్వైతమత రక్షకు ...నియమింపబడిరి. అట్లు కొన్ని శతాబ్దములవరకు నియమితకార్య ...ము జరిపించి వీరవైష్ణవులని పేరుగాంచిరి.

కాని ప్రస్తుతము శ్రీ రామానుజ విరోధులైన యాదవ ప్ర...శిష్యబృందము, వారిచే ప్రేరేపింపబడిన క్షుద్రమాచి ...స్త్రీలు, ...రామానుజాచార్య మతమును నాశనమొనరింప బూనినవారై ...మతమును వేదాంతర మతమును ఇదే శ్రీ రామానుజ మతమని ...ధించిరి. ఆహా! మానవు లెట్టి తేలికస్వభావులు? కొన్ని శతా...ములనుండి వచ్చు సత్సాంప్రదాయమును విడనాడి, హింసాప్రత ...యణులై, విద్యావిహీనులై, కృత్యాకృత్య గమనాగమన భక్ష్యా...విచారశూన్యులై, సకలమతగ్రస్తవర్తనులయినందున పూర్వ...ంబు పోగొట్టుకొని మూఢులై సంఘనిర్మాతయగు శ్రీ రామాను...పై అపనిందవేయుచు సంఘోన్నత్యాభివృద్ధి కర్తయగు తిరుక్కో...లు లక్ష్మణార్య పీఠమును ధిక్కరింపుచు కుక్షింభరులై యుండిరి.

ఇట్టిదురవస్థ పాలైన సంఘమందున్న మనము చేయవలసిన ...లెన్నియో గలవు.

మధ్యంతర మతమారణమును, సదాచార సంపన్నమైన ఆది ...స్థాపనయు, ఆర్థికంబుగను, రాజకీయముగను, సాంఘికముగను ...కముగను సంఘమును లేవదీయుటావశ్యకము.

అఖిలభారత చా॥ శ్రీ. వై. సంఘమహాసభలు జరపాలి, ఈసంవత్సరం డిశంబరు మాసంలో జరగాలని సూచించారు. ఈసభ బెజవాడపట్టణంబులో జరిపిన చాలమంచిది. ఆంధ్రదేశమునకు తమిళ దేశమునకు దాదాపుగా కేంద్రముగానున్న ఈ విజయవాడ పట్టణమున జరుపుటెంతయు మంచిది. శ్రీమాన్ నల్లఘట్ల వెంకటనరసయ్య గారు (మోపిదేవి) కడు సమర్థులును, విద్యావంతులును సంఘసంస్కర్తలును, ధనికులును అయినందున వారికి ఈకార్యభారమిచ్చిన గడుచక్కగా నిర్వహింపగలరు. వివిధ ప్రాంతములందున్నవారు పూరూర సంఘములుస్థాపించి ఈవిషయమై చర్చించి వెంటనే కార్యక్రమము జరుపవలయును. ప్రతినిధి రుసుముపెట్టుట చాలముఖ్యము.

---

## గుంటూరు వార్త.

---

గుంటూరులోనున్న మన చాత్తాద శ్రీవైష్ణవులందరు ఒక సంఘముగా నేర్పడి శ్రీమాన్ టి. రామానుజయ్యగారిని అధ్యక్షునిగను శ్రీమాన్ తిరుపతి భావనారాయణగారిని ఉపాధ్యక్షునిగను యెన్నుకొని సంఘనిర్మాణ కార్యక్రమమును ప్రారంభించినట్లు తెలియుచున్నది. వారు గుంటూరు జిల్లాయందంతటను సంచారముచేసి, ఉపసంఘములను స్థాపించి, మనజాతిలో ఉత్తేజముకలిగింతురని తెలియజేయుటకెంతయు సంతసించుచున్నాము. పెరుమాళ్లుయొక్క దయామృతమును భాగవతులయొక్క మంగళా శాసనములును వారిపై విరివిగ కురియుగాత !

వారివలెనే ప్రతిజిల్లాయందును మనవారును సంఘములస్థాపించి నిర్మాణ కార్యక్రమమును కొనసాగింతురుగా తమని విన్నవించుచున్నాము.

దాస్యం నమ్మాళ్వారు,

కార్యదర్శి. చా॥ శ్రీవైష్ణవయువజనసమితి, విజయనగరం.

# మన కర్తవ్యము.

## II

న. వేంకటరమణయ్య, సేలం.



చాత్తాద శ్రీ వైష్ణవ సోదర సోదరీమణులారా!

కాలదేశవర్తమానములకు తగినట్లు మనజాతిని యుద్ధారణను జేయుటకు మన మందరము పనిజేయవలసియున్నది. మన సాంఘికౌన్నత్యమునకు మనము సాధించవలసిన పనులు మెండుగనున్నవి యనియు, వానిలో మన సాంఘిక పత్రికయగు "సుదర్శనము"ను ముఖ్యముగా మనవారందరును దీసి యాదరించవలెననియు, మన కులనామమును 'చాత్తాద శ్రీవైష్ణవు' లని సర్కారు రికార్డులు మున్నగువాటియందు గుర్తించునట్లు జేయుటకు మనవారాందోళనము జేయవలెననియు, మనవారి సాంఘిక మహాసభల సమావేశపరచవలెననియు ముందటివ్యాసములో గుర్తించియుంటిని. ఈవ్యాసములో మరికొన్ని విషయములను చెప్పఁగోరెదను.

పూర్వము మనదేశములో పారమార్థిక చింతనమునందు ప్రజలకు మిక్కిలి యభిమానముండెను. గొప్పధనవంతునికన్నను ఒక్కటిబీద సన్యాసునికే హైందవుల యందు మిక్కిలి మర్యాదయు, పలుకుబడియు గలదు. హైందవదేశచరిత్రను తిలకించినను, రాజాధిరాజులు సైతము భక్తి జ్ఞాన వైరాగ్యములుగల సాధుపురుషులను సన్మానించి, వారికి శిష్యత్వము నంగీకరించి, గౌరవమర్యాదలనొసంగి యాదరించి వచ్చినట్లు పెక్కుసంఘటనలు గనబడుచున్నవి. మనదేశమునందే గాక ప్రపంచమునందెల్ల తపస్వులకు, యోగులకు, జ్ఞానులకు, భక్తులకు, మతప్రపంచములకు పూర్వము మిక్కిలి మర్యాదలు గలుగుచుండెడివి. అట్టికాలమునందు మనవారు పెక్కుమంది పారమార్థికమునందు నిమగ్నమానసులై లౌకికవ్యాపారములనుగమనించక, వేషభాషలయందు వైరాగ్యులై, అక్షయపాత్రధారులై, భగవన్నామసంకీర్తనములతో వీధులవెంట దిరిగి యాచించి దెచ్చిన ధాన్యములతో కుక్షియాత్రజరుపుచు, ప్రజలకు భగవద్విషయమును ప్రసంగించి చెప్పుచు కాలము గడుపుచుండిరి. అప్పుడు ఇతరకులస్థులు ఇట్టి మనవారిని మహాత్ములనియు, భక్తులనియు గౌరవించి మర్యాదలజూపుచుండిరి. కాలాంతరమున ప్రపంచములో గలిగిన అనేక మార్పులచేత, నేడు ప్రపంచమునందే గాక మనదేశమునందును, ఎట్టి భక్తి జ్ఞాన వైరాగ్యసంపన్నులైనను ధనము, అధికారము,

బలము మున్నగు నవిలేని బీదవారైనచో, వారు గౌరవ మర్యాదల నందక పోవుటయేగాక, మీదు మిక్కిలి హైన్యమునుగూడ బొందవలసిన వారగుచున్నారు. గాన పూర్వముగూడ కట్టు, పట్టినామము, బోడిజుట్టు, అక్షయపాత్ర, ఉంఛవృత్తి మున్నగు వాటితో గూడిన మన పెద్దల వేషభాషల కుండిన గౌరవ మర్యాదలు నేడు దేశమునందడుగంటి పోయినదన్న యాశ్చర్యము నందవలసినదిలేదు. ఇది యుగధర్మము. హిట్లరు వంటి సర్వాధికారుల రాజ్యమునకును, ఫిరంగుల, బాంబులు వంటి మారణ సాధనములకును, అధికారము, ధనము, బలము, మున్నగు లౌకిక కారణములకును తలవాల్చుచున్న ప్రపంచములో, నేడు పారమార్థిక మొకటియుండే లగ్నమానసులై లౌకికమును గమనించక నడువబూనినచో ఎట్టి వారును కష్టనష్టములకు లోను గావలసివచ్చును. దీని గమనించియే లోకము కాల దేశవర్తమానములకు దగినట్లు మార్పుల నందుచు వచ్చుచున్నది. మన వారును ఆ కాల చక్రమునకు లొంగక వేరు మార్గము లేదు. గావున పూర్వముండిన నైచ్యాను సంధానముతోగూడిన వేషభాషలలో కాలాను సరణముగ కొన్ని మార్పులు చేసుకొని మనవారు లౌకిక ప్రపంచమున ముందంజ వేయవలసియున్నది. అది విడచి పూర్వముండిన కట్టుబొట్లు, ఆచారము, వేషము, భాష మున్నగు వాటిలో నొక్కింత యైనను మార్పుకలుగరాదని హఠవాదము జేయబూనుట తగదు. వారు వారు నివసించు స్థలము, జేయు ఉద్యోగము - వృత్తి, కాలము వీనికి తగినట్లు పూర్వాచారమునకు బొత్తిగ విరోధము లేక యొక్కింత సంస్కరణములను ఆచార వేష భాషలయందు మనవారు చేకొనవలసినది యావశ్యమేయగును. అయినను జాతికిని, మతమునకును, సత్యమునకును, సన్మార్గమునకును విరుద్ధములగు సంస్కరణములకు చోటివ్వరాదు. ప్రాతయాచారములన్న అవియన్నియు మంచివనియు, నూతనములన్న అవియన్నియు చెడ్డవనియు నపోహపడక, ప్రతి యొక్కదానన్ని విచారించి చూచి చెడుగునున్ద్రోసి, మంచిని చేకొనవలయును. గనుక మన వారలలో దేశకాల వ్యత్యాసములచే జూపట్టు వైపరీత్యములకు జంకి, ఒకరిని యొకరు దూషించబూనక, మనలోని భేదాభిప్రాయములను వదలి సంఘీభావమునంది జాత్యుద్ధరణమునకు మనము కృషి జేయవలయును.

కుటుంబ నిర్వాహము జేయుచు పొట్టపోసుకొనుటకై మనవారు నేడు దేశమునందు పలువిధములగు వృత్తుల నవలంబించుచున్నారు. అయినను మన జాతి, మత, ఆచారములకు విరుద్ధములగు వృత్తుల నవలంభించుట ఎన్నటికిని తగదు. మన సంఘమునందు కాలక్రమమున విద్యా సంపద సన్నగిల్లుచున్నది. ముందైనను పారమార్థిక విద్య యెంత ప్రబలియుండినది గాని నేటికి అదియు కొఱవడసాగినది. ఈ కాలమునందితర సంఘములతో మనవారును ముందంజ వేయవలయునన్న ఈ కాలపు లౌకిక విద్యయందు మనవారు ప్రావీణ్యము నందవలయును.

స్థలో మన బాల బాలికలను సాధ్యమైనంతవరకు ముందుకు దేవలయును. ఇం
ధనము మిక్కిలి యావశ్యకము. అనేకముగ మనవారు మిక్కిలి బీదవారు
తము తమ బిడ్డలను విత్తవ్యయమున కోర్చి తామే జదివించుటకు వీలుగాదు.
త్యమును గుర్తించియే మనలోని పెద్దలు కొందఱుజేరి గడచిన ౨౫ సంవత్స
కను ముందే మద్రాసునందు 'చాత్తాద శ్రీవైష్ణవ సమాజ'మను పేర సంఘమును
చి చందాల మూలమునను, విరాళముల మూలమునను సొమ్ము వసూలించి,
లోని బీద బాలురకు ఉన్నత విద్యార్జనమునందు విద్యార్థివేతనము లొసంగి
సహాయమొనర్చుచుండిరి. ఆటువెనుక మద్రాసునందే 'విద్యాభివృద్ధి సమాజ'మను
మఱియొక సంఘ మేర్పడి యట్లే పనిజేయ గడంగెను. అందుపై నేలము,
, కోయంబత్తూరు మున్నగు చోట్లలోను స్వజాతి సమాజము లేర్పడి బీద
విద్యార్థులకు సాయ మొనర్చియు, స్వీయసంఘ శ్రేయమునకై యితర మార్గములలో
కృషిసేయు పనులు జేయుచుండినవి. గాని కారణాంతరములచేత ఆ సమాజము
లో ననేకములు నేటికి నిద్రలో నిమగ్నమైయున్నవి. ప్రథమములో మద్రాసు
న స్థాపించబడి పని చేయు చుండిన చాత్తాద శ్రీవైష్ణవ సమాజము పేర గడించిన
ధనము 1000 (వేయి) రూపాయలు తపాలాఫీసు సేవింగ్సు బ్యాంకిలో డిపా
జిట్టు చేయబడినది. యట్లే నేట్టికిని యున్నదని వినుచున్నాను. ప్రాత సమాజ
ము లేపదీసి, దానిద్వారా పై సొమ్మును పైబ్యాంకియందుండి రాదీసి, మన సం
ఘమునకు ఉపయోగపరచవలెనని మద్రాసు మిత్రులతోగూడి మేము ఆమధ్యచేసిన
ప్రయత్నము ఫలమునందలేదు. అటువెనుక ఆసొమ్ము యేమైనదియు ఇంకను నా
కు దెలియరాలేదు. మద్రాసు మిత్రులు మఱియొకమారు కార్యసాధనము
కు ప్రయత్నించెదరు గాక. గతమును మరచి మన వారధికముగనున్న ప్రతి
జిల్లా, తాలూకా, పట్టణములయందును స్వజాతి సంఘముల స్థాపించి, విరాళముల
మూలమున ధనము నార్జించి, మన కులములోని బీద విద్యార్థులకు ఉన్నత విద్యల
నార్జించుటకు ఉచితమగు సాయమొనర్ప గడంగవలయును. మరియు శ్రీవైష్ణవ
సాంఘిక విద్యాజ్ఞానమును మన వారియందు సన్నగిల్లుచున్నది గాన మత సం
ప్రదాయ గ్రంథపఠనాశక్తిని మనవారియందు లేపదీసియు, ఆయాచోట్లలలో
గ్రంథ కాలక్షేపముల జరిగించియు, మన బాల బాలికలకు భగవద్విషయ గ్రంథ
ములలో పోటీపరీక్షలు బెట్టి వారిని యాగ్రంథములను జదువునట్లు ప్రోత్సాహ
పఱచియు పనిజేయువలయును.

మనవారు ఏకాక్షరులు, చతురాక్షరులు, అష్టాక్షరులు అనియు ఇంకను
విధ వైష్ణవులనియు పెక్కు తెగలుగ జెప్పుకొనుచు పలు శాఖలుగ చీలిగనుపడు
చున్నారు. వీరలు పరస్పరము దూషణములకును బూనుచున్నారు. నేడు లోకము
ను అన్ని జాతులును ఏకమై సర్వసమానమును, సర్వ సోదరత్వమును స్థాపించు —

టకు పనులు జరుగుచుండుటను గమనించక ఒక్క జాతివారగు మనలో పలుభేదములఁ జూపట్టుచు, పలు శాఖలుగఁ జీలి, పరస్పర విరోధముల బూని, సంఘీభావమును మంటగలుపుట పాడియగునా? కొన్ని చోట్లలో నితర కులస్థులు కొందరు మనవారివలె వేషభాషల బూనుచు, తమ్ము మనవారిని జెప్పుకొనుచు మన సంఘమునందు లీనమగుటకు ప్రయత్నించుచున్నట్లు దెలియవచ్చుచున్నది. ఇట్లే బ్రాహ్మణ కులమునందును ఇతరులు జొచ్చుచుండుట జూచుచున్నాము. ఇట్టివారిని బట్టి ఆయా కులస్థులు జాగ్రత పడవలసినదే గాని మన సంఘజులనే దూరీకరించి త్రోయబూనుట తగదు. పలు శాఖలుగనున్న మనవారిని ఆచారవ్యవహారముల గమనించి సంఘీభావమువందునట్లు జేయుటకును మన వారలలో కొందఱక్కడ గనుపడు దుష్టాచారములను, దుర్వ్యాడుకలను పోగొట్టుటకును, మన సంఘజులమధ్య ఒకే విధమగు నాచారములను సంస్కరించి ప్రతిష్టించుటకును మనము పనిచేయ వలసి యున్నది.

---

## ఆత్తూరు తాలూకా చాత్తాద శ్రీ వైష్ణవ మహాసభ.

—)o(—

సేలం జిల్లా, ఆత్తూరు తాలూకాలోని చాత్తాద శ్రీ వైష్ణవుల మహాసభ 6-10-39 తేదీ మధ్యాహ్నము 1/2 గంటకు కొండయంపల్లి గ్రామమున రామానుజ సభామంటపమున సమావేశమాయెను. దేవతాప్రార్థ నానంతరము శ్రీమాన్ ఆత్తూరు కె. చిన్నపామయ్యాగారు సభవారి కోరికపై సభాధ్యక్షతను వహించిరి. అందుపై శ్రీమాన్ యస్. వెంకట్రామయ్యాగారు "జాత్యుద్ధరణము" అనుటను బట్టియు, ఉపన్యాసము లిచ్చి, సర్కారువారు తమ రికార్డులన్నిటియందును మన జాతినామమును చాత్తాద శ్రీవైష్ణవులని వాడక కొన్నిచోట్ల యింకను 'సాతాని' యను దూషణ ప్రదమగు నామమును వాడుచుండుట తగదనియు, మనవారందఱను అచ్చటచ్చట నకలుచేసి దొరతనమువారికి మన జాతినామమును చాత్తాదశ్రీవైష్ణవులనియే వాడవలయునని తీర్మానములుచేసి వ్రాసుకొనవలెననియు మనవారందరును "సుదర్శనము" పత్రికనుదీసి చదివి జాత్యభిమానమును జూపట్టవలెననియు నొక్కి వక్కాణించిరి.

పిమ్మట ప్రభుత్వమువారి రికార్డులయందు దూషణమునకై వాడబడిన సాతాని పదమును రద్దుచేయించి సరియైన చాత్తాద శ్రీవైష్ణవ శబ్దమునే వాడవలయునని సర్వసమ్మతముగ తీర్మానింపబడినది. భగవన్నామ సంకీర్తనతో సభ ముగింపబడినది.

యస్. వెంకట్రామయ్య,
ఫర్, అధ్యక్షుడు.

# చాత్తాద శ్రీ వైష్ణవ స్వాములకొక విజ్ఞాపనము.

ఆ. రామస్వామయ్య, రాశీపురం, సేలం జిల్లా.

మన సంఘము బాగుపడవలయునన్న, మన సంఘములో నైక్యమలవడవలయుననిన, మన సంఘములోని ప్రముఖుల స్నేహము వృద్ధిపొందవలయునన్న, మన సమూహములోని దురాచారము లడుగంటవలయుననిన, మన సమూహములోని భిన్నశాఖలలక్ష్య పరుపబడవలయుననిన, మన సమూహముయొక్క హక్కులు స్థిరపడవలయుననిన, మనజాతి నామము వ్యాకరణయుక్తముగ సర్కారు రికార్డులలో వాడబడ వలయుననిన, జాతిమీదగల యితరజాతివారి చులకనదృష్టి కుంటుపడవలయునన్న, ఇంకను మనజాత్యభివృద్ధి కరములగు పెక్కు కార్యములు జరుగవలయుననిన మన సంఘమునకు సభలవసరములే యను విచారదృష్టి కలవారికి గోచరింపక మానదు.

మన జాతి భగవద్రామానుజుల కాలమునుండి మాత్రమే యేర్పడెనని కొందరును, అంతకుముందుండియే కలిగినదని మరికొందరు వాదించుచున్నారు. ఈపుట్టు పూర్వోత్తరము లెట్లుండిన నేమి యూరకుండమన్నను మన పురాతన మత సంప్రదాయములెట్లో నేటికిని ప్రతియొక్కరు వర్తించవలయునని మనలోని పూర్వాచారపరాయణులును, పురాతన మత సాంప్రదాయముల నటుండ ప్రస్తుత దేశకాలానుగుణముగ ప్రవర్తించి లౌకిక వృత్తిలో ముందంజ వేయవలయునని మన నవనాగరిక సోదరులును వాదించుచున్నారు.

యీ వాదము సయితమటుండనిచ్చి యీ రకుందమన్నను మన శ్రీవైష్ణవ సత్సంప్రదాయ గ్రంథములలోను సదాచార్యులైన పూర్వాచార్యుల వల్లను మిక్కిలి పొగడ్తగన్న 'చాత్తాద శ్రీ వైష్ణవ' యను అర్థపుష్టిగల గౌరవప్రదమైన మన జాతినామము కుటీవల వక్రబుద్ధిగలవారి వాక్కులలో దూరి 'సాతాని' యను వ్యంగ్యరూపముతో నలిగి, సన్నగిలి వర్తించెడి జాతి నామమును వహించుకొనుట కిష్టపడకయు, తగిన కారణాంతరముల నెత్తిచూపి ఖండించుటకు తగిన సంఘ సహాయము నందుటకు మార్గములేకయు, కష్టము మీద, హీనభావమును వెలిబుచ్చెడి 'సాతాని' యను తుచ్ఛమైన పదమును మోసుకొని తొలగుచుండు మన సమూహముయొక్క హేయవర్తనమును చూడ మిక్కిలి జాలికలుగుచున్నది. యీ మూడక్షర నామము తల కంటగట్టబడి మన సంఘజులు ఇతర కులస్తులవలన కొన్ని స్థలములలో నెంతటి హీనముగ భావింపబడుచున్నారనునది చర్చనీయము. ఇట్లే దురాచార భావపూరితమగు త్రియాక్షరాభిదానమును రూపుమాపి జాతి నామమును దిద్దుకొనుట యందు రోషావేశపూరితులుగ మనవారు మెలగునట్లు పురికొల్పవలసి యున్నది. ఇంకను సంఘ మర్యాద విద్యాధిక్యత మున్నగు ననేక కార్యములలో మనవారు బాధ్యత వహించి పనిచేయవలసియున్నది. ఇంతతోబాటు క్రిందగుర్తించిన సంఘవృత్తి, వర్తన మున్నగువానిని చర్చింపవలసియున్నది. ఇంకను సంఘాభ్యుదయమునకగు కార్యములెంతో చేయవలసియున్నది. గనుక ఇట్టి మహత్కార్యముల నిర్వహించుటకు సంఘ సమావేశ మావశ్యకమేయని నొక్కి వక్కాణింప నుద్యమించెదను.

ఇంతేకాదు మనవారు నివసించు ప్రతి తాలూకాలోను జిల్లా యందును సంఘ సభల నెలకొల్పి సంఘాభివృద్ధి కనుకూలమగు నియమముల నేర్పరుచుకొని సంఘము నుద్ధరింపవలయును. ఈ తాలూకా

సభల కర్తవ్యమును మహాసభ నిర్ణయింపవలయును. గత
బరు నెల సుదర్శనములో మన్మిత్రులు శ్రీ న. వెంకట్రమణయ్య
మన కర్తవ్యమను శీర్షిక క్రింద వివరించునట్లు మన సంఘ
వేశములందు మనవారిలోని సాంఘిక మతాభిమానులను పురి
ప్రభుత్వము మన కోర్కెల నొప్పుకొనునట్లు చేయుటకు వలసిన
ము యెంతో యున్నది. మన సంఘబాలుర ఉన్నత విద్యాభ్యా
ందు ప్రభుత్వ సహాయ మలవడునట్లు చేయుటకు తగిన మార్గ
కనుక్కొనవలసియున్నది. పూర్వము విష్ణ్వాలయములలో
రికుండిన హక్కు లేవియని శాసనముల పరిశోధించి కనుకొని
బి పొందుట కేమి మార్గమని యారయవలసియున్నది. ఇంక
కార్యములున్నవి. ఇంతటి గొప్ప కార్యముల సాధించుటకు
లోని శాఖాభేదముల నటుండనిచ్చి దేశములోని చాత్తాద శ్రీ
వులందరు నేకీభవించి నడుము బిగించి మహాసభల మూలమున
సిననేకాని మనకోర్కెలు కొనసాగనేరవు. గనుక సశీఘ్రములో
గ్రమండలమున అఖిల చాత్తాద శ్రీవైష్ణవ మహాసభను జరుపు
వలసిన పనులను ప్రారంభించుట త్యంతావశ్యకమని కోరుచు
సత్కారమును నిర్వహించుటకు వలసిన కర్తవ్యమును చేకొన
మునియు సహాయమొనర్చవలయుననియు సుదర్శన పత్రికా
లకును సంఘోద్ధారకులను సంఘాభిమానులకును ముఖ్యముగా
భారము వహింపవలయునని విజయనగరములోని చాత్తాద
వైష్ణవ యువజనసమితి వారికిని మనవి చేసుకొనుచున్నాను.

---

# సుదర్శనం.

1939 సం॥ నవంబరు, 20 తేదీ.

## నామనవి.

---

ఈ సముద్ర మథనంలో హాలాహలమే వస్తుందో!
అమృతమే వస్తుందో??
మా విమర్శకులనేది హాలాహలమే వస్తుందని.

హాలాహలమే అయితే దాన్ని మ్రింగడానికి
శంకరుడే అవతరిస్తాడు.

తరువాత వచ్చేది తప్పకుండా అమృతమే అవుతుంది
మొదట, హాలాహలం వస్తుందేమోనని
తరువాత వచ్చే అమృతాన్ని వదులుకో గలమా

'మదిరాబిన్దు మిశ్రమాన శాతకుమ్భమయ కుమ్భగత
సలిలమ్భోభితే' అని తిరుక్కురుకై ప్పిరాన్‌పిళ్లాన్ ఒక ఉపమాన
సాయించారు. శాతకుమ్భం అనడంవల్ల పాత్రశుద్ధిద్యోతకం. తీర్థజల
అనడమువలన జలపావిత్ర్యం సూచితం. అయినప్పటికీ సురస
వెంటనే అది నిషిద్ధమవుతుంది.

ఆవిధంగానే మా వుద్యమాన్ని ప్రోత్సహిస్తూ లెక్క లేనన్ని ...వచాలు వస్తున్నప్పటికి వేళ్లమీద లెక్క పెట్టదగిన ఒకటి రెం...డావాక్యాలే మావుద్యమానికి కళంకాలని నేను భావిస్తాను.

...హూ విమర్శకులు మమ్మ... అర్థం చేసుకోలేకపో... వారు తలంచినట్లు ...ద్దేశం చాత్తాద శ్రీ...వులు దురాచార వర్త... అని లోకానికి చాటడం ...ంకాదు. దురాచార ...లు చాత్తాద శ్రీవైష్ణ... కారని చెప్పడం మాత్ర... చాత్తాద శ్రీవైష్ణవమతం ... సంఘంగాని దురాచార ...నానికి తావియ్యదు సరి... దాసిని ఖండిస్తుంది. అని ...టంగా చాటడం ...మాత్రమే! చాత్తాద శ్రీవైష్ణవులు సాత్వికధర్మసంపన్నులనియు, ...త్మిక సామ్రాట్టులనియు, చాత్తాద శ్రీవైష్ణవమ...ము మాత్రమే ప్రపంచమున కాదర్శమతమనియు రుజువుచేయుట ...మే మావుద్దేశము. ఇందుకోసమే ఈవిశ్వప్రయత్నమంతా!



* * *

మతానికీ నీతికీ అవినాభావసంబంధం. నైతికాభివృద్ధియే ...ఔన్నత్యం. నైతిక పతనమే మతవినాశకారణం. ప్రాక్ప్రతీచీ ...మలందలి మతచరిత్ర యీ సిద్ధాంతాన్నే స్థాపిస్తుంది. నైతిక ...తో బౌద్ధమతం నాశనమైంది. ఐరోపాలో రోమను కేతలిక్కు

మతమున్నూ ఆవిధంగానే దారితీసింది. నైతిక పతనాన్ని చెందిన్ని
ఉత్కృష్టంలోనున్న ఒక్కమతాన్ని చూపించండి.

ఆఫీసరుచేత పడ చీవాట్లు తిన్నచేతకాని గుమస్తా తన కోపా న్నంతా తన యిల్లాలిమీద చూపించాడట! అలావుంది మా విమర్శకుల అవస్థ. జాతియొక్క మతంయొక్క పతనానికి మూలకారణం తెలుసుకోకుండా తెలుసుకున్నా సమూలంగా ఛేదించడా దమ్ములేక మమ్మల్ని మండలించబోవడం చూస్తే నవ్వురాదూ?

ఒకరి వ్రాతల్ని చూసి కోపగించుకోవడం కంటే మననడతల్ని దిద్దుకోవడమే మంచిదేమో!

హితమనేది ఎప్పటికి ప్రియముకాదు కదా!

* * *

చాత్తాద శ్రీవైష్ణవులలోనున్న మూడు తెగలలోను ఒక తెగలో కొందరు మాత్రం వ్యక్తిగతంగా చేస్తూవున్న దురాచా లకూ, ఆపచారానికి సంఘం అంతా అవమానం భరించడం ఏమి న్యాయమో మాకు తెలియడంలేదు. మనం రహస్యమనే అనుభవాలు చిదంబర రహస్యాలు మాత్రమే. మనం ఆకాశంమీద కూర్చొని మాట్లాడకుండా ప్రజలలో కలసి మెలసి పరోక్షంగా మ గురించి యితరులనుకునే మాటలవింటే అందులోని నిజం తెలుస్తుం మమ్మల్ని మండలించే మా విమర్శకులకు మేము చెప్పేది ఏమి 'అయ్యా మతాంతరులచేతనున్నూ జాత్యంతరులచేతనున్నూ మనపై నిర్హేతుకముగా వ్రాయబడిన వ్రాతలను చూచి ఖండించండి' అని.

త్రాగుడువల్ల సర్వస్వమున్నూ కోలుపోయి ఫకీరైన ఒకపెద్ద మనిషి నన్నున్నూ నాపత్రికారచయితల్నీన్నీ మండలించ బోయాడు. అతనిమీద సుదర్శన ప్రభావం విపరీతంగా పనిచేసింది. అతడికినేను చెప్పే జవాబు ఏమిటంటే తమరు తమ దుర్వ్యసనాన్ని విడిచిపెట్టి మాకు సలహా చెప్పే అధికారం సంపాదించుకోవాలి. పంతులుగారు సిగ

కాలుస్తూ శిష్యులను సిగరెట్టు కాల్చవద్దని మందలిస్తున్నట్టుంది వ్యవహారం. పాపం! వామాచారులను వెనకవేసుకొని మమ్మ గౌరవముపేరట ధిక్కరించబోయే ఆ 'మతాభిమాని' విచా మా హృదయ పూర్వకమైన సానుభూతి.

మారచయితల్ని ఫలాని వ్యాసాలు వ్రాయండి అని మేమె కోరలేదు. వారు సంఘాన్ని అనుదినం ఎదుర్కుంటూవున్న నే సుదర్శనం ద్వారా భాగవతులకు నివేదిస్తున్నారు. సం సంస్కరించి ఉన్నతస్థితిలోనికి తెద్దామనే వారికోరిక అభినంద కదా!.

ఆవిషయాల్నే ప్రదర్శిస్తూవున్న సుదర్శనం ముకురప్రాయం మే. అద్దంలో వికృతాకారమైన ముఖం చూసుకొని కోపం ద్దాన్ని మాత్రం చిదగగొట్టడం ప్రయోజకత్వం కాదుకదా! మకులకు ఒకమనవి. మాకార్యక్రమం వారికి నచ్చకపోతే ష్టంవచ్చిన 'తీవ్రతరమైన' ప్రోగ్రాం యివ్వండి, సమాజం దలిక కలిగించండి.

Lead on we shall follow you.

ప్రతిజాతిలోను ప్రతిమతంలోనూ కొన్ని లోటుపాట్లున్నవి. రు వారి మతాన్ని వారి సంఘాన్ని సంస్కరించుకోవడం వారి ముల్ని చూసి ఒకరు నిరశించారంటే వారిమచ్చను వారు ష్ణులేదన్నమాట. వారికివారినాణెముతోనే జవాబుచెప్పగలము. అదే ధైర్యముతో మనము ముందంజవేయుదముగాక! అయిం ష్ణవ వైష్ణవ మతసామ్రాజ్యమును స్థాపింతముగాక! రాజకీయముగా ఆర్థికముగా సాంఘికముగా మనము వన్నె దముగాక!

సోదరులారా! అదే శపథముతో మన ధ్యేయస్థానమును చేరు వేగలవాలె ముందుకు సాగండి!

సంపాదకుడు.

## పండుగ దినము.

శ్రీ వైష్ణవ మహాసభ బెజవాడలో డిశంబరులో సమావేశమవుతుంది.

ప్రతి జిల్లాలోను విరాళములు ప్రోగుచేసి పంపించాలి.

ప్రతి జిల్లానుండి యువకులు వాలంటీర్లుగా వెళ్లి పనిచేయాలి.

ఎవరెవరు ఏ వ్యాసములు చదివేదీ ముందుగా ఆహ్వాన సంఘంవారికి తెలియజెయ్యాలి

ఎవరెవరు ఏతీర్మానాలు ప్రతిపాదించేది ముందుగా ఆహ్వాన సంఘం వారికి తెలియజెయ్యాలి.

అందరూ సహాయము చెయ్యడానికీ, సభలకు హాజరవడానికీ ప్రయత్నించాలి.

**ఇది దయాధర్మ భిక్షకాదు — మన విద్యుక్త ధర్మం.**
**మన ధర్మాన్ని మనం నిర్వహించడం మనవిధి.**

షరా:— శ్రీమాన్ నల్లగట్ల వెంకట నరసయ్యగారు, ఇరిగేషను కన్సర్వెన్సీ సబార్డినేటు, మోపిదేవి, కృష్ణజిల్లా వారికి విరాళములు పంపాలి. సంప్రదించాలి.

# చాత్తాద శ్రీవైష్ణవ యువజన సమితి,

# విజయనగరం.

---

ఈ నెలలో చాత్తాద శ్రీవైష్ణవ యువజనసమితివారు మూడు ...ములు సమావేశమై ఈ క్రింది తీర్మానములను చేసినారు.

(1) రాబోవు క్రిష్టమస్ శలవులలో బెజవాడయందు జరుగ...అఖిల భారత చాత్తాద శ్రీవైష్ణవ మహాజనసభకు అన్నివిధ...సహాయము చేయవలసినదని జాత్యుద్ధారకులను మతాభి...లను గోరుచున్నారు.

ఈవిషయమై శ్రీమాన్ నల్లగట్ల వెంకటనరసయ్య (మోపిదేవి) ...తో సంప్రదించవలయునని కోరుచున్నారు.

(2) జాతి నామమునుగూర్చి లోగడ జూలై నెలలో చేసిన ...నమును మరల మరల బలపరచి ప్రభుత్వమునకు పంపవలసి...కోరుచున్నారు.

(3) కొందరు భాగవతులు సుదర్శనమును గురించి పడు... అపోహల కాధారములేదనియు, స్వజాతి కారోపింపబడిన ...చారములగూర్చియే సుదర్శనము విమర్శించుచున్నదనియు, సుద...ము జాత్యంతరులను చందాదార్లుగ జేర్చుకొనదు గాన వారిఅపో... కాధారములేదనియు మనవిచేయుచున్నారు.

(4) ఈ క్రింది విధమున తీర్మానమును పూర్తిచేసి ఛీఫ్ ...టుడి గవర్నమెంటు ఆఫ్ మద్రాసు, ఫోర్టుసెంటు జార్జి

మద్రాసు అని అడ్రసు వ్రాసి ప్రతి పట్టణ గ్రామ చాత్తాద శ్రీ వైష్ణవులను పంపగోరెదము.

The Chattada Sri Vaishnavas of........................ Villige or town submit that our Community is not at present included in the list of the Backward Communities as given in the Educational rules and thus are deprived of half fee Concession open to most of the pupils of Non-brahmin communities. We pray that we may be included in the list of the Backward Communities in as much as we are only converts to Viashnavism from the same Non-brahmin communities who are elegible for Half fee concessions and in addition we are poorer than the above communities as our community is wedded to purity and poverty.

Camp:—

President's signature

Date:—

....................గ్రామం లేక పట్టణ వాస్తవ్యులగు చాత్తాద శ్రీవైష్ణవులు తాము బ్రాహ్మణేతరుల మైనప్పటికి తమ్ము మద్రాసు ఎడ్యుకేషనలు రూల్సులో వెనుకబడిన జాతుల లిష్టులో చేర్పలేదనియు, అందువలన తమకు సగము జీతముపై ఉన్నత విద్య గరచుటకవకాశము కలుగలేదనియు తాము కడు బీదవారనియు మద్రాసు ప్రభుత్వము వారికి మనవిచేసుకొనుచు, వెంటనే ప్రభుత్వమువారు తమ్ము వెనుకబడిన జాతులలో చేర్చి సగము జీతము సదుపాయము చేయించవలసినదనియు కోరుచున్నారు.

మకాం.

ప్రసిడెంటు సంతకం.

తారీకు.

(6) ఈక్రింది విధమున తీర్మానమును పూర్తి చేసి టుది సెక్రెటరీ టుది గవర్నమెంటు ఆఫ్ ఇండియా, ఇండియా గార్న మెంటు హౌసు, డిల్లీ. అని ఎడ్రెసు వ్రాసి పంపగోరెదము

The Chattada Sri Vaishnavas of.......................... town or villiage heartly welcome the view of the Viceroy in declaring the war aims of Britan in their application to India and pray that our community, mumbering more then 15 Laks in the Madras Presidency alone may be accorded at least seats in Madras Legislature in Joint or seperate electorates as resolved in its annual sessions.

Camp:—

President's signature.

Date:—

.......................గ్రామ లేక పట్టణ వాస్తవ్యులగు చాత్తాద శ్రీవైష్ణవులు ఈమధ్యను యుద్ధాదర్శములను గురించి వైస్రాయి గారు చేసిన ప్రకటనను ఆమోదించుచు మా సంఘమువారు మద్రాసు రాష్ట్రమునందు మాత్రమే 15 లక్షల జనాభాను పైగానుండుటచేత మా సంఘముతరపున మద్రాసు శాసన సభలో కొన్ని కనీసము స్థానములను ప్రత్యేకింపవలసినదని యిండియా ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

క్యాంపు:—

ప్రెసిడెంటు సంతకం.

తేది:—

ఈ తీర్మానముల నన్నింటిని ప్రతి గ్రామమునందున్న చాత్తాద శ్రీవైష్ణవులందరు చర్చించి, బలపరచి ప్రభుత్వమునకు పంపగోరుచు

న్నాను. మరియు బెజవాడలో డిశంబరు నెలలో జరుగబోవు మహా జనసభలో ఆమోదింప జేయవలెనని కోరుచున్నాను.

దాస్యం సమ్మాళ్వారు, (కార్యదర్శి)
చాత్తాద శ్రీవైష్ణవ యువజనసమితి, విజయనగరం.

---

# సభాతీర్మానములు.

బెజవాడ, బందరు, దీరి తాలూకాల చాత్తాద శ్రీవైష్ణవులు 29-10-3[illegible] తారీఖు సాయింత్రం 4 గంటలకు బెజవాడ తాలూకా తోట్లవల్లూరు గ్రామమం[illegible] సమావేశమై శ్రీమాన్ నల్లగట్ల వెంకటనరసయ్యగారి అధ్యక్షతక్రింద సభజరిపి [illegible] క్రింద నుదహరించిన తీర్మానములను తీర్మానించినారు. దయతో నవంబరు[illegible] వెలువడు "సుదర్శనం" పత్రికలో వెలువడించ ప్రార్థించుచున్నాను.

(1) తోట్లవల్లూరులో జరుపబడిన సభలో, చాత్తాదశ్రీవైష్ణవులు [illegible] జాతి నామము సాతాని కాదనియు, తమ విరోధులు చాత్తాదశ్రీవైష్ణవుల[illegible] సాతానులని దూషణనామముతో, వ్యవహరించుచున్నారనియు ప్రభుత్వమువా[illegible] స్పష్టముగా విన్నవించుచు, వ్యాకరణయుక్తమైన శబ్దము "చాత్తాద" కా[illegible] "సాతాని" కాదనియు స్పష్టపరచి, ప్రభుత్వమువారిటువైని నారికార్డులయం[illegible] సాతాని పదము వాడక చాత్తాదశ్రీవైష్ణవ శబ్దమునే వుపయోగింపవలెనని తీర్మా[illegible] నించుచున్నారు.

(2) ఇప్పటి విద్యాచట్టము, Back ward classకు చెందిన కుల[illegible] లకు తప్ప మిగతా కులములకు చెందిన విద్యార్థులకు. స్కూలుజీతము సహా[illegible] చేయుటకు యేమాత్రము అవకాశము లేదు. జీతముసహాయము, కులమును బట్టి[illegible] బీదతనమును బట్టి సహాయము చేయవలసినదిగా, అఖిల చాత్తాద శ్రీవైష్ణవ సంఘ[illegible] వారు ప్రభుత్వమువారిని కోరవలసినదిగా రాబోవు సమావేశములో వైతీర్మా[illegible] మును ప్రతిపాదించుటకు యీ సభాధ్యక్షుని కోరుచూ తీర్మానించినారు.

(3) 1వ తీర్మానమును ప్రభుత్వమువారికి పంపుటకును, 1, 2 తీర్మా[illegible] నములను "సుదర్శనం" పత్రికాలయమునకు పంపుటకును యేకగ్రీవముగా తీర్మా[illegible] నించినారు.

—నల్లగట్ల వెంకటనరసయ్య (అధ్యక్షుడు)

# దర్శనం

మాసపత్రిక.

అనుబంధం.

# శ్రీ వచనభూషణం

ప్రథమ ప్రకరణము.

సంపాదకుడు :
భద్రగిరి రామావతారం, బి. ఏ.,



చాత్తాది వైష్ణవ యువజన సమితి,
విజయనగరం.

విడిపత్రిక 0—1—0.

# నివేదన

శ్రీ వచన భూషణాన్ని రచించినవారు శ్రీ పిళ్ళై లోకాచార్యులు. వీరు శ్రీ వడక్కుత్తిరువీధి పిళ్ళగారి పుత్రులు. ఈయన సత్సంప్రదాయ కుటుంబానికి చెందినవాడు. ఈయన పూర్వీకులు అనేక వైష్ణ మత గ్రంథాలకు వ్యాఖ్యలు వ్రాశారు.

ఈయన సకల శాస్త్రాలూ చదివి ప్రాజ్ఞుడై ఒక్కమారు వైష్ణవ గ్రంథాల్ని సింహావలోకనం చేశాడు. పాశురాలా వే వ్యాఖ్యానాలా పాశురానికి పదేసి! అరుంబదాలా లెక్కలేనన్ని- జీవిత మా బుద్బుదప్రాయం. క్షణం మనదికాదు. ఈస్థితిలో మా వుడు యిన్ని గ్రంథాల్నీ చదివి యిదమిద్ధమని నిర్ణయించుకో బాధపడవలసిందే! అని ఆలోచించారు. ఆమానసిక వేదనలోను బయల్వెడలిన గ్రంథమే ఈ శ్రీవచనభూషణము.

శ్రీవచనభూషణం 463 సూత్రాలు గల ద్రావిడ గ్రం ఈగ్రంథాన్ని చూస్తే ఆంధ్రశబ్ద చింతామణి, బాలవ్యాకరణం కానికి వచ్చాయి. అయితే అవి వ్యాకరణ గ్రంథాలు. ఇది తగ్రంథం. ఈగ్రంథానికి మనవాళ మహామునులు విపు వ్యాఖ్య వ్రాశారు. ఒక్కొక్క సూత్రానికి రెండు పేజీల వ్యా వుంటుంది. శ్రీవచన భూషణంలాంటి ఉద్గ్రంథానికి మనవాళ మ మునిలాంటి జ్ఞాని వ్యాఖ్య వ్రాయడం సువర్ణానికి తావి అబ్బి జనసామాన్యానికి అందుబాటులో వుండడంకోసమే యీగ్రం ఈవిధంగా ప్రచురిస్తూ వున్నాం. అందువల్లనే మూల్యా చాలాతక్కువగా వుంచాము. ఈగ్రంథంలోని నాలుగు ప్రకరణ నాలుగు అనుబంధాలుగా వేస్తాము.

వ్యాఖ్య వ్రాయడంలో మనవాళ మహామునుల అడుగు అనుసరించాము. అనువాదంలో శ్రీమాన్ కందాడై శేషాచా వారి గ్రంథం మాకు చాల ఉపకరించింది. వారికి మా కృతజ్ఞత గ్రంథంలోని మంచిఅంతా ఆచార్యులది అవగుణాలన్నీ దాసునివి.

సంపాదకు

# శ్రీవచనభూషణము.



వేదార్థాన్ని స్మృతీతిహాసపురాణాలవల్ల నిర్ణయించాలి.

స్మృతిచేత పూర్వభాగంలోని అర్థమున్నూ తక్కిన రెండింటి ఉత్తరభాగంలోని అర్థమున్నూ నిర్ణయింపబడుతూ వున్నవి.

ఈరెండింటిలోను ఇతిహాసం ప్రబలమైంది.

అందుచేత అది ముందు చెప్పబడింది.

ఇతిహాస శ్రేష్ఠమైన శ్రీరామాయణంలో [1] చెరసాలలోనుం ఆమె యొక్క మహిమ చెప్పబడింది. మహాభారతంలో దూతమునకు పోయినవాని యొక్క మహిమ తెలియజేయ

ఈ రెండింటి చేతనున్నూ [3] పురుషకార వైభవమున్నూ ఉపాయ వైభవమున్నూ చెప్పబడినవి.

పురుషకారం అయినప్పుడు కృపయున్నూ పారతంత్ర్యమున్నూ అనన్యార్హత్వమున్నూ కావాలి.

---

1 'సీతాపిరాట్టి' అనడానికి బదులుగా చెఱసాలలోనున్న ఆమె అని ... దేవతా స్త్రీలను చెఱసాలనుంచి విడిపించడానికే యీమె చెఱసాల ...నది. ఇక్కడ ఈమె కృప చూపబడ్డది.

2 'శ్రీకృష్ణుడు' అనడానికి బదులుగా దూతమునకు పోయినవాడు అని ... ఆశ్రిత పారతంత్ర్యాన్ని తెలియజేస్తుంది

3 పురుష కారమనగా ఘటింపచేయునది.

4 పిరాట్టికి పురుషకార వైభవమున్నూ పెరుమాళ్లకు ఉపాయ వైభవ చెప్పబడినది. ఆగుణములు వారికి మాత్రమే ఉంటవి. అవి అనాది

(సీతా) పిరాట్టి మొదట విశ్లేషించడం (పెరుమాళ్లను విడి లంకకుపోవడం) తన [5] కృపను తెలియచెయ్యడానికి మాత్రమే.

నడుమ విడిచిపెట్టి వుండడం [6] పారతంత్ర్యాన్ని తెలియచెయ్యడానికి మాత్రమే.

తరువాత విడచిపెట్టడం [7] అనన్యార్హత్వాన్ని తెలియచెయ్యడానికి మాత్రమే.

పిరాట్టి [8] ఈశ్వరుడితో కలిసియున్నప్పుడున్నూ విడచియున్నప్పుడున్నూ ఈమె చేసే పురుషకారం ప్రకాశిస్తుంది.

సంశ్లేషదశలో ఈశ్వరుడ్ని దిద్దుబాటు చేస్తుంది.

విశ్లేషదశలో చేతనుడ్ని దిద్దుబాటు చేస్తుంది.

[9] ఇద్దర్నీ ఉపదేశం చేతనే దిద్దుబాటు చేస్తుంది.

ఉపదేశంచేతయిద్దరియొక్క కర్మపారతంత్ర్యమున్నూ నశిస్తుంది.

ఉపదేశంచేత వీలుకానప్పుడు చేతనుడ్ని కృపచేత దిద్దుబాటు చేస్తుంది. ఈశ్వరుడ్ని సౌందర్యంచేత దిద్దుబాటు చేస్తుంది.

---

5 దేవతా స్త్రీలను విడపించుటకు తాను చెఱలో నుండడం ఆమె కృపను తెలియజేస్తుంది. రాక్షస స్త్రీలు పెరుమాళ్లు విజయమును తలచుకొని భయపడగా "భవేయంశరణంహివః" అని భయప్రధానం చెయ్యడంకూడా కృపను తెలియజేస్తుంది.

6 ప్రజాపవాదమునకు జడిసి పెరుమాళ్లు లక్ష్మణునిద్వారా సీతాదేవిని గంగాతీరమున విడిచిపెట్టినప్పుడు 'నఖల్వద్యైవ సౌమిత్రే జీవితం జాహ్నవీజలే త్యజేయం రాఘవం వంశే భర్తుర్మాపరిహాస్యతి" అనడంవల్ల ప్రాణాన్ని విడిచిపెట్టాలని కోరిక ఉన్నప్పటికీ పెరుమాళ్ళ అభిప్రాయం ప్రకారం (అనగా త్సలాభస్సంప్రాప్తః')జీవించి సహింపవలసివట్టి పారతంత్ర్యమును బయలుపరచింది.

7 భూమిలో ప్రవేశించినప్పుడు మనసా కర్మణావాచాయ థారాం సమర్థయే తథామే మాధవీ దేవీవివరం దాతుమర్హతి. అని శపథం చెయ్యగా భూదేవి ఆమెను తనదగ్గరకు తీసుకొనిపోయింది. ఇది అనన్యార్హత్వాన్ని చూపుస్తుంది.

8 కాకాసురుని రక్షించడం సంశ్లేషదశయందున్నూ ఆంజనేయుని నుండి రాక్షసస్త్రీలను రక్షించడం విశ్లేష దశయందున్నూ అని తెలిసికోవాలి.

9 రక్షించుమని ఈశ్వరుని కోరుతుంది. శరణుపొందుమని ఆశ్రయితునికి చెప్పుతుంది,

తెలియని అర్థాన్ని విపులంగా చెప్పే ఆచార్యుడి కృత్యమున్నూ పురుషకార కృత్యమున్నూ ఉపాయ కృత్యమున్నూ తననే పెట్టుకోవడ వల్ల మహాభారతంలో ఉపాయ వైభవం చెప్పబడింది.

పురుషకారం యొక్కయు ఉపాయం యొక్కయు వైభవ ...టి దోషాన్ని గుణహానిన్నీ చూసి ఉపేక్షించడమే కాకుండా ...కారానికి వాటినే భోగ్యంగా చేసుకోవడం.

* చేతనుడియొక్క దోషగుణ హానులు పోతేగాని అంగీకము అని పిరాట్టియున్నూ ఉపాయ భూతుడైన ఈశ్వరుడున్నూ ...ట్టయితే ఆదోషగుణ హానులు వాళ్ళిద్దరికీ సంభవిస్తవి.

ఇంతకాలం వరకూ తన్ను స్వీకరించని పెరుమాళ్ల పిరాట్టి ...నాయందు దోషగుణహానులు లేకపోవడంవల్లకదా స్వీకరించారు ... చేతనుడు అనుకుంటే ఆదోషగుణ హానులు వాడియందే ...స్తవి.

రాక్షసస్త్రీలయొక్క దోషం ప్రసిద్ధమైనది కదా.

జితేంద్రియుల్లో తలమానికం లాంటివాడున్నూ ఆస్తికాగ్రే...డున్నూ 'కేశవస్యాత్మా' అని చెప్పబడ్డ అర్జునుడిలో దోష...న్నదా అని ప్రశ్నించితే అతనికి బంధుజనులపైవున్న స్నేహమున్నూ కారుణ్యమున్నూ, వధించడంలోగల భయమున్ను అతనిలోని ...షాలు ద్రౌపదిని అవమానించగా చూసి ఊరుకోవడమున్నూ కృష్ణుని అభిప్రాయ ప్రకారంగా ప్రధానదోషం.

---

* దోషమంటే అకృత్యకరణాది రూపమైన సిద్ధానుష్టానం. గుణహాని ...టే శాస్త్రవిహితమైన దానిని చెయ్యకపోవడం. దోషగుణహానుల్ని అంగీకరించ... కాకుండా వాటినే భోగ్యంగా తీసుకోవడం. చేతనుడు పాపాత్ముడైనను ...కృపకు పాత్రుడు అంటూ గోవు తన దూడమురికిని నాకు వాత్సల్యాన్ని కనపరుస్తుంది అని ఉపమానం చెప్పారు.

అయితే పాండవుల్ని ఎందుకు నిరసించడంలేదు అని అడిగితే ద్రౌపదీ మంగళసూత్రం కోసం అనిచెప్పాలి అర్జునుడికి ద్యూతసార థ్యాలు చెయ్యడం ప్రపత్తి ఉపదేశం చెయ్యడంకూడా ఈమెకోసమే.

ప్రపత్తికి దేశ నియమంకాని కాలనియమంగాని ప్రకార నియమంకాని అధికారినియమంకానీ ఫలనియమంగానిలేవు. విషయ నియమం మాత్రమే కావలసినది.

కర్మానికి పుణ్యక్షేత్రమూ, వసంతాది కాలమూ శాస్త్రోక్త విధాలు [2] త్రైవర్ణికులు అనేవి వ్యవస్థితములుగా వుంటవి.

'సశేషదేశః కాలః' అనడంవల్ల దీనికి (ప్రపత్తికి) దేశకాల నియమాలులేవు.

ఈ [3] అర్థమంత్ర రత్నంలోని మొదటి పదంలో స్పష్టంగా వుంది.

ప్రకారనియమం లేదనే విషయం ఎక్కడబడితే అక్కడ కన బడుతూంది.

ద్రౌపది బహిష్టైవుండి కదాప్రపత్తి చేసింది.

అర్జునుడు [4] నీచుల మధ్యకదా ఈఅర్థం(ప్రపత్యర్థం)విన్నాడు కాబట్టి (ప్రపత్తికి) శుధ్యశుధ్యములతో పనిలేదు.

---

1 దేశ నియమం అంటే పుణ్యక్షేత్రాలలోనే చెయ్యాలి అనే నియమం కాలనియమం అంటె వసంతాది కాలాల్లోనే చెయ్యాలి అనే నియమం ప్రకార నియమమంటె స్నానపాద ప్రక్షాళణాది పూర్వకంగా చెయ్యాలి అనేనియమం అధి కారి నియమం అంటె త్రైవర్ణికులుగానే వుండాలి అనే నియమం ఫలనియమం అంటె దృష్టాదృష్టాది ఫలాలలో నీఫలానికి ఇదే సాధనం అనే నియమం ప్రపత్తికి యీపైని చెప్పిన నియమాలేవీ లేవు.

2 త్రైవర్ణికులంటె ఉపనయ సంస్కార పూర్వకముగ వేదాధికారంగలవారు

3 'ద్వయేనమంత్రరత్నేన" అనడంవల్ల మంత్రరత్నాని కర్థం ద్వయం అని మాత్రమే.

4 "విష్ణుభక్తి విహీనస్తు యతిశ్చశ్వపచాధమః" అన్నట్లు విష్ణుభక్తి లేని దుర్యోధనాదులన్న యుద్ధరంగంలోనే అర్జునుడు గీతార్థం విన్నాడు.

ఉన్నట్లుగానే అధికారి అవుతాడు.

ఈవిషయంలో వేల్ వెట్టి పిళ్లైక్కు నంబిగారు సెలవిచ్చినది జ్ఞప్తి యందుంచుకోవాలి.

అధికారి నియమంలేదు. ఎలాగునఅంటె ధర్మపుత్రాదులు ద్రౌపది, కాకాసురుడు, గంజేంద్రాళ్వారు, విభీషణాళ్వారు, పెరుమాళ్లు యిళై పెరుమాళ్లు మొదలైన వాళ్ళంతాశరణుచొచ్చినవాళ్ళే అందువల్ల అధికారి నియమంలేదు.

ఫలనియమములేదు. ధర్మ పుత్రాదులకు ఫలం రాజ్యం. ద్రౌపదికి ఫలం వస్త్రం. కాకాసురుడి కిన్నీ కాళీయుడి కిన్నీ ఫలం ప్రాణం గంజేంద్రాళ్వారులకు ఫలం కైంకర్యం. శ్రీ విభీషణాళ్వార్లులకు శ్రీ రామప్రాప్తి. పెరుమాళ్లకు ఫలం సముద్రతరణం. ఇళయ పెరుమాళ్ళకు ఫలం రామాను సరణం. అందువల్ల (ఈఫలానికి ఇదే సాధనం అనే) ఫలనియమం లేదని తేలింది.

విషయనియమంఅంటే గుణపూర్తి గల స్థలమే.

(గుణ)పూర్తి అర్చావతారంలో ఉంది.

ఆళ్వారులు అనేక పర్యాయాలు అర్చావతారాన్నే ప్రపత్తి చేశారు కదా

పూర్ణం అనడంవల్ల అన్నిగుణాలు ఇక్కడ పుష్కలములు ప్రపత్తి కి కావలసిన సౌలభ్యాదులు యిక్కడే (ఈఅర్చావతారము లో) చీకటి గదిలో దీపంవలే ప్రకాశిస్తవి.

* పూర్తినిన్నీస్వాతంత్ర్యాన్నీ సంక్షేపించుకోని వుండి తన్ను ఆదరించినవాళ్లనుకూడా ఆదరించడం ఇక్కడేఈఅర్చావతారంలోనే.

---

* పెరుమాళ్ళు సముద్రం దాటి లంకకు వెళ్ళినప్పుడు సముద్రుడ్ని త్రోవ ఇవ్వవలసినదని ప్రార్థించారు.

ఇళై పెరుమాళ్లనగా లక్ష్మణస్వామి.

పూర్తిఅంటె అవాప్తసమస్త కామత్వం. దాన్ని సంక్షేపించుకోవడంఅంటే ఇచ్చిన నివేదనను స్వీకరించి తృప్తిపొందడం.

అంతర్యామిత్వం భూమిలోవుండే జలం లాంటిది.

పరత్వం ఆవరణజలం లాంటిది.

వ్యూహం పాల్కడలి లాంటిది.

వైభవములు (అవతారములు)నదీ ప్రవాహములు లాంటి

దానిలో నిలిచి ఉన్న మడుగుల్లాంటివి అర్చావతారాలు
(అర్చావతారం) శాస్త్రంచేత దిద్దుబాటు చెయ్య శక్యంకాక
యాంతరాసక్తులై (భగవద్విషయ) విముఖులై వుండేనరుల వైము
ఖ్యాన్ని పోగొట్టి రుచిని కలిగించేదై, రుచిని కలిగివుంటె ఉపాయమై
ఉపాయంగా తీసుకుంటే భోగ్యమున్నూ అవుతుంది.

ఈవిషయంలో (ఈఅర్చావతారంలో) ప్రపత్తిచేసే అధికా
రులు అజ్ఞులు, జ్ఞానాధికులు భక్తి పరవశులు అని మూడుతెగల
వాళ్ళు.

అజ్ఞానంచేత ప్రపన్నులైనవాళ్ళు నాలాంటివాళ్లు జ్ఞానాధిక్య
చేత ప్రపన్నులైనవాళ్ళు పూర్వాచార్యులు. భక్తి పారవశ్యంచే
ప్రపన్నులైనవాళ్లు ఆళ్వార్లు.

ఇలాగ చెప్పడం వాళ్లవాళ్ల ఆధిక్యాన్నిబట్టి.

ఈమూడున్నూ మూడుతత్వాలబట్టి ఉంటవి.

'ఎన్నాన్ శెయ్ కేన్' (నేను ఏమిచెయ్యగలను) అనే పాశు
రంలో ఈమూడున్నూ వున్నవి.

వారి విషయాన్న ఒక్కదానిబట్టి వుంటుంది. ముఖ్యం అదే
అంటే భక్తి మూలమైన ప్రపత్తే ముఖ్యమైంది.

'అవిద్యాతః'అనే శ్లోకంలో (శౌనకునిచేత) యీమూడున్నూ
చెప్పబడ్డవి.

---

పరత్వం=పరమపదమ్.

"ఇదం శరణమజ్ఞానాం' అనే చోటున భక్తిలో అవస్థానభేదము
...వెంటనే ఈ ప్రపత్తి శిథిలం కావచ్చును.

1 తన్ను అలంకరించుకొనేట్లు చేస్తుంది.

2 ధరించేట్లు చేస్తుంది.

3 ఈ స్వభావ విశేషాలు కళ్యాణ గుణాల విషయమందున్నూ
...యందున్ను, తిరునామాలయందున్ను, వేణునాదమందున్నూ
...వచ్చును.

'ప్రపత్తి ఉపాయంకాదు అని చెప్పుతూ వున్నారు.'

ప్రపత్తిని ఉపాయంగాచూస్తే కుమారుడు(తనపోషణగురించి)
...ద్ద లిఖితం పుచ్చుకొనేట్లు వుంటుంది.

దీనియొక్క స్వరూపం తన్ను (సాధనగా తలచినట్లయితే)
...చదు.

దీని అంగము ఇతరమైనవాటిని సహించదు.

ఉపాయం తన్ను సహిస్తుంది. (అంటే తన్ను ఉపాయంగా
...స్తే సహిస్తుంది.)

ఉపాయాంతరం రెండు విధాలుగాకూడా సహిస్తుంది.

ఇది (ప్రపత్తి) రెండింటిని సహించదు.

ఫలానికి ఆత్మజ్ఞానమున్నూ.

---

1 భగవంతుడు లభించడానికి ఈ చేతనుడు స్వప్రయత్నము నవలంబించు
...స్తుంది.

2 భగవంతునియందలి విరహముచేత "తరియేనిని" అనగా ధరింపజాలను
...ణాన్ని పోగొట్టుతుంది.
...సిద్ధోపాయముకన్న, సాధ్యోపాయంకన్నా విలక్షణమైనది కాబట్టి ఇది
...ముగాని ఉపాయాంతరముగాని సహించదు.

3 గోవిందుని కళ్యాణ గుణసంకీర్తనవల్ల ప్రాణరక్షణ చేసుకుంటున్నాను.
...) బాణాల్ని వ్యాపింపచేసిన చల్లని తామరపూవుల్లాంటి కళ్ళు కలిగిన ఈశ్వ
...మంలో తప్ప నామనస్సు ఉత్సాహపూరితంగా వుండదు. (తి మొ.)
...టిని సంకీర్తనము చెయ్యగానిని సుందరమైన చిలుకకు నమస్కరించినది(తి.
...బాధ గాను, ఊకుందుటకై వేణువుయొక్క మధురస్వరములా... (తి వా:

* అప్రతిషేధమున్నూ కావలసింది.

అలాకాకపోతే సంబంధానికిన్నీ గుణపూర్తికిన్నీ భంగంవస్తుంది

ఆపదను పోగొట్టుకుంటామని భ్రమించి దాన్ని తెచ్చిపెట్ట కోకుండా వుండడమే కావలసింది.

రక్షణకు కావలసినది రక్షణకు అనుమతించడం మాత్రమే.

(ప్రపత్తి) అన్నివుపాయాలకు పొదుగవడంవల్లనున్నూ చైత న్య కార్యమవడం వల్లనున్నూ, ప్రాప్తిదశలో అనువర్తించేది అవడం వల్ల నున్నూ స్వరూపవిరుద్ధం కాకపోవడంవల్లనున్ను అచేతవిలక్షణమై దాన్ని సాధనంగా తీసుకోకూడదు.

అయితే చేతనుడు అచేతన వస్తువుకంటె వేరుగా వుండడంవల్ల ప్రయోజనం ఉపాయమందు (సర్వేశ్వరుని యందు) ప్రీతిన్నీ

ఉపేయమందు (కైంకర్యమందు) సంతోషమున్నూ కలి వుండడం.

ఉన్మత్తా క్లెన్ని నెన్దిరున్దాయ్ (నీమనస్సులో యేమి తలంచి వున్నావు) అన్నట్లు లభించుటకు వుపాయం వాని యిచ్ఛ.

అదే యెప్పుడున్నూ వుంటుంది.

వీని తలంపు మారితే ఫలిస్తుంది.

అంతిమ కాలానికి రక్షకమేది? అని అంటే ఇప్పుడు రక్షకమే అనే తలంపు పోవడం మాత్రమే అని నంజీయరు సాయించియున్నారు

లభించేవాడున్నూ లభింపజేసేవాడున్నూ సంతోషించే వాడున్నూ వాడే.

స్వప్రయత్నాన్ని విడిచిపెట్టడమే పారతంత్ర్య ఫలం.

స్వప్రయోజనాన్ని విడిచిపెట్టు కోవడమే శేషత్వఫలం.

వానికొరకు చెయ్యడం ప్రయత్నఫలం.

---

* అప్రతి షేధమంటే మోక్షహేతువును అపేక్షించకుండా స్వభావసిద్ధ గానే మనకు శేషియున్నూ రక్షకుడున్నూ అయిన ఈశ్వరుని రక్షణం వద్దని నిషే ధించకుండా వుండడం [illegible] రక్షణకు [illegible] ప్రతిఘటించకుండా వుండడం

వాని విషయమున ప్రేమించడం చైతన్యఫలం.

అహమర్థమునకు జ్ఞానానందాదులు తటస్థములనతగినట్లుదాస్యం (అంతరంగ నిరూపకం!).

ఇది (దాస్యం) ఆగంతుకంకాదు (అనగా కొత్తగా వచ్చినది కాదు)

స్వాతంత్ర్యమున్నూ అన్య శేషత్వమున్నూ ఆగంతుకాలు.

స్వాతంత్ర్యం శేషత్వానికి విరోధి.

ఇతర శేషత్వం భగవచ్ఛేషత్వానికి విరోధి.

అహంకార రూపంలోవున్న మురికిని తుడిచివేస్తే ఆత్మకు నిజ పేరు 'అడియాన్' అనగా దాసుడ్ని అనికదా.

గ్రామ కులాదుల సంబంధముతో వచ్చినపేరు అనర్థహేతువు.

* 'ఏకాన్తీ వ్యపదేష్టవ్యః' అన్నచోట ఈసంగతి వివరింప బడింది.

ఉపాయానికి (అధికారైనప్పుడు) పిరాట్టివలెనున్నూ ద్రౌపది వలెనున్నూ తిరుకణ్ణమంగై యాండాను వలెనున్నూ ఉండాలి.

ఉపేయానికి ఇళైయ పెరుమాళ్ళవలెనున్నూ జటాయువు వలెనున్నూ పిళ్ళై తిరునరయూరరయరు వలెనున్నూ ఉండాలి.

పిరాట్టికిన్నీ ద్రౌపదికిన్నీ ఉన్న తారతమ్యం శక్తికిన్నీ అశక్తికిన్నీ ఉన్న తారతమ్యమే!

పిరాట్టి స్వశక్తిని విడిచిపెట్టింది.

ద్రౌపది లజ్జను విడిచిపెట్టింది.

తిరుకణ్ణమంగయాన్ తన వ్యాపారాన్ని విడిచిపెట్టుకున్నాడు.

---

* 'ఏకాన్తీవ్యపదేష్టవ్యో నైవగ్రామకులాదిభిః విష్ణునావ్యపదేష్టవ్యం తస్య సర్వం సఏవహి.

క్షుధాతురుడు ఉడికిన అన్నాన్నీ ఉడుకుతూఉన్న అన్నాన్నీ తినతలంచినట్లుగానే శ్రీరామచంద్రుడు అడవులకేగుతూ వున్నప్పుడు లక్ష్మణస్వామి, స్వామిని విడచిఉండలేననిన్నీ కైంకర్యం చెయ్యాలని అనిన్నీ సకలవిధకైంకర్యం చెయ్యాలని ఆజ్ఞాపించవలెననిన్నీ ప్రార్థించారు.

రాజధానికి వేంచేసిన తర్వాత స్వయంపాక నియమస్తులైన భరతాదులతో పాటు కైంకర్యంతో తృప్తిపొందక ఒక చేతితో ఛత్రమున్నూ ఇంకొక చేతితో చామరమును పట్టి కైంకర్యంచేశారు.

జటాయువున్నూ పిళ్లైతిరునరయూరరయురున్నూ శరీరాన్ని ఉపేక్షించారు.

* చింతయంతికి శరీరం తనంటనే పోయింది.

మోక్షానికి సర్వేశ్వరుడే ఉపాయం అని నిష్టకలుగడానికి శక్తిని, లజ్జను స్వప్రయత్నాన్ని విడచిపెట్టాలి.

ఉపేయాన్ని అనుష్టించడానికి ప్రేమయున్నూ తన్ను ఉపేక్షించడమున్నూ తన్ను ధరించలేకపోవడమున్నూ కావాలి.

ఇతడు విధిచేత ప్రాప్తించినదాన్నే విడిచిపెట్టగలడు కాని రాగంవల్ల ప్రాప్తమైనదాన్ని విడిచిపెట్టలేడు.

ఉపాయత్వాను సంధానము నివర్తకము.

ఉపేయత్వాను సంధానము ప్రవర్తకము.

అప్రాప్తి విషయాలలో ఆసక్తి కలవాడు అవిలభించి తీరాలి అని పట్టుబడితే ప్రాప్తవిషయాలలో ప్రీతికలవాడి పట్టుదల విషయమై వేరే చెప్పనక్కర్లేదు కదా?

అనుష్టానమున్నూ అనుష్టానముకానిదిన్నీ ఉపాయ కోటిలో చేరవు.

* చింతయంతి అనే గోపిక బయట పెద్దలుండడంచూచి గోవిందుని కన్నులు మూసుకొని ధ్యానించినది. ధ్యానమందలి నిర్మలమైన ఆనందంచేతనున్నూ కృష్ణుని పొందజాలని దుఃఖముచేతనున్నూ పాపనాశనముకాగా ఆమె ధ్యానిస్తూ యుచ్ఛ్వాస నిశ్వాసములుడిగి మోక్షాన్ని పొందింది.

ఇంతేకాకుండా అనన్యోపాయత్వానికీ అనన్యదైవత్వానికీ
...ం కలుగజేసే ప్రవృత్తిని సూచిస్తున్నాము కదా.

జ్ఞానవిపాక కార్యమైన అజ్ఞానంచేత చేసే కార్యాలన్నీ స్వరూ
...క ప్రతాశడులు.

ఉపాయ ఫలమై ఉపేయాంతర్భూతమై వుండేది ఉపాయానికి
...ంధకం కాదు.

సాధ్య సమానమున్నా ఆలస్యాన్ని సహించనిన్నీ అని కదా
...నికి అధిక్యం!

...ాధ్యవస్తువుపై వున్న ప్రేమవల్లకదా సాధనాన్ని అవలంబిస్తాము.

ఇతడికి (చేతనుడికి) ఆత్మగుణాలన్నిటికిన్నీ ప్రేమే ముఖ్య
...ం.

[1]"మాత్సాల్ మనజ్ఞ......ప్ప" [2]'పరమాత్మనియోరక్తః'
...ట్టు......మోన్దు' అనేవి ప్రమాణాలు.

ఆత్మగుణాల్లో ముఖ్యమైనవి శమము దమము.

ఈరెండున్నూ వుంటే ఆచార్యుడు చిక్కుతాడు.

ఆచార్యుడు లభిస్తే తిరుమంత్రం లభిస్తుంది.

తిరుమంత్రం చిక్కితే పరమేశ్వరుడు చిక్కుతాడు.

ఈశ్వరుడు దొరికితే ప్రాప్యభూమి అయిన వైకుంఠం దొరు
...ంది.

---

1 సర్వేశ్వరుడియందు మనస్సుంచితే నారీబాహులతయందాశనశించివేదాం
...మనస్సను నిలపడానికి సులభమవుతుంది.

2 ఎవడు పరమాత్మయందు ప్రేమకలవాడో అతడు పరమాత్మకంటే
...ం అయిన విషయాలయందు వైరాగ్యం పొందుతాడు.

3 ...ందరమైన కంకణములుగల శ్రీ దేవియున్నూ నీవున్నూ, మీరుభయు
... ...సి వుండగ సేవించిన పిదప వినడం, ముట్టుకోవడం, వాసన చూడ
...నుభవించడం ఓ.నిలా: తిరుగుతోన్న పంచేద్రియాలతో అనుభవింపదగ్గ
... తెలిసికో-డానికశక్యమైనదిన్నీ (భగవత్ప్రాప్తికంటె) అల్పమయిన
... షదలుకో న్నాను.

ప్రాపకుడి మూలాన్న ప్రాప్యవస్తువు దొరుకుతుంది.
ప్రాపకుడు తిరుమంత్రంవల్ల లభిస్తాడు.
తిరుమంత్రం ఆచార్యుడివల్ల లభిస్తుంది.
ఆచార్యుడు ఆత్మగుణంవల్ల లభిస్తాడు.

ఇది ఐశ్వర్య కాములకున్నూ ఉపాసకులకున్నూ ప్రపన్నులకున్నూ కావాలి.

ఈముగ్గురిలో ఎక్కువకావలసినవాడు ప్రపన్నుడు.
తక్కిన యిద్దరున్నూ నిషిద్ధవిషయాల్ని త్యజిస్తేచాలు.
ప్రపన్నుడికి శాస్త్రవిహిత విషయం విడవడమే అధికం.

ఇది కొందరికి * సౌందర్యంవల్ల కలుగుతుంది. మరికొందరికి కృపవల్ల కలుగుతుంది.

కలిగేటట్టి క్రమం ఏమిటంటే సౌందర్యం అజ్ఞానాన్ని కలుగజేస్తుంది. కృపవైరాగ్యాన్ని కలుగజేస్తుంది. ఆచారం భయాన్ని కలుగజేస్తుంది.

ఇవి వాటివాటి ఆధిక్యతబట్టి చెప్పబడ్డవి.

అరుచికలగడానికి (వైరాగ్యంకలగడానికి) దోష దర్శనం ఆవశ్యకం.

అంతమాత్రాన్న అది అంత ముఖ్యకారణం కాదు.
స్వరూపానికి అనుకూలం కాకపోవడమే ప్రధాన హేతువు.

భగవద్విషయంలో ప్రవర్తించడం గుణంబట్టికాదు స్వరూపప్రాప్తమును బట్టి.

అలాకాకపోతే గుణహీనమని తలంచినప్పుడు భగవద్విషయ ప్రవర్తనమున్నూ దోషాను సన్ధానమున్నూ సంసారప్రవృత్తి యున్నూ కూడనివే అవుతవి.

---

* ఇట్టిస్థితి కొందరికి సౌందర్యంవల్ల కలుగుతుంది ఏలాగంటే భగవత్ స్వరూప సాక్షాత్కారం పొందిన భక్తప్రపన్నులకు సకలజన మోహితమైన భగవంతుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యమును ఆస్వాదించడంవల్ల కలుగుతూంది.

[1] కొడియవెన్నెఞ్జమ్ అవన్ ఎన్తైకిడక్కుమ్' అనిన్నీ 'అడియేన్ ... కృన్నుమ్ ఉన్ శేరశి య్ద్రినయవేన్' అనిన్నీ నమ్మాళ్వార్లు చెప్పి... కదా.

గుణకృతదాస్యం కంటే, స్వరూపప్రయుక్తమైన దాస్యం ...మైంది కదా.

[2] అనసూయకు పిరాట్టి చెప్పినమాట జ్ఞప్తికి తెచ్చుకోవాలి.

భగవద్విషయంలో ప్రవృత్తి అనుకూలిస్తుందా అంటే దాని ...నా సంబంధం.

అది ఔపాధికం కాదు జన్మసిద్ధమైంది.

[3] 'సత్త' అనేది ప్రావణ్య కారణం అయిన అనుభవం లేక ... చెడిపోతుంది.

* అది చెడిపోకుండా ఉండడానికి తనకుతాను తటస్థించేవన్నీ ...నీయాలున్నూ స్వరూప ప్రాప్తములున్నూ అయివుంటవి. కాబట్టి ...తుడి విషయంలో ఇతడి ప్రవర్తనం అనుకూలిస్తుంది.

---

1 భగవంతుడు స్వకార్య పరుడు ఇతరుల కష్టాల్ని తెలియనివాడు. ఒకరికి ...వాడు. వంచకుడు. దుర్జ్ఞేయ స్వభావుడు అని చెప్పి, భగవంతుడిలాగ వున్నప్ప ...కాతీతముగా క్రూరమైన నామనస్సు వానినితప్ప వేరొక దానినెరుంగదు. ...మ్మాళ్వార్లు చెప్పినారుకదా.

2 శ్రీరామచంద్రుని విషయంలో నాకున్న బంధము స్వతసిద్ధముగా ఉన్నప్ప ...వారు గుణపరిపూర్ణులవడంవల్ల నాభావబంధము వారిగుణాలబట్టి వుంటుందని ...రు అనుకుంటున్నారు. వారు ఎప్పుడూ గుణవంతులుగా వుండడంవల్ల ...ణమును గుణములనుండి వేరుగా చూపించలేకపోతున్నాను వారొకవేళ ...నులుగానూ విరూపులుగాను ఉన్నప్పటికీ వారియెడల ఈవిధంగానే నడు ...టానుసుమా అని సీతాపిరాట్టి అనసూయకు సాయించినది.

3 సంబంధం అంటే శేషశేషి సంబంధం ... సత్తనుబట్టి ఉండేది అంటే ఆత్మతోటేవుండేది. అనగా జన్మసిద్ధం ప్రావ... అంటే స్నేహం.

4 సత్త చెడిపోకుండా ఈతడు చేసే ప్రయత్నాలన్నీ సర్వశేషి అయిన ...శ్వరుడికి అతిశయ ... స్వరూపానుకూలములు.

# AN APPEAL.

We are glad to inform you that we are goi to release in May a special number of o SUDARSANAM in ¼ crown size comprising abo 50 pages. Many eminent authors like Messers Viswa nath Kaviraju, Malladi Avadhani, Kavisekhara Bhogaraju Narayanamurty have promised t contribute their articles to us. We request the generous minded public to help our cause by contri buting donations, advertisements and Articles t our Sudarsanam.

May we request you particularly to send u your valuable,..........................................at an early da

Thanking you in anticipation.

Yours faithfully,

Editor.

---

శ్రీమతే రామానుజాయనమః.

# సుదర్శనం.

...ము } డిశంబరు. 1939. { ప్రత్యేక సంచిక.

...ము.


కాకర్లమూడి యతిరామానుజదాసు.
జిల్లా హరిజన సేవకసంఘ మెంబరు, గునపర్రు


౧

...న్నసేనన్నిక
...వ్యాప్రిజలెల్ల
...భులన రాక
...నులనినారు
...సునపుంట లోపంబు
...నుకొను మింక నామంబు

౨

...నులను పదము
...లలేనున్న
...ను ప్రిజలెల్ల
...గా వాడేరు
...కొను నీవింక లోపంబు
...కొని సవరించు నామంబు

౩

చాత్త్రాదులకు గాని
సంఘాలు లేక
సాతానులను పేరు
సవరించుకొనవలె గి
తెలిసికొను నీవింక లోపంబు
తెలిసికొని స్థాపించుసంఘంబు

౪

యువకులంతా నేడే
యూరూరు వెడలియు
యువజనసమితులు
విరివిగా స్థాపించి
సాతానులను పేరు సవరించ
సభలు దీర్మానములు గావించు

లలో మిగత ప్రకరణములన్నూ ప్రచురింతుము. (4) 'అష్టశ్లోకి' నిష్టప్తము గా ప్రచు భాగవతులకు నివేదింతుము

## దురాచారములను నిర్మూలించుట.

(ఏ) సంఘములో స్వార్థపరుల చేత ప్రవేశపెట్టబడిన దురాచారము నిర్మూలించుట.

(బి) అహింసా ప్రచారక సంఘము వారి చేతను మతాంతరుల చేతను ప్రచారింపబడిన నిర్హేతుకమైన నిందావాక్యములను ఖండించుట.

## సాంఘిక సేవ,

(ఏ) మన సంఘమునకు అజ్ఞానుల చేతను మతాంతరుల చేతను వాడబడు సాతాని నామమును ప్రభుత్వ రికార్డులనుండి రద్దుపరచుట.

(బి) ఉన్నతవిద్య గరచుటకై మనజాతికి సగముఫీజుపాయమును మనిమని ప్రభుత్వమును కోరుట.

(సి) చిన్నతరగతులు చదువుచున్న మనజాతి బీదవిద్యార్థులకు పుస్తకములను ఉచితముగానొసంగుట.

(డి) ధనవంతులనుండియు, మతాభిమానులనుండియు విరాళములనొసంగి ఉన్నతవిద్య గరపు బీదవిద్యార్థులకు స్కాలరుషిప్ నొసంగుట.

## 4. రాజకీయాభివృద్ధి

(ఏ) మన జాత్యభివృద్ధి కనువగువిధమున యసంబ్లీలలో మ జాతివారికి ప్రత్యేకప్రాతినిధ్యము నొసంగమని ప్రభుత్వమునుకోరుట.

(బి) మన జాత్యభివృద్ధికొరకు కొన్ని యుద్యోగములను ప్రత్యే పుమని ప్రభుత్వమును కోరుట.

(5) జాతియందైకమత్యమును పెంపొందించుట

(ఏ) సమాచారవర్తనము నెలకొల్పుట.

(బి) సంఘముయొక్క క్షేమమునకై అభిప్రాయ భేదము విస్మరించుట.

(సి) స్వార్థత్యాగమాదర్శకముగ పెట్టుకొనుట.

(6) సంఘములనెలకొల్పుట.

(ఏ). జిల్లా పట్టణ గ్రామ చాత్తాద శ్రీవైష్ణవ సంఘములనెల ల్పుట.

(బి) రామానుజ కూటములను స్థాపించుట.
(సి) మహాజనసభలను నడిపించుట లేకవానికి సహాయముచేయుట
(7) గ్రంథాలయములు పత్రికా పఠనాలయములు స్థాపించుట
మతగ్రంథములను వార్తా పత్రికలను సేకరించి సంఘకార్యాల ...లయమననో, లేక రామానుజకూటమునననో లేక యితరస్థలములయందుం ...పరచి, సర్క్యులేషన్ పద్ధతిగా భాగవతులకు మతసాంఘికవిజ్ఞాన ...చుట.
... వేసంగి మత పాఠ శాలలను నడపుట.
(ఎ) వ్యాయామము
(బి) బాలభటోద్యమము.
(సి) వివిధమతవిషయములు (2) మనలను నిరసించు జాతులనెదు ...ధానము
(డి) సాంఘిక విషయములు
(ఇ) రాజకీయవిషయములు
(యఫ్) ప్రచారవిధానము
...గు విషయములందు తర్ఫీజుచేయుట.
మనఆశయముల నెరవేర్చుకొనుటకు
(1) స్వజాతి పత్రికలలో ఆందోళనముచేసియు,
(2) ప్రచారకులను వివిధస్థలములకు బంపియు
(3) సభల తీర్మానముల మూలమునను,
(4) మహాజర్ల మూలమునను,
(5) పబ్లికు మీటింగుల మూలమునను (పబ్లికు మీటింగులలో ...మును కించపరచు మీటింగుల చేయకూడదు. మతౌన్నత్యమును ...ను నుపన్యసింపవచ్చును. మనపై ఆరోపింపబడిన విషయముల ఖండిం...ను.)
(6) ఇతర తీవ్రములైన విధానముల మూలమునను మనపనిని ...వచ్చును.

## నిబంధనలు

(1) 15 సం॥ లకు పై బడి 35 సం॥ లోబడిన వయసుకలవా దరు చాత్తాద శ్రీవైష్ణవ యువజన సంఘమున జేరుటకర్హులు.

(2) 18 సం॥ లోబడినవారికి ఓటింగుహక్కు లేదు.

(3) స్త్రీలుకూడ తమగార్డియనుల అనుమతిపై సభ్యురా గజేరవచ్చును.

(4) సంవత్సరం చందా అణామాత్రము.

(5) ఈక్రిందివిధమున ఫారమును బూర్తిచేసిచా శ్రీవై జనసమితి కార్యదర్శిC/oసుదర్శనం విజయనగరం అని పంపవలెను.

పూర్తి పేరు
వయస్సు.
విలాసము,
తండ్రి పేరు.
చెల్లించిచందా లేక
విరాళము.

చాత్తాద శ్రీవైష్ణవ యువజనసమితివారి ఆదర్శములలోను సభ లోను నేనేకీభవించుచు జాత్యౌన్నత్యమునకై పాటుపడెదను.

షరా:— స్త్రీ లైనచో గార్డియను సంతకముకూడ అవసరము

(1) 35 స॥ లకు పై బడి 50 సం॥ లోబడినవయస్సు గలవా రుకార్యనిర్వాహకవర్గము అనుమతినిపొంది సభ్యత్వమును పొందవచ్చు

(2) 50 సం॥ లకు పైబడినవారు యువజనసమితి సభ్యులుగాను కర్హులుగారు. వారు సలహాసంఘముగా నుండవచ్చును.

(3) చాత్తాద శ్రీవైష్ణవసంఘ సభ్యత్వపు చందా 0—1— మాత్రము నాలుగు కాణీబిళ్లలు పంపవలెను. వారి పేర్లన్నియు వార్షి చికయందు ప్రచురించబడును.

(5) 1—1—0 చెల్లించి వారి ఫొటోకూడ వార్షిక సంచికయం

...బడును.

(3) సంఘ సభ్యులందరు సుదర్శనం వార్షికోత్సవ సంచికను ఉచిత ...ందుటకు హక్కుగలదు

(4) మార్చి 10 తే॥ లోగా దరఖాస్తుఫారములు చా॥ శ్రీ॥ యు॥ ... C/o సుదర్శనం విజయనగరం పంపవలెను.

(5) మార్చి 20 వ తేదీని ప్రచురింపబడు సుదర్శనములో ఓటర్ల ...చురింపబడును. వారికిమాత్రమే కార్యనిర్వాహక వర్గము నెన్నుకొ...హక్కుగలదు.

(6) ఏప్రియలు 10 తేదీలోగా అభ్యర్థి దరఖాస్తులు కార్యదర్శిపేర ...ను.

(7) ప్రతిదరఖాస్తునూ్న ఓటింగుహక్కుగల సభ్యునిచే ప్రతిపాదింప ...మొకసభ్యునిచే బలపరచబడవలెను. అభ్యర్థిఅంగీకార సూచకము ...ము చేయవలెను.

(8) అభ్యర్థులపేర్లు ఏప్రియలు 20 తేదీ సుదర్శనములో ప్రకటించ... మేనెల 10 తే॥ లోగా సభ్యులు తమఓట్లను సుదర్శనమునకు పంప... మే 20 తే॥ వెలువడు సుదర్శనములో యెన్నుకోబడిన కార్యనిర్వా...ము పేరులు ప్రకటించబడును.

## కార్యనిర్వాహక వర్గము:

(1) అధ్యక్షుడు
(2) ఉపాధ్యక్షుడు
(3) కార్యదర్శి
(4) సహాయకార్యదర్శి
(5) పత్రికాసంపాదకుడు కోశాధికారి
(6) ఐదుగురితక్కువకాని కార్యనిర్వాహకవర్గము

ఒకసారి ఎన్నుకోబడిన కార్యనిర్వాహకవర్గము మగల ఎన్నికజరుగు ...ండును. సాధారణముగా సంవత్సరమునకొక పర్యాయము యెన్నిక

జరుగవలయును ఆకార్యనిర్వాహకవర్గమునందు గాని అందలిప్రత్యేకవ్య
యందుగాని విశ్వాసములేనిచో మొత్తముసభలచే అధికసంఖ్యాకులవిశ్వా
సాహిత్య తీర్మానమామోదింపబడవలెను.

## రిఫరెండం

కార్యనిర్వాహకవర్గము ఈకాన్స్టిట్యూషనులో ఏవిధమైన మార్పు తేదలచినను సభ్యులయందలి అధికసంఖ్యాకుల ఆమోదమును బడయవలె వీరు తేదలచిన మార్పు కరపత్రికములలోగాని సుదర్శనములోగాని తీర్మా రూపముగ ప్రచురించి దానిపై సభ్యులఆమోదమును కోరవలెను ఆగా లేక, ఆఫిర్కాయందలి సభ్యులందరు విడిగాగాని లేక ఒకేసమయమునగా తీర్మానమున కంగీకారమునుగాని వ్యతిరేకభావమునుగాని తెలుపుచు కార్యదర్శికిపంపవలెను. కార్యదర్శి ఆపట్టణమందలి గౌరవోద్యోగిమొదల కవర్లను విప్పిఓట్లు లెక్కించి ఫలితముగురించి అతని సంతకముపొందవలె కార్యదర్శి, హాజరైన కార్యనిర్వాహకవర్గమువారునుసంతకములుచేసి తమును సుదర్శనముద్వారా ప్రకటించవలెను.

కార్యనిర్వాహకవర్గము తలపెట్టుచున్న లేక అమలులోనున్న విధా ముపై ఏసభ్యునికైనను అంగీకారము లేనియెడల సభ్యుల సంతకము కార్యనిర్వాహకవర్గమునకు రిక్విజిషను పంపవచ్చును. కార్యనిర్వాహ మావిషయమై తప్పక ఓట్లుతీసుకొని ఫలితమును ప్రకటించవలెను.

దేశమందున్న ప్రతి ఛాత్రాద శ్రీవైష్ణవుడు యువజనసమితియం సభ్యుడుగాచేరి సమితిని, సుదర్శనమును నడుపగోరెదము. మావిమర్శ తరుణమును విడనాడక అధికసంఖ్యాకుల ఆదరమునుబొంది మాకార్య మునందు మార్పులు తేగోరెదము.

దాశ్యం నమ్మాళ్వారు.
కార్యదర్శి.

సుదర్శనం

జనవరి 1940

*Our Greetings*

*May the Bright New Year*
*bring you*
*Every happiness, blith and mirth*
*With all its pomp and splendour.*

From :

The Editor,

SUDARSANAM.

VIZIANAGRAM.

# ముఖ్య తీర్మానములు.

(1) Resolved that Sriman A. Rangaswamy Ayya, Sripe-rumbudur invited to preside over the confrence.

(2) That the conference should be held at Bezwada on the 25th, and 26th of March 1940.

S. RANGANADHASWAMY, B.A.B.L.
Chairman. R. C.
28—12—39.

(1) శ్రీమాన్ ఎ. యస్. రంగసామయ్యగారిని మహాసభ అధ్యక్షులుగా ఆహ్వానించుటకు తీర్మానింపబడినది.

(2) మహాసభ బెజవాడలో 1940 సం॥ మార్చి 25, 26వ తేదీలలో జరుగు టకు తీర్మానించబడినది.

యస్. రంగనాథస్వామి,
ఆహ్వానసంఘాధ్యక్షులు
28-12-39.

## ...డు వలపులు,

శ్రీకూర్మం జగన్నాథస్వామి,

* * *

...కోనెలద్వారము సన్నిధిజేరిరి
దేవుని కొలువగ ముప్వురు కన్నెలు
...మముల పువ్వుల కానుకలగూర్చిరి
చిన్నికరంబులు చెప్పగబరువని
...గుదలుచూపులు ముందుకు వెనుకకు
త్రొట్రిలజేయుచు త్రోవనుసిలిచిరి
...మివరంబుల నెదగోరెదరో
యేమిసుఖంబుల నోములు నోయవి'?
అని నేనడిగితి అబలలనప్పుడు
కౌతుకమాత్మను కలిగిన నాకును
ముందరికన్నియ మోమును సిగ్గున
వంచుచు బలికెను వణకుచు నిట్లనె
'సరిగల చీరలు సన్నసెవలువలు.
చీనాంబరములు చెలువపు దుస్తులు'
రెండవ జవ్వని మెండగు కోర్కెను
తెలియక జెప్పెను తీయనిపలుకుల
'మేలగు బంగరు మాలలు, మణులను
వన్నెల చిన్నెల వజ్రపురాసులు'
మూడవ ముద్దియ మోమును ప్రేమతో
వంచుచు బలికెను వణకుచునిట్లని
'జీవిత పథమున ప్రేమపుతోడును
నేమది గోరెద సారెకు సారెకు'?

---

## [illegible] అఖిలభారత చాత్తాద శ్రీ వైష్ణవ మహాసభ వాయిదా వేయబడినది.

---

స్వాములారా!

మహాసభ ప్రస్తుతము నిలిచిపోయిన వృత్తాంతము కొంత వి రసములోను కొంత సంతోషముతోను వ్రాస్తూ యున్నాను. అను ట్లుగా నలుగురు స్వాములు కలసిరాకపోయినారనే విచారమును, ఈ సెలవులలోనైన నలుగురు వేంచేసి మంగళ శాసనము చేస్తారనే సంతో మును దానునకి ఒకే పర్యాయము గలిగినవి. మనలో మంచి పలుకు గౌరవము గలిగియున్న స్వాములు ధనుర్మాసములో సభ పెట్టుటచే తామ చేయజాలమని వ్రాసియున్నారు పెద్దలు లేకుండా జరిగే సభ తామర లేని కొలనువలె కళావిహీనముగా నుంటుందని ప్రాజ్ఞులగు తమకు దా విన్నవింపనక్కర లేదు.

అదిన్నీ కాక మనం తలపెట్టిన కార్యం చాలా పెద్దదిన్నీ ప్రచారం ఆవశ్యకమైనదిన్నీ అయియున్నది. ఈ సభ మూలంగా ముఖ్యంగా సాధించదలచుకున్న విషయములు రెండున్నవి.

(1) మన జాతిలో ప్రబోధం కలిగించుట.

(2) మన మతౌన్నత్యమును, సంఘీభావమును ప్రపంచము చాటుట.

ప్రస్తుతం సభ జరుపుటవల్ల ఈ రెండు ప్రయోజనములు పోతవి. మన సభ గురించి జరుగవలసిన ప్రచారమూ జరుగలేదు. పెద్దలు వేంచేయకపోవుటవల్ల ఏ కార్యమును సాధించలేము సరికదా సాంఘికము పెద్ద దెబ్బతిన్నవారమగుదుము.

ఆహ్వాన సంఘము తరపున శ్రీమాన్ నల్లగట్ల వెంకటనరసయ్య
గారుని పేర జాబును వ్రాస్తూ "నేను 4 రోజులు శెలవుపెట్టి
పనిమీద వెళ్ళి అన్నియు సఫలము చేసినాను. మహాసభ 30-12-39
మరియు 31-12-39 తారీఖులలో బెజవాడలో శ్రీమాన్ A. S. రంగసామి
గారు అధ్యక్షతక్రింద జరుపుటకు నిశ్చయించడమైనది. విరాళములు
వచ్చినను లేకపోయినను సభ జరుపుటకు అన్నియు సమకూర్చి
నాను." అని వ్రాసియున్నారు.
మరియు వారు ఆంధ్రపత్రికాధిపతులగు మ॥ రా॥ శ్రీ॥ శంభు
గారితో మహాసభ ప్రచురణ విషయమై మాట్లాడియున్నారు.
డిసెంబరు మొదటివారములో నాలుగు వైపులనుండియు సభను
ఆపుచు కొందరును సభను ప్రస్తుతము ఆపుదలచేయవలసినదిగా
స్వాములును శ్రీ ముఖములు పంపియున్నారు.
1. శ్రీమాన్ ఆర్. ఆళ్వాంచారయ్యగారు మద్రాసు స్వాముల
ప్రస్తుతం ధనుర్మాసమగుటచేతనున్నా పరిచారమును సరిగా జరు
పుటవల్లను సభను ఈష్టరు శెలవులవరకు నిలుపుదలచేయవలసినదని
వ్రాసియున్నారు. ప్రస్తుతము నిలుపుదలచేసినచో మద్రాసు ప్రాంతముల
నలువురు ప్రముఖులు వేంచేయుదురని వ్రాయించియున్నారు.
2. గుంటూరు మండలిలోనున్న స్వాములుకూడ ధనుర్మాస
మగుటచే రాజాలమనియు జనవరి ఆఖరు వారమునకు వాయిదా వేయ
వలసినదనియు వ్రాయించియున్నారు.
3. శ్రీమాన్ వేంచేసియున్న తాళ్ళూరి పేఠాధిపతులకు ప్రస్తు
తము అస్వస్థతగానున్న కారణంచేత వారు రాజాలరని వారి కుమారులు
వ్రాయించియున్నారు.
4. పశ్చిమ గోదావరి జిల్లాలో ప్రముఖులైన శ్రీమాన్
... ఆంజనేయులుగారు తమకు తొందరపనులుండుటచేతనున్నా

5. ఏలూరు తాలూకాలోని ప్రముఖులైన శ్రీమాన్ తిరు రామానుజయ్యగారు (యేగివాడ) సుస్తీగా నుండుటచేతనున్నా ప్ర సభకు హాజరుకాజాలమని శ్రీముఖము పంపించియున్నారు.

6. 'చాత్తాద శ్రీవైష్ణవర్'అను తమిళపత్రికను నడప జరిగిన మహాసభలలో ప్రముఖపాత్రలను నిర్వహించిన యన్. రమణయ్యగారికి చాల సుస్తీగనున్నందనియు తాము వేంచేయ జాలము వ్రాసియున్నారు.

7. చాత్తాద శ్రీవైష్ణవ చతురాక్షరి సమాజమువారు దాస్) డిశంబరు 22 తే॥ సమావేశమై ప్రస్తుతం మహాసభ అపుదల ఈష్టరు శలవులలో పెట్టవలసినదిగ కోరుచు తీర్మానము చేసియున్నారు.

ఈపరిస్థితులలో సభనిలువుటకంటె చేయదలసినది వేరు దాసుని వినయపూర్వకమైన విన్నపమైయున్నది' దాసుని విన్నప శ్రీ నరసయ్యగారును, ఆహ్వానసంఘమువారును ఆమోదించి 28.12 జరిగిన ఆహ్వానసంఘసభలో ఆవిషయమును తీర్మానించినారు. మును వేరొక పేజీలో ముద్రించి యున్నారము.

అయితే మనవారు చాలమంది తీర్మానములు పంపించలేదు. నములను ముందుగా పంపించినచో ఆహ్వానసంఘమువారు వానిని ఆలోచించెదరు. కాబట్టి తీర్మానములు మహాసభలో ప్రతిపాదింప కున్నవారు వానికి ముందుగా తెలియజేయ వలసియున్నది.

ఎంతమందిస్వాములు ఏయేప్రాంతములనుండి వచ్చెదరో వాని లియ జేయవలసియున్నది.

ఇప్పటికి చాల కొద్ది విరాళములుమాత్రము వసూలయియున్న విరాళముల లొసంగిన భాగవతుల తిరునామములు మహాసభలో బడును. పిమ్మట సుదర్శనములో ప్రచురింపబడును, స్వాములందరు ర్యమును తమకార్యముగ భావించి నెరవేర్ప ప్రార్థించుచున్నాను.

దాసుడు భ. రామానుజ

# ఫార్వార్డు Forward



చాత్తాద శ్రీవైష్ణవ స్వాములారా చక్కని జాత్యాభివృద్ధి చర్య చేయించిన సంఘసేవకు నిసత్యకథ.

గుంటూరునందు సంఘమును స్థాపించి వుద్యమము నడుపుచున్న మరియు గుంటూరు జిల్లాలో ప్రతి గ్రామమునందు ప్రచారము ను తాలూకాకొక కార్యదర్శిని యెన్నుకొనడమైనది. వారు చాల తో పనిచేయుచున్నారనుట కిదియే నిదర్శనము.

గుంటూరు జిల్లా నర్సరావుపేట తాలూకాలో అల్లూరివారిపాలెం నివాసియు యువకుడు, పాఠశాలోపాధ్యాయుడు (S. S. L. C.) బెల్లంకొండ రాఘవయ్యసూరిగారు పనిచేయుచుండిరి.

వారు బాధ్యత వహించిన కొలది కాలములోనే వారి గ్రామము మనము సాంఘిక దురాచారమని చెప్పుకొను అశాస్త్రీయ పురో పెనుభూతమును నిర్మూలించ చేసిన విజయ ప్రయత్నము.

అల్లూరివారి పాలెంలో పది మంది చాత్తాద శ్రీవైష్ణవస్వాములు బి. రాఘవయ్య, టి. అంతయ్య సూరిగార్ల సత్యప్రబోధము పైవారు ఈక్రిందినిబంధనలకు బద్ధులై ఖరారునామా Agrement కొనడమైనది.

నలు :—

1. అన్యకుల మతస్థులకు భోక్తగాయుండరాదు.
2. పౌరోహిత్యము శాస్త్రయుక్తముగ జరిపించుట.
3. స్వసంఘ పౌరోహిత్యముపట్ల ద్వయవస్తు ఆరాధన జరిపించ
4. పై నిబంధనలకు వ్యతిరేకముగా నడచినగాని, నడచినట్లు

ఋజువైనగాని సుదర్శన పత్రికకు పది రూపాయలు, తీర్థప్రసాదము క్రింది ఐదు రూపాయలు చెల్లించునట్లు వ్రాసుకొని.

పై షరతులకు వ్యతిరేకముగ నడచినచో వారిపై తగు చర్య జరిపి సివిలుకోర్టుద్వారా రాబట్టుకొనుటకు రాఘవయ్య అంతయ్య సూరిగార్లకు అధికారమిచ్చియున్నారు.

ఇట్లు సంఘాభివృద్ధికి పాటుపడుచున్నందున రాఘవయ్య అంతయ్య సూరిగార్లకు ఇట్టి నిబంధనల కంగీకరించినందులకు అల్లూరివారి పాలె చాత్తాద శ్రీవైష్ణవులను, గుంటూరు చాత్తాద శ్రీవైష్ణవ సంఘమును మిక్కిలిగా అభినందించుచున్నారు. ఇట్టి యెన్నియో జరిపించగలుగుట రాఘవయ్య అంతయ్య సూరిగార్లకు ఆయురారోగ్య ఐశ్వర్యములొసగుటకు భగవంతుని ప్రార్థిస్తూయున్నాను.

ఇట్లు,
తిరుపతి భావనారాయణ, గుం

## కృతజ్ఞత.

ఈ నెలలలో పోషకులు: (1) శ్రీమాన్ భద్రగిరి రాజగోపా గారు. (2) శ్రీమాన్ భద్రగిరి జగన్నాథంగారు, (పార్వతీపుర అభిమానులు (1) శ్రీమాన్ అలఘురి అప్పలనరసింహం బి. ఎ. గా సబ్ రిజిష్ట్రారు, (పోలవరం.) (2) శ్రీమాన్ గోనా కొండయ్యగా (సోమలింగాపురం.) (3) శ్రీమాన్ ఎస్. వి. రఘుపతయ్యగా (ముసానపల్లె). (4) ఎమ్. రాధాకృష్ణయ్యగారు, A. S. (తండూరు). (5) భద్రగిరి శ్రీరామమిశ్రులుగారు, (పెనుకొం (6) తిరవతి అప్పలనరసయ్యగారు, (కోటనాడూరు). (7) బెల్లం రాఘవయ్యగారు. (అల్లూరివారిపాలెం). వీరందరికి మాకృతజ్ఞత.

---

5th All India Chattada Srivaishnava Conference.
Bezwada, 1940.



**President**

*Sriman A. S. Rangasamaiah garu*

శ్రీమతే రామానుజాయ నమః.



చెన్నరాజధాని విజయవాడ (**Bezwada**) యందు

1940 మార్చి 25, 26 తేదులందు జరిగిన

అఖిల చాత్తాద శ్రీవైష్ణవ మహాసభకు అధ్యక్షతవహించిన

శ్రీపెరుంబూదూరు

శ్రీమాన్ ఎ. ఎస్. రంగస్వామయ్యగారి అధ్యక్షోపన్యాసము.

---

శ్రీవేంకటార్య పదపంకజ సక్తచిత్తం।
శ్రీమచ్ఛఠారి గురుపాద సరోజ భృంగం।
శ్రీమద్యతీంద్ర ప్రవణార్పిత సర్వభారం।
కాంతోపయంతృముని దేశిక మాశ్రయామః॥

శ్రీశైలేశ దయాపాత్రం।
ధీభక్త్యాది గుణార్ణవం।
యతీంద్రప్రవణం వందే।
రమ్యజామాతరం మునిమ్॥

నమః ప్రణవశోభితం । నవకషాయ ఖండాంబరం ।
త్రిదండ పరిమండితం । త్రివిధత త్త్వ నిర్వాహకం ।
దయాంచిత దృగంచలం। దళితవాది వాగ్వైభవం ।
శమాది గుణసాగరం । శరణ మేమి రామానుజమ్ ॥

మహాశయులారా!

మీ కందఅకు సేవించి చేయు విజ్ఞాపనములు. పండితులు పెద్దలు వేంచేసియుండు ఈ మహాసభకు అధ్యక్షత వహించుటకు తగిన విద్యయు యోగ్యతయు దాసునికి లేదని తెలియజేసినను, ఆహ్వానసంఘము వారు తమ నిర్హేతుకకృపతో అధ్యక్షత వహింపవలసిన దనిన, ఆజ్ఞ శిరసా వహించినాడను. ఇట్టి గౌరవపదవిని దాసుని కొసంగినందుకు సంఘమువారికి నా అభివందనములను వినయపూర్వకముగా జేసికొను చున్నాడను. ఈ గౌరవమువలన ఫలించునది యిట్టి పదవికి దాసుని అనర్హత్వమే అయినను, "పయనన్ఱాగిలుమ్, పాంగలరాగిలుమ్, శెయ ల్నన్ఱాగ త్తిరుత్తిప్పణికొళ్వాన్" అనురీతిగా ఆశ్రితుడు ఎంత అప్రయోజకుండైనను, దిద్దుపాటు చేసి, వానిచే తమ కైంకర్యములు చేయించు కొనుట, భాగవతకృత్యము గనుక, ఈసభ నలంకరించియున్న భాగవతోత్తముల మంగళాశాసనములే దాసునికి తగిన యోగ్యతను కలుగజేసి ఈసభను జయప్రదముగా నిర్వర్తింప జేయునని ధైర్యముతో ప్రారంభించుచున్నాడను.

మన సంఘాభివృద్ధికి, చిరకాలముగా కృషి జేయువారును చాత్తాద శ్రీవైష్ణవ చతుర్థ మహాసభకు అధ్యక్షస్థానము నలంకరించిన వారు నగు శ్రీమాన్ ప్రళయకావేరి మణవాళయ్యగారు ఈ ... మహాసభ ప్రారంభోత్సవమును, చతురోపన్యాసముతో సలిపి నారు. తదుపరి ఆహ్వానసంఘాధ్యక్షులు శ్రీమాన్ ఎస్. రంగా స్వామి, బి. ఏ., బి. ఎల్. గారు ఆంధ్ర ఆంగ్లభాషలయందు ప్రవీణత గలవారు గనుక తమ బుద్ధికుశలతకు తగినట్లు, తమ గంభీరోపన్యాస ముచే ఈ సభవారిని ఆనందింపజేసినారు. దాసునికి తరువాత కొందరు మంది ప్రముఖులు తమ మృదుమధుర వాక్యములచే సభవారిని

నందింప జేయగలరు. మృష్టాన్నము మీదమీద భుజించుటకు వెగటు ట్టక యుండుటకొఱకు, మధ్యమధ్య రసాంతరము కొంత యుండవల నది అవశ్యము గనుక ఆ రసాంతరస్థానముననే, దాసుడు విన్నవింప వు విషయములు శైలియు నుండునని ప్రథమమందే తెలియబఱచు సుచున్నాడను.

## చాత్తాద శ్రీవైష్ణవ సమాజము.

ఇతర జాతులవారు మతస్థులవారు, తమతమసంఘాభివృద్ధికొఱకు ఘలను ఏర్పఱచి ద్రవ్యము ప్రోగుచేసి, తమవారల యువకులకు ఇంగ్లీ న్నత విద్యాలయందును, శిల్ప (Technical) విద్యాలయందును, ర్ణులగుటకు సహాయముచేసి, ఔన్నత్యమును బడయుచుండగా, మనవారలు వైదికలౌకికములందు, దినేదినే క్షీణించుటను జూచి, నమును తగుపాటిప్రయత్నములను జేసి, మనవారలను ఐహిక రమార్థికములందు వృద్ధిపఱుపదలంచి, సుమారు 40 సంవత్సరముల దట వేంచేసియుండిన రాయపేట లక్ష్మయ్యగారు, తిరుక్కుడంథై గోపయ్యగారు, బి. ఏ., బళ్లారి ఆర్. జగన్నాథయ్యగారు, శ్రీశైలం న్నరంగయ్యగారు, శ్రీ రేకం భాష్యకారులయ్యగారు, అహరం నమ్మా ళ్వారయ్యగారు బి.ఏ., మొదలగుప్రముఖులు చాత్తాదశ్రీవైష్ణవ మాజమనుపేర ఒక సంఘమును స్థాపించిరి. ఈసమాజము సుమారు సంవత్సరములవఱకు మిక్కిలి ఉత్సాహముతో పనిచేయుచు ండెను. మనవారి దురదృష్టమువలన, ఈ సమాజపు అభివృద్ధి కు ఉత్సాహముతో సేవ జేయుచు నుండిన యువకులు, కలవి నయ్యగారు వైత్తమానిధి అయ్యగారు అకాలమరణము ందుటచేత, సమాజము భిన్నమై రూపుమాసిపోయెను. 1920-వ వత్సరమున శ్రీమాన్ రాయపేట శ్రీనివాసయ్యగారు, శ్రీమాన్ భాష్యం ఆళవందారయ్యగారు మొదలగువారి ప్రోత్సాహము , చాత్తాద శ్రీవైష్ణవ విద్యాభివృద్ధి సమాజ మొకటి స్థాపింప డి. అటుతరువాత, నాలుగు సంవత్సరములు నాలుగు మహాసభలు గుపట్టణములలో సమావేశమై క్రమముగా జరిగినవి. దృష్టిదోష

ముననో లేక ఏకారణమునుబట్టియో 1926-వ సంవత్సరమునకు తరు
వాత మహాసభ జరుగుట లేదాయె. సమాజము కూడ తృప్తికర
ముగ పనిచేయుట కనబడదాయె. 1938-వ వత్సరమున మదరాసునగ
నుండు కొంతమంది యువకులు యువజనసంఘ మొక్కటి ఏర్పఱచి
సంఘాభివృద్ధికై పాటుపడ దలంచి, కుతూహలముతో ప్రారంభించిరి.
కొందఱు పెద్దవారలును పూర్వపుసమాజపు ఉద్దేశములను పునరుద్ధ
రణ జేయదలంచి వీరలకు తోడ్పడిరి. కాని, ఎవరి ఉద్యమము
ఫలింపలేదు. ఈ సమాజము కూడ మూడురోజుల ముచ్చటగా
ముగిసినది. మద్రాసుప్రాంతమునందలి మనవారల సంఘాభివృద్ధి
ఇట్టి స్థితియం దుండగా, భాస్కరకోటితుల్య మగు 'సుదర్శనము'న
ముం దుంచుకొని మనవారిలో నుండిన తిమిరంబులను బాఱద్రోల
శ్రీమాన్ భద్రగిరి రామావతారము, బి.ఏ. గారు, 'విజయనగ
మందుండి విజయముచేయుటయు, ఆంధ్రసహోదరులు ముఖ్యముగా
నల్లగట్ల వేంకటనరసయ్యగారు మొదలగు ఆహ్వాన సంఘమువా
వారికి సహాయభూతులుగా నుండుటయే కదా, గత 14 సంవత్సరము
లకు తరువాత, ఈ పట్టణమునందు ఈ ఐదవ మహాసభ ప్రారం
చుటయును, భాగవతగోష్ఠిని, దర్శించి ఆనందము చెందు భాగ్యము
నేడు మనవారెల్లరకును కలిగించినది. ఇందులకు దాసుని కృతజ్ఞత
ఆంధ్ర సోదరీ సోదరు లెల్లరకును వినయపూర్వకముగా విజ్ఞాపన
చేయుచున్నాడను. ఈ 'సుదర్శన' పత్రికను అవలంబముగా
గొని యువకులు ముఖ్యముగా ద్రవిడదేశస్థులు సంఘసేవ జేయ
నుత్సాహముతోను త్యాగబుద్ధితోను బాటు పడుటకు ముందడుగు
వేయనియెడల మనవారి ప్రస్తుతపుదీనస్థితికి మనమే కారణభూతుల
మగుదుము; సంఘాభిమానము లేనివార మగుదుము. మనసంతతివారి
నిందలకును ఇతరుల హేళనమునకును పాత్రుల మగుదుము. యువకు
లందఱకును ఇదియే నావిజ్ఞాపనము.

## చాత్తాద శ్రీవైష్ణవులు.

చాత్తాద(శ్రీ)వైష్ణవు లనగా ఎవరు, ఎట్టినిష్ఠ గలవా రనువిష
యము పెద్దలు ఎఱుంగుదురు గాని ఈ కాలపుయువజనులు కొందఱకు
శదీకరించుట ఆవశ్యక మని తలంచి దాసునికి తెలిసినవిషయములను
గ్రహముగా విన్నవించెదను. తప్పు లుండిన క్షమింప కర్తలు.
అధ్యయన జ్ఞానానుష్ఠానంగళాలె, బ్రాహ్మణ్య మాకిఱాప్పోలే,
దంగళ్ ఆయిరముం అఱియక్క அறிవల్లరానాల్ వైష్ణవత్వసిద్ధి''
నగా వేదాధ్యయనాదులు ఎట్లు బ్రాహ్మణత్వసిద్ధికి అవశ్యమో,
ట్లే ఈశ్వర నిర్హేతుక జాయమాన కటాక్షముచేతనే, అజ్ఞానము
, భక్తిరూపాపన్నజ్ఞానమును బడసిన ప్రపన్నజనకూటస్థు లగు
మ్మాళ్వార్లు (శఠకోపులు) సాధించియుండు, సామవేదసార మగు
వాయ్ మొழி వేయిపాశురములను గురుముఖముగా అభ్యసించి
ని అర్థమును చక్కగా గ్రహించి, అట్లు గ్రహించిన అర్థప్రకా
ము అనుష్ఠింప సమర్థు లైననే, వైష్ణవత్వసిద్ధి యని నిష్కర్షించి
న్నారు. దీర్ఘశరణాగతి యగు ఈ తిరువాయ్ మొழி ద్వయ
మంత్ర) వివరణముగా నున్నది. ''విష్ణుసంబంధి వైష్ణవః'' అనునది
స్తచేతనాచేతనులకు సంబంధించి నప్పటికిని భగవచ్ఛాస్త్ర
లో నిర్ణయించిన ''విష్ణూపాయో విష్ణుఫలో వైష్ణవః'' అను
య' పూర్వోత్తరవాక్యములవలన ప్రతిపాదించు అర్థానుష్ఠానపరు
నే తెలియజేయుచున్నది. ఎట్లనగా, ద్వయము సకలవేదసార మైన
మంత్రముయొక్క వివరణము. తిరుమంత్రములోని ప్రణవము
(ఆత్మ) స్వరూపమును, 'నమః' పదము విరోధి ఉపాయ
రూపములను, 'నారాయణ'పదము పర (ఈశ్వర) స్వరూపమును,
య'పదము పురుషార్థస్వరూపమును, ప్రతిపాదించుటచే, ముముక్షు
వైష్ణవునకు అర్థపంచక జ్ఞానము ఉపాదేయము. ఈ అర్థమునే,
వాయ్ మొழி ప్రతిపాదించుచున్నది. ''మిక్కవిఱై నిలైయుం,
య్యా ముయిర్ నిలైయుం...'' అను తనయయం దిది స్పష్టము.
యందు పైని చెప్పబడిన 'ఆత్మ' నారాయణునికే శేషభూతు

డనియు, సకల చేతనాచేతనములను శరీరముగా గల నారాయణుడే పరదేవత యనియు, వానితిరువడిగళులో సర్వకాలసర్వావస్థలయందు జేయు మిథునకైంకర్యమే పురుషార్థ (ఉపేయము) మనియు, అట్టి పురుషార్థము సిద్ధించుటకు వాడే (ఈశ్వరుడే) ఉపాయ మనియు, అట్టి ఉపాయమునకు స్వాహంకార మమకారాదులవలన గలుగు కర్మ, జ్ఞాన, భక్త్యాది అనుష్ఠానము లగు ఉపాయాంతరములును, కైంకర్యమువలన కలుగు ఈశ్వరముఖోల్లాసమందు స్వార్థతాబుద్ధి యగు భోగ్యాంతరములే, విరోధిస్వరూపము లని నిర్ణయింబడియున్నవి. అనగా నారాయణుడే సర్వశేషి యనియు సకలాత్మలు వానికి శేషభూతులనియు వానిని పొందుటకు వానితిరువడిగళే ఉపాయమనియు తక్కిన ఉపాయములు అపాయము లనియు, లక్ష్మీవిశిష్టుడైన నారాయణునికే చేయుకైంకర్యములు పురుషార్థము లనియు, అట్టి కైంకర్యమునందు స్వార్థతాబుద్ధి (అనగా ఆ కైంకర్యమందు తనకు కొంత అనుభవము గలదనుతలంపు) విరోధిస్వరూపము అని ఎఱుంగుటయే అర్థపంచక జ్ఞానము. ఈశ్వరునియందు శేషిత్వజ్ఞానము మఱినప్పటికిని అన్యశేషత్వజ్ఞాననివృత్తియే ప్రధానముగావున వైష్ణవులు వారు మంత్రాంతర, దేవతాంతర, సాధనాంతర, భోగ్యాంతరము (ప్రయోజనాంతరము)లను వాసనతో కూడ వర్జించినవా రనియు, ఇట్టినిష్ఠయే వేదాంత తాత్పర్యార్థ (వడియఁగట్టిన సారము) ప్రతిపాదక మైనసదనియు, ఇదియే నివృత్తిధర్మావలంబకు లగు చాత్తా శ్రీవైష్ణవుల నిష్ఠ యని చెప్పబడును. ఈ ధర్మమే ఉత్కృష్టధర్మమని తెలిసియుండు తెన్నాచార్యసంప్రదాయస్థులు అగు బ్రాహ్మణులు లోకాపవాదభీతిచేతను ఆనృశంస్యముచేతను వర్ణాశ్రమధర్మములకు అనుగుణ మగు కర్మాద్యుపాయములను ఫలాభిసంధిరహితముగ అనుష్ఠించువారలు. కాబట్టి వారలు ప్రవృత్తిమార్గావలంబకు లగు చాత్తిన శ్రీవైష్ణవు లని నిర్ణయింపబడి యున్నారు. చాత్తాద శ్రీవైష్ణవులలో, కర్మాద్యుపాయములను వర్జించుటకు హేతువు అజ్ఞాన అశక్తులు కావనియు, స్వరూపవిరుద్ధమే యనియు తెలిసి

ళ్లను, లోకాపవాదములను తృణీకరించి, కర్మాద్యుపాయములను సాద్ధాంతముగా త్యజించిన నివృత్తిధర్మానుష్ఠానపరులు. ఈ ధర్మము యొక్క నిజస్వరూపమును ఎఱింగిన జ్ఞానవృద్ధు లగు—ఉడయవరులు, పిళ్లై, నడువిల్ తిరువీదిప్పిళ్లై భట్టర్, చాత్తాద ధర్మనిష్ఠు లగువారి సంబంధముచే కాయ, అన్న, స్థలశుద్ధులు చేసికొనిన అనుష్ఠానములు లోకప్రసిద్ధము గదా? ఇట్టి అనుష్ఠానములను చక్కగా తెలిసికొన్న వారలేకదా జన్మాదుల ఉత్కృష్టతాపకృష్టములను ఎఱుగుదు రని "ఆచార్యహృదయ"మందు వెల్లడిచేయబడియున్నది. నివృత్తిధర్మపరు లు శిఖోపవీత త్యాగములు, అధికార నిర్ణయమునకే కాక, కర్మా ను తలంచుటకుగూడ యోగ్యత లేకుండుటకు సూచకములు. ఈ మును భక్తాంఘ్రిరేణులు సాధించియుండు 'తిరుమాలై' అను ప్రబంధమునకు చరమశ్లోకస్థానమై విలసిల్లు "మేంబొరుళ్ పోగవిట్టు..." అను పాశురపు వ్యాఖ్యానములో సుస్పష్టము. పరవస్తు శ్రీనివాసాచార్యులు "మాలికాసారపరిమళ మ"ను గ్రంథములో ఈ పాశురమునకు విస్తరముగా వ్యాఖ్యానము చేసియున్నారు. ఇందులకు నుష్ఠానముకూడ నున్నట్లు కర్ణపరంపరగా వినుచున్నారము. అనగా, ఒకప్పుడు అధ్యయన ఉత్సవమునందు శ్రీరంగనాథుని సన్నిధిని, అర యరులు (గానము చేయువారు) ఈ పాశురమును విన్నపము జేయగా, ఈ పాశురార్థనిష్ఠయే శ్రీరంగధామునికి అత్యంతప్రియమై ముఖోల్లా సము కలుగజేసినదని అచ్చటనున్న బ్రాహ్మణులు (చాత్తినవారు) గ్రహించి తెలిసికొని, అప్పుడే శిఖోపవీతములను త్యజించి చాత్తాదధర్మము ను అనుష్ఠించినారు. వీరలనే "కోవిల్ తుఱై చాత్తాదవర్" అనియెదరు. ఆ వేషభాషానుష్ఠానములే యిందులకు నిదర్శనములు.

ఎంబెరుమానార్లు అప్పటికాలము ననుసరించి భక్తిమార్గమునే వెల్లడిచేసి అర్థగౌరవమును, అధికారిదౌర్లభ్యమును బట్టి, ప్రపత్తి (Surrender) మార్గమును అంతరంగశిష్యులకు మాత్రము ఉపదేశించి తాము శ్రీరంగనాథునితిరువడిగళులో ప్రపత్తిచేసినారు. వారి పున రవతారమగు శ్రీ మణవాళమామునులు ప్రపత్తియాథాత్మ్యము తిరు

మంత్రముయొక్క లక్ష్యార్థ మగు చరమోపాయ(భాగవత్)నిష్ఠను "త్వద్దాసదాస గణనా, చరమావధౌయ, స్తద్దాసతైకరసతా విరతా మమాస్తు" అని ఎంబెరుమానారులతిరువడిగళులో ప్రపత్తి చేసినారు. ఈ అవతారములలో జ్ఞానానుష్ఠానములే ప్రధాన మనుటను వర్ణాశ్రమధర్మము అప్రధాన మనుటను, ఒక్కొక్కప్పుడే అనుష్ఠించి చూపియుండిరి. వారి తిరువుళ్లములో ఇది కొంతభారముగా నుండి పోయినది.

ఈ కొఱతను తీర్చుటకు శ్రీ మణవాళమామునుల అపరావతా మగు పరవస్తుకాంతోపయంత్రులు, అష్టదిగ్గజములలో ప్రధానులు పరవస్తు భట్టర్ పిరాన్ జీయర్ వంశమందు తిరువవతరించి, ఉత్తమా శ్రమమును స్వీకరించి యుండగా, శ్రీనివాసుని ఆజ్ఞచే రహస్యశాస్త్ర ములలో సర్వోత్కృష్ట మగు శ్రీ వచనభూషణ దివ్యశాస్త్రమందు ప్రతిపాదింపబడిన విషయములను రాద్ధాంతముగా తాము అనుష్ఠించి చూపదలంచి, తమ అంతరంగు లగు ఐదుగురు శిష్యులతో,

ఉ॥ ఒప్పినవారు దాము నపుఁడొక్క ముహూర్తమునందు నక్కటన్
దప్పక నాత్రిదండమునుఁ దాల్చిఁ బవిత్రముఁ గావు లొప్పఁగా
నప్పుడు తీసి మస్తకమునందుఁ జెలంగు శిఖాశిరోజముల్
తెప్పునఁ బోవఁ గర్మిసమితిన్ వెసఁదోలి ముదంబు మీఱఁగన్

అని చాత్తాద శ్రీవైష్ణవధర్మము నవలంబించి, అందులకు విరుద్ధచిహ్నము లగు శిఖోపవీతములను త్యజించి, వేదాంతసారా మును—లోకాపవాదమునకు లక్ష్యపెట్టక—అనుష్ఠించి చూపినారు. విశాఖపట్టణం జిల్లాలో నుండు, తాళూరి మఠమును, గంజాం జిల్లాలో నుండు గొలియా మఠమును, ఆ మఠాధిపతుల శిష్యసంపత్తు లునే యిందులకు నిదర్శనములు. గొలియా మఠములో వేంచే యుండు మణవాళమామునుల అర్చాతిరుమేనియే పరంపరాప్రాప్త మైనదనియు, ఆ మఠములో కొంతకాలముక్రిందట వేంచేసియుండిన ఒక అమ్మగారికి మణవాళమామునులు సర్వసులభులుగా నుండి రమ నదియు ఆ ప్రాంతమందు ప్రసిద్ధము. ఇట్లు సారతమశాస్త్రప్రతిపా

మై శిష్టపరిగ్రహమై యుండు సంప్రదాయస్థుల దేహాత్మసంబంధ
ము మనవారలకు ఓరాణ్‌వఝిగా (పరంపరగా) ప్రాప్తమై
యుండగా, ధర్మముయొక్క నిజస్థితిని తెలిసికొని ఇట్టి కుడి (వంశము)
యందు జన్మించుభాగ్యము మనకు కలిగినందులకు అత్యానందభరి
తులై, అట్టి ధర్మానుష్ఠాన అభివృద్ధులకు పాటుపడక, కొందఱు
కృత్యకరణములనే చూచి, అవియే చాత్తాదధర్మ మని భ్రమించి,
చాత్తాదు లనిపించుకొనుటకుగూడ సిగ్గుపడి ఇతరజాతులవార మని
చెప్పుకొనుట మిక్కిలి శోచనీయము. మనలో మఱికొందఱు ఉపవీత
ము దాల్చుకొని, బ్రాహ్మణు లనిపించుకొనుచు, నిజము వెల్లడి
యైనపు, అగౌరవము పొందుచున్నారు. మఱియు బ్రాహ్మణులకు
విధియుండు నిత్యకర్మానుష్ఠానములను జేయకయు లేక తెలిసికొన
క, "ఆజ్ఞాచ్ఛేదీ మమ ద్రోహీ" అను భగవన్నిగ్రహమునకు
గురులై ఉభయభ్రష్టత్వము పొందుటచే,లాభ మేమియో కానరాదు.
చాత్తాద (నివృత్తి) ధర్మమునకును, చాత్తిన (ప్రవృత్తి) ధర్మమున
కు ఉండు తారతమ్యమును బట్టియే 'శ్రీవిల్లిపుత్తూరు భగవర్'
పెద్దలు బ్రాహ్మణులు స్నానముచేయు రేవులోగూడ దిగక,
ము రేవులో స్నానము చేయువారు. ఇందులకు కారణ మేమి యని,
ఇతరబ్రాహ్మణులు అడుగగా:

శ్లో॥ విష్ణుదాసా వయం, యూయం ।
బ్రాహ్మణా వర్ణధర్మిణః ।
అస్మాకం దాసవృత్తీనాం ।
యుష్మాకం నాస్తి సంగతిః॥

అనగా, బ్రాహ్మణులు వర్ణధర్ము లనియు, తాము దాసవృత్తులు
కైంకర్యపరులును, కాబట్టి వారలతో అన్వయము లేదని జవాబు
చెప్పినారు. కనుకనే, మనపూర్వులు శుభాశుభ కార్యములందును,
పౌరోహిత్య యాజ్ఞికత్వములకు కూడ వారిసంబంధమును మాని
యున్నారు. కావున ప్రపన్నులగు ఆళ్వారాచార్యుల సంబంధమును
వీడి సామాన్య ఋష్యాదుల గోత్ర సూత్రాదుల నారోపించు

కొనుట మన స్వధర్మమునకును స్వరూపమునకును విరుద్ధమే కాక, మన పూర్వుల తిరువుళ్లమునకు గూడ మిక్కిలి భారము కలుగ జేసినవారమగుదుము. చాత్తాదధర్మమునకు ఉపవీతధారణము విరుద్ధానుష్ఠానము. కాబట్టి ఉపవీతమును దాల్చుకొనియుండు చాత్తాద శ్రీవైష్ణవులు చాత్తాదధర్మముయొక్క నిజస్థితిని తెలిసికొని ప్రవర్తింపవలయునని దాసుడు ప్రార్థించుచున్నాడను.

## సన్నిధికైంకర్యములు.

మనవారలు కొందఱు దివ్యదేశములందు వేంచేసియున్న అర్చావతారపుఎంబెరుమానుల సన్నిధులలో, అముదుపడి, చాత్తుపడి తిరుమాల (పుష్పము), తిరువిళక్కు (దీపం), సంమార్జన (చిమ్ముట) రంగవల్లి (ముగ్గు) మొదలగు కైంకర్యములను పరంపరగా చేయుచున్నారు. అనేకులు ఇవి నిహీనవృత్తులని తలంచుచున్నారు. ఇది అజ్ఞాన కారణమే. ఆత్మయొక్క నిజస్వరూపము :

శ్లో॥ దాసభూతాః స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః ।
నాన్యథా లక్షణం తేషాం బన్ధే మోక్షే తథైవ చ ॥

అని యున్నది. అనగా సకలాత్మలును స్వభావముగానే పరమాత్మకు దాసభూతులు. ఈ లీలావిభూతియందుండు కాలములో నిత్య విభూతియందుండు కాలములో, భేదము లేక సర్వదేశ సర్వకాలములందును దాసత్వమే ఆత్మకు లక్షణము; వేఱులక్షణము లేదు. ఆత్మ యొక్క అంతరంగస్వరూపము శేషత్వము. శేషభూతుడు శేషికి అతిశయత్వమును గలుగజేయుటయే కర్తవ్యము. ఈశ్వరుని దివ్య మంగళవిగ్రహ సౌందర్య కల్యాణగుణములందు కలుగు విశేషప్రావణ్యముచే, ఈశ్వరునికి ఏదైనను కించిత్కరించిననే (కింకరత్వము చేసిననే) తప్ప ఆత్మకు సత్త లేదాయె. వాని ముఖోల్లాసమునకు చేయు కైంకర్యములే పురుషార్థము. దీనినే యితరులు మోక్షమందురు. ఇట్టి కైంకర్యములను లీలావిభూతిలో నుండునంతవఱకు, కావేరీ స్నానముచేసి రంగనాథుని సన్నిధిని కైంకర్యము చేయుట

యాత్ర చాలించినపిదప, విరజలో తీర్థమాడి పరవాసుదేవుని
ధిలో కైంకర్యము జేయుటయే, 'అత్తాణిచ్చేవకము' అను
ష్టమైన పురుషార్థ మని పూర్వాచార్యుల సంప్రదాయము.
కైంకర్యములే, ఉపేయ మను (End in itself) తలంపుతో
వలయును. కాని, ఇది పురుషార్థ సిద్ధికి ఉపాయము
eans) అను బుద్ధితో చేయగూడదు. ఇట్టి కైంకర్యములే మన
ర్యులు మనవారికి పెట్టిన పైతృకధనము. నిత్యసూరులుకూడ
వతారములో కైంకర్యము చేయ నిచ్ఛగలవారలుగా నున్నా
మనవారి భాగ్యము ఎట్లుండునది చెప్ప నవసరము లేదు.
యము లన్నియు ఆస్తికుల కేగాని, నాస్తికులకు లేక ఆస్తికనాస్తి
చెప్పుట లేదు. పరలోకానుభవము అట్లుండగా, ఇహములో
కైంకర్యపరులకును వారలతో చేరినవారికిని విశేషగౌరవ
న్నది. భూలోకవైకుంఠం బనంబడు శ్రీరంగక్షేత్రమందలి మన
లు, చాత్తినవారి (బ్రాహ్మణులు) గోష్ఠిలో గూర్చుండి ప్రబం
ములు స్తోత్రపాఠములు సేవించుటయును, తీర్థప్రసాదములు చాత్తిన
లకు, తరువాత మనవారలకును, అటుపిమ్మట బ్రాహ్మణుల
మారులకును, అటుతరువాత బ్రాహ్మణేతరులకును వినియోగము
యుట నేటివఱకు అనుష్ఠానములో నున్నది. ఇట్లే, కొన్ని యితర
దేశములందును మర్యాద లున్నవి. ఇట్టి గౌరవము వైదికాగ్రే
లవలన పరంపరగా అంగీకరింపబడియున్నవి. ఇట్టి మర్యాదల
ను లౌక్యములో వేటేమి గౌరవమును మనము ఆశింపవచ్చును?
గౌరవమునకు తగినట్లు మనవారలు జ్ఞానానుష్ఠానపరులుగా
టయే అత్యావశ్యకము. శ్రీ పెరుంబూదూరులో బ్రాహ్మణుల
మాళిగలలో జరుగు వైదికకార్యములకు మనవారలు సైతము
బడుటయు గోష్ఠికి ఇవ్వబడు దక్షిణ తాంబూలములు మన
లకును సమానముగా నొసంగబడుటయు ఆచారములో నున్నవి.
ప్రకారము అనేకదివ్యదేశములలోను మర్యాద లున్నట్లు తెలియు
న్నది. సన్నిధిగాని సన్నిధికైంకర్యములుగాని లేనిస్థలములలో మన

వారల గౌరవము కొంత తక్కువగానే యున్నది. చాత్తినవారలు అధ్యాపకగోష్ఠి క్రమముగా క్షీణించుటను జూచి, అధ్యాపకగోష్ఠి అభివృద్ధిజేయుటకు బ్రాహ్మణులు వలయునంత నిధి (ఫండు) ఏర్పఱచి గోష్ఠివారలకు కొంత ద్రవ్యసాహాయ్యము జేయుచున్నారు. అటులే మనవారినిగూడ అధ్యాపకగోష్ఠికి అర్హులను జేయుటకు మనము తగుప్రయత్నము జేయుట అత్యావశ్యకము.

భగవత్కైంకర్యము పురుషార్థ మని, దానియందు అభినివే మొందుట అత్యావశ్యకము. తిరుమల (తిరుపతి) లో ఆచార్యుని ఆజ్ఞచొప్పున పుష్పవనము నిర్మించుటకు తటాకము త్రవ్వి ఆ మన్ను అనంతాళ్వానును గర్భవతిగా నుండిన వారి దేవిగారును మోయు చుండగా, తిరువేంగడముడయాన్ అమ్మగారికష్టమును జూచి సహా యము చేయదలంచి ఒక యువకునిరూపమును దాల్చి ఆమెగారు మోయుచున్న మంటితట్టను తాను మోయుచుండగా, ఆసంగతి తెలి సిన అనంతాళ్వాన్ "మా కైంకర్యములో పాల్గొన వచ్చినావా!" యని కుపితులై తనచేత నున్న గడ్డపాఱను వారిపై విసరివేసినా నది ఎల్లరకు తెలిసినవిషయమేకదా.

"కెడుమిడరాయవెల్లాం" అను తిరువాయ్మొழிలో "వయ లణి అనంతపురం, కడైత్తలై శీయ్క్కప్పెఱ్ఱాల్ కడువినైకళై యలామె" అను ఆళ్వారుల తిరువుళ్ల మెఱింగిన మఠాధిపతులు మహా యులుగూడ నేటికిని అనంతపద్మనాభుని సన్నిధిలో, ఒకక్షణ మైనా సమ్మార్జన (చిమ్ము) కైంకర్యమును చేయుటను చూడవచ్చును.

శ్రీ జగన్నాథ క్షేత్రాధిపతి యగు పూరీ మహారాజులుగారు జగన్నాథక్షేత్రమునకు 'సమ్మార్జనకైంకర్యపరు' డను బిరుదము వంశపరంపరగా వహించియున్నారు. భగవత్కైంకర్యముయొక్క నిజస్వరూప మిట్లుండ, దానిని తెలిసికొనక నిహీనముగ తలంచు అపరాధకోటిలో చేరును.

భగవత్కైంకర్యమునకన్నను ఆచార్యుల భాగవతుల కైంకర్య ములే ఈశ్వరుని తిరువుళ్ళమునకు అధికసంతోషమును కలుగజేయు

మనది మన పూర్వాచార్యుల సిద్ధాంతము. భగవత్ భాగవత కైంకర్యములందు ఇంతటి అభినివేశ ముండిననేతప్ప, అది కైంకర్య ములో చేరదు. కాబట్టి, కైంకర్యపరులు ఇట్టి భగవత్కైంకర్యమే మనకు లభించిన నిక్షేప మని తలంచి, అవి వర్ధిల్ల జేయుట అవశ్యా పేక్షితము.

వైదికవిషయములను గుఱించి కొంత విస్తరముగా చెప్పినందు కు క్షమింప బ్రార్థించెదను. లౌకికవిషయములను కాలోచితముగా తెలుసుకొనుటకును అనుష్ఠించుటకును యువజనులే సమర్థులు. వారీవిషయమై పాటుపడెదరు గనుక, ముఖ్యమగు కొన్నివిషయములను మాత్రమే మను ప్రస్తావించెదను.

## సంఘాభివృద్ధి

'గురుపరంపరాప్రభావ' మనెడి గ్రంథమునందు ఎంబెరు మానారులను ఆశ్రయించినవారలలో పదునొకండువేల ఉపవీతధారు లైన శ్రీవైష్ణవులును (చాత్తినవారు), ఉపవీతములేని (చాత్తని వారు) శ్రీవైష్ణవులు పండ్రెండువేల మందియును అసంఖ్యేయు లైన యితరులును అని పొడగట్టుచున్నది. వారి తిరువడిగళును ఆశ్ర యించిన మనవారిసంఖ్య ఆకాలములోనే పండ్రెండువేల పురుషులే యుండగా ఆశ్రయింపనివారిసంఖ్య లక్షలకొలది యుండు ననుటకు సంశయము లేదు. ఈరీతిగా వారిని ఆశ్రయించిన బ్రాహ్మణుల సంఖ్యను మనవారిసంఖ్య ఒకవేయి అధికముండెను. తరువాతకూడ, మనవారిసంఖ్య చాల అభివృద్ధి పొందియుండవలయును. అట్లుండ, 1911-వ సంవత్సరపు జనాభా (Census) లెక్కలో మనవారిసంఖ్య రాజధానిలో 48,000 ఉన్నట్టును ఆ సంఖ్య 1921-వ సంవత్సరపు జనాభాలో 44,000-అనగా నాలుగువేలు తగ్గినట్టును కనబడుచున్నది. 1931-వ సంవత్సరపు జనాభాలెక్కలో మనవారి మొత్తపుసంఖ్య కనబడలేదు. లక్షలకొలది యుండవలసిన మనవారిసంఖ్య దినేదినే తగ్గుచు, యిప్పటికి అర్ధలక్షకూడ లేకుండుటకు మనము మిక్కిలి చింతపడవలసినదే. ఇందులకు కొన్ని నిదర్శనములుకూడ కనబడు

చున్నవి. అవి ఏవనగా, మొదటిది :—(1) మదరాసు తిరువల్లిక్కేణి పార్థసారథిస్వామిసన్నిధి వెనుక నుండు రాజవీథికి చాత్తాదులవీథి యని యిప్పటికిని పేరున్నది. ఆ వీథిలో ప్రస్తుతము చాత్తాదుల తిరుమాళిగ ఒక్కటిగూడ లేదు. (2) ఇట్లే శ్రీరంగములో ఒకపెద్దవీథికి పేరు 'చాత్తాదవర్ వీథి' అని యున్నది. ఒకప్పుడు ఆవీథియంతయు చాత్తాదులే వసించియుండినా రని తెలియనగుచున్నది. కాని ప్రస్తుతము రెండు మూడు తిరుమాళిగలే యున్నవి. (3) తిరుమల (తిరుపతికొండ) మీద చాత్తాద అధ్యాపకగోష్ఠివారి తిరుమాళిగలు పదునాలుగు ఉండిన వనియు, యదుగిరి (మేలుకోట) అగ్రహారమునందు చాత్తాదుల తిరుమాళిగలు కొన్ని యుండిన వనియును శిలాశాసనములవలన తెలియనగుచున్నది. కాని చాత్తాద శ్రీవైష్ణవు లొక్కరును ప్రకృతము కానరాకున్నారు. ఇట్లే అనేక దివ్యదేశములలోను, ముఖ్యముగా మదరాసు పట్టణమునందును మన వారిసంఖ్య చాలమట్టుకు క్షీణదశలో నున్నదనుట నిర్వివాదాంశము. ఇందులకు ముఖ్యకారణము మన పూర్వులు ఆత్మసంబంధమే (అనగా జ్ఞానానుష్ఠానములే) ప్రధాన మనియు, కర్మసంబంధమగు కేవలదేహ మునుబట్టి వచ్చిన వర్ణములు (జాతులు) అప్రధాన మనియు దలంచి ఆ జ్ఞానమును అనుష్ఠానమునందు కనబఱచుచు వచ్చినారు. అందు కారణముగా మనవారిసంఖ్య అభివృద్ధి నొందెను. ధనుర్దాసులు, కాంచీపూర్ణులు, మారనేర్నంబి, విళాంజోలైప్పిళ్లై మున్నగువారలు, వివిధజాతులలో జన్మించినవారలైనను జ్ఞానాధిక్యమును బట్టి వారలందఱును చాత్తాదధర్మనిష్ఠులుగానే పూర్వాచార్యులవలన నిర్దేశింపబడియున్నారు.

పండై (పూర్వపు) కులమును వదలి (తొండక్కులము) దాస్యకులమునందు చేరినవారినేకదా, పెరియాళ్వారులు మంగళాశాసనపరులుగా రండు—అని 'తిరుప్పల్లాండు'లో పిలుచుచున్నారు. ఈ ధర్మ మిట్లుండ, ఇప్పటివారలు ఆత్మసంబంధమును బొత్తిగా ఉపేక్షచేసి కేవల దేహ సంబంధమునకే ఆధిక్య మిచ్చు చున్నారు.

స్తవులు మహమ్మదీయులు తమతమ మతములను వృద్ధిపఱచుటకు విధముల ప్రయత్నించుచున్నారు. మనమో మన చాత్తాదధర్మము ంచుట ప్రత్యక్షముగా నెఱింగియు ఉదాసీనులమై యున్నాము. ర్వారులయొక్కయు పూర్వాచార్యులయొక్కయు ముఖ్యోద్దేశ్యము ంచమం దంతటను వైష్ణవత్వమును 'ఫాలిగ ఫాలిగ' యని ంపజేయవలసి యుండగా, మన దర్శనమును అభివృద్ధిచేయుటయే సేవ, దేశసేవ యని తలంచి యిందులకు దగినప్రయత్నములు వారు ఆలోచింప వలసినది అవశ్యకర్తవ్యము.

రెండవది: మనవారిలో కొందఱు ముఖ్యముగా ఆంగ్లము చదివి పదవిలో నుండువారు, చాత్తాదు లనగా లోకనింద్యులని ని తప్పుఅభిప్రాయము గొని తాము చాత్తాదుల మని చెప్పక, జాతివారల మని చెప్పుకొనుటయు, మరికొందఱు ఆభిజాత్యముచే తములను దాల్చికొని, బ్రాహ్మణు లనిపించుకొనుటయు, ఉత్తర జిల్లాలలో చాత్తాదులు, 'దాసరి' 'తాదర్' అని సామాన్య గా పిలువబడుచుండుటచే, ఆ పేర్లక్రిందటనే జనాభాలెక్కలలో పబడుటయును, మనవారి సంఖ్య మిక్కిలి తగ్గుటకు కారణ ముగా నున్నవి.

## చాత్తాద శ్రీవైష్ణవులు

1920-వ సంవత్సరపు జనాభాలెక్కలు తయారుచేయు కాల , చాత్తాద శ్రీవైష్ణవ విద్యాభివృద్ధి సమాజము తరపున, మాన్ చిరువందాడు తిరువాయ్ మొళిప్పిళ్లయ్యగారు B.A., మాన్ రాంబాక్కం ఆళవందారయ్యగారు, శ్రీమాన్ ప్రళయకావేరి ళయ్యగారు, మొదలగువారు జనాభా అధికారితో భాషించి, వారలను చాత్తాదశ్రీవైష్ణవు లని లెక్క దాఖలా చేయుటకు కారమును పొంది యున్నారు. 1921-వ సంవత్సరమునందు జిల్లాల లెక్కలలో 'చాత్తాదశ్రీవైష్ణవు' లనియే గణింప యున్నారు. ఈవిషయమును ప్రతిగ్రామమునందుండు మనవారలకు

తీవ్రప్రచారము చేసి రాబోవుజనాభాలోను ఇతరవ్యవహారములలో
'చాత్తాదశ్రీవైష్ణవు' లనియే దాఖలుచేయ వలయును. ఇందువి
యమై 'సుదర్శన'పత్రికాసంపాదకులు ప్రచారము నిదివఱకే ఆరంభిం
యుండుట ప్రశంసనీయము.

## విద్య

మనవారలలో కొంతకాలముక్రిందట ఆంధ్రగీర్వాణభాష
ప్రసిద్ధి గాంచి మదరాసులో నుండు కాలేజీలలో తెనుగు పండి
స్థానములును, గ్రామాంతరములలో తెనుగు ఉపాధ్యాయ
స్థానములును మనవారివిగానే యుండెను. పండితులలో ప్రధాను
శ్రీమాన్ పరవస్తు చిన్నయ్యసూరిగారు ఆంధ్రభాషకు చే
మహోపకారమునుబట్టి 'ఆంధ్రపాణిని' అను బిరుదు వహించినారు
వీరు రచించిన గ్రంథములలో ముఖ్యమైనవి శబ్దలక్షణసంగ్రహము
బాలవ్యాకరణము మున్నగు లక్షణగ్రంథములును, నీతిచంద్రిక య
బడు లక్ష్యగ్రంథమును. శ్రీవారి స్వహస్తలిఖితగ్రంథ మొక్క
శ్రీ పీఠికాపురసంస్థానగ్రంథభాండాగారమునందు ఇప్పటికిని
పఱుపఁబడియుండునట్లు వినుచున్నాము. ఆంధ్రసహోదరులును ము
ముగా మనవారును వారియం దుండవలసిన కృతజ్ఞతను
కుండుట మిక్కిలి శోచనీయము. ఇకమీదనైనను 'పరవస్తు చి
య్యసూరిగారి దిన' మనుపేర సం॥మున కొకదినమున వారిని
యాడుటకును, వారి ప్రభావమును మన సంతతివారు తెలిసి
యెన్నడును మఱవకుండుటకును తగుఏర్పాటు జేయుట ఆవశ్యక
1914 సం॥ లో శ్రీ సూరిగారిపేర నొక పుస్తకభాండాగారము
రాసునందు నెలకొల్పబడి, కారణాంతరములచే అభివృద్ధి పొందక
నది. పిమ్మట పునరుద్ధరణ చేయబడెను. కాని, అదియును
పుట్టి పుబ్బలో మాడిన ట్లాయెను. కనుక, మనవారం
ఈయుద్యమమునకుఁ గంకణము గట్టి దీక్షతో కొనసాగింపఁ
వలయును. పౌరాణికులలో సుప్రసిద్ధిగాంచి పురుషులకొఱకు 'నీతి
ము'– స్త్రీలకొఱకు 'శ్రీనీతిసంగ్రహము' అను రెండుశతకము

రచియించిన కొమ్మిమ్మ రంగయ్యసూరిగారును, సంస్కృతభాషయందు పట్టపరీక్షలో సుమారు నూటనలువదిమంది బ్రాహ్మణులమధ్య ప్రథమ స్థానము వహించి, "రాజకుమార" పాఠశాలయందు సంస్కృత పండితస్థానము నలంకరించియుండిన వైయ్యాకరణం రామానుజయ్య గారును, పరవస్తు చిన్నయ్యసూరికి తర్వాత రాజధానీకళాశాలయందు పండితులుగా నుండిన శ్రీరేకం రామానుజ సూరిగారును, శ్రీరేకం ...వాళయ్య (Sub-judge)గారును, పంచాంగం తేవప్పెరుమాళ్లయ్య గారును ఓమందూరి దొరసామయ్యగారును, ఆనందముద్రాలయము ...ను, పిఠాపురపు సంస్థానమునందును ప్రధానపండితులుగా, ...న తంజనగరం దేవరాజసుధీమణిగారును, కీ॥ శే॥ అగరం-నమ్మా ళ్వారయ్య బి. ఏ. గారి ధర్మపత్నియును 'శోభావతీ' గ్రంథకర్త్రియు ...పెరియపిరాట్టి అమ్మగారును, 'బ్రహ్మసూత్రము' లకు త్రిభాష్య ...టీకా తాత్పర్యములను రచియించిన శ్రీమాన్ భద్రగిరి నంబెరు ...ళ్లయ్య, బి.ఏ., ఎల్.టి. గారును, కవిశరభ బిరుదాంకితు లగు ...మాన్ పెద్దమందడి వేంకటకృష్ణకవి గారును, ఆంధ్రపత్రికా కార్య ...నోద్యోగి యగు శ్రీమాన్ బుక్కపట్టనపు రామానుజకవిగారును ...వారలే.

ఇటులే వైదికవృత్తియందు ప్రసిద్ధి గాంచి మతప్రచారము ...ఆచార్యత్వమును వహించి యుండిన వారలలో చిరువందాడు ...వాయ్ మొళిప్పిళ్లయ్యగారును, వారికుమారు లగు వైయాకరణం ...రామానుజయ్యగారును, ఏకసంతగ్రాహి యని ఖ్యాతినొంది, మనసం ...దాయమునకు ఆదర్శపురుషులుగ నుండిన పరాంకుశనంబిగారును, ...పూరు రామానుజయ్యగారును, పర్లాకిమిడి కంచర్ల కాంతయ్య ...ను, కొమాండూరి రంగాచార్యులవారును, ఆసూరి కాంతయ్యసూరి గారును, చిరువందాడు శెల్వప్పిళ్లై స్వామిగారును, అగరం ...శ్వరయ్య B. A. గారును, అనేకశిష్యసంపత్తి గల తాళూరు, ...మా మఠాధిపతులలో గొందఱు ప్రముఖులును వేంచేసియుండిరి.

సంగీతవిద్యలో సంస్థానములందు ప్రఖ్యాతిగాంచినవారలలో వీణ-విజయవరదయ్యగారును బెబ్బులి-కేశవయ్యగారును షట్కాల నరసయ్యగారును వీణ-రాఘవయ్యగారును వారికొమారులును ప్రస్తుతము పండితులవలన గొనియాడబడుచుండు శ్రీమాన్ వీణ-వరద య్యగారును వైణికులలో ప్రసిద్ధిగాంచినారు. ఇట్టిప్రభావశీలు రుండిన మనకుడిగొయొక్క స్థితి యిప్పు డేమైయున్నది? ఆంధ్రగీర్వాణభాష యందు పండితు లని పేర్కొనబడినవారలలోగాని, వైదికాచారము లందుగాని అంతటి విఖ్యాతి పొందినవారు సకృత్తుగా నున్నారు. మన ము గౌరవమును బొందుటకు తగిన యోగ్యతను సంపాదింపను పాటుపడక, యీ కాలమునందు గౌరవము లేకపోయినదని చింతింపుట నిష్ప్రయోజనము.

మనవారలలో ఆంగ్లభాషయందు ఉన్నతవిద్య బడసినవార ల్లయు, ఉద్యోగస్థులయు సంఖ్యలను వ్రేళ్లమీద లెక్కపెట్టవచ్చును. ఈ రాజధానియంతయును కలయవెదకినను బి. ఎల్. పట్టము పొందిన వారు మువ్వురును, ఎల్. టి. లేక బి. ఇడి. పట్టముల బడసిన వారలు ఏడుగురును (ఒక స్త్రీ సహా), M. A. పట్టము పొందిన వారు ఒక్కరును, M. Sc., M. B. B. S. లేక L. M. S. పట్టము లను పొందినవారు ఐదుగురును, సామాన్య బి. ఏ. పట్టము పొందిన వారు దాదాపు పదునైదుగురు నుండవచ్చును. స్త్రీలలో బి. ఏ. పట్టము పొందినవార లిరువురు. పైని కనబఱచినవారలలో అనేక సంఖ్యాకులు కీర్తిశేషులైన డాక్టరు కోదాడు వేదాంతయ్యగారి కుటుంబమునకు జేరినవారలు.

## ఉద్యోగములు

ఉద్యోగసంఖ్యను జూచిన, (Gazetted appointments) గెజిటెడ్ ఉద్యోగములలో ప్రస్తుత ముందువారు, ఒక్క సివిల్ సర్జను క్యాప్టన్ కృష్ణన్‌గారు, రిటైర్డు జిల్లాసర్జను సి. రామానుజయ్యగారు ఒక్క డిప్యూటి కలెక్టర్, ఒక్క అసిస్టెంటు సర్జనుమాత్రమే. ఈ రాజ ధానిలో నుండు మనవారల ఆంగ్ల ఉన్నతవిద్యయు, ఉద్యోగములును

...తి తక్కువస్థితిలో నుండుటకు ముఖ్యకారణము మనవారి దారి ...మే కదా ? మదరాసు శాసనసభలయందు నేటివఱకు మనవా ...రైనను సభ్యులుగా నుండుట లేదు. జిల్లాబోర్డులు, మునిసిపాలి ...న్నిటిలో వెదకినను, ప్రస్తుతము ఒక్కరు లేక యిద్దఱకంటె అధి ...ము లేరు. చదువులో వెనుకబడి యుండునట్లు అంగీకరింపబడిన ...తులవారలలో గాని నిమ్నజాతులవారలలోగాని విద్యయం ...ను ఉద్యోగములందును, ఇంతటి కేవలస్థితి యుండదు. మనవారి ...యి ట్లుండ, ప్రాథమిక విద్యయందలి మనవారిసంఖ్య అధిక ...తమాత్రమున నే మనవారి నిజస్థితిని వృత్తులను పరిశీలింపక ...ధికారులు మనవారలను విద్యా విషయములో 'వెనుక ...' జాతివారలలో చేర్పకపోవుట చింతనీయము. గవర్నమెంటు ...వు మనవారలలో గొందఱకు ఉన్నతోద్యోగము లొసంగు ... సహాయము చేయకపోయినయెడల, మనవారల అభివృద్ధికి ...ర్గము అగపడదు. ఈవిషయములందు ప్రభుత్వమువారు తోడ్ప ...ట అత్యావశ్యకము. ఇందులకు మనమును తగిన ప్రయత్నములు ...యుట ఆవశ్యకము. ఇందుకొఱకు శాసనసభ్యుల సహాయమును ...యుటయు ముఖ్యము.

## వృత్తులు

మనవారలకు ఏర్పడియుండు వృత్తులలో ముఖ్యమైనవి, సన్నిధి ...కార్యములు, పుష్పవ్యాపారము, తిరుమణిశ్రీచూర్ణవ్యాపారము; ...మణి పెట్టెలు తిరుపగూడలు అల్లుట, ఉపాధ్యాయత్వము, అర్చ ...త్వము, గ్రామపౌరోహిత్యము, అక్షయపాత్రయు. కొన్ని స్థలము ... అచ్చులు కట్టుట, నేత నేయుట, వ్యవసాయము చేయుటయు. ...వు. వృత్తులు ఏవియైనను, చేయువానియొక్క యోగ్యతను ...యే గౌరవముగాని, వృత్తులలో గౌరవాగౌరవములు లేవనునది ...ంగుట ముఖ్యము. ఈకాలమున ఆంగ్ల ఉన్నతభాషయో, లేక ...విద్యయో (Technical education) నేర్చుకొనుట మనవారల ...తస్థితికి అందుబాటులో లేవు. అథవా నేర్చుకొన్నను, ఉద్యోగ

ములు సంపాదించుటయు, సంపాదించిన ఉద్యోగములను కాపాడుకొను టయు కష్టతరముగా నుండుటను మనము చూచుచున్నాము. ఇట్టి స్థితిలో ద్రవ్యవంతులు తప్ప తక్కినవారు 8-డవఫారము లేక ఎస్. ఎస్. ఎల్. సి. వఱకు చదివి, ఆంగ్లవిద్యను చాలించుకొని, ఏవైన గుడిసెపనులు (Cottage industries) అభ్యసించుట మంచిది. మనవార లకు ఏర్పడియుండు వృత్తులు, చాలవఱకు స్వరూపానుగుణముగా నున్నవి. వానియందు ప్రవర్తించి, వృద్ధిపొందుటనుబట్టి ఆలోచించ వలయును. కాలస్థితి ననుసరించి, మనము నూలు వడుకుట, నేతనేయు టను జేయవచ్చును. నేతపని అన్నివృత్తులలోను శ్రేష్ఠమైనదని మహా త్మాగాంధీ, తిరువళ్లువర్ మున్నగు మహాపురుషులచే వక్కాణింపబడి యున్నది. దేశకాలపరిస్థితులనుబట్టి వృత్తులను మార్చుకొనుటయందు తప్పేమియును కనబడదు. అక్షయపాత్ర విరక్తాగ్రేసరులకు ఉత్తమ వృత్తియనియు, సామాన్యులకు అధమవృత్తియనియు నెఱుంగవలయు.

తక్కిన జాతులవారికన్నను మనవారికి మతగ్రంథములందు విశేష అభ్యాస ముండుట ఆవశ్యకము. బ్రాహ్మణేతర జాతులలో నుండు విష్ణుమతస్థులు కొందఱు మనవారలయందు గురుత్వము కలిగి యున్నారు. ఇది కొంతవఱకు క్షీణించిపోయినది. ఇందులకు మన యొక్క విద్యలేమియు, అశ్రద్ధయునే కారణములు కాబట్టి, చిన్ననాటి నుండి మన బాల, బాలికలను స్తోత్రపాఠములు నిత్యానుసంధానము అభ్యసింప జేయుట అత్యావశ్యకము. శుభాశుభ కార్యములయందు యాజ్ఞికము, పౌరోహిత్యము మొదలగు వైదికవృత్తులను, కొందఱు అభ్యసింప జేయుట అవశ్యకర్తవ్యము. ఈ ఉద్యమము అభివృద్ధి గాంచుటకు ఇట్టిమహాసభ జరుగుకాలములో నిదివఱకు చేసినట్లు పోటీ పరీక్షలు పెట్టి, అందు ఉత్తీర్ణులైనవారికి, బహుమానములు ఇచ్చి ప్రోత్సహించుట మంచిది.

## తెగలు (Sects)

మనవారలలో ముఖ్యముగా మద్రాసునందు మూడు తెగలు గలవు. పూర్వము ఈభేదము మిక్కిలి కట్టుదిట్టములతో ఆచరణలో

నందున వివాహసంబంధములే కాక, భోజన ప్రతిభోజనములు లేకుండెను. కాలానుగుణముగా, ఇప్పటికే పెక్కు మార్పులు పై ప్రతిబంధకములు చాలవఱకు తగ్గిపోయినవి. శీఘ్రకాలము కొన్ని కుటుంబములలో నుండెడి యీ నిర్బంధములు సైతము ంచిపోవును. కనుక ఈవిషయమై మనము ప్రత్యేకప్రయత్నములు టకు అవసరము అగపడదు. ఉత్తర దక్షిణ ప్రాంతములందు తము కనబడు కొన్ని భేదములు, ఆచార అనుష్ఠానములను బట్టియే; కొందఱు ప్రథమపడివారు (భగవన్నిష్ఠ ప్రధానముగా గల అనియు, మఱికొందఱు చరమపడి (ఆచార్యనిష్ఠయే ప్రధాన గల) వారనియు భేదము కలదు. నేడు ప్రథమపడిలో నుండు ఆచార్యాభిమానమును పొంది, మఱునాడు చరమపడివారు లరు. కాబట్టి ఇది కేవల వైదికానుష్ఠానములు. ఇవి వివాహ ధములకు అడ్డుపడవు. భోజన ప్రతిభోజనములకు మాత్రమే న్నవి. దీనినే 'తెరచాటు' అనియెదరు. ఈ యేర్పాటు 'అన్న ము జ్ఞానవిరోధి యగు' నను ప్రమాణమునుబట్టియే కలిగినది. ంటి భేదములు, వైదికోత్తము లగు బ్రాహ్మణుల తిరుమాళిగల మును, కలవు. ఇట్టి స్వల్పభేదములు, సాంఘిక, మత, ఆర్థికాది త్యములకు, ఎంతయు అడ్డుపడవు. కావున, దీనినిగుఱించి మన చర్చింప నవసరము లేదు. ఈ కట్టుదిట్టములుకూడ చాలమట్టుకు ంచిపోవుచున్నవి.

## రాజకీయములు (Politics)

మన ప్రభుత్వమువారియెడల మనమందఱము పూర్ణవిశ్వాస కలిగియుండుట ఆవశ్యకము. ఇప్పుడు జర్మనీవారితో జరుగు మునందు బ్రిటిషు ప్రభుత్వమువారికి త్వరలో జయము గలుగ మనని యీశ్వరుని ప్రార్థించెదము. మహమ్మదు జిన్నాసాహెబ్ కోరికలు దేశక్షేమమునకును ఐకమత్యమునకును భంగము కలుగ ను గాన, వాని నంగీకరింపక, త్యాగబుద్ధితో దేశసేవ చేయు

గాంధీ మహాత్ముని అభిప్రాయములను సదయహృదయులై అంగీకరింపవలయునని మనము దొరతనమువారిని ప్రార్థింపవలయును.

## సంప్రదాయ, అనుష్ఠానములు

కాలమునకు తగినట్లు ఆచార అనుష్ఠానములు, కొంత మారుట గలదు. ఐనను, మన సంప్రదాయము, భగవన్నిర్హేతుక జాయమాన కటాక్షమువలన, భక్తి రూపాపన్న జ్ఞానమును బడసి, అట్టి విశేష జ్ఞానముచే, సర్వమును సాక్షాత్కరించిన ఆళ్వారులవలనను, అట్టి ఆళ్వారులచే విశేషకటాక్షము పొందిన పూర్వాచార్యులవలను 'ఓరాణ్వళిగా' (పరంపరగా) మనకు సంప్రాప్తమైనవి. మన పూర్వులందఱు ఇవియే ఉత్కృష్ట అనుష్ఠానము లని, తాము పూర్ణముగా తెలిసి, విశ్వసించి, మనకు లభింపజేసినారు. ఇట్టి సార తమమగు అనుష్ఠానములను మనము విడనాడినయెడల మనకు శ్రేయస్కరము కాకపోవుటయే కాక మనపూర్వులయొక్క ఆత్మలకు దుఃఖమును కలుగజేసినవారల మగుదుము. మనము పూర్వుల అనుష్ఠానములందు విశ్వాస ముంచి నడచినయెడల, మనకు ఇహపర ములందును మేలు కలుగును. ఇది యెంతయు కష్టము గాదు. మన జీవితకాలములో చాలభాగము మనము వృథాకాలక్షేపము చేయు చున్నాము. ఈ వ్యర్థకాలమును తగ్గించి, భగవద్విషయములలో ప్రతిరోజు కొంతకాలము వినియోగపఱచుట మన కుడివారికి శ్రేయ స్కరము. ముఖ్యముగా ప్రస్తుతము మనవారలు కొందఱు వైష్ణవ చిహ్నము లగు తిరుమణి శ్రీచూర్ణము ధరించుటకూడ మానివేయు చున్నారు. మన స్వధర్మమునందును, మన పూర్వుల జ్ఞానాను ష్ఠానములందును, విశ్వాసమును ఆదరణము నుంచుట మేలా లేక విరుద్ధధర్మము లగువానిని అభిమానించుట శ్రేయస్కరమా అనునది మనమే ఆలోచించి తెలిసికొనవచ్చును.

"శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్..."

అను గీతాశ్లోకమును జ్ఞప్తికి తెచ్చుకొనవలయును.

మనవారల ప్రతి తిరుమాళిగయందు 'కనివార్ పీట్టిన్ బమ్'
...గా నిత్యముక్తానుభావ్యమును వదలి, చేతనోజ్జీవనార్థమై అర్చా
...మేను దాల్చి, తనస్వాతంత్ర్యమంతయు మాని అజ్ఞులమగు మనకు
...తంత్రుడై యుండు సౌలభ్యమును తలంచితలంచి మనస్సు కరగునట్టి
...భావము గలవారి తిరుమాళిగలలో ఆనందముగా వేంచేసియుండు
...మాళ్లు కుచితోపచారములు సలిపి, మనము భుజించువానిని
"...దన్నః పురుషో భవతి తదన్నాః తస్య దేవతాః" అనునట్లు భగవ
...ర్పణము చేసి, అందువలన పావనత్వభోగ్యత్వముల బడసినప్రసా
...ము స్వీకరించుట ఇహపరశ్రేయస్కరము. దినము ఒక్కటికి అర్ధ
...కాలమైనను భగవత్సేవ చేయుట కష్టము గాదు. అభినివేశ
...డిన, ఎట్టిపనియు సాధింపవచ్చును. "Where there is a will,
... is a way" అను ఆంగ్లలోకోక్తిని స్మరింపవలయును.

ఆళ్వారుల 'అరుళిచ్చెయల్' అను ద్రవిడప్రబంధమును, అష్టా
...రహస్యములును మన పూర్వాచార్యులు మనకు బెట్టియుండు
...పము. వీనిని గురుముఖముగా అభ్యసించి అనుభవించిన, నిదియే
...పదానుభవమును ఈ లీలావిభూతియందే కలుగజేయును. వాని
...వమును, వానిలో దాగియుండు అర్థవిశేషములును అధికారాను
...ముగా గోచరించును. సామాన్యులుసైతము తెలిసికొని ఆనం
...వచ్చును. మహామతులుకూడ నింతయని నిర్ణయింప అశక్య
... అర్థపుష్టి కలదు. మనవారెల్లరు ఈ విషయమందలి జ్ఞానమును
...దింప ప్రయత్నపడుట అత్యావశ్యకము. దేహయాత్ర కర్మాధీన
... యెఱింగి దేహపోషణ మొదలగు ఐహికసుఖములందు విశేష
...మోహము జెందక, కర్మానుగుణముగా లభించినంతవఱకు తృప్తి
... ఆత్మోజ్జీవనము ప్రధాన మనుబుద్ధితో వర్తించుట శ్లాఘనీ
...ము. దీనినే "Simple living & high thinking" అనిచెదరు.
...ట "యస్యానుగ్రహ మిచ్ఛామి తస్య విత్తం హరామ్యహం"
... భగవద్వాక్యమును, "తృణీకృత విరించాది నిరంకుశవిభూతయః

రామానుజపదాంభోజ సమాశ్రయణశాలినః'' అను పూర్వాచా ర్యులవాక్యమును అనుసంధేయము.

పై అనుష్ఠానములు వర్ధిల్లుటకు గృహిణులు తోడ్పడవలయు, మగవారికన్నను స్త్రీలయందే విశేషఅనుష్ఠానము లుండినవి యని చెప్పెదరు. పూర్వాచారములను వీరలే కట్టుదిట్టములతో గృహము లందు నడుపగలరు. ఇందు శ్రద్ధాభక్తులు కలవారుగా నుండవలయునని సహోదరీమణు లెల్లరను ప్రార్థించుకొనుచున్నాడను.

ముఖ్యముగా, మనవారందఱును పరస్పరప్రేమయు మైత్రీ భావము గలవారై ప్రవర్తింపవలయు. అసూయ, ద్వేషము ఉండిన యెడల 'వైష్ణవుడు' అనిపించుకొనుటకే అర్హుడు కాజాలడు. మణ వాళమామునులసంబంధముగల వారల నిష్ఠను ''అపగతమదమానై రంతిమోపాయనిష్ఠై రధిగతపరమార్థై రర్థకామా నపేక్షైః నిఖిలజన సుహృద్భి ర్నిర్జిత క్రోధలోభైః వరవరమునిభృత్యై రస్తు మే నిత్య యోగః'' అని సాధించియున్నారు. ఇదియే శ్రీవైష్ణవు లగువా కెల్లరకును, ముఖ్యముగా మనవారలకు, నిత్యానుష్ఠానములు. ఈ అనుష్ఠానము లేకున్న, మణవాళమామునులసంబంధము పోగొట్టు కొనువార మగుదుము. మనసంఘాభివృద్ధికొఱకు మన మొక్కొక్క రును పరసమృద్ధితో ఏకీభవించి పాటుపడి, సాధ్య మైనంతవఱకు ద్రవ్యము ప్రోగుచేసిన, ననేక కార్యములు సాధింపవచ్చును. అట్లు చేయక పరస్పరభేదబుద్ధితో ఐకమత్యములేక తమయొక్క ఖ్యాతిలాభములకే పాటుపడినయెడల, మనలో భిన్నత్వములు ఏర్పడి, మన ఉద్యమములు ఏవియును గొనసాగకపోవుటయే కాక నలుగురినగుబాటునకుకూడ పాత్రుల మగుదుము. "United we stand, Divided we fall" అను ఆంగ్ల సామెతను జ్ఞప్తికి తెచ్చుకొనవలయును. మనపూర్వులు వివాహాములను భగవత్సాన్నిధ్య (గృహ తిరువారాధన) మందు పెద్దల మంగళాశాసన పూర్వకముగా జరిపించుటయేతప్ప, హోమము మొదలగు క్రియలను చేయుటలేదు ఇవి స్వరూపవిరుద్ధము. కాలాను గుణముగ ఇట్టి పూర్వా చారములను అమలులోనికి తెచ్చి అనవసరపు కర్చులు తగ్గించువిషయ

ము ఆలోచించుట మంచిది. ఈపైని కనబఱచిన ఉద్దేశ్యములను నెరవేర్చుటకు ప్రతిజిల్లాలోను సమాజమొక్కటి స్థాపించి, ఆజిల్లా లందఱను సమాజమునకు సభ్యులనుగా జేర్చి, చందాలు విరాళములమూలముగా ధనము కూర్పవలయును. జిల్లాసభలపై ఒక్కటి రెండో కేంద్రసమాజములు ఉండవలయును. ఆంగ్లఉన్నతవిద్య, విద్యల అభివృద్ధికొఱకు, బుద్ధిమంతులైన బాలురకు ద్రవ్యసహాయము చేసి వారలను ముందునకు తేవలయును. కొందఱను స్వరూపములు నభ్యసింపజేసి అధ్యాపకులుగాను, కాలక్షేపపరులుగాను చేసి, వారిమూలమున మతప్రచారము గావింపవలయును.

దక్షిణప్రాంతమం దుండు దివ్యదేశములందు, మనవారలకు ఉండియుండు కైంకర్యములను అభివృద్ధిజేయుటకును, అవి అన్యాక్రాంతముకాకుండ గాపాడుటకును, ఇప్పు డున్నసన్నిధిమర్యాదల నైన పోగొట్టుకొనకుండుటకును, తగినప్రయత్నములు చేయుటకు ద్రవ్యము మొనర్చుటయు ఆవశ్యకము. సాధ్యమైనంతవఱకు, మనలో మము కష్టపడి సాహాయ్యము జేసికొనుటకు ప్రయత్నించుటయే ము. "We must learn to stand on our own legs." దాక్షిణాత్యులు ముఖ్యముగా గమనింపవలసినది మాతృభాషాభివృద్ధి. వారిలో 100-కి గురు ఆంధ్రభాషయందు పరిచయము లేకుండుట మిక్కిలి విచారము. బాలబాలికలకు చిన్ననాటనుండే చక్కగా వ్రాయనుచదువను నేర్పించుట ఆవశ్యకము. మనస్వరూపగ్రంథములు (దివ్యప్రబంధములు) ద్రావిడ భాషలో నున్నవి గనుక ద్రవిడభాషాజ్ఞానము మన ఆంధ్రసహోదరులకు అత్యావశ్యక మని విన్నవించుకొనెదను.

అన్నిపనులు సాధించుటకు ప్రచారము అత్యావశ్యకము. పనులకు మొట్టమొదట యువకులే తోడ్పడవలయును. ఈ కాల సాహసధైర్యములతో పనిచేయువారు యువజనులే. వారి సహాయమునే మనము ఎదురుచూడవలయును. వారు త్యాగశీలురై పరసమృద్ధులతో పాటుపడ ముందునకు రావలయును. తరువాత

వార్తాపత్రికలు ఉండవలయును. ప్రస్తుతము వెలువడుచుండు 'సుదర్శన' పత్రికకు సంపాదకులు తమ వ్యయప్రయాసలను పాటిం పక గొప్పకార్యమును సాధించుటకు ఉత్సాహము కలిగియున్నారను టకు ఈ కూడిన మహాసభయే నిదర్శనము. ఈ పత్రిక త్వరలో, వారపు లేక దినసరిపత్రికగా వృద్ధినొందుట ఆవశ్యకము. 'చాత్తాద శ్రీవైష్ణవన్' అను ద్రవిడపత్రికను మరల ప్రారంభించుటకు తగు ప్రయత్నము చేయవలయు నని శ్రీమాన్ శేలం వేంకటరమణయ్య గారు మొదలగు శేలంవాసులను ప్రార్థించుచున్నాడను.

ముఖ్యమని దాసునికి తోచిన విషయములను, దాసునికి తెలిసినంతవఱకు విన్నవించుకొంటిని. భాషాజ్ఞానముగాని, బుద్ధిబలము గాని లేనివాడను గాబట్టి యిందు తప్పులు మెండుగ నుండును. అందు లకు క్షంతవ్యుడ. అధికకాలము దాసునివిజ్ఞాపనములను పుత్రవాత్సల్య ముతో విన్నందులకును, ఈ మహాసభ అధ్యక్షపదవి దాసునకొసంగి గౌరవించినందులకును సభవారెల్లరకును దాసుడు కృతజ్ఞతాపూర్వక ముగా మరలమరల అంజలి జేయుచున్నాడను. ఈ సభను జయప్రద ముగా జరుపదోడ్పడిన పెద్దలకును సహోదరీ సహోదరులకును, ఈ రెండురోజులకు ఇచ్చట వేంచేసియున్న మనవారందఱకును సాపాటు బస వసతులు మొదలగు సౌకర్యములు చేయ బూనుకొన్న ఆహ్వాన సంఘసభ్యుల కందఱకును, ముఖ్యముగా శ్రీమాన్ భద్రగిరి రామా తారముగారు B.A., శ్రీమాన్ ఎస్. రంగనాథస్వామిగారు B.A., B.L. శ్రీమాన్ నల్లగట్ల వెంకటనరసయ్యగారు, డాక్టర్ డి. లక్ష్మణస్వామి గారు, శ్రీమాన్ వై. శ్రీనివాసులుగారు, శ్రీమాన్ నల్లగట్ల సత్య నారాయణగారు మున్నగువారికిని, యువజనసమితి, బాలభటులు మొద లగువారికిని దాసుని కృతజ్ఞతను తెలుపుచు, సంఘసేవ జేయ ముందు నకు వచ్చినవారలకు ఆయురారోగ్యములు గలుగుటకును, ఈ యువ జనసంఘము అభివృద్ధిగాచ మంగళాశాసనములు జేయ ఎంబెరుమా న్లను, ఇచ్చట వేంచేసియుండు భాగవతోత్తములను ప్రార్థించుచు,

దాసాను దాసుడు ఎ. యస్. రంగస్వామయ్య (శ్రీ పెరుంబూదూరు).



కేసరీ ముద్రాక్షరశాల, చెన్నపురి.

# సుదర్శనం

## మాసపత్రిక.

ము 2. ] మే, —1940. [ అనుబంధం

## విజ్ఞాపన.

మార్చిలో జరిగిన మహాసభ విజయవంతంగా జరిగిపోయి
చెప్పవచ్చును. అందలి విషయ విశేషములు, తీర్మానములు
ర్శిగారు పంపించినారు. అవి వేరొకచోట ముద్రించినాము.
శ్రీమాన్ డా॥ త్రిదండ పార్థసారథిగారు గావించిన సుదర్శన
వందనోత్సవోపన్యాసము శ్రీమాన్ టి. పి. మనవాళ్లయ్యగారి
ప్రారంభోపన్యాసమున్నూ సభాధ్యక్షులగు శ్రీమాన్
యస్. రంగస్వామయ్యగారి అమూల్యమైన అధ్యక్షోపన్యాసము
ముఖ్యముగా హర్షింపతగియున్నవి. ఆహ్వానసంఘాధ్యక్షులైన
న్ యస్. రంగనాథస్వామి బి. ఎ, బి. యల్. గారి చాక
మున్నూ, శ్రీమాన్ యన్. వి. నరసయ్యగారి శాంతస్వభావ
ను, శ్రీమాన్ వా॥లక్ష్మణస్వామి. కాండ్రికోట నరసింహారావు
కటరామ్, డి. రామానుజయ్య ప్రభృతుల కార్యదీక్షయున్నూ
సభకు వన్నె పెట్టినవి.
అంగీకరింప బడిన తీర్మానములు గాలికి పోకుండా అమలులో
కు స్థాయిసఘము యేర్పాటు చేయబడినది స్థాయిసభాసంఘ

సభ్యులు వారి వారి జిల్లాలలో (1) సంఘస్థాపన (2) దురాచార నిర్మూలన, (3) విద్యార్థి వేతనములకు నిధిని యేర్పరచుట మున్నగు విషయములను తీవ్రముగా కొనసాగింప ప్రార్థించెదము. ఈరహస్య త్రియము పైనే మన జాతి భావి భాగ్యోన్నతి ఆధారపడియున్నదను విషయమును గమనించ గోరెదము.

మార్చిసంచిక కొంచెము ఆలస్యముగా ప్రచురింప బడినందున స్వాములకు పోస్టు చేయలేదు. ఈమహాసభా సంచికతో దానిపొందు పరచినాము. చిత్తగించగోరెదము.

మహాసభాసమయములో సుదర్శనమునకు విరాళములు వేసి ప్రోత్సహించిన స్వాములకు కృతజ్ఞతా పూర్వకవందనములు వారిలో ముఖ్యముగా పరాంకుశం సుందరరామయ్యగారిని, శ్రీమాన్ తిరునగరి రామానుజయ్యగారిని (వేగివాడ) పేర్కొన గోరెదము. స్వాములందరు సుదర్శనముపై చూపిన ఆదరాభిమానములను నిలుపుకొనుటకు అన్ని విధముల ప్రయత్నించెదము.

జూన్ నెల 21 తేదీని సుదర్శనం ప్రత్యేక సంచిక వెలువరచ దలచినాము. అందులకు పెద్దవారి జీవిత చరిత్రములు ఆశీస్సులు సందేశములు వినయపూర్వకముగా వాంఛించుచున్నాము. యువకులు గీతికలను, సభ్యములైన కథలనువ్రాసి పంపగోరెదము. ఈవిషయమై ఆఖరు పేజీపై ముద్రించిన విషయమును గమనించ కోరెదము.

కాగితముధర విపరీతముగ పెరిగిన ఈదినములలో ప్రత్యేక సంచికను వేయబూనుట సాహసమే కావచ్చును అయినను. సంచికను వేయుట మావిధియని తలంచుచున్నాము. మావిధిని మా నెరవేర్పించుటకు స్వాములందరు శక్త్యానుసారముతోడ్పడెదరు గాక! మహాసభలో విరాళములు వేసిన స్వాములందరు వారి విరాళములను వెంటనే పంపించి మాయుద్యమమునకు తోడ్పడెదరుగాక యని మాప్రార్థన. (భాగవత విధేయులు, సంపాదక వర్గము)

# అఖిల చాత్తాద శ్రీ వైష్ణవ మహాసభ.

## కార్యదర్శి నివేదిక.

---

1940 సం॥ మార్చినెల 25,26 తేదీలలో విజయవాడ యందు ...ఐదవ అఖలభారత చాత్తాద శ్రీవైష్ణవ మహాసభ సమా...ము జరిపిన విషయమైన రిపోర్టు—

ఈసభకు సుమారు 200 ప్రతినిధులు హాజరైనారు. ముఖ్య ...గా మదాసు నైజాం రాజ్యము విశాఖపట్నం తూర్పు పశ్చిమ ...దావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు, జిల్లాలనుండి విజయము ...సు ప్రతినిధుల సంఖ్య 204.

1939 సం॥ డిశెంబరు మాసములో బెజవాడలో చాత్తాద శ్రీవైష్ణవులు సమావేశమై మహాసభ జరుపుటకు బెజవాడలో ...ర్చి 25,26 తేదీలలో ఐదవ అఖిల భారత మహాసభ జరుపుటకు ...శ్చయించడమైనది. అందులకు ఆహ్వాన సంఘమొకటి స్థాపించబడెను. ...దిగువ కనుపరచబడిన వారలు ఆహ్వాన సంఘసభ్యులుగా ఎన్ను...కబడిరి.

ఆహ్వాన సంఘాధ్యక్షులు:—

శ్రీమాన్ శ్రీ కూర్మం రంగనాధస్వామిగారు బిఏ. బియల్.

కార్యదర్శి:—

డా॥ డి. లక్ష్మణస్వామిగారు యల్. యమ్. పి.

సంయుక్త కార్యదర్శి:—

వై. శ్రీనివాసులుగారు

కోశాధికారి:—

...ల్లగట్ల సత్యనారాయణగారు

ఇంకా చాలమంది ప్రముఖులు ఆహ్వాన సంఘసభ్యులుగా ఎన్నుకొనబడిరి.

మహాసభకు అధ్యక్షులుగా శ్రీమాన్ ఎ. యస్. రంగ సామయ్యగారిని (శ్రీ పెరంబూరు) అధ్యక్షులుగా యేర్పాటు చేయడ మైనది.

ఈసభ జరుగు విషయమై 1000 కర పత్రములను అచ్చొ త్తించి అనేక పట్టణములకు గ్రామములకు పంపడమైనది. ఆహ్వాన సంఘపు మెంబర్లు కొన్ని గ్రామాంతరములకు స్వయముగా వెళ్ళి ప్రచారము గావించిరి. సదరు విజయనగరంనుండి వెలువడు సుదర్శన పత్రికయందు ప్రతినెల ప్రచురము చేయబడినది. ఆంధ్రపత్రిక కృష్ణాపత్రిక, ప్రజామిత్ర మొదలయిన వార్త పత్రికలలోను తెలియ జేయబడినది. సుదర్శన పత్రిక సంపాదకులు యిందులకు చాలా సహా యమొనర్చి మాకు అన్నివిధముల ప్రోత్సాహ పరచినారు ఈసభ కార్యక్రమమును 1000 కరపత్రములద్వారా, రెండువారముల మందుగానే తెలియజేయుడమైనది.

ఈసభ మ్యూజియమందు జరుపుటకు కృష్ణాజిల్లా బోర్డువారి అనుమతి పొందబడినది. అధ్యక్షులవారి ఛాయాపటములు 1000 అచ్చొత్తించి అనేకులకు పంపడమైనది. ఈసభకు వచ్చు ప్రతినిధులను వారివారికి ఏర్పరచి యున్న స్థలములకు పిలుచుకొని వచ్చుటకు రైలు వద్దకు కొందరు స్వచ్ఛంధ సేవకులను ఏర్పాటు చేయడమైనది.

ప్రతినిధులకు సభ్యులకు కట్టణములు యేర్పరచి సొమ్ము వసూలు చేయవలయునని సలహా యిచ్చినారు కాని ప్రస్తుతము మనవారి స్థితినిబట్టి రుసుములను నిర్ణయించబడలేదు. వచ్చినవారికి బసలు సాపాటులు మొదలగు సౌకర్యములను వుచితముగా చేయుటకు ఆహ్వాన సంఘమువారే పూనుకున్నారు. స్వేచ్ఛగా నొసగుబడిన విరాళముల మొత్తము రు 104-0-0

25-3-40 తే॥ ఉదయం 7 గంటలకు అధ్యక్షులను వారిబస ...డి బాండు వాయిద్యముతో మోటారు కారులో పూరేగించు మ్యూజియము హాలుకు వేంచేయింప జేసుకొనిరి.

మ్యూజియముద్వార మందలి సుదర్శన పతాకమును శ్రీమాన్ DR. T. పార్థసారథి గారివల్ల పతాకోత్సవము జరుపబడినది. ...స్థలమునకు చేరిన పిదప శ్రీమాన్ పండిత బుక్కపట్టణం రామా ...చార్యవారిచే దైవప్రార్థనము చేయబడి సభ ప్రారంభింపబడినది.

ఆహ్వాన సంఘాధ్యక్షులైన శ్రీమాన్ **యస్. రంగనాథ** ...స్వామి బి. ఏ. బి. యల్. గారు కృష్ణానదీ తీరముననున్న బెజవాడ ...పు పావిత్ర్యమును కొనియాడి, శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు ...తులుగారివలన బ్రాహ్మణజాతి చైతన్యమొందినదనియు అట్లే ...జాతులు చైతన్యమొందవలయుననియు చెప్పిరి. ప్రభుత్వమువారు ...వారల కొసగిన అర్ధజీతపు సహాయమువల్ల లాభమునుపొంద ...యునని చెప్పిరి పిమ్మట సభ్యులకు ఆహ్వానసంఘమువారి తరుపున ...హ్వానమొసంగిరి.

చతుర్థమహాసభకు అధ్యక్షత వహించిన శ్రీమాన్ **టి. పి. ...నవాళ్ల య్యస్వామిగారు** సభాప్రారంభోత్సవము జరుపుచ ..., ఆధ్యాత్మి, లౌకిక, సారస్వత పాండిత్యము ప్రకర్షితముగాగ, ...వారు విద్యయందు వెనుకబడియున్న సంగతియు విద్యావశ్య ...ము, మనలోని దురాచారములకు, మన అవమాన జీవితమునకు ...ణము విద్యలేమియే అనియు గీతాశ్లోకములద్వారా స్థిరపరచి, ...గడ జరుపబడిన 4 మహాసభలయొక్క చరిత్రమును దిగ్మాత్రముగ ...చించినారు. యువకులలో నేడు కలగిన ప్రబోధమున కుత్సాహ ...ము జూపుచు మనవారలలో విద్యాభివృద్ధికై తగు ధనము సేకరిం ...లయునని చెప్పిరి. యుక్తియుక్తమును, పాండిత్యపూరితములైన ... యుపన్యాసము సభాసదుల నాహ్లాదములుగ నొసర్చినది.

మహాసభకు తాము వేంచేయుటకు వీలులేక పోయినందులకు చింతిల్లుచు ఈసభ జయప్రదముగ జరుగవలయునని ఆశీర్వదించుచు ఈక్రింద కనుపర్చిన వారివద్దనుండి వచ్చిన తంతివార్తలు ఉత్తరములు సభలో వినిపించడమైనది.

శ్రీమాన్ చేవూరి చిరంజీవులుగారు
,, 2 చీ నంబిళ్లదాసుగారు.
,, 3 ఎ. అప్పలనరసింహాంగారు
,, 4 సి. టి. అయ్యాగారు.
,, 5 మోతుం శోభనాద్రిగారు.
,, 6 తంగనగరమ్ కన్నన్ గారు
,, 7 ఒరయూరు నారాయణయ్యగారు
,, 8 టి. రామానుజయ్యానూరిగారు
,, 9 భద్రగిరి లక్ష్మయ్యగారు.
శ్రీమాన్ 10 బి. నంబెరుమాళ్లగారు.
,, 11 ఎన్. వెంకటరమణయ్యగారు.
,, 12 జి. ఏ. వెంకటరామానుజయ్యగారు
,, 13 బి. నమ్మాళ్వారుగారు.
,, 14 తమిళవ్యాసము : చాత్తాద శ్రీవైష్ణవ సమాజం, ఆత్తూరు.
,, 15 ఆర్. రామస్వామయ్యగారు.
,, 16 ఎ. రామస్వామయ్యగారు.
,, 17 పి. శంగోపగోపయ్యగారు
,, 18 సి. తిరువాయిముజిపిళ్లైయిగారు
,, 19 బి. రామావతారము.

పిమ్మట సభాధ్యక్షులైన శ్రీమాన్ ఏ. యస్. రంగసామయ్య గారు తమ అధ్యక్షోపన్యాసము చదివిరి-ఆవుపన్యాసము వెనుక పొందుపరుపబడినది. తరువాత విషయ నిర్ధారణ సభకు (1) అధ్యక్షులు (2) ఆర్ ఆళవందారయ్యగారు (3) టి. పి. మనవాళ్లయ్యగారు (4) వి. ఆంజనేయులుగారు (5) ఎస్. రంగనాధస్వామిగారు (6) ఎల్. కె. వెంకటరామ్‌గారు (7) ఎస్. యతిరాజయ్యగారు (8) ఎల్. వెంకటనరసయ్యగారు (9) టి. భావనారాయణగారు (10) టి.వి. కొండయ్యసూరిగారు. (11) వి. టి. అయ్యలయ్యగారు.

25 తేదీ మధ్యాహ్నము 2 గంll. విషయ నిర్ణయ సభవారు సమావేశమై మహాసభలోనికి తేవలసిన తీర్మానములను చర్చించినారు. మధ్యాహ్నము 4 గంటలకు మహాసభ తిరుగ సమావేశమై

ఈదిగువ కనుపరచినవారు స్వసంఘాభివృద్ధి విషయముల నుప
చిరి.

(1) శ్రీమాన్ డి. రామానుజయ్యగారు బి.ఏ. ఏలూరు. (2) వెంకటనరసయ్యగారు. (3) యోగానందంగారు (4) వై. వాసులుగారు (5) టి. వి. కొండయ్యసూరిగారు (6) Dr. లక్ష్మణస్వామిగారు (7) టి. భావనారాయణగారు (8) టి.వి. య్యగారు.

26-3-40 తేదీ ఉదయం 8 గం॥ మహాసభ సమావేశమైనది. నిర్ధారణ సభవారు నిర్ణయించిన తీర్మానములన్నియు మహా చర్చింపబడినవి. అంగీకరింపబడిన తీర్మానములు వేరొకచోట పబడియున్నవి. అంగీకరింపబడిన తీర్మానములు అమలులో టకు యీదిగువ కనుపరచబడిన వారలను స్థాయిసమితి సభ్యు ఎన్నుకొనడమయినది.

(1) శ్రీమాన్ పరాంకుశం సుందరరామయ్యగారు-ప్రసిడెంటు.

(2) Dr. డి. లక్ష్మణస్వామిగారు-కార్యదర్శి.

(3) నకు ళాభరణం . ంజనేయులుగారు.

శ్రీమాన్ చేవూరు వెంకటచలం వురవు జీవులుగారు. తిరునగరి రామానుజయ్యగారు. తాళ్ళూరు రాయణస్వామిగారు. భద్రగిరి రామానతారంగారు శ్రీ భాష్యం రామానుజయ్యగారు. లంకా వెంకటనరసయ్యగారు. యస్. నాథస్వామిగారు.

భోజనాంతరము శ్రీమాన్ బుక్కపట్టణం రామానుజయ్య హరికథా కాలక్షేపముచేసి సభవారిని ఆనందింపజేసినారు. ంటలకు తిరుగ మహాసభ సమావేశమయినది.

విజయనగరం చాత్తాద శ్రీవైష్ణవ యువజనసమితి అధ్యక్షు శ్రీమాన్ ఎ. వి. రమణగారు వారిసమితి కార్యక్రమము

గురించియు సుదర్శన పత్రికా ప్రచారముగురించియు మాట్లాడిరి. వారిసమితి ఆశయము పెద్దలచే నిర్ణయింపబడిన మంచి ఆచారములను అనుసరించుటయేగాని యువకులు వారిష్టమొచ్చినట్లు ప్రవర్తించుట కాదని వక్కాణించిరి. ద్రావిడ వస్తువులు వాడుటలో అది మతసమ్మతమని ఋజువుచేసి బహిరంగముగా వాడుటయే మంచిదిగాని రహస్యముగా వాడుట అవమానకరమని ఋజువుచేసిరి. సుదర్శన పత్రిక నష్టముపై నడచుచున్నదిగాన అందరు సహాయము చేయవలసినది విన్నవించిరి.

అధ్యక్షులవారు వచ్చే మహాసభవరకు జరుగువరకు కార్యక్రమమును జరుపుటకు ఈదిగువ కనుపరచిన వారలను Working Committee members గా (కార్యనిర్వాహక సభ్యులుగా) నియమించి సభవారికి తెలియచేసినారు.

(1) శ్రీమాన్ పి. సుందరరామయ్యగారు,
(2) ,, బి రామావతారంగారు,
(3) ,, యస్. రంగనాధస్వామిగారు,
(4) ,, ఎచ్. దేవరాజయ్యగారు,
(5) ,, కె. వెంకటరామ్ గారు,
(6) ,, లంక వెంకటవరసయ్యగారు.

షష్టమ అఖలభారత చాత్తాద శ్రీవైష్ణవ మహాసభ జరుపుటకు శ్రీమాన్ పరాంకుశం సుందరరామయ్యా వారివల్ల ఆహ్వానింపబడి సభవారిచేత అంగీకరింపబడినది. ఈసభా కాలమున్నూ కార్యక్రమమున్నూ సుదర్శన పత్రికద్వారా తెలియజేయుడమవును. అధ్యక్షులు వారు తమ ముగింపు మాటలలో (Concluding remarks) ఆహ్వానసంఘమువారికిన్నీ సభ్యులకున్నూ ఈసభను విజయవంతము గావించినందుకు వందనోపచారముల తెలుపుచు, వైష్ణవులమనవారు పరస్పర మైత్రి భావముతో ప్రవర్తించుటయే కర్తవ్యమనియు

...యత, విరోధము మొదలగు గుణములుండిన వైష్ణవుడనిపించు ...కొనుట కర్హతలేదనియు, సర్వజీవులయందును ప్రేమకలిగి యుండ వలయుననియు తమకు విరోధులుండకూడదనియు, విరోధులను ప్రేమ పూర్వకముగా వశము చేసుకొనవలయుననియు, దురాచార నిర్మూ లనమునకు యువకులే యిందు ముందంజ వేయవలయుననియు ధర్మము ...సామాన్య విశేష దర్మములని రెండు విధములుగా నున్నవనియునన్నా ...ములను తెలియపరచి మనవార్లకు దైవభక్తియు, స్వరూపజ్ఞా ...కలిగినయెడల ఆత్మగుణములు తమంతట తామే వృద్ధిపొందు ...ము సంఘదురాచారములు రూపుమాపుటలో స్వరూపగ్రింథ ...నము అత్యావశ్యమని చెప్పి సభ ముగింపజేసిరి.

తరువాత కార్యదర్శియైన శ్రీమాన్ Dr. లక్ష్మణస్వామిగారు ...ధ్యక్షులకున్నూ ఆహ్వానసంఘాధ్యక్షులకున్నూ శ్రీమాన్ టి. పి. ...నవాళ్ళు య్యగారికిన్ని, Dr. టి. పార్థసారథి గారికిన్నీ తమయొక్క ...సుప్రియాసల నెంచక చాలాదూరమునుంచి ఈసభకు వేంచేసిన ...సభ్యులందరికిన్నీ, వచ్చినవారలకెల్ల సాపాటు, ఫలహారముల నొసగిన ...స్వాగత సంఘ సభ్యులకున్నూ, సభ జరుపుటకు స్థలమొసంగిన జిల్లా ...బోర్డు ప్రెసిడెంటువారికిన్నీ వందనోపహారములు తెలియపర్చుకొనిరి. ...పిమ్మట ఛాయాపటము తీసుకొనబడి సభ ముగింపబడినది.

దాస్యం లక్ష్మణస్వామి,
కార్యదర్శి.

# తీర్మానములు.

---

1940 సం॥రం మార్చి 25, 26 తారీఖులలో విజయవాడ మ్యూజియమ్ హాలులో సమావేశమైన ఐదవ అఖిలభారత చాత్తాద శ్రీవైష్ణవ మహాసభయందు అంగీకరింపబడిన తీర్మానములు.

1. ప్రభుత్వమువారికి ఈమహాసభవారు తమ భక్తివిశ్వాసములను తెల్పుకొనుచున్నారు.

2. ఈ మహాసభవారు మన రాజధానికి గవర్నరుగా క్రొత్తగా విజయముచేసిన సర్. ఆర్థర్ హోపు దొరవారికి స్వాగత మొసంగుచూ వారి పరిపాలనలో మనవారి ఔన్నత్యమునకు తోడ్పడెదరని విశ్వసించుచున్నాము.

3. ప్రస్తుతము జర్మనీవారికిన్నీ మన ప్రభుత్వము వారికిన్నీ జరుగుచున్న యుద్ధమందు మన ప్రభుత్వమువారు విజయమొందెదరు గాక.

4. చాత్తాద శ్రీవైష్ణవులను విద్యలో వెనుకపడిన జాతుల వారి లిష్టులో జేర్చినందులకు ప్రభుత్వమువారికిన్నీ విద్యాధికారులకున్నీ ఈసభవారు కృతజ్ఞతను వందన పూర్వకముగా తెలియజేయుచున్నారు.

ఈ పైతీర్మానము సభ అద్యక్షులవలన ఉపపాదించబడి, సర్వజనాంగీకృతమైనవి.

5. ఈదిగువ నుదహరించినవారి అకాలమరణమునకు, సభవారు తమ సంఘమునకు కలిగిన విచారమును తెలుపుచూ వారి కుటుంబముల వార్లకు తమ సానుభూతిని తెలుపుకొనుచున్నారు.

1. శ్రీమాన్ ఆసూరి కాంతయ్య సూరిగారు, బి. యే. కృష్ణాజిల్లా రిజిష్ట్రారుగారు

3. ,, త్రిదండం జియ్యరుసూరిగారు బి. యే,
తహసీలుదారుగారు.

4. ,, చదరంగపట్నం శ్రీనివాసయ్యగారు.

6. చాత్తాద శ్రీవైష్ణవుల దారిద్ర్యమువల్ల వారిలో ఉన్నత విద్య బడసినవారి సంఖ్యయు, ఉద్యోగములో నుండువారి సంఖ్యయు చాలా తక్కువగా ఉన్నందున, విద్యాభివృద్ధికిని, వున్నత వుద్యోగములు పొందుటకు ప్రభుత్వమువారిని సహాయం చేయువలయునని యీ సభవారు ప్రార్థించుచున్నారు.

ఉ=శ్రీ॥ రా॥ ఆళ్వందారయ్యగారు.

ఆ=శ్రీ॥ టి॥ పి॥ మనవాళ్లయ్యగారు.

తీర్మానము ఏకగ్రీవముగా అంగీకరింపబడినది

7. చాత్తాద శ్రీవైష్ణవులలో నుండు, మూడు తెగలవారలలో భేదములేక పంక్తి భోజనములు, వివాహములు చేయుటవల్ల ఏకమత్యము, పరస్పరానురాగము వృద్ధియగుటకు హేతువగునని యీ సభవారు సిఫారసు చేయుచున్నారు.

ఉ॥ శ్రీ॥ టి॥ పి॥ మనవాళ్ళయ్యగారు

ఆ॥ శ్రీ॥ బు॥ రామానుజయ్యగారు.

సవరణ:— (ఎ) వివాహమనే పదమును తీసివేయువలెను.

ఉ॥ శ్రీ॥ రా॥ ఆళ్వాందరయ్యగారు

ఆ॥ వి॥ టి॥ అయ్యలయ్యగారు.

యీ సవరణ సభవారివల్ల అంగీకరింపబడనందున త్రోసి వేయబడినది.

(బి) తెగలయొక్క వివరము, ఏకాక్షరి, చతురాక్షరి, అష్టాక్షరీ యని సూచించవలసినది.

ఉ॥ శ్రీ॥ ప॥ సుందరరామయ్యగారు

ఆ॥ శ్రీ॥ యస్॥ యతిరామానుజసూరిగారు.

యీ సవరణ అంగీకరింపబడి, యీ సవరణతో మొదటి తీర్మానము యేకగ్రీవముగా వొప్పుకొనబడినది.

8. చాత్తాద శ్రీవైష్ణవులకు కొన్ని దివ్య దేశములలో అనగా శ్రీరంగము, శ్రీ విల్లిబుత్తూరు, తిరుకోట్టియ్యూర్ మొదలగు సన్నిధులయందు, కొన్ని విశేష మర్యాదలు అనగా అధ్యాపకము, పిన్నడిసేవ యుండుటవల్ల మనవారల కొందరిని, అధ్యాపకులుగా తయారుచేయుటవశ్యమనియు అందుకొరకు ప్రత్యేక నిధి యేర్పరచి, అధ్యాపకము నేర్చుకొనువారికి, ద్రవ్యసహాయము చేయుట వశ్యమని, యీ సభవారు తీర్మానించుచున్నారు.

ఉ॥ శ్రీ॥ వి. టి. అయ్యలయ్మగారు

ఆ॥ శ్రీ॥ రా. ఆళ్వందారయ్యగారు

ఏకగ్రీవముగా నామోదించబడినది.

9. సాంఘిక అభివృద్ధికొరకు విజయనగరపు చాత్తాద శ్రీవైష్ణవ యువజన సంఘమువారు చేయుచున్న పనిని యీ సభవారు శ్లాఘించుచున్నారు.

ఉ॥ శ్రీ॥ కె. వెంకటరామ్‌గారు

ఆ॥ శ్రీ॥ యస్. యతిరామానుజసూరిగారు.

అంగీకరింపబడినది.

10. చాత్తాద శ్రీవైష్ణవులందరును సుదర్శనం పత్రికకు చందాదారులుగా చేరి ఆపత్రిక గడచిన రెండు సం॥గాచేయుచున్న మంచి పనికి సహాయము చేయవలయునని కోరుచూ సంఘోన్నతి కొరకు శ్రద్ధతో పాటుపడుచున్న ఈ పత్రికా సంపాదకులగు శ్రీ భద్రాచలం రామావతారం గారికి ఈ సభవారు తమ వందనము లర్పించుచున్నారు.

11. 1940 మార్చినెల 5వ తేదీని వెలువడిన ఫోర్టు సెంటు జార్జి గెజెట్టు 1 బి. భాగములో 214వ పుటలో విద్యాలో వెనుకబడిన

...తులవారి పట్టికలో కనుపరచియుండును చాత్తాది (చిత్తాదివైష్ణవ
...సహా) అన్న పదములకు బదులుగా చాత్తాద శ్రీవైష్ణవులు
...పదములను వుంచవలయునని (డైరక్టరు ఆఫ్ పబ్లికు యర్స్ట్రి
...వారిని కోరుటకును) లోగడ మదార్సు గవర్నమెంటువారు తమ
... నెం॥　　తా॥　　గల ఆర్డరులో పై నామ
...అంగీకరించి యున్నందునను 1921 సం॥ జనాభా లెఖ్ఖలలో
...చాత్తాద శ్రీవైష్ణవులను పేరుతో దాఖలుచేయబడుయుం
...చేతను యీ చాత్తాద శ్రీవైష్ణవుల నానామమునే కనుపర్చవల
...యీ సభవారు కోరుచున్నారు.

ఉ॥ శ్రీ॥ ఏ. వి. రమణగారు

ఆ॥ శ్రీ॥ టి. భావన్నారాయణగారు.

అంగీకరింపబడినది.

12. రాబోవు 1941వ స॥ జనాభాలెఖ్ఖలలో చాత్తాద
...వైష్ణవులు అను పేరుతో మనవారందును వ్రాయుంచవలసినదనిన్నీ
...దరి అవివేకులవలన వాడబడు సాతాని దాసరి లేక తాదర్ మొద
...గల పేర్లను వాడుట యుక్తముకారని తెల్పుచూ యీ సభ
...యీవిషయమై ప్రతి గ్రామములోనుండు మనవారెల్లరిని
...ప్రచారముచేసి తెలుపవలెనని మనవారిని కోరుచున్నాము.

షరా:—(ఈచాత్తాద శ్రీవైష్ణవులు అను పదమును మనము
...కొను విషయమై యిదివరకే గవర్నమెంటువారివల్ల అంగీకరింప
...యున్నది.)

13. ప్రతి జిల్లాలోనున్నా చాత్తాద శ్రీవైష్ణవ సమాజ
...కటి యేర్పరచి, చందాలు, విరాళములు మూలముగా ధనమును
...గుచేసి మనవారి బాలుర, వున్నత విద్యాభివృద్ధికి తగు సహాయము
...యవలయునని యీ సభవారు తీర్మానించుచున్నారు.

14. మహాసభల మధ్యకాలమందు, జిల్లా సంఘములు కూడ వలయునని ఈసభవారుసిఫారసు చేయుచున్నారు.-

15. ఆంధ్రదేశమందు సుదర్శన పత్రిక చేయుచుండు మా చిపని చొప్పున ద్రావిడ జిల్లాలు, మైసూరు, హైదరాబాదు ప్రాం తములందు ప్రచారము చేయుటకు, ఆంగ్ల ద్రావిడ, కన్నడ భాషల యందు 'పాంచజన్యము'అను పేర వొక పార్శ్వపత్రిక వెలువడీవ చేయుట వుచితమని యీ సభవారు తీర్మానించుచున్నారు.

16. మనవారెల్లరుకును ముఖ్యముగా చాలా బాలికలకు స్వరూప విద్య నేర్పించుట ముఖ్యావశ్యకమని యీ సభవారు తీర్మా నించుచున్నారు.

17. శ్రీమాన్ ఎ. ఎస్. రంగస్వామయ్యగారు మన జాత్య భివృద్ధి కొరకు చాల సంవత్సరములనుండి చూపుచున్న అమితోత్సా హమునకును చేసిన సేవకును హర్షించుచు ఈసభవారు వారికి 'కులభూషణ'అను బిరుదము నొసంగుటకు తీర్మానించుచున్నారు.

18. ఈమహాసభ జరుపుటకు ముజియములును వొసంగి నందుకు యీ సభవారు కృష్ణా జిల్లాబోర్డు ప్రెసిడెంటువారికి తమ అభివందనముల నర్పించుచున్నారు.

19. యీపై వుదహరించిన తీర్మానములను, దీనికి సం బంధించినవారలకు, పంపుటకును, ఆవిషమై అవసరమైనపుడు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుటకును యీ సభవారు ఆహ్వానసంఘ కార్య దర్శియగు శ్రీమాన్ డా॥ డి. లక్ష్మణస్వామిగారు యల్. యమ్. పి వారి అధికారమిచ్చుచున్నారు.

20. ఆరవ అఖిలభారత చాత్తాద, శ్రీవైష్ణవ మహాసభ రాజమహేంద్రవరం నందు జరిపించుటకు శ్రీమాన్ పరాంకుశం సుందరరామయ్యగారివల్ల ఆహ్వానింపబడి, సభవారివల్ల నంగీకరింప బడినది.

# RECEIPTS & EXPENDITURES.

| | | | |
|---|---|---|---|
| Nollaghatla Rangaiah garu, Mopidevi. | 262 | 7 | 6 |
| Lanka Venkatanarasaiah guru | 1 | 0 | 0 |
| Sreeman S. Ethiramanujaih guru | 3 | 0 | 0 |
| ,, S. Venkaiah garu | 1 | 0 | 0 |
| ,, Vedantham Lakshmaiah garu | 1 | 0 | 0 |
| ,, S Seenaiah garu | 2 | 0 | 0 |
| ,, Katiambakam Thiruvengalaiah garu, | 5 | 0 | 0 |
| ,, Parmkusam Snndararamiah garu | 10 | 0 | 0 |
| ,, Vakulabharanam Anjenulu garu | 2 | 0 | 0 |
| ,, Thalluri Narayanaswami garu | 2 | 0 | 0 |
| ,, Thinavaraparti Thimmengaliah garu | 2 | 0 | 0 |
| ,, Manavalliah garu | 1 | 0 | 0 |
| ,, K. Thotaoraiah garu | 1 | 0 | 0 |
| ,, A] V Ramana garu | 2 | 0 | 0 |
| ,, Dr. C. Ramanujaiah garu | 5 | 0 | 0 |
| ,, Bukkapatnam Ramanujaiah garu | 2 | 0 | 0 |
| ,, Dasyam Venkataramanujaiah garu | 2 | 0 | 0 |
| ,, Koneti Venkatram garu, | 1 | 0 | 0 |
| ,, S. Ranganadhaswamy garu | 5 | 0 | 0 |
| ,, S. Namberumalaiah garu | 1 | 0 | 0 |
| ,, Thirunaghari Bhashyakarlu garu | 1 | 0 | 0 |
| ,, R. Jagannadhaswami garu | 1 | 0 | 0 |
| ,, K. V. Narasimharao garu | 2 | 0 | 0 |
| ,, R. V. Narasimham garu, | 2 | 0 | 0 |
| ,, V. E. Thiruvengadam garu | 0 | 8 | 0 |
| ,, A. Ramanujaiah garu | 1 | 0 | 0 |
| ,, Bhadragiri Rammurti garu | 2 | 0 | 0 |
| ,, ,, Namberumallu garu, B. A., L. T. | 2 | 0 | 0 |
| ,, ,, Jagannadham garu, | 1 | 0 | 0 |
| ,, ,, Rajagopalam garu, | 1 | 0 | 0 |
| ,, Alagham Appalanarasimham garu, | 2 | 0 | 0 |
| ,, Velampudi Sobhanadri garu, | 1 | 0 | 0 |
| ,, Kanduri Lakshmaiah garu, | 3 | 0 | 0 |
| ,, S. V. Raghapataiyang aru, | 1 | 0 | 0 |
| ,, M. Radhakrishnamurti garu, | 1 | 0 | 0 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 36. | „ | A. V. Ramana garu, | 1 | 0 | 0 |
| 37. | „ | Bhadragiri Sriramamisrulu garu, | 2 | 0 | 0 |
| 38. | „ | Dasyam Nammalvaru garu, | 1 | 0 | 0 |
| 39. | „ | Janardhanam Balaramaswami garu | 1 | 0 | 0 |
| 40 | „ | Gona Kandayya garu. | 1 | 0 | 0 |
| 41 | „ | Bhadragiri Ramavataram garu, | 5 | 0 | 0 |
| 42 | „ | Y. Sreenivasulu garu, | 1 | 0 | 0 |
| 43 | „ | R. Appalanarasiah garu, | 3 | 0 | 0 |
| 44 | „ | Sheshavamatam Sheshaiah garu, | 1 | 0 | 0 |
| 45 | „ | T. V. Sheshaiah garu, | 1 | 0 | 0 |
| 46 | „ | C. M. N. Sampathaiah garu | 5 | 0 | 0 |
| 47 | „ | K Thiruvengalaiah garu | 10 | 0 | 0 |
| 41 | „ | Santhanam Venugopalaiah garu, | 2 | 8 | 0 |
| | | Collections Total ... | 366 | 15 | 0 |

## EXPEDITURE.

| | | | | |
|---|---|---|---|---|
| Tiffins and Meals ... | ... | 197 | 10 | 0 |
| Printing Charges ... | ... | 25 | 0 | 0 |
| Photos ... | ... | 20 | 0 | 0 |
| Travelling Expenditure for Propaganda Work, cooles etc. ... | ... | 49 | 8 | 0 |
| Postal Charges ... | ... | 30 | 14 | 3 |
| Decorations ... | ... | 10 | 15 | 3 |
| Electric current cha:ges ... | ... | 10 | 0 | 0 |
| Miscellaneous ... | ... | 23 | 0 | 0 |
| Total ... | | 396 | 15 | 6 |

---

# సుదర్శనం

మాసపత్రిక.

ుటము 3 ) జూన్,—1940 ( సంచిక 1.

## he all India Chathada Srivaishnava Fifth Conference Held at Bezwada on 25th & 26th March-1940.



he members of the Sri Vaishnavas Chathada,
ssembled at the Fifth Conference, Bezwada,
ffer their united prayers for the Allies, Victory,
n the present great war in the far West with glory,
nabling the British Nation to rule long.
utting down horrors of Hitlerism ere long,
ay, extend their hearty welcome to H. E. Sir Arthur
Hope
s the Governor of Madras and confidently hope,
hat their interests with sympathy will he safeguard,
s they are financially poor and educationally backward
y leading them from perpetual poverty to power,
iewing their microscopic minority in grades higher;
nd also thank the Director of Public Instruction,
r including them in the list of backward section.

T. P. Manavaliah.

# లెమ్ము సోదరా !

దావ్యం నమ్మాళ్వారు,
విజయనగరం.

సీ॥ అడియేను దాసోహ మనెడి శిష్యులులేరె ?
సంశయవిచ్ఛేద సరణిలేదె ?
నిజజ్ఞాన భక్తుల నిజశాంతి మార్గాన
తరియింపజేసెడి గురులులేరె ?
పన్నిద్దరాళ్వార్ల భక్తి ప్రపత్తుల
బోధించినట్టి సుబోధలేవి ?
సర్వమానవ ప్రేమ శాంతి తేజంబులు
పాండితీ ప్రతిభయు బాసెనొక్కొ ?.

గీ॥ ఆత్మపరిశుద్ధ ముక్తి ప్రదాదులందు
భారతావనిమిన్న ప్రపంచమునకు
అందు చాత్తాద శ్రీవైష్ణవనెడి మతము
సంఘ సంస్కార పూరిత శాంతిసుమము.

గీ॥ శాంతికలదో ? సంఘ సంస్కారమేది?
భక్తిజ్ఞానాదులెచ్చట? భక్తులెచట ?
మంచి గుణముల బోధించు మాన్యులెవరు ?
ఏల నిస్పృహ జెందెదు బేలపగిది

గీ॥ భయద సంఘ దురాచార ప్రాభవంబు
ఛేదమొనరించ చక్రంబు; లేదుభయము
లెమ్ము యువజన సోదరా లెమ్మికనుము
సభ్యత్వమొంది యశమ్ముగొనుము.

తల్లి:— 'ఇంగ్లీషా' తెలుగా!

'ఇగ్లీషు నేర్పించిన నేర్చుకొనెదను. తెలుగు నాకొకరు చెప్పనవ లేదు గదా!'

'నేయిష్టాను సారముగా కానియ్యి తల్లీ.

* * *

అమ్మాయికి ఇంటర్ మీడియట్ ప్యాసైన మేనత్త కొడుకొకడు అతడు బ్రహ్మచారి ఎంతమంది యెన్నిచెప్పినను వివాహము లేదు.

అతని యుద్దేశము లెట్టివో......................

ఈమె ఆతనిని తనకు యింగ్లీషుచెప్పమని అడుగగా ఆతడు దానికి నెను ఇంగ్లీషు మొదటినుండి మొదలుపెట్టి చెప్ప మొదలిడెను. యందుండెడి మక్కువనుబట్టి ఆమెకు చదువుత్వరగా నలవడుచుండెను. గురువుగారికి ఒక రోజున జ్వరము వచ్చినది అది తీవ్రరూపమును నది.

జబ్బు ఒకరోజుకొక రోజు హెచ్చుటయేగాని తగ్గు ముఖములేదు. ఒకరోజున శిష్యురాలు గురువుగారికి ప్రక్క మీధకూర్చొని శుశ్రూష చుండెను.

గురువు, శిష్యురాలుని నోరార 'జయ' అనిపిలిచి కండ్లుమూసు

తలుపు వేసిన చప్పుడు......................

—

## దురాచార నిరసనము,

చేవూరు చిర: జీవులు దాసుడు
విజయనగరం.

చాత్తాద శ్రీవైష్ణవ స్వాములారా !

వామాచారులగు వైష్ణవ వేషధారులు, స్వాతిక ధర్మశాస్త్రములకును యుక్తముకాని అధర్మ ప్రవర్తనకును విపరీతార్థములు చెప్పి అమాయకులను మోహింపజేసి మోసపుచ్చి తమ తుచ్ఛపు కోర్కెలను తీర్చుకుంటున్నారు.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్స్వనుష్ఠితాత్
స్వధర్మేనిధనం శ్రేయః పరధర్మో భయావహః

తా॥ బాగుగా నాచరింపబడిన పరధర్మముకన్న గుణహీనమైన తన ధర్మము మిక్కిలి మంచిది. ఏలన, తన ధర్మము ననుసరించి నడుచుటలో మరణము తటస్థించినను మేలు. పరధర్మము నరకాది రూపమగు భయమును కలుగజేయును.

ఈ శ్లోకము నాధారముగా దీసుకొని వామాచార పరులు తాత నుండి వచ్చిన అంటు జాడ్యములవంటి దురాచారములను స్వధర్మమని చెప్పుచున్నారు.

భగవద్వచనమునకు సహార్థము చెప్పి ఆస్తిక నాస్తికుడు నరకమననుభవించును. పూర్వికులనగా నెవరు? నిన్న మొన్న చనిపోయిన తల్లి తండ్రులా? లేక పరమాత్మ అంశమైన బ్రహ్మసృష్ట్యాదినుండి యున్న మహర్షులును, ఆళ్వారాదులున్నూ పరమాచార్యులునా?

శ్లో॥ మహర్షి యస్సప్తపూర్వే చత్వారోమనవస్తథా
మద్భావా మానసాజాతా యేషాంలోక ఇమాః ప్రజాః

తా॥ భృగువు మొదలైన సప్తర్షులును వారికంటె పూర్వులైన సనకసనందాది యోగులును నాఅంశలై సంకల్పమాత్రమున పుట్టిరి. లోకమందలి ప్రజలందరు వారివలన బుట్టిరి.

కాబట్టి గురుపరంపరనుబట్టి చూస్తే వసిష్ట వ్యాస శుకవామదేవ
త్రయాది మహర్షులును, తండ్రివంశ పరంపరనుబట్టి చూస్తే బ్రహ్మ
సనకాది ఋషులును మన్వాది తపోనిధులును మనకు పూర్వఋషు
న్నారు. మనుశబ్దముయొక్క అపత్యము మీాది తద్ధితమే మానవ
కనుక గురు పరంపరను బట్టిచూచిన సత్యధర్మ తపోనిష్టులుగానే
వలెను లేక వంశపరంపరగా చూచినను బ్రహ్మచర్య అహింస
ధ్యాన నిష్టాద్యనుష్టానములతో నుండవలయునేగాని వేదభ్రష్టులు
ృతులయిన నేటి గురువులనే ప్రమాణముగా తీసుకోకూడదు.
వేదాంత డంబాచార వైష్ణవ వేషధారుల నడవడివల్ల నితర
కొందరు పరమపావనమగు ద్రవిడ వేదమునూ, ఆళ్వారులను,
ష్ణవులను గూడ దూషించుచున్నారు. లోసులు నేటి మన నడతను
మతమునకు నీచారోపణచేయుదురేకాని ద్రవిడ వేదమందలి
మును పరిశీలించు శక్తిని కలిగియుండరు. మన నడతలవలన మన
నకును ఆళ్వారాచార్యులకును తగిన శిష్యులమని వన్నె తేవలయునే
రి కీర్తిని పావిత్ర్యమును కించపరచకూడదు.

పేదరికమున యాచనవలన జీవించు నొకానొకనికి అదృష్టవశమువలన
మంతుడైన కుమారుడు జన్మించినచో పూర్వాచారమను నెప
వానిని ధనహీనునిగావించి యాచనవృత్తిని ప్రవేశపెట్టుట యాదర
కాదుకదా? గుడ్డివానికి సలక్షణమైన పుత్రుడు జన్మించినచో
చారమును పేరుతో వాని గుడ్లు పెకిలించజాలముకదా! విద్యా
వంశమున మహాపండితుడైన పుత్రుడు జన్మించుట పూర్వాచార
విరుద్ధమని చెప్పలేముకదా! తాతలనుండి దొంగతనమునే యాచా
గలవానిని ధనాపహారణకై శిక్షింపక విడువలేముకదా! అట్లే
లికమైన లోటుపాట్లను గాని క్రొత్తగా ప్రవేశించిన దురాచార
గాని, పూర్వాచారమనుట తగదు.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మోవిగుణః అను పూర్వోదాహృత శ్లోకము నను అనేకులు వారిమనః పరిపాకము ననుసరించి యర్థము చెప్పెదరు స్వధర్మమనగా బ్రహ్మచారిగా నుండునపుడు, గురుశుశ్రూష వేదాధ్యయనము బ్రహ్మచర్యము భిక్షాహారము స్వధర్మమగును గృహస్తునకు అగ్నిహోత్రాది పంచయజ్ఞములు, ఋతుకాలమున భార్యాసంగమము, నిత్యనైమిత్తికాది కర్మలుచేయుట స్వధర్మమగును. మరియు వానప్రస్థాశ్రమమున చేయుకర్మలు గృహస్థాశ్రమ ధర్మములకంటె భిన్నమైనవి. వారికి అది స్వధర్మమగును సన్యాసాశ్రమమును స్వీకరించునపుడు నింతవరకు అనుష్ఠించిన మూడు ఆశ్రమములలోగల సకలకర్మములను పరిత్యజించి భిక్షాహారము చేసుకొనుటబ్రహ్మనిష్ఠ మొదలగునవి సన్యాసికి స్వధర్మమగును. ఒకసమయమున ఒక కర్మచేయుటయు మరియొకసమయమున అదే కర్మత్యజించుటయు తటస్థించును కాన స్వధర్మమనగా, ఎవరెవరేయే స్థితియిందుందురో వారు దానిననుసరించి, చేయవలసిన పనిచేయుటలో ప్రాణము పోయినను దృఢబుద్ధి కలిగియుండుట మోక్షదాయకమని తాత్పర్యము.,

## వైష్ణవ భక్తుల ధర్మము.

శ్లో॥ సర్వభూతేషుకారుణ్యం ప్రియభాషణమేవచ।
సర్వభూతహితేశ్రద్ధా సాక్షాత్ భక్తః హంరేస్మృతా॥

తా॥ పరమపురుషుని యందలి నిజమైనభక్తి యేదనిన, సమస్త భూతములందును కారుణ్యమును, అందరియందును ప్రేమయు సర్వభూతమైయుండుటలో శ్రద్ధయు అన్నిజీవరాసులయందు నీశ్వరుని చూచుటయు నదే సరియైన భక్తియనబడును.

వైష్ణవ ధర్మశాస్త్రములన్నియు, భూతదయ జీవకారుణ్యముల సత్యమును బోధించుచుండగా నీడంబాచార వైష్ణవగురువుల క్రూరకృత్యముల కెంతమాత్రమాధారములేదు"

శ్లో॥ ప్రవృత్తించ నివృత్తించ జనావిదురాసురాః।
నశౌచం నాపిచాచారో నసత్యంతేషువిద్యతే॥

తా॥ అసుర జన్మగలవారు ప్రవృత్తి ధర్మమును అనగా ఐహికఫల సాధనమగు కర్మమునుగాని, నివృత్తిధర్మమును అనగా మోక్షదాయకమైన కర్మమునుగాని ఎఱుగరు. వారికి వైదిక కర్మలయందర్హతలేదు. ఆచారములేదు దానికి హేతువగు సత్యములేదు. శీలములేదు అని చెప్పబడినది.

'పరధర్మోభయావహః' అనుటచే స్వరూపవిరుద్ధమైన అసురప్రకృతి భయమును కలిగిస్తున్నది. అని అభిప్రాయము. మరియు స్వస్వధర్మః స్వధర్మ స్వశబ్దము ఆత్మను నిరూపిస్తున్నది. ఆత్మకు బంధకరమగుపని అనగా స్వరూప విరుద్ధమైన పనిని ప్రాణము పోయినను చేయరాదని భావము ఆత్మానురూపసిద్ధిని పొందుటలో ప్రాణముపోయినను మంగళకరము.

---

## కృష్ణ సంప్రార్థనము.

ఎ. కె. రాయకవి.
విజయనగరము.

మునిముచ్చుఁ దనముచేతను గొల్లయిల్లాండ్రి
వెన్నలఁ దినినట్టి వీరుఁడెవఁడు?
సన్యస్తహృదయ సంసర్గ నిర్భరతరో
ద్ధృతిఁ హరించెడి ధీరుఁడెవఁడు?
అరిమురిలేకుఁడ చిరుత పాలియమునందె
పూతన జంపిన పుణ్యుఁడెవఁడు?
సరసవిదగ్ధ భాషాపాండిమముచేతఁ
గీతవ్రాసినయట్టి కీర్తియెవఁడు?
కంసనరకాదిదైత్య నిహింసన ప్ర
థిత భుజాధామనిలయుఁడ డెవ్వఁడట్టి
శౌరి రాధాంతరంగాంబుజాత మధుపుఁ
డఖిల సుజనావళీనుతుఁ డరయుమమ్మ

---

# చాత్తాద శ్రీవైష్ణవ నిత్యానుష్ఠానములు.

శేషవమరం శేషయ్య,
మోటుమర్రి.

ప్రతిదినము బ్రాహ్మ్యముహూర్తమున మేలుకొని గురుపరంపరా పూర్వకముగ-ద్వయము-తిరుపల్లి-యచ్చి-మొదలగు పాశురాను సంధానము జేయవలయును. తదుపరి జలమల విసర్జన-దంతధావనాది స్నానక్రియ లాచరించవలయును. లేనిచో జపహోమ నిత్యనైమిత్తికాది సత్కర్మ లొనరించుటకు యోగ్యుడుకాడు. కాన-స్నానము జేయుతరి (తిస్రకోట్యో ర్ధకోటీచ తీర్థాని భువనత్రయే వైష్ణవాంఘ్రిజైర్వ్యాప్యాత్. కోటిశా గేన నోసమమ్. అను ప్రమాణాను సారముగా భగవద్భాగవతాచార్య శ్రీపాద తీర్థమని భావించి శిరస్సున ప్రోక్షించుకొని శ్రీమద్భగవద్భాగవత సంశ్లేషమున కనుగుణమున స్నానమాచరించెదనని దలచి రామానుజ చతు శ్లోకాను సంధానముతో స్నానముచేసి ధౌత (మడివస్త్రములను) ధరించి శుద్ధపాత్రిమందుగల తీర్థముచే ఉత్తరవాక్యాను సంధానముగ స్థలశుద్ధిజేసి శుద్ధమగు పీటపైన తిరుమణి పెట్టెనుంచి శుద్ధాసనముపై కూర్చొని హస్త ప్రక్షాళనముజేసికొని తిరుమణికోపును వామహస్తమందుంచి శ్రీభూదేవ్యై నమః. అని అభిమంత్రించి తీర్థముచే సవ్యముగ దక్షిణ హస్తములో, అ[illegible] గదీసి అద్దములో లలాటమును జూచుకొనుచు నఖములచేదప్ప [illegible]ళీయములతోగాని స్వర్ణ-రజిత-తులసీ కాష్టాదులచే జేయబడిన పుల్లల గాని లలాటాదిద్వాదశ స్థానములయందు సుస్పష్టముగ మిక్కిలి మనో హరముగ ఊర్ధ్వపుండ్రము శ్రీహరి చరణద్వయాకృతిగ తిరుమణి ధరించి మధ్య (నీలతో యదమధ్యస్థా విద్యుల్లేఖేవ భాస్వరా) యనునటుల లక్ష్మీ స్వరూపమైన శ్రీచూర్ణమును ధరించి. (లలాటే కేశవంధ్యాయే కుక్షౌ నారా యణస్తథా వక్షస్థలే మాధవంచ గోవిందం కంఠకోపరే! విష్ణుంచ దక్షిణే కుక్షౌ-బాహౌచ మధుసూదనమ్-త్రివిక్రమమ్ స్కంధదేశే వామనం వామపార్శ్వకే శ్రీధరమ్. వామబాహౌచ హృషీకేశమ్ తథాకంఠేపృష్ఠే

ద్మనాభంచ. త్రికేదామోదర స్తథా। తత్ప్రక్షాళనతోయేన వాసుదేవేన
ార్జనమ్.

శ్రీ దేవీప్రథమమ్ రామః। ద్వతీయమ్ అమృతోద్భవమ్।
తృతీయమ్ కమలా ప్రోక్తా చతుర్థీ శాంతి శోభీనీ పంచమీ
విష్ణుపత్నీచ షష్టికే వైష్ణవీతథా। సప్తమమ్ వరారోహి
అష్టమీ ప్రియవల్లభీనవమీ శార్ఙ్గపాణీచ దశమీ దేవదేవనీ।
ఏకాదశ మహాలక్ష్మీ ద్వాదశీ లోకసుందరీ శ్రీచూర్ణం।
ధారయేన్నిత్యం వైష్ణవాస్యతతం దరేత్॥ (అసిగాని)

లక్ష్మీనాథ సమారంభామ్నాథయామునమధ్యమామ్
అస్మదాచార్య పర్యంతామ్ వందేగురుపరంపరామ్॥

యనునటుల పెరుమాళ్ళు మొదలుకొని స్వాచార్యులవరకుగల తని
అను సంధించి ద్వాదశ స్థానములందు అంజలిజేశి స్వాచార్యులచే
బోధింపబడిన శ్లోక గురు పరంపరయు.

శ్లో॥ అస్మద్దేశికమస్మదీయ పరమాచార్యాన్ అశేషాన్ గురూన్
లక్ష్మణ యోగిపుంగవ మహాపూర్ణే మునిమ్ యామునమ్ రామమ్।
పద్మలోచనమ్ మునివరమ్ శఠద్వేషిణమ్ సేనేశంశ్రియ మిందిరా సహ
నారాయణమ్ సంశ్రయే॥

మరియు వాక్య గురు పరంపర (౧) అస్మద్గురుభ్యోన్నమః (౨)
పరమగురుభ్యో నమః (౩) అస్మత్ సర్వగురుభ్యోన్నమః (౪)
రామానుజాయనమః (౫) శ్రీపరాంకుశదాసాయనమః (౬) శ్రీ
యామునమునయేనమః (౭) శ్రీరామమిశ్రాయనమః (౮) శ్రీపుండరీ
కాక్షాయనమః (౯) శ్రీమన్నాథమునయేనమః (౧౦) శ్రీమతే శఠకోపా
యనమః (౧౧) శ్రీమతే విష్వక్సేనాయనమః (౧౨) శ్రియైనమః

౧౩ శ్రీధరాయనమః॥ తిరుమంత్రము (ఓంనమోనారాయణాయ)ద్వయమ్ (శ్రీమన్నారాయణచరణౌ శరణమ్ ప్రపద్యే శ్రీమతేనారాయణాయనమః) చరమశ్లోకః॥ సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకమ్ శరణమ్ వ్రజ అహమ్ త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః) అని అనుసంధించి (విష్ణుపాదోదకం.తద్వత్ గురుపాదోదకం ఇధాయను ప్రమాణానుసారముగ ఆచార్య శ్రీపాద తీర్థముతో జేయబడిన తీర్థవడి ప్రత్యేక తీర్థములో జేర్చుకొని జ్ఞానాత్మశుద్ధ్యర్థముగా స్వీకరించి తిరుమణిపెట్టను కట్టి వేంచేపు చేయపలెను. తదుపరి భగవద్భాగవతాచార్య తిరువారాధనార్థము తులసీ పుష్పాది కైంకర్యోపయుక్తములగు సకల పదార్థముల సంగ్రహించి స్వోచారోక్త విధిగా పెరుమాళ్లకు ఆరగింపు సమర్పించి అనంతరము దేహధారణమ్ పరమాత్మ సమారాధన సమాప్తి ప్రసాద ప్రతిపత్తియను బుద్ధిశేషముతో ప్రసాద స్వీకారముజేసి సావకాశమున్నచో భగవద్భాగవతాది గుణానుభవము సాంప్రదాయ సద్గ్రంథపఠనజేసి భగవద్భాగవత ఆచార్య కైంకర్యోపయుక్తమగు అర్ఘ్యార్జన నిమిత్తము నియమిత కార్యములందువ్యయించి కాలక్షేపముజేసి సూర్యాస్తమయమైన పిమ్మట స్నానముగాని లేక హస్తపాదప్రక్షాళనాచమనీయాదులజేసి ఆచార్యులు మొదలగువారు సేవసాయించిరేని వారిసన్నిధిలో సాష్టాంగ దండప్రణామ మాచరించి పెరుమాళ్లసన్నిధికివెళ్లి అంజలీబద్ధుడయి భగవద్భాగవతాచార్య స్తోత్రరత్నములను సంధించి ప్రసాదమును స్వీకరించి గురుపరంపర పూర్వక ద్వయానుసంధానముతో శయనించి బ్రాహ్మ్య ముహూర్తమున మేలుకొని పైన విజ్ఞాపనచేసుకొన్న నిత్యానుష్టానముల దాసోహబుద్ధితో సదా ఆచరించుట చాత్తాద శ్రీవైష్ణవ లక్షణము.

# 5th All India Chattada Srivaishnava Conference.

## RESOLUTIONS.

1. The 5th All India Chattda Sri Vaishnava Conference ...y expresses its loyalty to the Government.

2. The Conference while welcoming, His excellency Sir ...r Hope, the new Governor of Madras, hopes that our ...ada Sri Vaishnava Community will be uplifted in his regime.

3. That this conference prays for the success of the all'ies ...are now fighting for Justice and Freedom.

4. That this Conference expresses its hearty thanks to the ...ernment of Madras and the Director of Public Instructions ... having included the Chattada Sri Vaishnavas in the list of ...ward classes for educational purposes.

5. That this conference records its deep sense of sorrow ...e demise of (1) Sriman Asuri Kanthayyasuri garu B.A., Retired ...rict Rrgistrar. (2) Thridhandam Jiyyar Suri, garu, B. A. ...sildar. (3) Sadharangapatnam Srinivariah garu of Madras. ...irrepairable loss, the community has sustained thereby and ...eys its heart felt condolense to the members of the bereaved ...ies.

6. That this conference appeals to the Government for affording ...al fecilities to the members of the community for higher ...ations and for due enchouagement in the higher grades of ...c service in considerations of its poverty striken conditions Proposed by Sri R. Alavandarayya. Seconded by Sri T. P. ...avallayya carried unanimeously.

7. That this Conference recomends inter dining and inter ...iages amongst the members of its community belonging to, ...ent.sets, for strenthening its unity, and love.

Moved by Sri T. P. Manavalliah garu.
Seconded by V. T. Ayyalaiah garu.

(a) Amendment :—
That the word inter marriages be deleted.
Moved by Sri R. Alavandarayya garu.
Seconded by V. T. Ayyalaiah garu.
The amendment was put to Vote and lost.

(b) That the names of the sects Ekashari, Chathrakashari and Astakshari be added after sects' in the original resolutions

Mover Sri P. Sundara Ramaih garu
Seconded, Sri S. Ethiramanuj Suri
The amendment is carried—
The original resolutions with this amendment is unanimously carried out—

8. That this Conference resolves that a fund is started at once to train. "Adhyapakas" among the members of its communities by granting stipends with a view to take the place of "Pinnadi Adhyapaka Seve" in temples such as Srirangam, Sri Villiputur, Thirokkotiyur etc. Where in the members of the community are enjoying certain previlages next to the Brahmin community.

Moved by V. T. Ayyalaiah
Seconded by R. Alavandaraih.
carried unanimously.

9. That this conference places on record is appreciation of the work carried on by Chathadi Sri Vishnva Youth League Vizianagram for its social upliftment.

Moved by Sri R. Venkatram.
Seconded by Sri Ethiramanuja suri
unanimously carried.

10. That this conference earnestly appeals to "Chathada Sri Vishnavar" all over the country to enroll themselves as subscribers to "Sudarsan" and thus help the journal in making it a powerful instrument to carry on the good work, it has been doing for the past two years and further conveys its thanks to the Editor of the journal for his keen interest and endeavour to improve the social states of the community.

moved by Sri K. Venkatram
seconded by Sri K. V. Narasimharao.
unanimously carried.

11. That this conference resolves to request the Director of Public Instructions Madras to Substitute the name "Chathada Sri Vishnavas" in place of the name "Chattadi (including Stain and Chattada Vaishnava) appearing aginst No. 16 in the list of Caster other than the scheduled caste published in page 214 of Fort St. George Gazette Part 1-B dated March 5th 1940. as the Madras Government have already recognised this name their in order dated................ and recorded accordingly in the census ounts for the year 1921.

Moved by Sri A. V. Ramana.
seconded by Sri P Bhavannarayana
unanimously carried.

12. That this Conference resolves to request the members of the community to enroll themselves as "Chathada Sri Vaishnavas" in the ensuing census of 1941 but not as Sathani, Dasari or Chatha, as is generally being done by the ignorant for educating the members in this respect, intensive propaganda be carried on in each and every village.

Moved fr m the Chair.
Carried unanimously.

13. That this conference resolves that District Samajams of the community Should be constituted in each and every District for collecting subscriptions and Donations for the purpose of affording higher educational facilities to the deserving Youths of the community.

moved by Sri T. P. Manavallayya garu
seconded Mr. G. Govindayya.
carried unanimously.

14, That this conference recommends that endeavoures should be made to whole District Conference in each District during the intervel between this and the next Provincial Conference.

Moved by Sri T. P. Manavallayya garu,
Seconded by Sri Dr. T. Parthasaradhi.

15 That this conference resolves to start a bilingual monthly (English and Tamil) at Madras, the head quarters of our ...hayyabhi Vardhini Samajam under the name "Panchajanyam" to travel throughout the districts of Tamilnad,

Mysore and Hydrabad to rouse our people who are in deep stumber by its reverberating sound while "Sudarsanam" is proudly travelling in the Andhra Desa and doing good work.

moved by B. Ramanujayya.

seconded by Sri V. T. Ayyalyiah.

Amendment that the word canerese also be added after "Tamil"

moved K. Venkatraman

seconded by Bhavanarayan.

Amendment is carried.

The resolution as amended is unanimously carried.

16. That this conference resolves that religious education encouraged among the members of the community espeacially among the boys and girls.

moved by Sri T. Parthasaradhi.

seconded by D. Lakshmanaswamy,

unanimously carried.

17. That this conference resolves to confer on Sriman A. S Rangasamayya garu the tittle of Kulabhushana in considerations of the keen interest he has been taking and for the help he has been rendering for the uplift of our community since several years past.

moved by Sri R. Alavandaraiah.

seconded by G. Ranganadhaswamy, B.A., B.L.

carried unanimously.

18. That this conference expreses it's sincere thanks to the president District Board Krishna for having placed the meusum hall at its disposal for holding the conference.

moved from the chair.

carried unanimously.

19. That this conference anthorises Sri D. Lakshmanaswamy. Secretary reception committee to communicate the copies of the above resolutions to the offices concerned and carry on further correspondence on the subjeet if necessary.

moved from the chair.

carried nemcom.

---



# సుదర్శనం

మాసపత్రిక.

సంపుటము 3 } ఆగష్టు 1940, { సంచిక 3

## ఆళ్వారుత్రయం

### ౧. పొయ్గయాళ్వార్లు.

శ్లో. కాంచ్యాం సరసి హేమాబ్జే జాతాం కాసారయోగినమ్
కలయేశ్శ్రియః పత్యుః రవిందీప మకల్పయత్.

### ౨. పూదత్తాళ్వార్లు.

శ్లో. మల్లాపురవరాధీశం మాధవీ కుసుమోద్భవం
భూతంనమామి యోవిష్ణోర్జ్ఞానదీప మకల్పయత్.

### 3. పేయాళ్వార్లు.

శ్లో. దృష్టవానితిహోవాచర మయూమయిలాధిపమ్
కూపేరక్తోత్పలేజాతం మహదాహ్వయమాశ్రయే.

[అవతారిక — అవి బౌద్ధమతం వికృతాకారం దాల్చిన రోజులు: భగవంతునియందు నమ్మకంపోయి అనాత్మవాదం ప్రచారంలో ఉన్న దినాలు. శైవమతం కూడా ఒకవిధంగా పట్టుపడలిన రోజులు.........సకల కళ్యాణగుణ బరిపూర్ణుడున్నూ సర్వశక్తియున్నూ, సర్వవ్యాపియున్నూ, సర్వజ్ఞుడున్నూ అయిన శ్రియఃపతి జీవులను జననమరణ దుఃఖానుంచి ఉద్ధరించాలని సంకల్పిస్తాడు. తన దేవీభూషణాయుధ పరివారాన్ని భూలోకంలో ఆళ్వార్లుగానూ, ఆచార్యులుగానూ అవతరించిరి ప్రాకృతజీవుల్ని ఉద్ధరించమని ఆజ్ఞాపిస్తాడు.]

సిద్ధార్థినామ సంవత్సర ఆశ్వయుజ శుక్ల అష్టమీ మంగళవారంనాడు కాంచీపట్టణంలో ఒకసరోవరంలో బంగారు తామరయందు (పాంచజన్యాంశమందు) **పొయ్‌గయాళ్వార్లు** అవతరించారు. వారు అవతరించిన మర్నాడు నవమితోకూడిన ధనిష్ఠనక్షత్రమందు మహాబలిపురంలో (తిరుక్కడన్ మల్లె) గదాంశమున **పూదత్తాళ్వార్లు** అవతరించారు. వారు అవతరించిన మర్నాడు దశమితో కూడిన శతభిషనక్షత్రమందు మయూరపురంలో (తిరుమయిలై) మాధవస్వామి కోవెల సమీపంలో ఉన్న లతాహ్రదం అనే కోనేటిలో ఎఱ్ఱకలువయందు (నందకాంశమున) **పేయాళ్వార్లు** అవతరించారు. వీరు ముగ్గురున్నూ అనేక దివ్యక్షేత్రములను దర్శిస్తూ చివరకు దక్షిణపినాకినీ దక్షిణపుగట్టుననున్న వామనక్షేత్రము చేరుకున్నారు. అక్కడవున్న అయినర్ పెరుమాళ్ల సన్నిధిని మంగళాశాసనంచేసి విశ్రమించడానికి తగిన స్థలాన్ని వెదకడానికి బయలుదేరారు.

మొదట పొయ్‌గయాళ్వార్లు పండుకోడానికి స్థలం వెదుక్కుంటూ ఊరంతా గాలించిగాలించి ఆఖరికి ఒక వైష్ణవగృహంముందలి నడవ అరుగుమీద చోటుచూచుకొని శయనించారు. కొంతసేపటికి పూదత్తాళ్వార్లు వేంచేసి ఆ గృహంఎదుట నిలబడి 'అపియనికి రాత్రి పండుకొనుటకు కొంచెం స్థలందొరుకుతుందా' అని అర్థించారు. ఆ మాటలు చెవినిపడగానే పొయ్‌గయాళ్వార్లు బయటికివచ్చి 'స్వామీ దాసుడుండే చోటు ఒకరికి పండుకొనుటకైనన్నూ, ఇద్దరికి కూర్చో

ష్టకైననూ సరిపోతుంది. తాము దయచేస్తే యిద్దరం కూర్చుం టాము' అని విన్నవించారు. ఆ మాటవిని పూదత్తాళ్వార్లు ఆ అరుగు మీదకు వేంచేశారు. మరికొంతసేపటికి పెయాళ్వార్లు శయనించడానికి స్థలం వెదుక్కుంటూ వచ్చి ఆగృహంముందే నిలుచొని, 'స్వాము లారా! దాసునికి పండుకోడానికి కొంతస్థలం కావాలి ఇక్కడ చిక్కు తుందా' అని అడిగేరు. అమాట విని లోనున్న ఆళ్వార్లు 'స్వామీ ఈ అరుగు ఒకరు పండుకోడానికైనా, ఇద్దరు కూర్చోడానికైనా, ముగ్గురు నిలుచోడానికైనా సరిపోతుంది. యిక్కడ మేం యిద్దరం న్నాము తమరుకూడా వస్తే ముగ్గురం నిలుచుందాం. తాము వేం చేయవలసింది' అని విన్నవించారు.

ఈవిధంగా పాంచజన్యగదానందకాంశ సంభూతులైన ఆళ్వార్లు ఆ అరుగుమీద నిలుచొని వారివారి వృత్తాంతములను చెప్పుకుంటూ గోష్ఠిలో వుండగా శ్రీమన్నారాయణుడు వారి ఓర్పును పరీ క్షించదలచి ఆచోటు మిక్కిలి యిరుకుగా అయేటట్టు చేశాడు. వారు ఇంతకుముందులేని యిరకటం ఉప్పుడెలావచ్చిందని దివ్యదృష్టితో చూచి శ్రియఃపతి విలాసంగా గ్రహించారు. తమదగ్గర భౌతిక దృష్టికి కనబడకుండావున్న లక్ష్మీసమేతుడైన శ్రీమన్నారాయణుని వీక్షించి ఆనందపారవశ్యముచే కనుకొలకుల నీరుగ్రిమ్మగా భగవం తుని అనేక విధాల స్తుతియింపసాగినారు. అంతట నిఖిలకళ్యాణగుణ పరిపూర్ణుడున్నూ అవాప్త సమస్త కాముడున్నూ అయిన శ్రీమన్నా రాయణుడు ఆ ఆళ్వారు త్రయానికి తన దివ్యసాక్షాత్కారం ఇచ్చి వాళ్లని అనందపరవశులుగ జేసి 'ఓ భాగవతశిఖామణులారా, భక్తు లుండేచోటే నేనువుండేచోటు. వాళ్లహృదయాలనుంచి నేను వేరుగా వుండలేను. మీరు అజ్ఞానాంధకారంలో మునిగివున్న మలినాత్మలను నా భక్తిజ్యోతిచే వెలుగొందజేసి వారిని నా పరమపదం చేర్పండి. అనాత్మవాదంచేత మలినమైన యీ భూలోకంలో భక్తిమార్గాంతర

తమైన వేదాంతార్థములను బయటపరచి పిమ్మట నాసన్నిధానమును చేరుకొండి' అని ఆజ్ఞాపించి అంతర్థానుడయ్యెను.

ఆ ముగ్గురు యోగులున్నూ మెరుపుమెరసినట్లు క్షణకాలము దర్శనమిచ్చి మాయమైపోయిన శ్రియఃపతి వియోగాన్ని సహించలేక 'ఓ గజేంద్రవరదా! అనంతఫలదా, కృపాసముద్రా! సంప్రాపితజ్ఞానముద్రా! మాకు సర్వదా నీసేవలభించేటట్టు చెయ్యమని ప్రార్థించారు. వారిలో పొయ్‌గయాళ్వార్లు తమకు శ్రీమన్నారాయణుడు సాక్షాత్కరించిన విధాన్ని 'వైయందగళియుం' అనే తమిళగీతముగా రచియించారు. పూదత్తాళ్వార్లు వారి దివ్యానుభవమును 'అన్బేదగళియుం' అనే తమిళ గీతికగా రచియించారు. పేయాళ్వార్లు 'తిరుక్కండేన్' అనే తమిళగీతం ద్వారా తమ దివ్యానుభవాన్ని వెల్లడి చేశారు. ఈ మూడు దివ్యప్రబంధాలకు కూడా 'తిరువందాది' అనే పేరు చెల్లుతూవుంది. ఈవిధంగా ఆళ్వారుత్రయం ఋగ్వేద యజుర్వేద సామవేద సారాంశముతో మూడు తిరువందాదులను రచియించి వాటిని భూలోకంలో వ్యాపింపజేసి స్వమత సంస్థాపనంజేసి అనేక అనేక ప్రాకృత జీవుల్ని ఉజ్జీవింపజేసి శ్రియఃపతి ఆజ్ఞప్రకారం లీలా విభూతి విడిచిపెట్టి పరమపదమునకు వేంచేశారు.

---

# తిరుమంజిశయాళ్వార్లు

శ్లో॥ విభవాబ్దే పుష్యమాసే దశామ్యాం కృష్ణపక్షగే
తులాలగ్నే భక్తిసారో మఖాయాం గురువాసరే
కనకాంగాం భార్గవస్య జజ్ఞే చక్రాంశజో మహాన్
శ్రీ దివ్యసూరిచరితే వ్యావతారోస్య గీయతే.

[భార్గవాదినములు సత్యలోకం వెళ్లి శ్రియఃపతియున్నూ, పెరియపిరాట్టి
న్నూ అర్చావతారంలో వేంచేసివున్న దివ్యదేశంయెక్కడవున్నది అని బ్రహ్మ
న్ని అడుగుతారు. బ్రహ్మదేవుడు కాంచీపురానికి తూర్పునవున్న తిరుమంజిశ
ప్పుడు "తిరుముషి" అని వాడుతున్నారు) అనే దివ్యదేశములో జగన్నాథుడనే
తో వేంచేసియున్నారని చెప్పుతాడు. ఆ విషయమై నిదర్శనం చూపించవల
ని భార్గవులు కోరుతారు. విధాత విశ్వకర్మను పిలిపించి కర్తవ్యముపదేశించగా
డు ఒక త్రాసును తీసుకొనివచ్చి దానిలో ఒక ప్రక్క తిరుమంజిశను మరి
క ప్రక్క తక్కిన దివ్యదేశములను వుంచితూచగా తిరుమజిశతట్టే మొగ్గు
పిస్తుంది. భార్గవులు సంతోషించి ఆపుణ్యస్థలంలో తపస్సుచేస్తారు. అతని
స్సును భంగంచెయ్యడానికి దేవేంద్రుడు కనకాంగి అనే అప్సరసను పంపిస్తాడు.
వులు కనకాంగి మాయలో మునిగిపోతారు.]

పొయ్‌గయ్‌పూదప్పేయాళ్వార్లు అవతరించిన సంవత్సరాన్నే
ష్య కృష్ణ పాడ్యమీ మఘానక్షత్రమందు సుదర్శనాంశమున కన
ంగియందు తిరుమంజిశయాళ్వార్లు అవతరించారు. కనకాంగి ఆ
వును భార్గవుల కప్పగించి దేవలోకంపోయింది. భార్గవులు విరక్తి
ది ఆపసిపాపను ఒకవెదురుపొదల్లో విడిచి, తపస్సుచెయ్యడానికి
పోయారు. ఆపాప రోదన విని తిరువాళన్ అనే మేదరవాడు
చ్చి ఆబిడ్డను తీసుకొనిపోయి పంకజవల్లియనే పేరుగల తనభార్య
చ్చేడు. సంతానాపేక్షచేత కృషిస్తూవున్న పంకజవల్లి ఆబిడ్డ భగవ

దనుగ్రహంవల్ల లభించేడని సంతోషించినదాయెను. ఆకలిదప్పులు లేకుండా శుక్లపక్ష క్షపాకరునివలె వృద్ధిపొందుతూవున్న ఈ ఆళ్వార్ల మహాత్మ్యము విని దృఢవ్రతుడనే శూద్రుడు భక్తితో ఆవుపాలను తీసి ఆళ్వార్లకు అనుదినం సమర్పిస్తూ వుండేవాడు. ఆళ్వార్లు ఆరగింపు చేయగా మిగిలిన శేషమును తానున్నూ తన భార్యయున్నూ భక్తి పూర్వకంగా పుచ్చుకుంటూ వుండేవారు. ఆళ్వార్ల భుక్తశేషం యొక్క మహిమవల్ల ఆశూద్రదంపతులకు కణికృష్ణుడనే కుమారుడు కలిగినాడు.

తిరుమంజిశయాళ్వార్లు నిత్యవస్తువును తెలియగోరి నాలుగు వందల సంవత్సములు దేశయాత్రచేసి విసుగొంది శ్రీమన్నారాయణునిగూర్చి తపస్సు చేశారు. భక్తవత్సలుడైన నారాయణమూర్తి ఆళ్వార్లకు సక్షాత్కరించి భక్తిసారుడనే తిరునామమునిచ్చి శ్రీవైష్ణవమతసిద్ధాంతమును తెలియచేసి ప్రాకృతులను వుద్ధరించవలసినదని ఆజ్ఞాపించినారు. కొంతకాలానికి పొయ్‌గయ్‌పూదప్పేయాళ్వార్లు తిరుమంజిశకు వేంచేసి భక్తిసారులతో కొన్నిదినాలు వుండి వారిని కూడ వెంటబెట్టుకొని అనేక దివ్యదేశాల్ని సేవించారు.

తిరుమంజిశయాళ్వార్లు భగవన్నియమ ప్రకారం తిరువేక్కాకు పోయి వరదరాజస్వామిని సేవిస్తూ వుండేవారు ఆళ్వార్లను వెదుకుతూ కణికృష్ణుడు తిరువేక్కాకు వచ్చి ఆయన సన్నిధిని భక్తినిమగ్నుడై వుండేవాడు, అతడు ఒక వృద్ధభక్తిపరిపత్తులతో సమ్మార్జనంచేయడంచూసి సంతోషించినవాడై ఒక పాశురంచెప్పి, ఆమెకు యౌవనముకలుగునట్లుగా శేషశాయిని ప్రార్థించగా ఆమె యౌవనమాయెను. ఆ పట్టణాన్ని పరిపాలిస్తూవున్న పల్లవరాయడనే రాజు ఆమహాత్మ్యము విని కణికృష్ణుని తనవద్దకు రప్పించుకొని తనకు ముదిమి కలుగకుండునట్లు ఒక ప్రబంధమును రచింపుమనియు వలయునంత ధనధాన్యములిచ్చెదననియు చెప్పినవాడాయెను. భగవంతుని భాగవతులను

క్షింపు నానాల్క నీవంటి ధనమదాంధుల నామముచ్చరింపదని కృష్ణుడు తిరస్కరింపగా పల్లవరాయుడు తన రాజ్యమునుండి పోవలసినదని కణికృష్ణుని ఆజ్ఞాపించినవాడాయెను. కణికృష్ణుడు ఆళ్వార్ల సన్నిధికిపోయి రాజాజ్ఞను తెలిపి తాను వేరొకచోటికి పోవుటకు అనుమతి ఇయవలసినదని కోరినవాడాయెను. శిష్యపరతంత్రులగు ఆళ్వార్లు తాకూడ కణికృష్ణునివెంట పోవుటకు బయలుదేరినవాడాయెను. పరాధీనులయిన ఆళ్వార్లు కదలగా భక్తపరాధీనులైన పెరుమాళ్లు చుట్టిని శేషశాయిని వెంటబెట్టుకొని ఆళ్వార్లను వెంబడించారు.

ఉదయాన్నె అర్చకులు తిరువారాధన చేయడకోసం కోవెలకు రాగా అక్కడ పెరుమాళ్లు కనిపించలేదు. వారు తత్తరపాటులో రాజువద్దకు పోయి మొరబెట్టినారు. రాజు దిగులుపడినవాడై కాళ్లు తలబడగా భక్తిసారుల వెంట పోతూవున్న పెరుమాళ్ల కాళ్లపై బడి పట్టణమునకు తిరిగి రావలసినదని ప్రార్థించినవాడాయెను. అప్పుడు పెరుమాళ్లు కృపవహించి, ఓరాజా! నీవు నాభక్తుడైన కణికృష్ణుని నిరాకరించి ఆళ్వార్ల మనస్సు నొప్పించితివి. అందువల్ల అతడు వెళ్లిపోవుచున్నాడు. అతని విడలేక నేనున్నూ అతడి వెంటనే వెళ్లిపోతూవున్నాను. అతడు నిలిచేటట్లయితే నేనూ నిలిచిపోతాను అని సెలవిచ్చినవారాయెను. అప్పుడారాజు కణికృష్ణుడి వెనుక నడచిపోతూవున్న ఆళ్వార్ల తిరువడుగులపైబడి కృపచూపవలసినదని కోరగా ఆళ్వారు కనికృష్ణుడికి ఎగ్గుజరిగింది కాబట్టి అతడు క్షమిస్తే నేనున్నూ క్షమిస్తానని చెప్పాడు. రాజు సిగ్గువిడిచినవాడై కణికృష్ణుని పాదములపై బడి తన్ను క్షమించవలసిందని ప్రార్థించాడు. కృపాసముద్రుడైన కణికృష్ణుడు అతణ్ని క్షమించి రాజధానికివచ్చాడు. అతని వెనక ఆళ్వార్లున్నూ ఆళ్వార్ల వెనక శేషశాయియున్నూ తిరిగి ప్రవేశంచేశారు.

తిరుమంజిశయాళ్వార్లు కొన్ని సంవత్సరములు తిరువేక్కాకలో వేంచేసి కుంభకోణంలోవున్న శార్ఙపాణిని సేవించడానికి బయలుదేరెను మార్గమధ్యాన్న శార్దూలపురంలో బ్రాహ్మణవీధిగుండా ఆళ్వార్లు పోతూవుండగా బ్రాహ్మణుడు ఆళ్వార్లను చూచి శూద్రుడువచ్చాడని వేదపఠన నిలిపివేశాడు. ఆళ్వార్లు ఆవీధిని దాటిపోయినతర్వాత మరల వేదపఠన ఉపక్రమిస్తే అది జ్ఞప్తికిరాలేదు. వారు ఆళ్వార్లకు చేసిన అపకారం జ్ఞప్తికితెచ్చుకొని 'నశూద్రా భగవద్భక్తాః' అనగా భాగవతులు శూద్రులు కాజాలరు అనే సూత్రాన్ని స్మరించి ఆళ్వార్ల తిరువడుగులపైబడగా అయన వారిని క్షమించారు. అప్పుళ్లో కోవెలకు వేంచేసి ఆళ్వార్లు పెరుమాళ్లకు ప్రదక్షిణచేస్తూ వుండగా పెరుమాళ్లున్నూ ఆళ్వార్లు ఏతట్టు తిరుతూవుంటే ఆతట్టే తిరుగుతూవచ్చారు. అక్కడవున్న అర్చకులున్నూ, బ్రాహ్మణులున్నూ ఈమహాత్మ్యాన్ని చూచి ఆశ్చర్యపోయారు. ఆగ్రామంలోవున్న ఒక దీక్షితులు ఒకమహాయజ్ఞంచేస్తూ ఆళ్వార్లను తోడుకొనిపోయి పూజించేటప్పటికి అక్కడవున్న బ్రాహ్మణులు తమ కవమానము జరిగినదని దీక్షితులను దూషించారు. ఆళ్వార్లు పెరుమాళ్లను ధ్యానించగా శ్రియఃపతి దుష్టులకు భయమున్నూ శిష్టులకు ఆహ్లాదమున్నూ కలిగేటట్లు సుదర్శన చక్రధారియై సాక్షాత్కరించి అక్కడనుంచి కుంభకోణము వేంచేసి అక్కడి అర్చావతారమును సేవించి "నాన్ ముగన్" తిరువంతాది తొంబైయారున్నూ "తిరుచ్ఛందవిరుత్తం" నూట్రియిరవైయున్నూ రచించారు. తర్వాత ఆళ్వార్లు అక్కడ 2700 సంవత్సరములు వేంచేసివుండి తమ 4870 సంవత్సరములో లీలావిభూతిని విడిచిపెట్టి నిత్యవిభూతికి వేంచాశారు.

# నమ్మాళ్వారు

శ్లో॥ 'వకులాభరణం వందే జగదాభరణం గురుమ్
యశ్శ్రుతేరుత్తరం భాగం చక్రే ద్రామిడభాషయా
ఆదౌ కలేర్ద్వాపరకా కురుకాపురి పాండ్యదేశే
వైశాఖమాసి మఘువానలభేంశజాతమ్
సేనాపతేః పదజకారి గృహోపతీర్ణం
శ్రీశాశ్వదం శఠరిపుం శరణం ప్రపద్యే.'

[శ్రియఃపతి అనంతుని పిలచి విష్వక్సేనులు నమ్మాళ్వార్లుగా అవతరిస్తారు ... నీవు ముందుగా పోయి తిరుక్కురుగూరులో చింతచెట్టుగా జన్మించమని ...స్తారు. అనంతులు సిద్ధార్థినామ సంవత్సర చైత్రమాసంలో మూలా నక్ష... తామ్రపర్ణి నదీతీరంలో ఆదిప్పిరాన్ సన్నిధికి ఉత్తరవేపున తింత్రిణీ...ంగా అవతరిస్తారు.]

తిరుక్కురుగూరు అనే ప్రదేశాన్ని భగవద్భాగవత భక్తుడు ... సదాచారవర్తనుడున్నూ అయిన కారియనే రాజు ఏలుతూ ...వాడు. అతనికి సంతానం లేకపోవడంవల్ల తన భార్యయైన ...యనంగతో (తిరుక్కురుంగుడి) కి పోయి తిరుప్పార్కడల్ అనే ...తీర్థంలో స్నానంచేసి అక్కడ వేంచేసియున్న ఆదిప్పిరాన్ పెరు...ళ్ళనుగూర్చి తపస్సు చేశాడు. భక్తపరాధీనుడైన ఆదిప్పిరాన్ ... తపస్సుకు మెచ్చి సుపుత్రుడు కలిగేటట్టువరం ప్రసాదించాడు.

శ్రీమన్నారాయణుని అనుగ్రహంవల్ల విష్వక్సేనుని అంశము ...యనంగ గర్భంలో ప్రవేశించి ప్రమాదినామ సంవత్సర వైశాఖ ... పూర్ణిమా శుక్రవారంనాడు విశాఖ నక్షత్ర యుక్త కర్కాటక ...ంలో నమ్మాళ్వారు రూపంగా అవతరించారు. ఆ అవతారమూర్తి

పుట్టినదినమందు శుభశకునాలు చాలా కన్పించినవి. అంధులకున్నూ, బధిరులకున్నూ, అవివేకులకూన్నూ వాళ్ల వాళ్ల లోపాలు వాటంతట అవే పోయినవి. గౌర్డ్రాంర్డు గర్భమును ధరించారు. పూలవాన కురిసింది. ఆకాశం నైర్మల్యం పొందింది. కారిమహారాజు చాలా సంతోషించినవాడై గోభూహిరణ్యాదానాల్ని చేసి ఆశిశువునకు "మారుడు" అని నామకరణం చేశాడు. ఆయనే నమ్మాళ్వారు.

అయితే ఆశిశువు కళ్లువిప్పి చూడలేదు. నోరువిప్పి ఏడ్వలేదు. స్తన్యపానం చెయ్యలేదు. కాలుసేతులు కదలింపలేదు. యోగమందున్న మహాయోగివలె వన్నెతరగక దేదీప్యమానుడై ఉండెను. మహారాజున్నూ మహారాణియున్నూ విచారపూరితులయ్యారు. మహారాజు మంత్రులతో ఆలోచించగా వాళ్లు ఈమహానుభావుడు సర్వ ప్రసాదికాబట్టి యిందలిచిత్రము పరమేశ్వరునికే తెలియాలి. బిడ్డను తీసుకొనిపోయి పెరుమాళ్లు సన్నిధిని ఉంచవలసినది అని సలహా యిచ్చారు. వారి సలహాప్రకారము రాజు బిడ్డను బంగారుటుయ్యాలులో నుంచి ఆదినాథుని సన్నిధిలో ఉంచాడు. అప్పుడు ఆ శిశువు ఉయ్యాలనుంచి నేలకు దిగి మెల్లగా జరుగుతూ ఆగుడికి ఉత్తర దిశనునున్న తింత్రిణీవృక్షం చెంతకు వెళ్లినది. అక్కడ పద్మాసనము వేసికొని కుడిచేత చిన్ముద్రనుబూని ఎడమచేయి వడినుంచుకొని జ్యోతిస్వరూపుడై వెలుగుతూ ఉండెను. ఆసమయంలో పెరియ పిరాట్టి ప్రార్థనపై విష్వక్సేనను పిలిచి అతని అంశయందు జనియించిన నమ్మాళ్వార్లకు సమాశ్రయణాదులు ప్రసాదించి విశిష్టాద్వైత రహస్యములుపదేశించవలసినదని శ్రియఃపతి ఆజ్ఞాపించెను. విష్వక్సేనుము లోకంలోని జీవాత్మలుజ్జీవించుటకు సాధనాలైన సకల వేదాంత రహస్యములను ఆళ్వార్లు కుపదేశించారు.

# మధురకవి యాళ్వార్లు.

మధురకవి యాళ్వార్లు శ్రీ నమ్మాళ్వార్లకు సమకాలికులు. ...ర సంవత్సర చైత్రి శుక్ల చతుర్దశీ శుక్రవారంనాడు చిత్రా ...త్రాన్ని తిరుక్కోళూరులో ఒకపురశ్చూడ శ్రీ వైష్ణవునికి పుత్రు ...జన్మించారు. ఆయన తీర్థయాత్రలు చేస్తూ అయోధ్యయందుండి ...ళూరు పెరుమాళ్లను ధ్యానిస్తూ దక్షిణవువైపు తిరుగగా ...లుగు కనిపించింది. ఆయన ఆశ్చర్యపడి ఆ తేజస్సును అన్వేషిస్తూ ...దినాలు ప్రయాణం సాగించి చివరకు ఆదిప్పిరాన్ దేవాలయము ...న్నారు. తింత్రిణీవృక్షమువద్ద ధ్యానిమై ఉన్న నమ్మాళ్వార్ల ...చూసి వారిసంగతి అచ్చటనున్నవాళ్లను అడిగి తెలుసుకొన్నారు. ...నయందు భగవదంశ ఉన్నదని నిశ్చయం చేసుకొని వారిసన్నిధి ...ను చేతులు జోడించి స్వామీ 'చిత్తన్ వయత్తిల్ సిరియదుపిరం ...ల్ ఎత్తై త్తిన్ను ఎంగేకిడక్కుం' (అనగా చిత్తుకడుపున చిన్నది ...ై ఏమితిని ఎక్కడ పడియుండును) అని ప్రశ్నించారు. అంతకు ...ముందు నోరుతెరచి యెఱుగని చింతచెట్టుక్రింది మునీంద్రుడు అంద ...ు ఆశ్చర్యం కలిగేటట్టుగా 'అత్తైత్తిన్ను అంగేకిడక్కుం (అనగా ...తిని అక్కడనే పడియుండును) అని శెలవిచ్చారు. మధురకవి ...మ్మాళ్వార్ల ప్రజ్ఞావిశేషముల కాశ్చర్యపడి కేవలం పరమేశ్వరుడే ... సాగిలబడి.

...పద్మాసనోపవిష్టం పరపదయుగళే నివిష్టచైతన్యం।
పరతత్త్వముద్రబోధ ముద్రం పరమాచార్యం పరాంకుశం వందే॥

అని వినుతించి 'స్వామీ! అప్రాకృతాలైన మీచరిత్రలు ...దివ్యమహిమను సూచిస్తున్నవి. మీదివ్యసూక్తులు వేదాంతార్థ ...బోధకములవుతూ దానుని ప్రశ్నకు సదుత్తరములయినవి. కావున ...

మీరు నన్ను కటాక్షించి నాకు విహిత పురుషార్థాన్ని ప్రసాదించవలసింది' అని వేడుకున్నారు. ఆసమయంలో శ్రీమన్నారాయణుడు దేవీ భూషణాయుధ పరిజనాలతో గరుడవాహనారూఢుడై నమ్మాళ్వార్లకున్నూ మధురకవి యాళ్వార్లకున్నూ దర్శనం సాయించారు. భక్తి పారవశ్యంచేత చేతులు జోడించుకొనివున్న నమ్మాళ్వార్లనుచూచి, లోకంలోని ఆత్మలు మాయను గడచి జ్ఞానమార్గవర్తులయి నిత్యానందప్రదమైన పరమపదాన్ని పొందడానికి తగిన నిఖిలవేదాంతార్థములను ద్రవిడవేదముగా వ్రాయమని సెలవిచ్చి అంతర్ధానం పొందేరు.

నమ్మాళ్వార్లు చింతచెట్టు క్రిందనే వేంచేసివుండి శ్రీమన్నారాయణుడే పరాత్పరమనియున్ను ఆయనతప్ప ఆత్మలకు గత్యంతరము లేదనిన్నీ సృష్టి స్థితి లయాలనే మూడుకార్యాలకు మూడుమూర్తులై వర్తించే శ్రీమన్నారాయణుడు భక్తపరాధీనుడనిన్నీ ఆయనభక్తులు మోక్షార్హులనిన్నీ తలస్తూ, ఉపదేశిస్తూ, తన్మయత్వము పొందుతూ వుండేవారు. శ్రియఃపతియందలి ప్రేమ పారవశ్యముచే, పతినివిడచిన పతివ్రతవలె విరహమునందుచూ పక్షులచే శ్రీమన్నారాయణునికి వార్తలనంపుతూ వుండేవారు. శ్రీమన్నారాయణుని సేవనుగూర్చి తమ దివ్యానుభవము తెలిసేటట్టుగా సకల వేదాంతసారమైన తిరుమంత్రార్థమును ఋగ్వేదసారమైన తిరువిరుత్తము, యజుర్వేదసారమైన తిరువాశిరియవిరుత్తము, అథర్వవేదసారమైన తిరువాయ్‌మొళి అనే నాల్గు దివ్యప్రబంధాలుగా రచియించి వాటిని మధురకవి యాళ్వార్లచే వ్రాయించారు.

నమ్మాళ్వార్లు, శ్రీ ఆదిప్పిరాన్ ప్రసాదించిన పొగడమాలను ధరించడంవల్ల వకుళాభరణుడనిన్నీ పరసమయాన్ని నిరశించడంవల్ల పరాంకుశుడని శటులను మరగుపరచడంచేత శఠగోపుడనిన్ని పేర్లను వహించి భక్తిప్రపత్తుల కాలవాలమై సర్వకాల సర్వావస్థలయందు పెరుమాళ్ల సేవచేస్తూ వుండేవారు. భక్తి పారవశ్యంచేత విరహాన్ని

పొందుతూవున్న నమ్మాళ్వార్లు పెరుమాళ్లను ధ్యానింప శ్రీవారు ప్రత్యక్షమై నమ్మాళ్వార్లను పరమ పదమునకు తీసుకొనిపోతూ, పెరుమాళ్లను ఆళ్వార్లను విడిచివుండలేని మధురకవులను చూచి శ్రీ మధురకవీ! తిరువాయ్ మొడిని సర్వజనులు అను సంధించునట్లుచేసి అందలి అనుభవార్థములను ప్రపంచమునకు చాటి చింతచెట్టుక్రింద నమ్మాళ్వార్లను ప్రతిష్టచేసి అర్చించి నాపరమ పదమునకు రావలసినది. అని ఆజ్ఞాపించారు. పెరుమాళ్లతో నమ్మాళ్వార్లున్నూ తర్వాత కొంత కాలానికి మధురకవి యాళ్వార్లున్నూ యిలీలావిభూతిని విడిచిపెట్టి నిత్యవిభూతికి వేంచేశారు.

---

## కులశేఖరాళ్వార్లు

కుంభే పునర్వసూ జాతం కేరళేకోళి పట్టణే
కౌస్తుభాంశంధరాధీశం కులశేఖర మాశ్రిమే.

పూర్వం మళయాల దేశాన్ని దృఢవ్రతుడనే రాజు పాలిస్తుండేవాడు. అతడికి పిల్లలు లేకపోవడంవల్ల శ్రియః పతినిగూర్చి ఘోరంగా తపస్సు చేశాడు. పరమేశ్వరుడు సంతోషించి కౌస్తుభాంశమందు అతడికి సుపుత్రుడు కలిగేటట్టు వరం యిచ్చాడు. కొంత కాలానికి దృఢవ్రత మహారాజు భార్య గర్భం ధరించి పది నెలలు నిండిన తర్వాత, పరాభవనామ సంవత్సర మాఘ శుక్ల ద్వాదశీ శుక్రవారం నాడు పునర్వసు నక్షత్రమందు సుపుత్రుడ్ని కన్నది. జనన కాలమందు అనేకమైన శుభశకునాలు కనిపించాయి. [illegible] మహారాజు వేదోక్త రీతిగా జాతక కర్మాం చేసి కులశేఖరుడు అని నామకరణం చేశాడు. కులశేఖరుడు దిన దిన ప్రవర్ధమానుడవుతూ వేద శాస్త్ర విద్యలయందు అసమాన

పాండిత్యాన్ని గడించాడు. కొంతకాలానికి దృఢవ్రత మహారాజు వాన ప్రస్థాశ్రమాన్ని స్వీకరించి కులశేఖరుడికి పట్టాభిషేకం చేసి భార్యా సమేతుడై అడవికి పోయాడు.

కులశేఖర మహారాజు వర్ణాశ్రమ ధర్మాలు తప్పకుండా రాజ్యం చేస్తూ భగవద్భాగవత భక్తియుక్తుడై వుండేవాడు. ఒక నాడు కులశేఖరుడు శ్రియఃపతిని స్మరించి శయనించగా శ్రీమన్నారాయణుడు అతని స్వప్నమందు తన నిత్యవిభూతిని లీలా విభూతిని చూపించేడు కులశేఖరులు పెరుమాళ్ళ చరణారవిందములయందు తన మనస్సు లగ్నంచేసి చైతన్య విహీనుడై వున్నారు. తెల్లవారినప్పటికే వైతాళికులు మేలుకొలుపులు పాడినప్పటికీ రాజు కదలకపోవడం మంత్రులకుభయాశ్చర్యాల్ని కలుగజేసింది. నలుగురూ నాలుగు విధాల అనుకున్నారు. వారికోలాహలం కులశేఖరుని ధ్యానాన్ని భంగంచేసింది. అతడు తనకు పెరుమాళ్ళు ప్రసాదించిన వైభవాన్ని చెప్పినాటినుండి భాగవతులను ఆహ్వానిస్తూ వాళ్ళను సంతోషపరుస్తూ రాజ్యకార్య విముఖుడై వుండేవాడు. మంత్రులకు యిది కష్టంగా తోచింది. వాళ్ళు పెరుమాళ్ళ ఆభరణాలను దాచివేసారు. పరిచారకులచేత భాగవతులే అపహరించి వుంటారని చెప్పించారు. కులశేఖరాళ్వార్లు యీభాగవత అపరాధాన్ని సహించలేకపోయారు. పాములవాడిచేత ఒక కృష్ణసర్పాన్ని తెప్పించి బుంగలోవుంచి తనవుంగరాని ఆబుంగలో వుంచారు. భాగవతులే తీశారని చెప్పి ఆబుంగలో చెయ్యిపెట్టి వుంగరాన్ని తియ్యమని పరిచారకుల్ని అడిగారు వాళ్ళు భయపడిపోయారు. అప్పుడు ఆళ్వార్లు తనభక్తి అందరికి విస్మయం గొలుపగా బుంగలో చెయిపెట్టి భాగవతులెవ్వరు అపహరించలేదని చెప్పి ఆవుంగరాన్ని తీశారు.

అప్పటినుంచీ ఆయనకు భగవంతుడియందున్నూ భాగవతుల యందున్నూ భక్తి హెచ్చయింది. ఆయన గీర్వాణభాషలో ముకుంద

మాలఅనే ముకుందస్తవాన్నిరచియించి శ్రీరంగనాథుడికిసమర్పించారు. మరిన్నీ తమ ఆనందంలో 'ఇరుళిరిచ్చుఢర్ మణి' అని ప్రారంభించి ముప్పై ప్రబంధాలు వ్రాయించారు. శ్రీరంగంలోవున్న శ్రీరంగనాయకులు కటాక్షించి ఆయనకు సాక్షాత్కరించి, వెంకటాచలానికిపోయి క్కడ శ్రీనివాసమూర్తి అనే పేరుతోవున్న తన అర్చావతారాన్ని సాధించమని చెప్పారు. శ్రియఃపతిఆజ్ఞ ప్రకారం తిరుపతికిన్నీ తిరుక్కచ్చకిన్నీ వెళ్లి అక్కడి అర్చావతారాన్ని పూజించి అనేక ప్రబంధాలు చెప్పేరు. అక్కడనుంచి వ్రేపల్లెకు (తిరువాయర్పాడి) వచ్చి తాను గోపిక అయినట్లున్నూ శ్రీయఃపతికృష్ణుని వలెనున్నూ భావించి ఒక ప్రబంధంచెప్పారు. అక్కడనుండి అయోధ్యకువచ్చి శ్రీరామచంద్రుడి అర్చావ తారాన్నిసేవించి పుత్రవియోగంచే దశరథుడు పడినబాధను వస్తువుగా తీసుకొని ఒక ప్రబంధాన్ని రచియించారు. అక్కడనుంచి చిత్రకూటానికివచ్చి గోవిందరాజ పెరుమాళ్లను సేవించి పదిపాటలతో రామాయణాన్ని రచించారు. తిరిగి స్వగ్రామంచేరి తమ నూటనలబైయ్యో సంవత్సరాన్ని ఆళ్వార్లు లీలావిభూతి విడిచి నిత్య విభూతికి వేంచేశారు.

---

# బ్రహ్మసూత్రములు.

338 పేజీలు

(త్రిభాష్య లఘు టీకా తాత్పర్య సహితము.)

గ్రంథకర్త:

శ్రీమాన్ భద్రగిరి నంబెరుమాళ్లు, B. A., L. T.



పబ్లిషర్సు:

రంగా అండ్ కో.,

ఏలూరు,

---

వెల 0—8—0. పోస్టేజీ 0—3—0.

# సుదర్శనం ప్రత్యేక సంచిక,

---

త్వరలో సుదర్శనం ప్రత్యేక సంచిక వేయడానికి ప్రయత్నిస్తు
ము. ఆసంచిక మామూలు సంచికవలెకాకుండా ఎక్కువ పేజీలు
ను ఆకర్షనీయమైన వ్యాసములతోను కథలతోను పద్యములతోను
డాలి అని మా ఆశయం. మనలో అనేకులు పరమపదించిన మహా
ులు వున్నారు. ప్రస్తుతం వున్నవారిలో మత, రాజకీయములలో
ముఖస్థానములు వహించినవారున్నారు. వారి జీవితాన్ని సచిత్రంగా
ంగా ప్రచురించాలని మావుద్దేశం. కాబట్టి లోగడ నాల్గు మహా
లు నడిపిన మహనీయుల జీవితచరిత్రలున్నూ చిత్రములున్నూ యింకా
ాలి. వాటిని సేకరించి పంపించవలసిందని స్వాములను కోరుతూ
్నాను.

మనలను అనుదినం యెదుర్కొంటూవున్న మత సాంఘిక సమస్యల
కథానికలు కావాలి. కథలలో మన అభిప్రాయములను యిమిడించి
సామాన్యాన్ని ప్రబోధించడం చాలా సులభం. కాబట్టి చాత్తాద
ష్ణవులలోనున్న వ్యాసకారులంతా తగు ప్రయత్నంచేసి మాకోర్కె
ర్చాలి అని మాప్రార్థన.

చాత్తాద శ్రీవైష్ణవులలో కవులు లేకపోలేదు. ప్రత్యేక సంచికను
వంతంగా చేయడానికి చిన్నచిన్న గీతికలూ పద్యాలూ అవసరం.

వ్యాసాలు రెండు పేజీలకు మించకుండా వుండాలి. తక్కువ పేజీ
ఆకర్షనీయంగా వ్రాయడమే కళ. రెండు పేజీలకు మించిన వ్యాస
ు ప్రచురింపజాలమని మనవిచేయుచున్నాము. వ్యవహారిక భాషలో
ామాన్యానికి అర్థమయేటట్లు వుండాలి. వ్యాసములు పంప ప్రార్థన.

వివరములు:— సంపాదకుడు 'సుదర్శనం' విజయనగరం.

---

SUDARSANAM

## సుదర్శనం.

జూలై నెలలో పోషకులు.

శ్రీమాన్ దాస్యం రంగనాయకులుగారు, దుమ్ముగూడెం. 5-0-0.

అభిమానులు :

శ్రీమాన్ జి. తిరువేంగడయ్యగారు కాళహస్తి. 2-8-0.

శ్రీమాన్ ఎ. చిన్నసామయ్యగారు, కొండయంబల్లి. 1-0-0.

శ్రీమాన్ పి. కృష్ణమయ్యగారు, Dudyala. 1-0-0.

శ్రీమాన్ శేషివపురం శేషయ్యగారు, మోటమర్రి. 1-8-0.

ఆగష్టు నెలలో :

శ్రీమాన్ ఆసూరి నరసింహాచార్యులుగారు, 0-4-6.

సెప్టెంబరు నెలలో :

శ్రీమాన్ వేమల రంగయ్యగారు. 1-0-0.

శ్రీమాన్ యం. వి. లక్ష్మయ్యగారు. 1-4-0.



Edited and Published by B. R. Avatar. Printed at S. R. P. Printing Works, Vizianagram.

